# సర్వ సిద్ధాంత సారభూతమగు

## శ్రీ శంకర పూర్ణాద్వైతము






సాధన రహస్యాది బహు గ్రంథకర్తలు,

శ్రీరామకృష్ణాశ్రమములు (బాపట్ల & భీమునిపట్నము)

సంస్థాపకులు :

పరమహంస - పరివ్రాజకాచార్య

శ్రీ అనుభవానంద స్వాములవారు

పదునేడవ కుసుమము



ద్వితీయ ముద్రణ : 1984

వెల : రు. 20-00

"This book is published with the Financial assistance of
TIRUMALA TIRUPATHI DEVASTANAMS
Under their Scheme aid to publish religious books."

ప్రతులకు :

శ్రీ అనుభవానంద గ్రంథమాల

బాపట్ల - 522 101 (గుంటూరు జిల్లా),

భీమునిపట్నము - 531 163 (విశాఖ జిల్లా)

మరియు

పరమహంస కార్యాలయము

భీమునిపట్నము - 531 163 (విశాఖ జిల్లా)



ముద్రణ :

శ్రీ నిత్యానంద్ ప్రింటింగ్ ప్రెస్,

రైలుపేట, బాపట్ల

ఫోన్ : 110

# ద్వితీయ ముద్రణము

అనుభవముతోకూడిన వచన రచనములు. సాధనా పటిమచే గలిగిన ఏకాగ్రతవలన సాధ్యము. ఆ ఏకాగ్రతచే జ్ఞానమును, 'ఏక విజ్ఞానేన సర్వ విజ్ఞానం భవతి' ఆ జ్ఞానముచే సర్వ విజ్ఞానములు కలుగుచున్నవనిగదా శాస్త్రము. అదికూడ పూర్వజన్మ సుకృతలభ్యమే !

శ్రీ అనుభవానంద స్వాములవారు, సకల సమన్వయావతారమగు శ్రీ రామకృష్ణ దేవుని సర్వాదర్శమూర్తిగా ఆరాధించిన మహనీయులగుటచేనేమో, వారి వచన రచనములందు ఆ సమత్వము వ్యక్తమగుచుండును. ఆ సమత్వము వారి సకల గ్రంథములతో ప్రవహించుచుండును. అట్టి గ్రంథమే 'సర్వ సిద్ధాంత సౌరభము'. ఆ పేరులోనే ఆ సమరసత్వము వ్యక్తము.

'సర్వ వేదాంత సిద్ధాంత సారసంగ్రహము'ను శ్రీశంకరులును, 'సర్వ సిద్ధాంత లేశ సంగ్రహము'ను శ్రీ అప్పయ్య దీక్షితులును రచించినట్లుగా 'సర్వ సిద్ధాంత సౌరభము'ను శ్రీ అనుభవానంద స్వాములవారును రచించిరి. పుష్పముల సువాసన నాఘ్రాణించినవారు, ఆ కుసుమము ఎచ్చట నున్నదో అని అన్వేషించి, ఆ వృక్షమును కనుగొని సంతసించినట్లు సిద్ధాంతమను పుష్ప సౌరభమును గాంచినవారుకూడ గవేషణము సలిపి, ఆ సిద్ధాంత వృక్షరాజమును కనుగొని ఆనందించవలయునని శ్రీ స్వాములవారి ఉద్దేశము. ఏ పూవు విలువ, సుగంధములు దానివే! అట్లే ఏ సిద్ధాంత విశిష్టత దానిదే! ఆ సమత్వ గ్రహణమునకే, ఆచరణమునకే యీ

'సౌరభ' రచనము. ఆ సామరస్యముచే సంకుచితత్త్వము బాసి, పర మత దూషణముల మాని, విశాలత్వమును విశ్వతోముఖమయ నగు ఆనందమును పొందనగును.

ఇదియే శ్రీ రామకృష్ణదేవుని ప్రత్యేక సాధనా విధానము! ఇదియే ప్రత్యక్ష అనుభవస్థితి! సాధనలనేకములుగాని అనుభవము ఒక్కటే! సిద్ధాంతములు బహుళములుగాని గమ్యమొక్కటే! సకలానుభవ స్వరూపుడైన శ్రీరామకృష్ణుని సమస్త సాధనా విధానములను, సర్వమత సామరస్యమును, సకలానుభవ రహస్యములను వ్యక్తము చేయుటకే యీ శ్రీ అనుభవానంద గ్రంథమాలను శ్రీ అనుభవానంద స్వాములవారు సంస్థాపించిరి.

ఈ గ్రంథ ముద్రణమునకు శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానమువారు రు. 7,250-00 లు ఆర్థిక సహాయము చేసి, మా గ్రంథమాల కృషికి తోడ్పడినందులకు వారికి మా కృతజ్ఞతలు.

పాఠకులు దీనిని పఠించి, మన మహర్షుల భౌతికాభౌతిక విజ్ఞానసంపదకు వారసులై, మన ప్రాచీన భారతీయాధ్యాత్మిక సంస్కృతీ ప్రవాహమున నీదులాడి, యథార్థ భారతీయులై మనెదరుగాక!

వ్యాస పౌర్ణమి
13-7-84

మాతాజీ
త్యాగీశానంద

# సమర్పణము

శ్రీరామాది దశావతారములకున్, శ్రీలక్ష్మి వాణి ఉమా
తారాశక్తులకున్, త్రిమూర్తులకు స్వస్థానంబుగా నొప్పు నా
పారావారము, రామకృష్ణగురు, సర్వాధ్యాత్మికస్థానమున్
ఆరాధించుచు గ్రంథమిచ్చెదను సర్వాధ్యాత్మికాన్వేషినై

శ్రీవిద్యాప్రతిభాస్వరూపులు, "మహోత్కృష్టానుభూతస్థితుల్
భావాతీతులు, తత్త్వసిద్ధులును, సర్వాధ్యాత్మికాచార్యులై
భావిన్ భూతము వర్తమానములలో భాసిల్లు తత్త్వజ్ఞులన్
భావించే నిడువాడ గ్రంథమును సర్వాధ్యాత్మికాన్వేషినై

శుభమై, సుందరమై, సుఖప్రదమునై శోభిల్లు తత్త్వార్థ సు
ప్రభకన్వేషకులౌ ముముక్షులకు సర్వాధ్యాత్మికోత్కృష్టతా
విభవార్థంబు ననుగ్రహింపగల దేవిన్ 'సర్వ సిద్ధాంత సౌ
రభమున్' నేను సమర్పణంబిడుదు సర్వాధ్యాత్మికాన్వేషినై

# వి ష య సూ చి క

## ముఖ ప్రబంధము ౧-౧౪౫



## శ్రీశంకర పూర్వాద్వైతము

### 1. ఉపోద్ఘాతము. 1-106

శ్రీ శారదారామకృష్ణాభ్యాం నమః

# సర్వ సిద్ధాంత సౌరభము

## ముఖప్రబంధము - చతుర్థభాగము

## భారతీయ సంస్కృతి

స్వస్తి ప్రజాభ్యః పరిపాలయంతాం
న్యాయేన మార్గేణ మహీం మహేశ।
గో బ్రాహ్మణేభ్యశ్శుభమస్తు నిత్యం
లోకాస్సమస్తాస్సుఖినో భవంతు॥

అనాదికాలమునుండి పరంపరాగతమై, అవిచ్ఛిన్న ప్రవాహమై చనుదెంచు అతి ప్రాచీన భారతీయ సంస్కృతీ వైభవము యొక్క సమత్వమును జాటుచు, 'గో బ్రాహ్మణేభ్యః' అను పదమున దమోగుణవిశిష్టమగు పశుపక్ష్యాది వాగ్రహిత సృష్టి నుండి వాగాది శక్తిసామర్థ్యముల బొంది, అవ్వాని సద్వినియోగ పరచుకొని, రజస్తమోగుణముల నధిగమించి, సత్వప్రధానులై,

త్రిగుణాతీతబ్రహ్మమున నేకమై యొప్పారు బ్రాహ్మణులవరకు గల సర్వ జీవకోటికి, నిత్యము శుభము గలుగునుగాక అని ప్రార్థించియు దృప్తిగాంచక, ఈ భూలోక క్షేమమునుమాత్ర మపేక్షించుట సంకుచితత్వమును సూచించునను విశాల భావమున, ప్రస్తుతము సామాన్య మానవున కగోచరమైన భూరేతర సర్వ లోకములందు గల సర్వచరాచర జీవకోటులును సుఖజీవు లగుదురుగాక అనియు, సర్వ విశ్వక్షేమము నాకాంక్షించుచు 'లోకాస్సమస్తాస్సుఖినో భవంతు' యని నుడువు ఆర్యోక్తి ననుస రించియు, సర్వలోకముల నున్న సకల జీవరాసుల యోగ క్షేమములనే యాసించి, కాంక్షించి, తత్ప్రాప్తికాధారమైన పరమే శ్వరుని నిత్యము ప్రార్థించుచుండుటయే భారతీయ సంస్కృతీ సువిశాల లక్షణమని విజ్ఞుల మతము. ఆ సులక్షణ విధానమునే యాశ్రయించిన మన 'సర్వ సిద్ధాంత సౌరభము' దర్శన ఖండ మున గల భాగ త్రయముతో దేశముల బర్యటించి, 'జీయా దాచంద్రతారార్కం సర్వ సిద్ధాంత సౌరభం । మూర్ఛితాధ్యాత్మ చైతన్య సంజీవన మహౌషధిః॥ '[1] 'ఆస్తికత్వం ప్రతిష్ఠాప్య యుక్తి ప్రామాణ్యపూర్వకం। జీయాదాచంద్రతారార్కం సర్వ సిద్ధాంత సౌరభం' [1] అని సంస్తుతిపాత్రయై, సార్థకయై విరాజిల్లి నది. 'భారతీయ దర్శన లఘు విజ్ఞాన సర్వస్వం'[2] అని కీర్తి నార్జించినది. 'అమూల్యమైన పెన్నిధి' అనియు, 'శాస్త్రము లకును **Sciences** మన భారతీయ తత్త్వమునకును సమన్వ

---

1. శ్రీ వాసా సూర్యనారాయణశాస్త్రి : అభిప్రాయము.
2. సంపాదకులు : ఆంధ్రప్రభ, పత్రిక - సమీక్ష.

యము చేసి విద్వాంసులకుగూడ విశేష విషయములను వివరించెను' 3 అను యశస్సునకాకరమై యొప్పారుట భగవాన్ శ్రీ రామకృష్ణ దేవుని కృపావిశేషము. ఏతద్గ్రంథముయొక్క కృషి ఫలితముగ సర్వ సామరస్యమేర్పడి, 'సర్వే జనాస్సుఖినో భవంతు' 'ఓం శాంతిః శాంతిః శాంతిః' సర్వజనులకు క్షేమము గలుగుగాక! ఆధిదైవిక, అధిభౌతిక, ఆధ్యాత్మికరూప త్రివిధ దుఃఖములుపశమించునుగాక అను పరమాదర్శక సర్వతోముఖ శ్రేయో సంపత్తికొరకై పరమేశ్వరు బ్రార్థించు సనాతన భారతీయ సంస్కృతీ సంప్రదాయము వాక్యములప్రకారము సర్వ ప్రపంచ శాంతి వాంఛయు నీడేరి, ఆధునిక భయానక ప్రపంచమున సుస్థిర శాంతి సంస్థాపనమగుగాక! తత్సిద్ధికి బరమకారణమైన, 'సౌరభ, గ్రంథ పరమలక్ష్యమైన, సువిశాల భారతీయ సంస్కృతీ వైభవమును లోకము గ్రహించి, అనుసరించి ఆనందించునుగాక! 'సౌరభము' యొక్క సంకల్పము సిద్ధించును గాక!

---

## సంస్కృతీ నిర్వచనము

Culture cannot be defined unitarily. It is a complex of many strands of varying importance and vitality. It expresses itself through language and art, through philosophy and religion, and through social habits and customs. 4 ఏకముఖ

---

3. శ్రీ శివశంకర స్వాములవారు : అభిప్రాయము.

4. Prof. Radhakrishna Chaudhary : Prabuddha Bharatha, 1956 – P 143

ముగా సంస్కృతి నిర్వచింపబడనేరదు. వివిధ శక్తిసామర్థ్యములు, ప్రాముఖ్యమును గల అనేక క్లిష్ట విషయపుంజము సంస్కృతి. భాష, కళ, తత్త్వశాస్త్రము, మతము, సాంఘికాచార నిష్ఠల ద్వారా అది సువ్యక్తమగుచుండును. ఒక్కమాటలో Culture refines personality [4] సంస్కృతి వ్యక్తిత్వమును బరిశుద్ధ పరచునని ఆచార్య రాధాకృష్ణ చౌదరి Permanent Aspects of Indian Culture అను వ్యాసమున వచించియున్నాడు. ఆ యాచార్యుని సంస్కృతీ నిర్వచనము కడు విశాలమై, సర్వతోముఖమై, భారతీయ సమగ్ర సంస్కృతీ స్వరూపమును మన ముందుంచుచు, దొలుదొల్త నుదాహరింపబడిన స్వస్తివాచక విశాలతత్త్వమును వ్యక్తపరచుచున్నది. అందుచేతనే India may be new to world politics and her military strength --- But India is old in thought and experienced and has travelled through trackless centuries in the adventure of life. Throughout her long history she has stood for peace and every prayer that an Indian raises, ends with an invocation to peace [5] ప్రపంచ రాజకీయములందును, సైనిక సామర్థ్యమునందును భారతదేశము నూతనము కావచ్చును. కాని భావజాలములందును అనుభవమునందును ఆమె చాల వృద్ధు. జీవనకృషి సాఫల్యముకొరకు ఆమె

4. Prof. Radhakrishna Chaudhary : Prabuddha Bharatha. 1956 p 142.

5. Pandit Jawaharlal Nehru : Jawaharlal Nehru's Speeches, 1949-53 p 124.

యనేక అంధకార శతాబ్దములు ప్రయాణించినది. తన అతి దీర్ఘ కాలచరిత్రయందంతటను ఆమె శాంతికొరకే కృషి సల్పినది. భారతీయుల ప్రతియొక్క ప్రార్థనయు, శాంతివచనముతో బరిసమాప్తి నొందునని జవహరలాల్ నెహ్రూ పండితుడు భారతీయ సంస్కృతీ వైశిష్ట్యమునుగూర్చి సగర్వముగ జెప్పుకొని యున్నాడు.

కాన సంస్కృతీ విషయ పరిశీలనము గావించునప్పుడు There is something that is deeper than national culture, and that is human culture. 6 జాతీయ సంస్కృతి కంటె నిగూఢమైన మానవ సంస్కృతి యొండు గలదని గుర్తించి, The goal of progress must be one of perfection, not of the mere individual, but of society as a whole 7 అభివృద్ధికి గమ్యము పరిపూర్ణత. అది వ్యక్తిగతముగాక, సంఘమునకంతటికి నన్వయము గావలయును, పి. యస్. శాస్త్రి హెచ్చరికను స్వీకరించి, జాతి, వర్ణ, భౌగోళికాది సర్వావధుల నతీతించి, స్వస్తివాక్యమున వాకొనబడిన రీతి సర్వలోకమునకు జెందినదే సంస్కృతి యని గ్రహించి, సంస్కృతీతత్త్వ తాత్పర్య గ్రహణమునకు బూనుకొందముగాక. అట్టి విశిష్ట కార్యనిర్వహణమునకు The historical method requires us not to take sides -- but to follow

---

6. Pandit Jawaharlal Nehru : Jawaharlal Nehru's Speeches, 1949 – 1953 p 429

7. Dr. P. S. Sastry : Prabuddha Bharatha, 1955 p 13.

the development with strict indifference. 8 చారిత్రక విధానమునకు బాక్షికదృష్టిగాక, పరిణామమును తటస్థ పద్ధతి ననుసరించుటయే ముఖ్యమని యనునట్లు యీ సంస్కృతి వ్యక్తియొక్క నిత్యజీవితమున, సంఘమున, ప్రజా బాహుళ్య నెట్లు ప్రవేశించి పరివర్తనముల గలుగజేసెనో విచారించుట ముఖ్యము. అందులకై సంస్కృతీ తాత్పర్యమును గ్రహింప యత్నించెదముగాక !

The culture of a people represents its common soul. 9 ఒక జాతియొక్క సంస్కృతి దాని సర్వ సామాన్య వ్యక్తిత్వమును వ్యక్తపరచునని ధీరేంద్రనాథుడు నుడువునట్లు జాతికి సంస్కృతియే జీవగర్ర. మరియు Culture is that intangible yet all-pervasive something in the whole structure of a civilization which seeks to cultivate the inner and outer life of the people possessing that civilization. 10 ప్రజానీకముయొక్క బాహ్యాభ్యంతర పురోగమనము గలుగజేయు సంపూర్ణ నాగరిక సంస్కారవ్యవస్థలో నప్రత్యక్ష సర్వవ్యాపక తత్త్వమే సంస్కృతియనియు ధీరేంద్రనాథుని వచనము. అద్దానినే యిసుమంత వివరణముగావించుచు, నాగరికతా, సంస్కృతుల శబ్దార్థముల విడదీసి A particular civilization is the matter whose form is its culture. 11 ప్రత్యేక

---

8. Dr. S. Radhakrishnan : Indian Philosophy, vol. 1 p 56
9. Dr. Dhirendranath Roy : The Spirit of Indian Civilization, p 255.
10. Dr. Dhirendranath Roy : The Spirit of Indian Civilization, p 65.
11. Dr. Dhirendranath Roy : The Spirit of Indian Civilization, p 24

నాగరికతా స్వరూపమున దాని సంస్కృతి యొక్క ప్రత్యక్ష వ్యక్తిత్వమనియు వాకొనుచు, Culture is to a civilization as sweet smell is to a flower. 11 పుష్పమునకు గల సుగంధమువలె నాగరికతా వ్యవస్థకు సంస్కృతి యుండుననియు నాతని వివరణము. ఒక్క మాటలో సంస్కృతి వ్యష్టి రూపమున వ్యక్తిజన్యమై, దాని పరిమళ పుంజమును పరిసరముల బ్రసరింపజేసి, సంఘమున జొచ్చి, అపూర్వ పరివర్తన పరిణామముల గలిగించి, జాతి సంస్కారము అనగా నాగరికతా రూపమున వ్యక్తమై, క్రమక్రమముగ మానవాభ్యుదయకారక శక్తియై రూపొందుననిన బాగుగనుండును. అనగా సంస్కృతి సాంఘికాన్వయము బొందగా నాగరికత యగుచున్నదని యన నొప్పును.

కాని సంస్కృతి యనుటతోడనే ప్రస్తుత కాలమున ననేక యుహాపోహలకవకాశ మిచ్చుచున్నది. ఆధునిక పాశ్చాత్య నాగరికతానుగుణముగ వేషమును ధరించి, సభాస్థలుల బ్రథమ స్థానముల నలంకరించుట సంస్కృతి యందమా? నోరు మెదిపిన నిరక్ష్యరాస్యతగదా! లేక భాషా పాండిత్యమును గడించి, ఉపన్యాస వేదికల గదిలించి ఉద్గ్రంథముల రచించినంత మాత్రమున సంస్కృతీపరుడందమా? నైతిక విధానమున దూరముకదా! బాహ్య వేషముల ధరించి, యనేకులకు నీతుల బోధించుచు, తదనుగుణ బాహ్య ప్రవర్తనము నలవరచుకొని

11. Dr. Dhireneranath Roy : The Spirit of Indian Civilization, p 24

యున్నంతమాత్రమున సంస్కృతీమూర్తి యందమా? స్వాను భవపటిమ శూన్యముగదా! అందుచే నీ విషయ క్లిష్టత్వమును మననము గావించి We grow in learning, in knowledge and in experience, till we have such an enormous accumulation of them that it becomes impossible to know exactly where we stand. We are overwhelmed by all this and, at the same time, somehow or other we have a feeling that all these put together do not necessarily represent a growth in the wisdom of human race. 12 ప్రస్తుతము మనము, యథార్థముగ నెట్టి పరిస్థితిలో నున్నదియు గ్రహించుకొనుటకు దుర్లభమగురీతి మనము విద్యా, జ్ఞాన, అనుభవముల నభివృద్ధి గావించి, అత్యంతముగ వాని బెంచివైచితిమి. దీనివలన మనము ముంచివేయబడితిమి. అయినను నేదోవిధముగ, నివియన్నియు నేకమైజేరియు మానవ జాతియొక్క జ్ఞానాభివృద్ధిని సూచింప నవసరములేదని, మనకు గాఢమైన తీవ్రభావము గలదని నెహ్రూ పండితుడు ఆవేదనపడెను. మఱియొక సందర్భమునగూడ We have rich stores of knowledge, and we have universities and all kinds of institutions for imparting this knowledge to others, but some times, one wonders whether we are really growing in wisdom 13 విలువైన జ్ఞానాగారములు గలవు. దాని నితరులకు బ్రసరింపజేయు

---

12. Pandit Jawaharlal Nehru : Jawaharlal Nehru's Speeches, p 361

13. Pandit Jawaharlal Nehru : Jawaharlal Nehru's Speeches, p 165

టకు విశ్వవిద్యాలయాది యనేక సంస్థలును గలవు. కాని, నైజమున మనము వివేకమున నభివృద్ధిగాంచుచున్నామా యని యొక్కొక్క పర్యాయము ఆశ్చర్యమొందుదుము అనియు నాతడు చింతించెను. కాన If the world suffers from mental deterioration or from moral degradation, then something goes wrong at the root of civilization or culture. 14 మానసిక క్షీణత్వము, నైతిక పతనములద్వారా ప్రపంచము కుంటుపడుచున్నచో నాగరికత, సంస్కృతుల మూలముననే దోషమున్నదని నెహ్రూ పండితుని నిర్ణయము.

కావున సంస్కృతి యనగ కేవలము పాండిత్యము కాదని నిర్ధారణము. అయిన సంస్కృతి యనగ నెట్టిది? 'కనబడ్డవారిని మర్యాదగా పలకరించటం, సాదరంగా ఆతిథ్యమివ్వటం, నాజూగ్గా ఉండటం --- ఇవే సంస్కృతికి అర్థంకావు. సంస్కృతినిబట్టి ఇవి చేకూరుతూ ఉంటయి' 15 అని హ.స.జ 'ప్రజామత'లో విశదము చేసెను. ఈ విషయమునే వివరించుచు, What is culture? According to some anthropolo gists, it is the way of life of a people living together. Culture manifests itself in their habits and customs, arts, social system, knowledge, and in their religion. It is something more than a mere total of these parts or aspects. 16 సంస్కృతి

14. Pandit Jawaharlal Nehru : Jawaharlal Nehru Speeches, p 383

15. హ. స. జ. 'ప్రజామత' పత్రిక - 19-8-56.

16. Banton. G. Obeyesekere : Prabuddha Bharatha, 1954 p 290.

లందును, మానవ వేషభాషలందును, అనేకమైన మార్పుల గలిగించి, భూసారము నధిగమింపజేసి, పృథ్విని సస్యశ్యామల మొనరించి; మానవ జీవనవిధానమున బాహ్యమునకు మార్పును గలుగజేయును. దీనివలన భూగర్భమున వివిధ లోహజాతులు రూపాంతరముల బొంది, మానవోపకరణములై, యాతని జీవిత మును సున్నితమొనరించును. ఈ సంస్కృతీ బలమున క్రిందికి బ్రవహించు జలములు పైకెగయుచు, ప్రజోపకరములుగ రూపొం దును. అనేక ప్రకృతి శక్తులు మానవ మేధాశక్తి కధీనమై, అతని దుఃఖముల దగ్గించి, సుఖము నధికమొనరింప దోడ్పడ గలుగును. దీనిచే బ్రపంచ బాహ్యరూపమే మార్పు జెందినట్లు గోచరించును. ఈ సంస్కృతీ విభాగమునకు లౌకిక సంస్కృతి యని పూర్వమే నామకరణమొనర్చియుంటిమి.

సంస్కృతీ విభాగమున, ద్వితీయమును ధార్మికము అనగా నైతికము అనదగును. పూర్వ భాగమున బ్రకృతి శక్తుల ద్వారా ప్రకృతిసంపదను బెంపొందించి, అనుభవించి, సుఖింప నధికారము మానవుడు సంపాదింప, నీ భాగము అతని యథేచ్ఛా లాలసత్వము నిసుమంత నరికట్టును. అతని స్వార్థమును గొంచెము సడలించును. అతని స్వాతంత్ర్యము నొకించుక బాలించును. అనుభవింపనతనికధికారమీయబడినను, పరుల కాటంకము కారాదని శాసించును. అన్యులకు బాధాకరము గానటుల వారించును. తనతోడి జీవరాసులకందుగూడ భాగ మున్నదని దృష్టికి గోచరింపజేయును. ప్రకృతి సంపదాను భవమున దనకువోలె నితర ప్రాణులకు గూడ గల అధికారమును

నెరుకపరచి సమతను బోధించును. తదనుగుణ శాసనముల సృజించి, వ్యక్తి స్వాతంత్ర్యము నరికట్టును. దీనిలో సాంఘికాచారములు, వర్ణవ్యవస్థలు, ఆచార వ్యవహారములు, నియమనిష్ఠలు అంతర్గతము. ఆర్థిక, వైజ్ఞానిక, రాజకీయాదికములన్నియు నీ సంస్కృతీ భాగమున విభాగములు. వ్యక్తి, వ్యక్తి విభేదముల సడలించి, సర్వవిధ సమానత్వమును సంఘమున ప్రతిష్ఠింప నది యత్నించును. ఎల్లరకు సమానావకాశముల నొసంగి, వారి వారి శక్త్యనుసార ప్రవర్ధమానమునకిది దోహదము గలుగచేయును. సర్వ జీవరాసుల దయార్ద్రదృష్టుల వీక్షించి, వాని వాని కవసరములనొసంగి, సమానస్థాయిన నభివృద్ధినొసంగి పోషించును. దీన సంఘము సుఖశాంతులకాకరమై, యారోగ్యకర ప్రవృత్తుల నిలయమై, ఆశాసూయాద్వేషాది సంఘ విద్రోహకర లక్షణముల కతీతమై, నిత్యకళ్యాణము పచ్చతోరణములతో సుమంగళమై విరాజిల్లును. సంస్కృతీ పూర్వ విభాగముకంటె నిది అభౌతికమై, మానసికమై, విశాలమై, మార్దవమై యొప్పారుటచే నిది అతి ప్రధానము, ప్రముఖము, ముఖ్యము. ఆధునిక సంఘము దీని యందు దృష్టుల బ్రసరింపజేసి సమగ్ర పరిశీలనము గావించి, అనుష్టించుట ముఖ్యావసరము, దీనితో బ్రపంచ జీవితము సర్వ సమృద్ధమై, సమరసమై, సుఖనిలయమై, శాంతిసంధానమై యొప్పి సర్వజీవుల కానందధామమై విరాజిల్లును.

ఇక తృతీయము. ఇది సర్వోత్కృష్టము. అభౌతికమేగాక అలౌకికము, ఆధ్యాత్మికము, అంతరము. పై సంస్కృతీ భాగ ద్వయమున గల సర్వ సుఖసంపదాదిలో మునిగియు, జరా వ్యాధి

మరణాది యనివార్య బాధాకర ప్రపంచ లక్షణముల దిలకించి, విమర్శించి, భౌతికముగ సుఖము దుఃఖరూపమే యనియు, గాన భౌతిక ప్రపంచమున గల సుఖము భ్రాంతియు క్షణికమును అనియు, దాని నైజస్థితిని గ్రహించి, లోకమున గల యింద్రియ సుఖాన్వేషణము వ్యర్థమని తీర్మానించి, అభౌతికమై అలౌకికమై యింద్రియాతీతమై యొప్పు అవ్యయానందమగ్నత ముఖ్యమనియు నిశ్చయించి, ప్రథమతః అది లోకాంతరమని కృషించి, అట్టి భావన కేవలమూహాజనితమని సాధనాపటిమచే నెఱింగి, పరమార్థతః అది స్వాంతరము హృదయస్థము, స్వాత్మానుభూత మనియు సాధించి, అయ్యానందమున మునిగియుండుట ఆధ్యాత్మిక సంస్కృతి యగును. ప్రథమమున మానవుడు బుద్ధిపరిణామమును బొందుచు, ద్వితీయమున హృదయపరిపాకము నార్జించి విశుద్ధమానవుడై, తృతీయమున మానవత్వమునుండి లోకాదర్శమైన దేవత్వమున నడుగిడి, స్థిరుడై, పూర్ణుడై విరాజిల్లును. ఆతని చిత్తసీమలో నెట్టి సంక్షోభములులేక పరిసర సంక్షోభముల సమయింపజేయును. ఆతని సన్నిధానమున ప్రపంచగత సర్వ దుర్గుణములడగారి సర్వ సౌభాగ్య చంద్రికా చయము ప్రకాశించును. అతని ముఖదర్పణమున త్రివిధ సంస్కృతి వైభవములును దొంగి చూచుచు, నెల్లరకాదర్శమై యెల్లవేళల బాసటయై యొప్పారును. అదియే పరమార్థము, జీవిత సార్థకత, మానవాభ్యుదయకారణము, సర్వజీవ గమ్యస్థానము.

ప్రథమ సంస్కృతిలో మానవుని మేథాశక్తి యభివృద్ధి గాంచుచు, తమోగుణావృత మానవతత్త్వము నుద్ధరించి, బుద్ధి

సహాయమున రజోలక్షణమును బరిణమింపజేసి, ప్రకృతిశక్తుల బహిర్గతమొనర్చి సర్వోపయుక్తముగ నొనరించును. ద్వితీయ మున మేధాశక్తితో నేకమైన రజోగుణము హృదయమున బ్రవేశించి, కరుణా ముదితా ప్రేమ దయాదిక లలితగుణముల విజృంభింపజేసి, హృదయపీఠమున సత్వమును బ్రతిష్ఠింపజేసి, మానవత్వమును పూర్ణత్వమునకు గొంపోయి, సత్వ సహాయమున దృతీయమునకు మార్గముజూపును. తృతీయము సత్యప్రా వృతమై, రాక్షస మానవ అంశముల రూపుమాపి, దైవాంశముల బరివర్ధమానము గావించి, సర్వానందదాయక దైవత్వమునే సిద్ధింపజేయును. అటుల నీ త్రివిధ సంస్కృతుల త్రిగుణములు గూడ బైవిధానమున బరిణమించి, సర్వశ్రేయోకారకవిధముగ రూపొందుచున్నవి. ఈ విషయముల నిక ముందు గ్రంథమున జూడగలము కాన ప్రస్తుతమునకింతవరకు ముగింతము. ఇంచు మించుగ నిట్టులే ఆచార్య మామిడిపూడి వేంకటరంగయ్య, సంస్కృతిని విభజించి, వానికి భౌతికము, సాంఘికము, ఆధ్యాత్మికము అనుచు నామకరణమొసంగియున్నాడు. [18]

ఇంతవరకు వివరింపబడిన సంస్కృతియొక్క ప్రథమ ద్వితీయ భాగములు సాంఘికములై, వ్యష్టి సమష్టుల పరస్పర సంబంధములకన్వయమై, వ్యష్టిసమష్ట్యభివృద్ధికొరకు గావించు కృషితో మేళనమై, వ్యష్టిప్రభావమును సమష్టిపై భౌతిక మాన

18. (శ్రీ) మామిడిపూడి వేంకటరంగయ్య: ఆంధ్ర సంస్కృతీ వారోత్సవములు, ఒంగోలు - 20-12-1955.

ప్రికమముగ ప్రసరింపజేయుచుండుటచే నాద్వనుమును Civilization నాగరికత అని చెప్పనొప్పును. పూర్వమే వచింపబడి యున్నట్లుల Culture సంస్కృతి వ్యష్టిజన్యమై వికసించి, Civilization నాగరికత రూపమున సంఘమున వ్యాపించును గదా! అందుచే మొదటి రెండు సంస్కృతీ భాగములు సంపూర్ణముగ సాంఘికములై నాగరికత యనుబడును. దాని విశదీకరించుచు, The word civilization has two distinct senses. It should be taken both as a process and a product. 19 నాగరికత అను పదమునకు రెండు విస్పష్ట భావములు గలవు. అవి కృషి ఫలితములననగును. As a process, it implies the act of making one civil or social. It is that act of man which serves to socialize him in all his relationships. Civilization in this respect is synonymous with socialization. It refers primarily to the manner of living. It makes man feel his oneness with others. 19 కృషి రూపమన వ్యక్తిని సాంఘికమొనర్చుట యనదగును. ఈ మానవకృషియే నతని సర్వ సంబంధ బాంధవ్యములతో సాంఘికవాదిగ జేయును. ఈ దృష్టిలో నాగరికత సాంఘిక వ్యవస్థయే యగుచున్నది. జీవితపద్ధతియే ముఖ్యముగ నిందు సూచితము. పరులతో నేకత్వము ననుభవించునట్లు మానవుని నది యొనర్చును. అది నాగరికతయొక్క ప్రథమాంశముగ ధీరేంద్రనాథరాయ్ విశదీకరించియున్నాడు. నాగరికతా

---

19 Dr. Dhireneranath Roy : The Spirit of Indian Civilization, p 26, 31

ద్వితీయాంశమును ప్రస్తావించుచు నది ఫలితాంశమనియు, దానికి యాధునిక రచయితలు ప్రాధాన్యము నొసంగి దానిని Possession స్వామ్యముగ నన్వయించుచు, and choose to judge a people chiefly from what it has, as if its possession is the sole determinant of what it is.[19] ప్రజకుగల భోగభాగ్యాది స్వామ్యత్వమే ప్రజానీక నైజ స్థితికి నిర్ణయమనునటుల, సంఘముననున్న సంపదనే ముఖ్యముగ గ్రహించి తీర్మానించుచున్నారనియు, దానిచే గ్రయ విక్రయ సామర్థ్యముననో, దౌర్జన్య విధానముననో సర్వసమృద్ధి నార్జించినవారే నాగరికులై, బుద్ధ, సోక్రటీసు, క్రీస్తు మొదలగు వారికంటె నధికులగుదురనియు ఆచార్య రాయ్ వివరణము. అందుచే నాగరికతలో గల ద్వివిధ విభాగముల, ఫలితాంశరూప ధనధాన్య సంపద్విశేషములుగాక, వాని నార్జించు విధానము, వినియోగించు పద్ధతుల గల కృషియంశమే ప్రధానమని ధీరేంద్రుని సముచిత నిర్ణయము.

అటులే Lecomti du Nouy లికోటి డు నాయ్ అను సుప్రసిద్ధ Biologist జీవవర్గ శాస్త్రజ్ఞుడు, సుప్రఖ్యాతమైన Human Destiny 'మానవ భవితవ్యము' అను తన గ్రంథమున, నాగరికతా స్వరూపమును మరియొక దృక్పథమున వివరించియున్నాడు.[20] Static స్థిత, Dynamic గమనరూపమున ద్వివిధముగ అనగ అచల, చలరూపముగ నాగరికతను

---

19. Dr. ·hirendranath Roy : The Spirit of Indian Civilization, p 26, 31.

20. Dr. Lecomti du Nouy : Human Destiny, p 106.

విభజించియున్నాడు. ఈ విభజనము ననుసరించిచూడ, నొక నిర్ణీతకాలమున నొక జాతియొక్క నాగరికస్థితిని దెలుపునది స్థిత రూపము. కాని ఆ కాలమునకట్టి నాగరికత నా జాతికి బ్రసాదించిన పరంపరాగత పూర్వ నాగరికతా ప్రవాహము, అకాలమునకు ననంతరము ప్రవాహముగనే భవిష్యత్తునకు బ్రసరించుచున్న నాగరికతా వాహిని చలము, అనగా గమనము, ప్రగతి యనియు నాతని వివరణము. First the Static definition: Civilization is the deceptive inventory of all the modifications brought about. in the moral, esthetic, and material conditions of the normal life of man in society, by the brain alone.[20] మొదటిది స్థిత నాగరికత. మానవ సమాజమున గేవలము మానవ మేధాశక్తిచే మానవుని సామాన్య జీవన విధానములో గలిగిన నైతిక, కళా, లౌకిక పరిస్థితుల సంస్కరణా సమూహముయొక్క భ్రాంతిరూప అనుక్రమణికయే నాగరికత యగును అని నాయ్ పండితుని నిర్వచనము. అటులే Second, the dynamic definition : Civilization is the global outcome of the conflict between the memory of man's anterior evolution which persists in him and the moral and spiritual ideas which tend to make him forget it.[20] రెండవది గమన నాగరికతా నిర్వచనము. మానవునిలో బూర్వమునుండి నిలచియున్న పరిణామము యొక్క స్మృతికిని, దాని విస్మరింపజేయ యత్నించు నైతిక,

20. Dr. Lecomti du Nouy : Human Destiny, p 106.

పారమార్థిక భావములకును జరుగు పోరాటమువలన నేర్పడు ప్రపంచవ్యాప్త ఫలితాంశమే నాగరికత యనియు నతని నిర్వచనము. అనగా మానవులలో ననాదికాలమునుండి యరుదెంచుచున్న రజస్తమోగుణరూప పశు రాక్షస వృత్తులకును, ప్రపంచ జీవితమున నేర్పడుచున్న నైతికాధ్యాత్మిక ప్రవృత్తులకును ఏర్పడిన సంఘర్షణా ఫలితస్వరూపమే గమనరూప నాగరికత యని యాతని తాత్పర్యము. ప్రగతిని సూచించు యీ రెండవ నాగరికతా విధానమున మానవదృష్టి పశుత్వమునుండి మానవత్వమునకును, అటనుండి దేవత్వమునకును బరిణమించుచున్నది. అందుచే నిట భౌతిక విజ్ఞానసంబంధ యంత్రాదికములుగాని, తదితర సుఖాన్వేషణకారక ప్రకృతిశక్తులుగాని గోచరింపవు. ఈ ద్వివిధ నిర్వచనములలో బూర్వము వచింపబడినటుల లౌకిక, ధార్మిక, ఆధ్యాత్మిక సంస్కృతీ త్రయమే తొంగిచూచుచు ప్రగతిరూప నాగరికతను ఆధ్యాత్మిక సంస్కృతియందును, స్థితనాగరికత ప్రథమ ద్వయమునను లీనము గావించుకొనినది. పై జర్చింపబడిన విషయములననుసరించి సంస్కృతీ స్వరూపమును నొకించుక గ్రహించినారము. దాని సమగ్ర విగ్రహము మన కట్టెదుట నిలువబెట్టబడినది. ఈ దృక్పథముతో భారతీయ సంస్కృతి నిసుమంత గ్రహించి, పై నిర్వచనములకనుగుణమై, మానవజాతికి సమగ్ర సంస్కృతీ వికాసమును గలుగజేయగల శక్తి అందిమిడి యున్నదా అను విషయమును బరిశీలించెదముగాక!

The greatness of Indian thought lies in the fact that her cultural conception is that of the Eternal, the Spirit encased in envolving matter involved and imminent in it. Her religion is the aspiration to the spiritual consciousness. Her whole Dharma or Law is founded upon it Her philosophy, art and literature have the same upward look. Her progress is spiritual progress [21] పరిణమించుచున్న ప్రకృతి పదార్థములో గప్పబడి, యందిమిడియున్న నిత్య పదార్థమునుగూర్చిన తన వైజ్ఞానిక భావఝరియందే హైందవ సంస్కృతియొక్క గొప్పదనమిమిడియున్నది. ఆధ్యాత్మిక చైతన్యస్ఫురణ కాంక్షయే ఆమె మతము. ఆమెయొక్క ధర్మమంతయు నద్దానిపై నాధారపడును. ఆమెయొక్క తత్త్వశాస్త్రము, లలితకళలు, సాహిత్యములకదే యూర్ధ్వదృష్టి గలదు. ఆధ్యాత్మికాభివృద్ధియే ఆమెయొక్క పురోగమనము. Her founding of life upon this exalted conception, her urge towards spiritual and eternal constitutes the distinct value of her civilization. [21] ఆమె జీవనపద్ధతిని యీ అత్యున్నతాదర్శమున నిలిపియుండుట, నిత్యాధ్యాత్మిక సంస్థితికై ఆమె ఆకాంక్ష, ఆమెయొక్క నాగరికతకు ఒక ప్రత్యేకత నొసంగినదని సర్ జాన్ వుడ్రాఫ్ సంస్తుతించినట్లు, పూర్వోక్త విధాన సంస్కృతీ

21. Sir John Woodroofe : Vedanta Kesari, 19[illegible]

త్రయ విభాగమున, దృతీయమైన ఆధ్యాత్మిక సంస్కృతియే అతి ప్రధానమై, గమ్యమై యొప్పారి యుండుటచే, భారత చరిత్రాకథనమున యవనాది పరదేశీయ దండయాత్రలలోగాక, వివిధకాలముల దలలెత్తిన రాజ్య సామ్రాజ్యములందుగాక, మధ్య మధ్య గోచరించు గొప్ప చక్రవర్తుల విధానములందుగూడగాక, భారతీయైక్యత మరియొక తత్త్వమున గలదని సురేంద్రనాథ దాసుగుప్త వ్రాయుచు, It is essentially one of spiritual aspirations and obedience to the law of the spirit, which were regarded as superior to everything else; and it has outlived all the political changes through which India passed.[22] ఆధ్యాత్మిక తృష్ణయు, పారమార్థిక నియమపాలనముతే సర్వేతరములకు నధికతమములని నిర్ణయింపబడి యుండుట యొక ముఖ్యపద్ధతియై, భారతదేశము అనుభవించిన నసంఖ్యాక రాజకీయ పరివర్తనముల నన్నింటిని నధిగమించినదని యాతడు ఘంటాపథముగా వక్కాణించి యున్నాడు. శిశిర్ కుమార సేన్ పండితుడుగూడ Spirituality is indeed the keynote of the Indian mind.[23] భారతీయ చిత్తమునకును పారమార్థిక దృష్టియే ముఖ్యమగు మూలసూత్రముగ వచించి యున్నాడు. ఈ యపూర్వ అసమాన భారతీయ విచిత్రతత్త్వము ల్లరచే గమనార్హము, గవేషణీయము.

---

. Prof. Surendranath Das Gupta : A History of Indian Philosophy vol. 1 p vii

. Prof. Sisir Kumar Mitra : The vision of India, p 123.

అదియును వివేకానందుని వచనములలో India's culture is incomparable, being developed thousands of years of trial and experimentation, till it attained to the highest standard ever reached by humanity and consequently possessed of an unshakable stability and strength all its own. 24 భారతీయ సంస్కృతి, మున్నెన్నడు మానవజాతి పొందని అత్యున్నత స్థాయి నందుకొనువరకు, అనేక వేల సంవత్సరముల పరిశీలనాకృషి ఫలితముగ నభివృద్ధి గాంచినదగుటచే నసమానము. తత్ఫలితముగ నది స్వకీయమైన శక్తిసామర్థ్యములలో అచంచల సుస్థిరతను గలిగియున్నది. ఈ విషయమునే హీరేంద్రనాథ దత్తుడుగూడ, Indian culture is of the greatest antiquity, among all the known cultures of our globe. 25 మన భూగోళమున దెలియబడిన సకల సంస్కృతులలో భారతీయ సంస్కృతి అతి ప్రాచీనమని వాకొనియున్నాడు. కేవలము ప్రాచీనతయే ప్రాశస్త్యమును ప్రసాదింపనొల్లక పోయినను, యనాదికాలమునుండి నేటిదనుక నది యెట్టి వికారములు లేక దన మార్గముననే సముచిత పరిణామము నొందుచు వచ్చుచుండుటచే బూర్వోక్త వివేకానందుని వచనములరీతి సుస్థిరత్వము దానికి జేకూరినది. ప్రాశస్త్యమున్నగాని అది సిద్ధింపనొల్లదని వేరుగ వచింప ననావశ్యము.

---

24. Swami Vivekananda : The Life, vol. 3 p 232.
25. Prof. Hirendranath Datta : Indian Culture, p 7.

అంతియగాక, దీని గవేషణా విధానము, ఆచరణ పద్ధతులతోగూడ నొక విశిష్టత గోచరించును. The Hindu nation proceeded, through the study of the mind through metaphysics and logic. 26 భారతజాతి మనోపరీక్షా, తత్త్వవిచారణము, తర్కములద్వారా ముందుకు నడచినది. We find that searching through the mind we at last come to that Oneness, that Universal One. 26 చిత్తపరిశీలనము విశ్వైక్యమైన ఏకత్వమునకు దారిజూపుననియు వివేకానందుడు భారతీయ సంస్కృతివిధాన రహస్యమును వెలిబుచ్చియున్నాడు. దానికై acceptance of tested knowledge and examined belief in the light of not only the intellect, but also integral experience. 27 కేవలము మేధాదృష్టిని మాత్రమేగాక, సమగ్రమైన అనుభవద్వారమున బరీక్షలకు నిలచిన విజ్ఞాన విశ్వాసముల నలంకరించియుండుటచే దత్ఫలితముగా in an enlightenment which puts an end to all sorrows and brings in abiding bliss. 27 సర్వదుఃఖోపశమనము గావించి, నిత్యానందమును గలుగజేయు వికాసమును భారతీయ సంస్కృతి ఆర్జించియున్నది. అట్టి నిర్దుష్ట విచారణా సాధ్యమైనదగుటచే 'భారతజాతి, సంప్రదాయము ఎప్పుడునూ సమన్వయ విధానమే. ఇతర సంస్కృతులను స్వంతము జేసికొని, తన విశిష్టతను నిలువబెట్టుకొను సమర్థత భారతదేశమునకు బహుశః భౌగోళిక పరిస్థితివలన జేకూరియుండును.' 28 అని దాని సర్వ

---

26. Swami Vivekananda : The Complete Works, vol. 2 p 140.
27. Dr. P. Nagaraja Rao : Prabuddha Bharatha, 1955, p 406.

సమన్వయ స్వభావమును ఆచార్య కె. ఎం. పణిక్కర్ విశ్వభారతిలో నుతించియున్నాడు. భారతీయ సంస్కృతీ సర్వసమత్వ సమన్వయతత్త్వము నుగ్గడించుచు, 'నదులనేకం సముద్ర మొక్కటి, మార్గాలనేకం గమ్యస్థానమొక్కటి, నామరూపాలనేకం పరమేశ్వరుడొక్కడు, పూజలనేకం ఫలమొక్కటి, ఈ విభిన్న సూక్తులలో గర్భితమైన ఏకత్వమే భారతీయ సంస్కృతికి మూలం' 29 అనియు వివరించుచు, నట్టి విశ్వవిశాల సంస్కృతిని సంకుచితపరచు యత్నముల ఖండించుచు, 'భారతీయ సంస్కృతి ఏదో ఒక మతంవారికే చెందినదనుకొనడం, దానికి ద్రోహం చేయడమే ... ఏ యొక్కరికో చెందక, అందరికీ దివ్య సౌరభాలను పంచి యిచ్చేదే భారతీయ సంస్కృతి' యనియు ఆంధ్ర ప్రభ సంపాదకుడు హెచ్చరిక జేసియున్నాడు. 30 'ప్రతి వ్యక్తి తన చైతన్యమును ఉత్తమరీతిని మిగతా చైతన్యముతో నేకము జేసికొనుటే సంస్కృతి' 31 యని వచించుచు, 'యావత్తు చైతన్య స్పర్శను అనుభవించి, తదనుగుణముగా జీవించడం జీవితానికి సార్థకత. ఇదియే సంస్కృతి' యనియు 31 హ. స. జ. వ్రాయుచు, సంస్కృతి భారతీయ సంస్కృతి స్వరూపముగా వివరించియున్నాడు. అట్టి సర్వ సమన్వయ స్వరూపిణికావుననే

---

28. Dr. K. M. Panikkar : Viswabharathi Convocation Address, 1955
29. సంపాదకుడు: ఆంధ్రప్రభ, పత్రిక. 9-12-1955.
30. " " 4-12-1955.
31. హ. స. జ. ప్రజామత' పత్రిక - 19-8-56.

Our motherland in its wide catholity has truly become the temple of all religions. 32 తన సువిశాల హృదయముచే మన మాతృభూమి సకల మతములకు యథార్థమున ఆలయముగా రూపొందియున్నదని ఆచార్య హీరేంద్రనాథుడు సగర్వముగ వాకొనియున్నాడు. సర్వమతములందే యిమిడియున్నవని My religion in one which Christianity is an off-shoot and Buddhism is a rebel child. 33 క్రైస్తవమతము శాఖగను, బౌద్ధము ఎదిరించు బిడ్డగను గలది నా మతము అని వివేకానందుడు భారతీయ సంస్కృతి యొక్క సువిశాలత్వమును జాటియున్నాడు.

పై జర్చను బరిశీలించినచో భారతీయ సంస్కృతి అతి విశాలమై, సర్వతోముఖమై, సర్వాదర్శమై యొప్పారినదనుటకెట్టి సందియమును లేదు. మానవులలో గల సర్వ స్వభావముల నది పరిశీలించి, గ్రహించి దానికి సర్వోత్కృష్టాధ్యాత్మికాదర్శమును ముందుంచి, తదనుగుణ పరిణతికై తోడ్పడుట విస్పష్టము. Hinduism has something to offer which is suited to all minds. Its very strength lies in its infinite adaptability to the infinite diversity of human character and human tendencies. 34 సర్వప్రవృత్తులకనుగుణ విషయముల హిందూమతము తెలుపగలదు. అనంత నానాత్వమున నున్న మానవ స్వభావములకు, మానవ

32. Prof. Hirendranath Datta : Indian Culture, p 61.

33. Swami Vivekananda : The Complete Workss, vol. 6 p 71.

34 Sir Monier Williams : Vedata Kesari, 1926, p 10.

ప్రవృత్తులకు, అద్భుత సమన్వయము గావించుకొనుటలో దాని సామర్థ్యమిమిడియున్నది. ఎట్లన, It has its high spiritual and abstract side suited to the metaphysical philosopher, its practical and concrete side suited to the man of affairs; - - , its aesthetic and ceremonial side suited to the man of poetic feeling and imagination; its quiescent and contemplative side suited to the man of peace and lover of seclusion. 34 తత్త్వవేత్తకనుగుణమైన ఉన్నత సూక్ష్మాధ్యాత్మిక విధానము దానికి గలదు. దాని యాచారములు స్థూలముగ గర్మప్రవృత్తుని కనుగుణము. దాని కళా కర్మాదులు ఊహాభావదృష్టి గలవానికనుకూలములు. దాని ప్రశాంత ధ్యానాదిక పద్ధతి, ఏకాంతవాస కాంక్షగల శాంత స్వభావునకుచితము అని మోనియర్ విలియమ్సు సవివరముగా బలికియున్నాడు. ఆ విషయమునే పరిశీలించిన ధీరేంద్రనాథుడుగూడ

The highest strength of the Indian civilization lies in the fine organic relationships of its different factors. 35 దాని వివిధాంశముల గల భాగ భాగ పరస్పర సౌందర్య సంబంధమునందే భారతీయ నాగరికతయొక్క యుత్కృష్టశక్తి యిమిడి యున్నదని వచించి యున్నాడు. అందుచే భారతీయ సంస్కృతి సర్వమును స్వీకరించి, ప్రేమించి, ఏకస్థానమొనరించి, అద్భుత సమరసత్వమున సమన్వయము

---

34. Sir Monier Williams : Vedanta Kesari, 1926 p 10.

35. Dr. Dhirendranath Roy : The Spirit of Indian Civilization, p 42

గావించి, హైందవమనియు భారతీయమనియు బిలువబడినను, యథార్థమునకు సర్వ మానవ సంస్కృతీ స్వరూపముగనే అది ప్రాచీనకాలముననే మూర్తీభవించి యున్నదని పై గ్రంథభాగ తాత్పర్యము.

భారతీయ సంస్కృతీ ప్రభావ వైభవమును గుర్తించి యున్న సర్ ఫ్రాన్సిస్ యంగ్‌హస్బెండ్ అను ఆంగ్ల విజ్ఞాన వేత్త తన మిత్రులైన పాశ్చాత్య వేత్తలను, ఒక వారము దినములైనను భారతమున వసించి, దాని మాధుర్యమును గ్రోలనుద్బోధించుచు it is better to give India even that little time, rather than go through life without ever seeing India at all. 36 భారతదేశమును అసలు చూడకయే జీవితమును వ్యర్థము చేసికొనుటకంటె నా స్వల్ప కాలమునైనను హిందూదేశ పర్యటనమునకై వినియోగించుట ఉత్తమమని ప్రబోధించియున్నాడు. Her (India's) torch of spiritual culture must dispel the darkness of materialistic civilizations. 37 భారతీయాధ్యాత్మిక సంస్కృతీ జ్యోతి, లోకాయత నాగరికతల యంధకారమును బటాపంచలు జేయునుగాక అని పూర్వ ఋషులవలె 'క్రిణ్వంతు విశ్వం ఆర్యం' విశ్వమును ఆర్యముగ జేయుదుముగాక అనగ సర్వ సంతారకమైన ఆర్య సంస్కృతి ప్రపంచమును వ్యాపించి, మాన

36. Sir Francis Younghusband : Preface, The Awakening of India, of Dr. Dewitt Maokenjee

37. Swami Atulananda : Indian Civilization, Vedanta Kesari 1935 p 198.

వుల బళుత్వమునుండి యుద్ధరించునుగాక అని అతులానంద స్వామియు నావేదన పడియున్నాడుగదా. అదే గదా 'యథేమా వాచం కల్యాణీం ఆవదాని జన్నేభ్యః। బ్రహ్మరాజన్యాభ్యాం శూద్రాయ చార్యాయ చ। స్వాయ చారణాయ చ' కాన నే నీ కళ్యాణప్రద వాక్యముల బ్రజానీకము కొరకై యుచ్చరించెను గాక! బ్రహ్మ క్షత్రి వైశ్య శూద్రాదులకేగాక, నా దేశీయులకును బరదేశీయులకును జాటెదనుగాక యని విశ్వ విశాల హృదయ మున యజుర్వేదమున ఋషిశ్రేష్ఠుడొకడు ఎలుగెత్తి, గద్గదకంఠుడై యరచియున్నాడు. దాని అతి ప్రాచీనతయేగాక దాని సంపూర్ణ ఆధునికత్వమునుగూడ వివరించుచు ఆచార్య సురేంద్రనాథ దాస్‌గుప్త భారతీయ సంస్కృతికాటపట్టగు తత్త్వశాస్త్ర పఠనము నుద్బోధించుచు, For most of the problems that are still debated in modern philosophical thought occured in more or less divergent forms to the philosophers of India. 38 ఆధునిక తాత్త్విక విచారణములో నింకను జర్చింపబడుచున్న పెక్కు సమస్యలు, భారతీయ తత్త్వజ్ఞులకు నించుమించు యిదే వివిధ రూపముల దోచననియు, Their discussions, difficulties and solutions, when properly grasped in connection with the problems of our own times, may throw light on the course of the process of the future reconstruction of modern thought. 38 వారి వాదములు, క్లిష్టత్వము, నివారణోపాయములను, ప్రస్తు

38. Prof. Surendranath Das Gupta : A History of Indian Philosophy, vol. 1 p vii.

తము మన కాలమున గల సమస్యలతో జోడించి, సక్రమముగ గ్రహించినచో నాధునిక భావ భవిష్యన్నిర్మాణమున కెంతయో మార్గమును జూపగలదనియు సురేంద్రుడు హెచ్చరిక జేసి యున్నాడు. కాన Were I an Indian, I should never surrender my soul to any. Of what value is any gift when to obtain it you must cease to be yourselves? 39 నేను భారతీయుడనై యుండినచో అన్యమునకు దేనికిని దలయొగ్గను. నిన్ను నీవుగా నుండనీయని దాన పరిగ్రహము వ్యర్థముగాదా? అని వూడ్రాఫ్ భారతీయ సంస్కృతిని గొనియాడినాడు. అక్కారణమున బ్రాచీన సంస్కృతిని నిర్లక్ష్యము జేసి, అధునాతనమును మాత్రమే ప్రస్తుతించు కొందరాధునికుల సంబోధించుచు, నది వట్టి భ్రాంతి యనియు, నాత్మవంచనమనియు హెచ్చరించుచు, ధీరేంద్రనాథుడు The present state of the Indlan situation requires the maintenance of an iron faith in India's past, lest in the process of cleaning the house the gold goes with the dust. 40 ప్రస్తుత భారతీయ పరిస్థితిప్రకారము భారతదేశ ప్రాచీనతపై గాఢ విశ్వాసము అత్యవసరము. లేకున్న గృహమును శుభ్రపఱచు నప్పుడు దుమ్ముధూళితో సువర్ణముగూడ బోవునని గట్టిగా వచించి యున్నాడు. ప్రాచీన భారతమునుగూర్చి కేవలము మూఢ నమ్మకముగాని, మూఢ ద్వేషముగాని దూష్యములనియు, ఆ రెండింటిపై భవిష్యత్తు నిర్మాణము కాజాలదనియు హెచ్చరించుచు,

39. Sir John Woodroofe : Shakti and Shakta, p 431.
40. Dr. Dhirendranath Roy : The Sp irit of Indian Civilization, p 195

The present and the future inevitably grow out of the past and bear its stamp, and to forget this, is to build without foundations and to cut off the roots of national growth. 41 వర్తమాన, భవిష్యత్తులు అనివార్యముగ భూతమునుండియే జనితము. ఈ రహస్యము విస్మరించుట పునాదులులేక నిర్మాణము జేయుట వంటిదై, జాతీయతాభివృద్ధియొక్క మూలమును ఛేదించుట వంటిదగును It is to ignore one of the most powerful forces that influences people. 41 మరియు ప్రజానీకమును వశపరచుకొను అతి బలవత్తరమైన యొక శక్తిని యలక్ష్యము జేసినట్లగునని నెహ్రూ పండితుడు మరల మరల హెచ్చరించుచున్నాడు. భూతకాలచింతనా మాధుర్యరుచుల వర్ణించుచు, There is a stillness and everlastingness about the past; it changes not and has a touch of eternity. Uneffected by the storms and upheavals of the present, it maintains its dignity, and repose and tempts the troubled spirit and the tortured mind to seek shelter in its vaulted cata - combs. 42 గతమున నొక ప్రశాంతత నిత్యతయు గలదు. అది మార్పు చెందక ననంతత్వమును స్పృశించును. వర్తమానకాలమున గల విప్లవ సంక్షోభములచే నస్పర్శమై, అది తన గౌరవ శాంతుల గాపాడుకొనును. అది కల్లోలిత చిత్తమును దన గర్భిత సమాధుల నాశ్రయించి విశ్రాంతిగొన నాకర్షించును.

41. Pandit Jawaharlal Nehru : The Discovery of India, p 443.
42. Pandit Jawaharlal Nehru : The Discovery of India, p 5.

మరియు There is peace there and security, and one may even sense a spiritual quality. 42 అందు శాంతి స్థిరత్వములు గలవు మరియునందు బారమార్థికత్వముగూడ గోచరము అని నెహ్రూ పండితుడు గతము నున్నతస్థాయిని స్తుతించి, అందే నిలచి యుండుటయందలి దోషమును వివరించుచు, But it is not life, unless we can find the vital link between it and the present with all its conflicts and problems 42 అయినను వర్తమానమున గల సర్వ సంక్షోభములు తమ సమస్యలతో దానికి ముఖ్యమైన సంబంధముండినగాని అది జీవనమే కాదని గట్టిగా హెచ్చరించియున్నాడు. కాన అతి ప్రాచీనమును అభ్యుదయకారణమును సర్వ మానవసమాజ వికాస హేతువును అగు భారతీయ సంస్కృతీ తత్త్వమును, అందిమిడియున్న సర్వతోముఖ ఆదర్శమును, సకల విజ్ఞానసాగర తుల్యమైన దాని నిజస్వరూపమును గ్రహించి, ఉచితానుచితముల విమర్శించి, వర్తమానమున కవసరముల నన్వయించి, ప్రజానీకమునకు దాని ప్రాచీనత్వ నవీనత్వముల నెరుకపరచి, సమాజాభ్యుదయకర విధానమున బ్రవర్తించెదముగాక! అర్దాని సక్రమవిధాన ననుష్ఠించి, ఆనందించి ఆదర్శవంతులమగుదుముగాక!

---

42. Pandit Jawaharlal Nehru : The Discovery of India, p 5.

## సమన్వయ విధానము

కాని పై విషయముల సమన్వయింప యత్నించుటయందనేక సమస్యలుప్పతిల్లును. అవి ఒక్కొకచో నతి క్లిష్టములై, సమన్వయమునకు దూరముగనున్నట్లు అగుపడును. కాని సమగ్ర పరిశీలనము గావించుచో సమన్వయ మార్గము లేకపోతేదు. కాని దానికై పరిశీలనము, ప్రశాంత చిత్తము, రాగద్వేషరాహిత్యము, నిష్పక్షపాత నిస్స్వార్థదృష్టియు, బట్టుదలయు, సమన్వయ దృక్పథములుండవలయును.

## సంస్కృతి - భాష

భారతీయ సంస్కృతి యనుటతోడనే ప్రథమమునుండి దాని ప్రపంచమున ప్రసరింపజేసిన సంస్కృతభాషను ప్రధానముగా స్వీకరించి, భాషకాధారమగు భావమును విస్మరించి, భాషయే సంస్కృతి యని కొందరు వాదించుట సహజము. Sanskrit was responsible for developing thought and reflecting in our work. - - - A language was powerful only when it provoked thought and imparted wisdom. This language Sanskrit is the strongest manifestation of culture of the Indian people. 43 మనలో భావ విజృంభణమునకు, యోచనలకు సంస్కృతమే ప్రధానము. యోచనా పాటవమును గలిగించి,

---

43. Pandit Jawaharlal Nehru : Bhandarkar Oriental Research Institute Poona, 2-8-1956.

వివేకమును ప్రసాదించు భాషయే శక్తివంతమైనది. భారతీయుల సంస్కృతీ స్వరూపమునకు సంస్కృతమే బలియుమైన మూర్తి యని జవహరలాల్ నెహ్రూ పండితుడుగూడ సంస్కృత - భారతీయ సంస్కృతీ సన్నిహిత, అనగా, అవినాభావ సంబంధమును ఉగ్గడించియున్నాడు. సంస్కృతమును హిందూమతముతో ముడి బెట్టుట పొరబాటు యని హెచ్చరించినను 44 'ఒక దేశముయొక్క నాగరికతను దెలుసుకొనుటకు, ఆ నాగరికతా ప్రసారమునకు గారణమైన ప్రాచీన సాహిత్యాధ్యయనము అవసరము. సంస్కృత భాష భారతదేశములో నీ సంస్కృతీ వ్యాప్తికి ప్రధాన సాధనముగా నుండెను. హిందువులకు, మొత్తమునకు భారతీయులకు సమైక్య దృక్పథమును గలగించినది సంస్కృతమే. మన జీవితముల రూపొందిన గొప్ప ప్రాంతీయ భాషలను పరిపుష్టను జేసి, నేటికిగూడ వానికి నండగా నున్నది సంస్కృతమే' 44 యని సర్దార్ పణిక్కర్ భారతీయ విద్యాభవనములో సంస్కృతభాషా వైశిష్ట్యమును స్పష్టపరచియున్నాడు. పాశ్చాత్య పండితులలో ముఖ్యుడైన కౌంట్ జోర్న్‌స్టెరన్‌గూడ No country except India and no language except the Sanskrit can boast of a possession so ancient and venerable. No nation except Hindus can stand before the world with such heirloom in its possession, unapprochable in grandeur and infinity - above all in glory. 45 భారతేతరమైన దేశముగాని, సంస్కృతేతరమైన భాషగాని అంత ప్రాచీనమును గౌరవాస్పదమును అయిన

---

44. Dr. K. M. Panikkar : Bharatiya Vidya Bhavan, 14-1-1956.
45. Prof. Count Bjornsterna : Hindu Superiority, p 180.

స్వామ్యము గలిగియుండలేదు. ఔన్నత్యమున అందనిదై, శోభ యందు అనంతమై, పరమ పవిత్ర వారసత్వమును గల భారత దేశముగాక నన్యము ప్రపంచమున నభావము అని ఉచ్చ స్థాయిని నతడు కొనియాడియున్నాడు.

అట్టిచో నిక సంస్కృతభాషయే సంస్కృతి యనియు, దాని నేర్వనివాడు తద్రహితుడనియు గాఢ విశ్వాసముంచిన భాషా వాదుల విషయమింక వచింపవలెనా? 'భారతీయౌన్నత్యాన్ని, భారతీయ సంస్కృతీ వైభవాన్ని విశ్వమంతట జాటిన దేవభాష సంస్కృతము. భారతీయ విజ్ఞానశాస్త్రమునకు ఖని సంస్కృతము' 46 అనియు, 'భారతదేశముయొక్క సభ్యత, సంస్కృతి అంతయు సంస్కృత భాషలో నున్నది. ఇప్పుడు ప్రపంచములో మనము విశిష్టులముగా గనుపించుచుండుట యనగా నందులకు యీ భాష, యీ సంస్కృతి, యీ సభ్యతలే కారణము' 47 అని కె. యం. మున్షీ మహాశయుడు నొక్కి వక్కాణించియున్నాడు. అదేవిధముగ భారతీయ సంస్కృతిని సంస్కృత సంస్కృతియే యని కామకోటిపీఠాధీశ్వరులు Sanskrit culture, ranging from the earliest extent literary records of the world, to the loftiest productions of Sri Sankaracharya and Kalidasa and being continued today by many a contemporary seer and scholar,

---

46. K. M. Munshi : (శ్రీ) బులుసు వేంకట సుబ్బారావు, ఆంధ్రపత్రిక. 31-7-1955.

47. K. M. Munshi : ఆంధ్ర పత్రిక, 11-7-1955

a culture which gleams through a vast range of climes from Central Asia to the Pacific Archipelago, can render this service of evolving a lofty world-culture suited to all times and climes. 48 ప్రపంచమున గల అతి ప్రాచీన రచనలనుండి సర్వోత్కృష్టమైన శ్రీశంకరాచార్య, కాళిదాసాదుల రచనలవరకును, నేటికిని యనేక సమకాలిక విద్వాంసులచే నింకను సాగింపబడుచున్న సంస్కృత విజ్ఞానము, మధ్య ఆసియానుండి పసిఫిక్ దీవుల వరకు గల విశాల దేశముల ప్రకాశించిన సంస్కృతి, సర్వకాల సర్వదేశములకనుకూలమైన ఉన్నత విశ్వవిజ్ఞానము, అనగా విశ్వసంస్కృతిని సృజించుట యను సేవను గావింప సమర్థము అని తెలిపియున్నాడు. The very preservation from times immemorial of this Sanskrit culture, which has been the solace of many a deep thinker all over the world up to this day, is enough to help in the evolutions of such a universal culture. 48 నేటివరకు ప్రపంచమంతటను, అసంఖ్యాక నిగూఢ విజ్ఞానవేత్తలకు శాంతి నొసంగుచున్న యీ సంస్కృత విజ్ఞానము అనాదికాలమునుండి పోషింపబడుచు వచ్చుచుండుటయే, విశ్వ విజ్ఞాన నిర్మాణమునకు యిది సహకారి కాగలదనుటకు ప్రబల కారణమనియు పీఠాధీశ్వరుని వాదము. The popularisation of Sanskrit throughout the world which will play an imparant part in correcting and elevating human nature is an imperitive duty imposed by

4 . H. H, Sri Sankaracharya of Ka[illegible]koti Peetha :
Bhavan's Journal, 6-11-1955.

Providence, at this juncture on all our countrymen.[48] మానవ స్వభావమును సంస్కరించి యుద్ధరించు ముఖ్యకార్యమున ప్రముఖపాత్ర వహించు నీ సంస్కృతభాషా వ్యాప్తి, ప్రచారము పరమేశ్వరునిచే నేడు మన భారతీయులమీద నుంపబడిన విధాయకమైన కర్తవ్యముగగూడ కామకోటి పీఠాధిపతుల గాఢ విశ్వాసము. ఇట్టి దృఢ విశ్వాసమును సంస్కృత భాషా సముద్ధరణమునకై సంస్కృత విశ్వపరిషత్ 11-12-1951 న జరిగిన తన ప్రథమ సమావేశమున, సోమనాథ క్షేత్రమున, గొన్ని ముఖ్యమైన ప్రతిజ్ఞల గావించియున్నది. That Sanskrit is the language of India's culture and inspiration: that it is the world's classical language and the key to a true understanding of India's cultural and spiritual greatness.[48] భారతీయ సంస్కృతీ ప్రబోధములకు సంస్కృతమే భాష యనియు, నది ప్రపంచమున శ్రేష్ఠమైన భాషయై, భారతీయ వైజ్ఞానిక ఆధ్యాత్మికౌన్నత్య గ్రహణమునకు మూలసూత్రమనియు ననుట ప్రథమము. అటులే వారణాశిలో జరిగిన ద్వితీయ సమావేశమునగూడ, Without a thorough knowledge of Sanskrit, our culture, our literature, our regional language, arts and our history, in short our whole life would remain an unsolved puzzle.[48] సంస్కృత భాషాజ్ఞానము క్షుణ్ణముగ లేనిచో మన సంస్కృతి, మన సాహిత్యము, మన ప్రాంతీయ భాష, కళలు, మన చరిత్ర, ఒక్కమాటలో మన

48. H. H. Sri Sankaracharya of Kamakoti Peetha : Bhavan's Journal 6-11-1955.

జీవితమే ఒక యనిర్ణీత సమస్యగా నిలచిపోవుననియు, Sanskrit alone had the potentiality of enlightening us to the real nature of the knowledge and literary treasures which great men have left for us. 49 మనకొరకు మహానుభావులచే నుంపబడిన సాహిత్యసంపత్ జ్ఞానములయొక్క యథార్థ తత్వమును మనకెరుకపరువ సంస్కృతమునకే సమర్థత గలదనియు భారతదేశ రాష్ట్రపతి రాజేంద్రప్రసాద్ అధ్యక్ష స్థానమునుండి వచింప, Indian culture and civilization cannot survive if Sanskrit learning is allowed to decay. 49 సంస్కృత విద్యను నశింపనిచ్చినచో భారతీయ సంస్కృతీ నాగరికతలు మనజాలవని కె. ఎం. మున్షీ మహాశయుడు పై భావముల బలపరిచెను. ఈ విధముగ సంస్కృత భాషావాదులు, దాని ప్రాధాన్యమును అనేక విధములుగ జాటుచున్నారు. భారతమున, సంస్కృత భాషాధ్యయనమునకై యుత్సాహములిట్లుండ, 1952 వ సంవత్సరమున, తురుష్కదేశమున, ఇస్తాంబుల్ నగరమున జరిగిన ప్రాచ్య భాషా పరిషత్తులో సమావేశమైన సకల ప్రపంచ భాషావేత్తలు సంస్కృత భాషా ప్రాధాన్యమును విశిష్టతను గుర్తించిరి. ఆ విషయమును, అందు బాల్గొనిన మద్రాసు విశ్వవిద్యాలయాధ్యక్షుడైన ఆర్కాటు లక్ష్మణస్వామి ముదలియారు, యీ విధముగా వచించెను. 'లోకములో అనేక దేశములు సంస్కృతమునందు బద్ధాదరములై యున్నవి. సంస్కృతముకంటె గొప్పదికాని, సమర్థమైనదిగాని, మరియొక సాహిత్యము లేదనుచున్నారు. దానికి దుల్యమైన భాషకూడ లేదను

49 Sanskrit Viswa Vidya Parishat : Bhavan's Journal, 6-11-1955.

చున్నారు. ఆసియా భాషలకేగాక, ఐరోపీయ భాషలకన్నింటికిని సంస్కృతము మాతృక యనుచున్నారు. ఈ పరిషత్తు మరల ఐదు సంవత్సరములకు జరుగును. అప్పుడు సంస్కృతము లోక భాషగ జేయువిషయము చర్చకు రాగలదు.' 50 ఇంతవరకు సాగిన సంస్కృతభాషా ప్రాశస్త్య వ్యాసంగము ననుసరించి, ఆ భాష ఎంత ప్రధానమైనదో, దానికిని, భారతీయ సంస్కృతికి నెట్టి సన్నిహితత్వమేగాక అవినాభావ సంబంధము గలదో గ్రాహ్యము. ఈ విధముగ భాషయే సంస్కృతి యనువారును, భాషా, సంస్కృతులన్యమనువారును, ఏకముఖముగ దాని ప్రాముఖ్యమును గొనియాడి యున్నారు. కాన నది యనాది కాలమునుండి భారతీయ సంస్కృతితో ముడివడి, ఏకమై, అభిన్న భాగముగ వర్ధిల్లుటచే, సంస్కృతీ నిర్వచన వివరణకార్యమున నిది పెద్ద గడ్డు సమస్యగా నేర్పడినదని తాత్పర్యము.

కాని విశాలదృష్టి వీక్షించినచో సంస్కృతికి, భాషకు సన్నిహిత సంబంధమున్నను, సంస్కృతిని భాష వ్యాప్తి నొందింప గల్గినను, సంస్కృతి యనిన గడువిశాలమై, భాషకుగూడ మించినదై యుండుట విదితము. సంస్కృతి సమగ్రమై, మానవ జీవితమున నభ్యుదయకర విషయములన్నింటితో సంపూర్ణమై యొప్పుటయు స్పష్టము. అందుచే నా సంస్కృతీ నిర్వచనమునకు, వివరణమునకు, ననువుగ ప్రథమతః భాష లోవభూయిష్టమై యున్నను క్రమ సంస్కారమును బొంది, అనుగుణ పద నిర్మాణము గావించుకొని, సంస్కృతితో నదియు నభివృద్ధి గాంచి,

50. Dr. A. Laxmanaswami Mudaliar, ఆంధ్రపత్రిక, 11-7-1955.

సంస్కృతితో నదియు సమగ్రమై రూపొందుటయు సహజము. ప్రస్తుతమాంగ్ల భాష, ఆధునిక భౌతిక విజ్ఞాన పరిభాషను గలిగి, తద్వివరణమునకు అధికతరముగా నితర భాషలకంటె నుపయుక్తమగుచున్నరీతి, అతి ప్రాచీనకాలమునుండి, అనగా మానవుని కందరాని కాలమునుండి వైదిక సంస్కృతికి దోబుట్టువై సహపరిణామమునొంది, ఆ వైదిక సంస్కృతి యెన్ని మార్గముల ప్రవేశించిన నన్నింట నిదియు ప్రవేశించి, తన్నిర్వచనా వివరణ కార్యభారము నతి సమర్థతతో నిర్వహించి, నాటనుండి నేటిదనుక దాని వీడక సహచరియై, అనుచరియై మనిన సంస్కృతభాష కంటె నితరము దేనికిని భారతీయ సంస్కృతిని వివరింప శక్తి చాలదనుట నిస్సందేహము. లౌకిక సంస్కృతి ఎన్ని పోకడల పోయినదో అన్ని పోకడలను సంస్కృతము పోయినది. ధార్మిక సంస్కృతి ఎంత విజృంభించినదో అంతగనే సంస్కృతము విజృంభించినది. ఆధ్యాత్మిక సంస్కృతి ప్రపంచమున నింకే సంస్కృతియు బోని ఎన్ని వినూత్న ఆశ్చర్యకర, అద్భుత భావ వీధుల జొచ్చి అచ్చటచ్చట గల అనంతానందముల నాస్వాదించినదో నంత సమర్థముగ నితర భాషలు దూరమునుండియైన గనజాలని విధముగ, సంస్కృతము వాని ప్రపంచమున నిలువజేసియుంచినది. కావున సామాన్యముగ భాషకును సంస్కృతికిని సంబంధము లేకున్నను, సంస్కృతమునకును భారతీయ సంస్కృతికిని, నేటికిని మిగుల సంబంధముండుట ముఖ్యముగ గమనించి, సంస్కృతీ గ్రహణమునకు ఆ భాష అనివార్యము, అత్యంతావశ్యకమనియే నిశ్చయము. కాని యితర భాషలుగూడ భారతీయ సంస్కృతీ భావగాంభీర్య, మాధుర్య, సౌందర్యముల

విస్పష్టలీల నుచ్చరింపగలుగు శక్తిసామర్థ్యముల బ్రదర్శించుచో వానికిగూడ నుచితస్థానము నొసంగనగును గాని, అగ్రస్థానము సంస్కృత భాషకే ప్రత్యేకించుట సముచితము. భారతీయ సంస్కృతీ వ్యాప్తికి అదియే ముఖ్యోపాయము.

## సంస్కృతి - వర్ణాశ్రమాచారములు

భాషవలెనే సంస్కృతీ సంపాదనమునకై యా యా సాధకునకు, బాత్రానుగుణముగ, గాలానుగుణముగ నేర్పాటు గావింపబడిన నియమనిష్ఠలు, సక్రమ సంఘ పరిపాలనమునకై ఆ యా కాలముల నేర్పడిన వర్ణ కుల జాతి వ్యవస్థలును సంస్కృతితో నందందు మేళవించి, భాషవోలె నభేదత్వమును జూపజొచ్చినవి. విద్యా, పాలన, వాణిజ్య, కార్మిక విధానమున సంఘము చతుర్విధములై, ముఖ్య విభాగములుగ ప్రాచీనకాలమున నేర్పడి వానికి సాంకేతికముగ బ్రహ్మ క్షత్ర వైశ్య శూద్రులనబడు నామకరణము చేయబడినది. అవి క్రమక్రమానుగతముగ సంఘమున నాటి, ఆ యా వృత్తులకనుగుణ గుణసంపత్తి నార్జించి, అభివృద్ధి జెంది యొప్పారినవి. కాలక్రమమున నా యా వృత్తులకనుకూల ప్రవృత్తులు ఆ యా వర్ణ విభాగములయందే గానబడుచు, నందే పోషింపబడుచు, నందే యభివృద్ధి గాంచుటచే నా యా లక్షణములు ఆ యా వర్ణముల స్థిరపడినవి. అందుచే నా యా వృత్తులకును ఆ యా వర్ణములకును అవినాభావసంబంధమేర్పడిపోయినది. సంస్కృతికిని సంస్కృతమునకేర్పడిన బద్ధ సంబంధము,

వర్ణ వృత్తులకును ఏర్పడి సంఘమున వర్ణ వ్యవస్థయే, కులాచార పాలనమే హిందూ అనగా భారతీయ సంస్కృతి యనెడు అపోహను గూడ గలిగించినది. ప్రాచీనకాలమున నది చెల్లినను, అన్య నాగరికతా సంపర్కఫలితముగ నా భావజాలములు తారుమారు కాజొచ్చినవి. సునాయాస ప్రాప్తములగు పాశ్చాత్య నాగరికతా ఫలితములు, వేషభాషలు, కష్టసాధ్యములగు ప్రాచీన నియమ నిష్ఠలకంటె, సంస్కృత విద్యాధ్యయనముకంటె, నిరాడంబరము లగు వేషములకంటె ప్రజానీకము నాకర్షించి, వర్ణాశ్రమధర్మ విధులయందు విశ్వాసమును గోల్పోవునటుల జేయుటమాత్రమే గాక భారతీయ సంస్కృతిపైగూడ గౌరవాదరముల గోల్పోవున ట్లొనరించెను. మీదుమిక్కిలి ప్రాచీనకాలమునాటి వర్ణ వ్యవస్థ తారుమారై, వృత్తులు సంకరములై, ఆ యా వర్ణోచిత యాచార వ్యవహారములు లోపించి, ఆ యా వృత్తుల వర్ణ విభేదము లేక సెల్లరు స్వీకరించుటచే వర్ణవ్యవస్థావిధానము ఆధునిక యుగమున ననావశ్యకమను భావము సంఘమున వ్యాప్తి జెందెను. అందుచే భారతీయ సంస్కృతికిని వర్ణమునకెట్టి సంబంధము లేదనెడు నమ్మకము అంతట కలిగెను. కాన వర్ణ సంబంధమైన ఆచార ములు వ్యర్థములను నమ్మకము అగ్రజులలోగూడ వ్యాప్తి జెంది, వర్ణవ్యవస్థ సంపూర్ణముగ క్షీణించిపోయినది.

అట్టిచో నీ వర్ణవ్యవస్థకు ప్రస్తుతకాలమున స్థానమెంతయను నది క్లిష్ట సమస్యగా బరిణమించినది. కాని ఆధునికులలో నధిక సంఖ్యాకులు దాని ద్రోసిరాజనువారలే గలరు. కేవలము భార తీయ సంస్కృతి గ్రహింపనివారు, పాశ్చాత్య నాగరికతా సంపర్క

మును బూర్తిగా నొందినవారలేగాక సనాతన విద్యావ్యాసంగము గలవారలలోగూడ ననేకులు దీని నిరసించిరి. ఆధునిక కాలమున కది అవలంబనీయముగాదని కొందరు, అనుష్ఠానసాధ్యముకాదని కొందరు, అసలు అనావశ్యకమని కొందరు తీర్మానించిరి. అట్లును కావచ్చును. కాని అతి ప్రాచీనకాలమునుండి కొన్ని సంస్కారములు ఆయా వర్ణములలో జీర్ణమై, వంశపరంపరాగతముగ వచ్చుచుండుట నెల్లరంగీకరించిన విషయమే. ఆ యా సంస్కారములు జన్మతః గల వ్యక్తి ఆ యా గుణముల అభ్యాసాదులచే నభివృద్ధి పరచుకొని, ఆ యా ప్రవృత్తుల సంఘమున జొప్పించి, సంఘము నుజ్జీవింప జేయగలుగుచున్నాడు. ఏ ప్రవృత్తులు వృత్తిలో గోచరించునో వాని అభివృద్ధికై నాతనికి సహకారము జేసిన, నతడు వానిలో అత్యధిక ప్రవర్ధమానమును సాధించి, సంఘమునకుదోడ్పడును. అతని సహాయమున నితరులలో నా ప్రవృత్తులు గాలక్రమముగ నభివృద్ధి గావించి, వానిలో నితరులకుగూడ నవకాశము గలిగింప నవకాశమేర్పడును. అంతవరకు ఆ వ్యక్తులకు, వాని సంస్కారాభివృద్ధికి దగు అవకాశముల గల్పించుటుచితమగుచున్నది. అట్టి యవకాశముల వర్ణమను నామమునగాక, సంస్కారములు, సమర్థత అనుచు గావించుటుత్తమోత్తమముగా దోచెడిని.

అటులే ఆచారములు, అనుష్ఠానములు. ఇవి దేశ కాలముల ననుసరించి మారుచుండును. వర్ణాశ్రమముల కనుగుణముగ జెల్వొందును. వాని విభజించి, సర్వకాల సర్వదేశములకనుగుణమై, వ్యక్తిని త్రివిధ సంస్కృతులలో నభివృద్ధిపరిచి, మాన

వాభ్యుదయమునకు గారణమగువానికి బ్రాధాన్యము నొసంగి, అప్రాధాన్యముల విసర్జించుట సమంజసము. అంతియగాక వ్యక్తి గత, వర్ణగత, జాతిగత, దేశగత ఆచార వ్యవహారముల, సర్వ సామాన్యమొనరింపబూనుట యసమంజసము. అందులకు మిక్కిలి జాగ్రత్త అవసరము. వ్యర్థములైన ఆచారముల విసర్జించినందు వలన సంస్కృతీ ప్రవర్ధమానమునకెట్టి లోటును ఏర్పడదని భావము. ఈ విధముగ భారతీయ సంస్కృతీ సంపూర్ణ స్వరూప మును గ్రహించి, యనుసరించి, ఆనందింప, బెద్ద యాటంక ములవోలె గోచరించు భాష, వర్ణ, ఆచారములు యథార్థమున యాటంకములుగాక, దాని సమగ్ర స్వరూప గ్రహణమునకు దోడ్పడు ఆవశ్యక శక్తులై యొప్పారునని గ్రహింపగలముగాక. వాని ప్రస్తుత ప్రయోజనము లెట్లున్నను, పూర్వమున భారతీయ సంస్కృతీ యవలంబనము, అభివృద్ధి, గమ్యముల గమనింప, నవి బహుళముగ శక్తిమంతముగ దోడ్పడుటయుందెట్టి సంశయ మనావశ్యకము. కాని వాని నేటికిని నభివృద్ధి నొందించి, అవలం బించుట విచారణీయము. ఎట్లులైనను వాని యథాతథముగ స్వీకరింప నవకాశములేకున్నను, వానిలో గల యుత్కృష్ట విష యము, మానవాభ్యుదయకారణ సూత్రముల గ్రహించి, ప్రజా నీకమున జొప్పించి, అనుష్ఠింప నవకాశమొసంగుట సారగ్రహణ పారీణుల ముఖ్య కర్తవ్యము. లేకున్న in the process of cleaning the house the gold goes with the dust 51 గృహమును శుభ్రపరచు కార్యమున దుమ్ము ధూళితో బంగారముగూడ జారిపోవును.

---

51. Dr. Dhirendranath Roy : The Spirit of Indian Civilization, p 195

భారతీయ సంస్కృతికింత గొప్ప చేటు వచ్చుటకు గారణము పాశ్చాత్య నాగరికత యని కొందరి భావము. ఇటీవలనే వెలువడిన The Eternal Quest 'నిత్యాన్వేషణము' అను తన గ్రంథమున ఆచార్య రాధాకృష్ణుడు పై విషయమును సమగ్ర పరిశీలనము గావించి, భారతీయ సంస్కృతియందేగాక, భగవదాస్తిక్య భావమునగూడ, భారతదేశముననేగాక సర్వాధునిక ప్రపంచమునగూడ నెందులకీ తిరుగుబాటు జరుగుచున్నదియు వివరించుచు, ముఖ్య కారణములుగ నైదింటిని గ్రోడీకరించినాడు. (i) Scientific temper (ii) Development of technology (iii) Religion itself suffers in the practices of its votaries from the disparity between outward allegiance and inward betrayal (iv) Silence of the religious teachers in regard to social problems (v) Dogma and fanaticism and mutual hositility of religions [52] భౌతికవిజ్ఞాన దృక్పథము, తచ్ఛాస్త్రఫలరూప యంత్రాదిక పారిశ్రామిక రంగము, బాహ్యమున విశ్వాసము, అంతరమున నవిశ్వాసములు గల మతావలంబకుల పరస్పర వైరుధ్యము, సాంఘిక సమస్యలగూర్చి మతాచార్యుల మౌనము, మతముల పరస్పర స్పర్ధలకు గారణమైన మూర్ఖత్వ, మూఢత్వములు ప్రబల కారణములుగ నాచార్యవర్యుని నిర్ణయము. అవి ఎంతయు సముచితములుగ సద్విమర్శాశీలు కు దోచకమానవు. పై విషయములు స్థూలదృష్టి గోచరములై,

52. Sri S. Radhakrishnan : The Eternal Quest.

సామాన్య మానవుని బెడద్రోవ ద్రొక్కింత నుపయుక్తములగు చున్నవనుట విదితమే. కాని తత్త్వవిదులకు, సామాన్య ప్రజానీకమునకు గల పరస్పర సంబంధబాంధవ్యము నేటివలెనే ఎల్ల కాలముల సమస్యగా బరిణమించుట విజ్ఞులకు గ్రాహ్యమే. ఆర్థర్ షోపెన్‌హార్ వచించురీతి In general, the wise in all ages have always said the same things, and the fools, who at all times form the immence majority, have in their way too acted alike, and done the opposite; and so it will continue [53] సాధారణముగ, అన్నియుగముల దత్త్వవేత్తలు ఆ విషయములనే వచించెదరు. సర్వకాలముల నత్యంత బహుళ సంఖ్యలోనుండు మూఢులుగూడ నదేవిధముగ తద్వ్యతిరిక్తముగ బ్రవర్తించెదరు; అట్లు అది నడచుచుండును. అదే యర్థమును స్ఫురింపజేయుచు వోల్టేర్‌కూడ We shall leave the world as foolish and wicked as we found it [54] ప్రథమమున ప్రపంచమును మనము గాంచినప్పటిస్థితి యగు మూఢత్వ మూర్ఖత్వములలో దాని వదలిపోవుదుము అని పలికియున్నాడు. కాన ప్రస్తుత ప్రపంచ విషమ పరిస్థితిని గేవలము మతాచార్యులపై జుట్టక, నితర కారణములగూడ నన్వేషింపనగును. ఏ జీవిత విధానమందైనను దోషులధిక సంఖ్యాకులుగను, శ్రేష్ఠులల్పసంఖ్యాబలముగ నుందురు. కనుక నధికుల దోషముల నల్పులపై బూయుక, నుత్తము

---

53. Arthur Schopenhaur : The Story of Philosophy of Will Durant, p 322.

54. Voltaiare ,, p 322

లైన శ్రేష్ఠుల ఉన్నతాదర్శముల విమర్శించి, గ్రహించి, ప్రజా నీకమున బ్రవేశపరచి, యాచరణయోగ్యము గావించుట రాజకీయ నాయకులయొక్కయు, బ్రభుత్వాధినేతలయొక్కయు ముఖ్య కర్తవ్యమని తోచెడిని. అందులకై ప్రస్తుత ప్రపంచమున బ్రజానీకము నాకర్షించుచున్న ముఖ్య విషయములను, బ్రజాబాహుళ్యమునకు దూరమగుచున్న ఆస్తికత్వ, భక్త్యాది ఆధ్యాత్మిక ధార్మిక భావపరిస్థితులను నిష్పాక్షికబుద్ధి బరిశీలించి, గుణదోష విమర్శ గావించి, దోష నిర్మూలనమునకు, గుణగ్రహణమునకును ఎల్లరు యత్నింపవలెను. అట్లయినను లోకసంస్కరణము జరిగి, మానవోద్ధరణము పూర్తి యగునను భ్రాంతి వ్యర్థము. షోపెన్ హార్, వోల్టేరుల పై వాక్యములే సత్యములు. పూర్వమెందరు మహాత్ములు ప్రజోద్ధరణమునకై యత్నింపలేదు! సర్వత్యాగము నెందరు మహామహులు దానికై చేయలేదు! అటులే నేడును ఎందరు ప్రత్యక్షముగను, అజ్ఞాతముగను లోకోద్ధరణమునకు, బ్రపంచ దుఃఖోపశమనమునకు బూనుటలేదు! పలుబాములు బడుట లేదు! అట్టివారి శ్రమ వృధాగాక కొంతవరకు బ్రపంచమునకుపయుక్త మగుచునే యున్నది. ఇక నితరాంశములు సమగ్ర పరిశీలనాంశములే యగుచున్నవి. వానిగూర్చి సుమంత యోచించెదము గాక!

# సంస్కృతి - భౌతిక విజ్ఞానము (Science)

ప్రథమతః భౌతిక విజ్ఞానము, దాని గుణదోషములు, దాని ప్రస్తుత స్థితినిగూర్చి విచారించెదము. Science is a wonderful exhibition of stages in the greatest of human adventures, the intellectual adventure 55 మానవ సాహసములలో మహత్తరమగు బుద్ధిప్రేరిత సాహస కార్యముయొక్క అద్భుత క్రమత్వ ప్రదర్శనమే భౌతిక విజ్ఞాన శాస్త్రముగా ప్రఖ్యాత భౌతిక విజ్ఞానవేత్త యగు జె. డబ్ల్యు. ఎన్. సల్లివాన్ పండితుని నిర్వచనము. అది ప్రకృతిలోని ఉద్దేశ్యముపైగాక హేతుత్వమునందు దృష్టి గలిగి, ప్రసిద్ధ భౌతిక విజ్ఞాన చక్రవర్తి యగు ఆల్బర్టు ఐన్‌స్టీన్ దృష్టికి Cosmic Religion 56 ప్రకృతి మతమై, The Cosmic religious experience is the strongest and noblest mainspring of scientific research 56 ప్రకృతిమతానుభవము భౌతిక విజ్ఞాన పరిశీలనమునకు శక్తివంతమును, పవిత్రమును అగు ముఖ్య కారణమై, independent of passions 57 రాగద్వేషాది ప్రవృత్తులులేక, ముఖ్యముగ కొన్ని శతాబ్దములనుండి యసమాన మేధాసంపన్నుల నాకర్షించి, వారి నిరంతర కృషి, త్యాగఫలితముగా ప్రపంచ బాహ్య స్వరూపమును సంపూర్ణముగ దలక్రిందులు చేసినట్లు గోచరింపచేసినది. ఈ భౌతిక విజ్ఞాన శాస్త్రము A thing cannot be regarded as true when

---

55. Dr. J. W. N. Sullivan : The Limitations of Science, p 48.
56. Dr. L. Barnett : The Universe and Dr. Einstein, p 117.
57. Dr. Lecomte du Nouy : Human Destiny, p 167.

there is no scientific evidence to confirm it 58 భౌతిక విజ్ఞానశాస్త్ర సాక్ష్యమునగాని, ఒక పదార్థముయొక్క యునికి సత్యముగ బరిగణింపనేరదు అని సగర్వముగ దీని నిర్దుష్టత్వమునుగూర్చి పలుకజూచును. అట్లు ప్రకృతిమతమున గృషి సేయు వేత్తలుమాత్రమే The only profoundly religious people 59 అద్భుతముగ బారమార్థిక చింతనామూర్తులు అని ఐన్‌స్టీన్ ముఖతః అది పలికించును. అంతియగాక The philosopher and mystic, as well as the scientist, have always sought through their various disceplines of introspection to arrive at a knowledge of the ultimate immutable essence that undergirds the mutable illusory world 60 క్షరమై, భ్రాంతియైన, ప్రపంచమును బంధించియుంచిన అవ్యయ పరమార్థ తత్త్వజ్ఞాన సముపార్జనకై, తమ తమ వివిధ సాధనలద్వారా తత్త్వవిదుడు, జ్ఞాని, భౌతికవిజ్ఞానిగూడ యన్వేషించెదరని తత్త్వజ్ఞానుల సరస స్థానము నది గడింప యత్నించినది. అటులే సి. ఇ. ఎం. జోడ్‌గూడ I should hold, then that the speculations of the scientists are, equally with the perceptions of the plain man, the moral consciousness of the good man, the sensitivity of the artist, and the religious experience of the mystic, revelatory of reality 61 సామాన్య మాన

58 Dr. Nandalal Chatterjee : Prabuddha Bharatha, 1955 p 27
59. Prof. Albert Einstein : Discovery of India, of Nehru, p 481.
60. Dr L. Barnett : Universe and Dr. Einstein, p 122.
61. Mr. C. E. M. Joad : Saints and Legends, Prabuddha Bharata, 1637.

వుని ప్రత్యక్ష ఇంద్రియ జన్యజ్ఞానము, నైతికచిత్తుని, ధార్మిక ప్రవృత్తి, కళాకారుని సూక్ష్మ దృష్టి, జ్ఞానియొక్క ఆధ్యాత్మికాను భూతులవలె భౌతిక విజ్ఞానవేత్త యొక్క మనోవ్యాపారముఃగూడ సమానమే యని నా యభిప్రాయమని వచించియున్నాడు. అగుటచే నీ శాస్త్రజ్ఞుని దృష్టి ప్రారంభమునుండి అంతమువరకు శాంతివంతమై, సూక్ష్మాతిసూక్ష్మమై, పదార్థముయొక్క యాథార్థ్య పరిశోధనము గావించుచుండుట గమనార్హము, గణనీయము.

కాని ప్రస్తుత యథార్థ పరిస్థితి నాలోచించినచో, భౌతిక విజ్ఞానము, పై నుచ్చరింపబడినంతగ సమగ్రముగాక, నన్ని సంద ర్భముల నసంపూర్ణమై, కొన్నివేళల భ్రాంతి భావములకుగూడ నిలయమై, ప్రపంచమునకు మేలుకంటె గీడును గలుగజేయు చున్నటుల ఆధునిక వేత్తలందరు ఘంటాపథముగా వివిధ ప్రచార యంత్రములద్వారా ప్రకటించుచున్నారు. ఇంత కృషి చేసినను ప్రపంచ యంత్రరహస్యముల నది ఎంతవరకు గ్రహింపగలిగెనో యిసుమంత యోచించెదముగాక!

కాంతికిరణ ప్రసారమునకు, ఉష్ణ ప్రసరణమునకుచిత పదా ర్థమువలెనే యొక పదార్థము గలదనియు, నది మన ప్రపంచము ననేగాక విశ్వాంతరాళమునందంతట నిండియుండి, సూర్యగోళము నుండియేగాక కోటాదికోట్ల మైళ్ళ దూరమునగల బృహన్నక్ష త్రములనుండిగూడ మనకు ఆ యా కాంతికిరణముల దనద్వారా వహించి, ప్రసరింపజేసి మనకందించుచున్నదనియు శాస్త్రజ్ఞులు విచారించి, తీర్మానించి, దానికి Ether ఈథర్ అని నామకరణ

మొసంగెను. కాని క్రమక్రమముగా తేజోకిరణప్రసార రహస్యము లకై యనేక యత్నముల గావించిన శాస్త్రజ్ఞులు దాని త్రోసి పుచ్చిరి. And in spite of many attempts, no reasonable mechanical interpretation of the properties of the mysterious carrier of light waves was found possible 62 కాంతితరంగముల బ్రసరింపజేయుగల ఆ యనిర్దిష్ట వాహకశక్తియొక్క లక్షణముల సకారణ స్థూల వివరణములు ఎంత కృషి చేసినను గానరాకున్నవి అని George Gamow జార్జి గామౌ వ్రాసియున్నాడు. అయినను అట్టిది లేదనుటకు సంపూర్తిగ నవకాశము అలభ్యము. సెకండునకు 1,[illegible],384 మైళ్ళ వేగమున బర్వెత్తు కాంతితరంగములకాధార మెయ్యది యను సమస్య యింకను అనిర్ధారణముగనే శాస్త్రజ్ఞుల మనముల నిలచియున్నది. In fact, the space through which light travels with such ease seems to be completely empty 62 యథార్థముగ, తేజస్సు సునాయాసముగ బ్రసరించుచున్న యంతరాళము, సంపూర్ణముగ శూన్యముగ నున్నది యని వచించినను కాంతిప్రసారము అనుటతోడ బ్రసారమునకవకాశ మొసంగు పదార్థము అవసరమగుచున్నది. శాస్త్రదృష్టికది అగమ్యమైనను యుక్తికది యవసరమగుచున్నది. దానికెట్టి లక్షణములైన అగోచరములు. అందుచే నది యున్నదనిగాని, లేదనిగాని వచించుటకు గష్టసాధ్యమై యొప్పారినది. కావున The nature of light is still one of the fun-

62. Dr. George Gamow : One Two Three—Infinity, p 95.

damental puzzles of Science 63 తేజోతత్వమింకను భౌతిక శాస్త్రముయొక్క ముఖ్య సమస్యగనే యున్నదని సల్లివాన్ తన Limitations of Science భౌతిక శాస్త్రావధులు అను గ్రంథమున వ్రాసియున్నాడు.

అటులే యనేక ప్రకృతి శక్తులును, మానవ మేధాశక్తి కందక దాగలమూచి యాడుచుండుట విదితము. కేవలము శాస్త్ర వేధశాలలలోమాత్రమేగాక ప్రత్యక్షముగ Electricity Magnetism విద్యుచ్ఛక్తి, అయస్కాంతశక్తుల మనము జూచుచునే చున్నాము. అనేక విధముల మనకనుభవయోగ్యములుగనే యున్నవి. అటులే Gravity గురుత్వము నాబడు ఆకర్షణ శక్తియుగూడ నిత్యానుభూతమే. కాని యథార్థమున మనకేగాక వాని యునికిని గనిపెట్టి, వాని బహిర్గతమొనరించి, యందరికందు బాటునకు దెచ్చి, అనుభవయోగ్యముగ జేసిన శాస్త్రజ్ఞులకుగూడ నవి యింకను దురూహ్యములుగనే నిలచియుండుటయు గమనార్హము. అందుచేతనే లింకన్ బార్నెట్ అను సుప్రసిద్ధ శాస్త్రవ్యాఖ్యాత Science cannot yet really 'explain' electricity, magnetism and gravitation; their effects can be measured and predicted, but of their ultimate nature no more is known to the modern scientist 64 విద్యుత్, అయస్కాంత, గురుత్వ శక్తులగూర్చి యథార్థమున భౌతికశాస్త్రము యింకను వివరింపజాలదు. వాని ప్రత్యక్ష ఫలితముల గణింపనగును, భవిష్యత్ఫలితాంశముల

63. Dr. J. W. N. Sullivan : The Limitation of Science, p 46,
64. Lincon Barnett : The Universe and Dr. Einstein. p 16.

వచింపవచ్చును. కాని వాని పర్యవసానతత్త్వము ఆధునిక భౌతిక వేత్తకు ఏమాత్రము తెలియదని అసలు రహస్యమును వెలిబుచ్చియున్నాడు. అట్టి వాని వివిధాంశముల బరీక్షించి చూచిన అనేక శాస్త్రజ్ఞులు అనేక సిద్ధాంతముల బ్రతిపాదించియున్నను, చివరకు వాని రహస్యముల బరిశోధించి గ్రహింపజాలక, The Principle of Uncertanity 65 అనిశ్చయ సిద్ధాంతము, The principle of Indeterminacy 65 అనిర్ణీత సిద్ధాంతములను నిర్మించిరి. సర్వ పదార్థమునకాధారమగు Electron ఎలెక్ట్రాన్ యొక్క వేగమును నిర్ణయింప సంపూర్ణముగ నశక్యము అని, అనిశ్చయ సిద్ధాంత తాత్పర్యము. దీని Heisenburg హెయిసిన్‌బర్గ్ అను జర్మనువేత్త ప్రతిపాదించెను. ప్రతిశక్తియు సూక్ష్మాణురూపమున ప్రసరించునని, Max Plank మాక్సు ప్లాంక్ అను శాస్త్రజ్ఞుడు గ్రహించి, ఆ అప్రత్యక్ష యణురూపములకు Quanta క్వాంటా అని నామకరణమొసంగియున్నాడు. ఈ క్వాంటా ఒకే రీతి ఆ యా శక్తుల గలిగి ప్రసరించునని యాతని Quanta Theory క్వాంటా సిద్ధాంతము. కాని పండిత సల్లివాన్ వాక్యములతో Perhaps the most important new concept that has yet emerged out of the rich and fascinating quantum theory is the Principle of Indeterminacy. This principle is the negation of the strict determinism that has hitherto reigned in Science 66 అమూల్యమును ఆకర్షణీయమునునైన

65. Lincon Barnett : The Universe and Dr. Einstein, p 36.

66. Dr. J. W. N. Sullivan : The Limitations of Science, p 69.

క్వాంటా సిద్ధాంతమునుండి అనిర్ణీత సిద్ధాంతము అను అతి ముఖ్య వినూత్న భావముత్పన్నమైనది. ఇంతకాలము భౌతిక శాస్త్రమును బాలించుచుండిన సూక్ష్మ నియతివాద తత్త్వము నిరాకరింప బడుటయే యీ సిద్ధాంతమగుచున్నది. అయినను డాక్టరు ఐన్‌స్టీన్‌యొక్క బృహత్తర మేధాసంపత్తి, సాహసాది లక్షణములతో బై నుదాహరింపబడిన విద్యుత్, అయస్కాంత, ఆకర్షణ శక్తుల వివిధాంశముల బరిశీలించి, వాని పుట్టుపూర్వోత్తరముల గ్రహించి, వాని ఏకత్వమును గనుగొన Unified field Theory ఐక్యావకాశ సిద్ధాంతమును బ్రతిపాదించి, అనేక విధముల శ్రమించెను గాని ఫలితము గానరాదయ్యెను. విద్యుత్ దయస్కాంతముల నొకించుక సమన్వయము గావించి, Electro-Magnetism విద్యుదయస్కాంత శక్తి యని నామకరణమొనరించినను, Gravitation ఆకర్షణశక్తి అగోచరమగుటచే రెంటిని భేదముగనే యుంచి, లోకమునగల సర్వశక్తులను యీ రెండింట నొకదాని నుండి జనితమని తీర్మానింప నాతడు ప్రయాసపడెను. కాని నిష్ఫలమయ్యెను. ఆ శక్తులు పూర్వమువలె నభేద్యములై యున్నవి. పై విషయము has led to the present situation which is characterised - not withstanding all successes - by an uncertainty concerning the choice of the basic theoritical concepts, 67 అనేక విధముల జయము గాంచినను ముఖ్య మూల సూత్రముల నెంచుకొనుటలో గల అనిశ్చయత్వము అను ప్రస్తుత పరిస్థితికి దారి జూపినది అని ఐన్‌స్టీన్ నిర్ణయించియున్నాడు.

---

67. Dr. Albert Einstein : Foreward, The Universe and Dr. Einstein.

కావున Thus a completely unified science is, in nature of things, impossible. We shall never reach a set of concepts in terms of which all phenomena can be described [68] ఆ విధముగ ప్రకృతి తత్త్వములో ఐక్య సిద్ధాంతము దుర్లభము. అఖిల ప్రకృతిని వివరించ గల మూలసూత్రముల మనము గాంచజాలమనియు నిస్పృహ జెంది సల్లివాన్ పలికియున్నాడు.

ఈ విషయమునింకను దరచి చూచుచున్న వెర్నర్ హైసన్ బర్గు ఆచార్యుడు, విశ్వనిర్మాణమునకు మూలమైన రహస్యమును ఒక గణిత సమీకరణముద్వారా కనుగొనినట్లు ప్రకటించియున్నాడు. ఈ సూత్రమున బ్రపంచ సృష్టికాధారమగు అణు నిర్మాణము, తజ్జనితమైన స్థూల పదార్థముల పుట్టుపూర్వోత్తరములు బహిర్గతము లగును. దీనిచే ఐన్‌స్టీన్ ప్రతిపాదిత Unified Field Theory ఐక్య సిద్ధాంతము కొంతవరకు సాధ్యమైనది. కాని యిది ఎంత వరకు నిర్దుష్టమో తీవ్ర గవేషణా ఫలితమునగాని తెలియదు. (Indian Express 27-2-1958)

ఇదేవిధముగా తత్త్వశాస్త్రముల జెప్పబడిన 'అణోరణీయాన్ మహతో మహీయాన్' అనునట్లు Proton, Neutron, Electron ప్రోటాన్, న్యూట్రాన్, ఎలెక్ట్రాన్‌లచే నిర్మితమైనట్లు చెప్ప బడుతున్న పరమాణువునుండి అతిశక్తివంతమగు దుర్భిణీ యంత్ర ముల ద్వారా గ్రహింపబడుచున్న గ్రహాంతరాళ, విశ్వాంతరాళ మధ్యస్థముగ గోచరించు విశ్వనిర్మాణమువరకు సర్వము, భౌతిక

68. Dr. J. W N. Sullivan : The Limitations of Science, p 105.

శాస్త్రవిధాన గవేషణము గావించు వేత్తకు అగమ్యగోచరమై, అతి క్లిష్ట సమస్యయై యొప్పారుచుండుట సర్వవిదితము. ఇటీవల, 1956 సంవత్సరము, జూలై ఒకటవ తేది, జర్మనీలో జరిగిన అఖిల ప్రపంచ నోబెల్ బహుమాన గ్రహీతల సమావేశమున Prof. Wernor Heisenburg, Hidki Yukawa జర్మనీ దేశస్థుడైన ఆచార్య వెర్నర్ హైసెన్‌బర్గు, జపానీయుడైన హిడికి యుకావా శాస్త్రజ్ఞులు ఐన్‌స్టీన్‌చే పూర్వము ప్రతిపాదింపబడిన Theory Relativity పరస్పరాపేక్షికసిద్ధాంతము, ప్రకృతి నిర్మాణమున ముఖ్యమైన Elementary Particles మూల పరమాణువులకు సంబంధించిన సమస్యల నివారింప నసమర్థమని నిశ్చయించి, ఆ సిద్ధాంతమును నిరాకరించిరి. అదేవిధముగ Plank ప్లాంక్‌చే ప్రతిపాదితమైన, Quantum Theory క్వాంట సిద్ధాంతముగూడ నసమగ్రముగ నిరాసము గావించిరి. పరమాణు భాగములుగ పూర్వము చెప్పబడినరీతి మూడు తత్త్వములుగాక Neutron, Proton, Anti-Neutron, Anti-Proton న్యూట్రాన్, ప్రోటాన్‌లేగాక, వ్యతిరేక న్యూట్రాన్, వ్యతిరేక ప్రోటానులు, అవిగాక విచిత్రమై అగమ్యమైన మరి రెండు పరమాణు భాగములును మధ్యనుండ వీనిని Electrons ఎలెక్ట్రాన్‌లు, చుట్టియుండునని వీరు తీర్మానించిరి. [69] No theory in science is regarded as the final truth, only as a step, or as useful tool; towards the attainment of a further measure of truth [70] భౌతిక శాస్త్రమున నేదియు పరమసత్య

69. International Nobel Prize Winners Conference Ist July 1956. The Hindu 4-7-1956.

70. Angus Armitege : The World of Copernicus, p 160.

ముగా బరిగణింపబడక, సత్యాన్వేషణమార్గమున మరియొక సోపానముగ, ఉపకరణముగమాత్రము గైకొనబడునని అంగస్ ఆర్మిటేజ్ అను ఖగోళ శాస్త్రజ్ఞుని వచనమురీతి భౌతిక విజ్ఞాన ధార యింకను స్థిరపడక సంతత వికారముల జెందుచు, గమ్యమునకు సుదూరమున గలదనుట సందియములేదు.

స్థూలమగు పై యంశములగూర్చియే భౌతిక విజ్ఞానసాధన దోషభూయిష్టముగ నుండ, నిక నీ గవేషణావిధానమును బ్రోత్సహించుచు, దద్రహస్యముల గ్రహించుచున్న మానవ చిత్తతత్త్వమునుగూర్చి యీ శాస్త్రము ఏమి గ్రహింపగలదు! అందుచేతనే సల్లివాన్ Thus the theory of evolution, although it can tell us a great deal about the development of our bodies, can tell us very little about the development of our minds [71] పరిణామ సిద్ధాంతము మన శరీరాభివృద్ధివిషయముల బహుళముగ జెప్పగలిగియున్నను, చిత్తపరిణామమునుగూర్చి అసలు ఏమియు జెప్పజాలనిదయ్యెనని వచించియున్నాడు. అట్లు మనస్సునే గ్రహింపజాలని శాస్త్రము, మనస్సునకాధారమై సర్వ జీవ పరిణామములకు మూలశక్తియై, సర్వ ప్రపంచమున వ్యాప్తముగనుండి, వ్యష్టి సమష్టుల నంతమున గల అగమ్యగోచర Life ప్రాణశక్తిని గూర్చి ఏమి వచింపగలదు! We are brought to the conclusion that, actually, it is totally impossible to account scientifically for all phenomen, pertaining to Life. Its development and progressive

71. Dr. J. W. N. Sullivan : The Limitation of Science, p 46,

evolution and that, unless the foundatinns of modern science are overthron, they are unexplainable 72 ప్రాణశక్తియు, దాని యభివృద్ధి, క్రమపరిణామములు మొదలగు జీవతత్త్వ రహస్యముల భౌతికశాస్త్ర పరముగా నిర్ణయించుట సంపూర్తిగ దుర్లభమని మనము తుది తీర్మానమునకు జేరినాము. ఆధునిక భౌతిక శాస్త్ర ప్రాతిపదికలు నశింబడచేయనంతవరకు అవి అనిర్వాచ్యములుగనే యుండునని ఖండితముగ నాయ్ పండితుడు పలికియున్నాడు. అటులనే when we come to the sciences-dealing with life, the state of affairs is less satisfactory 73 జీవతత్త్వ శాస్త్రమునకు జేర పరిస్థితులు అసంతృప్తికరముగనే యున్నవి. Many of the questions that seem to us quite fundamental have not been met 73 మనకతి ముఖ్యములైన అనేక సమస్యలు నిర్ణయింపబడలేదనియు సల్లివాన్ విమర్శించియున్నాడు.

కావున Expressions snch as 'Scientific truth' should only be taken in a very limited sence and not literally, - - - There is no scientific truth in the absolute sence 74 భౌతిక విజ్ఞాన సత్యము అను యుచ్చారణములును చాల నియమితార్థములతో స్వీకరింపవలెను. పర్యసానముగ భౌతికశాస్త్ర సత్యమునది రిత్త అనియు నాయ్ విద్వాంసుని తీర్మానము. ఇట్లు Because science

72. Dr. Lecomti du Nouy : Human Destiny, p. 37.

73. Dr. J. W. N. Sullivan : The Limitations of Science, p 125,

74. Dr. Lecomti du Nouy : Human Destiny, p. 23

has so far failed to grasp the reality, - - -, it is the general recognition that we are not yet in contact with the ultimate reality [75] భౌతిక విజ్ఞానము [illegible] గ్రహింపజాలనిదగుటచే, మనమింకను పరమార్థ [illegible] [illegible]గనే యున్నామను యథార్థమును జేమ్సు జీన్సు [illegible], ప్రస్తుతకాలమున భౌతికవిజ్ఞానవిశ్వము, పూర్వము [illegible] [illegible]యున్నదనియు, ప్రకృతిపరిణామ జ్ఞానము [illegible], This knowledge is, in a way, less satisfactory, for in every direction we are faced by ambiguities and contradictions [76] [illegible] [illegible] [illegible]ములు, పరస్పర వ్యతిరేకతలు, మనల [illegible], ఈ జ్ఞానము సంతృప్తికరముకాదని సల్లివాన్ [illegible]. దీనినే యింక గొంత వివరించుచు లింకన్ బార్నెట్ But the ireny of man's quest for reality is that as nature is stripped of its disguses, as order emerges from chaos and unity from diversity, as concepts merge and fundumental laws, assume increasingly simpler form, the evolving picture becomes ever more remote from experience - far stranger indeed and less recognizable [77] ప్రకృతిని [illegible] తెరల దొలగించు కొలది, సంక్షోభమునుండి [illegible]యింప, నానాత్వమునుండి ఏకత్వమవతరింప, భావ[illegible] [illegible], మూలసూత్రములు అధికతరముగ సులభత్వము

---

75. Dr. James Jeans : Prabuddha Bharata, 1946 a, p. 206.
76. Dr. J. W. N. Sullivan : The Limitations of Science, p 69.
77. Dr. Lincoln Barnett : The Universe and Dr. Einstein, p. 122

నొంద, పరిణామచిత్రము అధికతరముగ ననుభూతికి సుదూరమై మిగుల వినూత్నముగను, గుర్తించుటకతీతముగను రూపొందు చుండుట మానవ సత్యాన్వేషణమునందుగల, వైపరీత్యముగ నుద్ఘాటించియున్నాడు.

ఈ పరిస్థితికి గారణమనునటుల, మరికొందరు భౌతిక విజ్ఞాన వేత్తలు, కొన్ని నిర్ణయముల గావించిరి. We know ess about our material world than is usually believed and that our knowledge is subjective, and conditioned by the structure of our brain 78 మనము విశ్వశించుచున్నంతగ భౌతిక ప్రపంచమునుగూర్చి మనకు దెలియదు. మన జ్ఞానము మానసికమైనదై, మన మేధా స్వరూపము ననుసరించియుండునని, ఆచార్య లికోటి డు నాయ్ తెలుపగా Realization that our whole knowledge of the universe is simply a residue of impressions clouded by our imperfect senses makes the quest for reality seem hopeless 79 విశ్వమునుగూర్చి మన జ్ఞానమంతయు, మన దోషభూయిష్ఠమగు నింద్రియములచే నావృతమైన సంస్కారములయొక్క అవశేషముమాత్రమే యని గుర్తెరుంగుటచే, నుత్కృష్ట సత్యాన్వేషణము నిరాశాపూర్ణముగ నగునని, లింకన్ బార్నెట్ వచించుచున్నాడు. సుప్రసిద్ధ విజ్ఞాన వేత్త యగు సర్ జేమ్సు జీన్సు, తన The Mysterious

---

78. Dr. Lecomti du Nouy : Human Destiny, p 38.

79. Dr. Lincoln Bharnett : The Universe and Dr. Einstein, p. 23

Universe 'దుర్జ్ఞేయ విశ్వము' అను గ్రంథరాజమున Standing on our microscopic fragment of a grain of sand, we attempt to discover the nature and purpose of the Universe which surrounds our home in space and time 80 సూక్ష్మాతిసూక్ష్మమగు యిసుక రేణువుపై నిలువబడి, మన గృహమును, దేశకాలముల ద్వారా నావరించియున్న విశ్వముయొక్క స్వభావ హేతువుల గ్రహింప యత్నించుచున్నామనియు, నట్లు కృషిచేసి గ్రహించిన విషయములైనను, The everything that has been said and every conclusion that has been tentatively put forward, is quite frankly speculative and uncertain 81 వచింపబడినదంతయు, బరీక్షార్థముగ, దెలుపబడిన సకల నిర్ణయములును నిర్ధారణముగ, నూహాగానములై అనిశ్చయములనియు, కాని We are not in contact with the ultimate reality పరమార్థసత్యమును మనమందుకొనలేదనియు వ్రాసియున్నాడు. మరియు In man's brief tenancy on earth he ego-centrically orders events in his mind according to his own feelings of past, present and future 82 మానవుడు భూమిపైనున్న స్వల్ప నివాసములో, స్వకీయ భూతభవిష్యద్వర్తమాన భావముల కనుగుణముగ, దన చిత్తమున సంఘటనముల స్వార్థముగ నేర్పరచుకొనును. కాని విశ్వము క్రొత్తగ నేర్పడక, బూర్వమువలెనే యుండును. In cannot be encompassed in its entire

80. Sir James Jeans : The Mysterious Universe, p. 3.
81. Sir James Jeans : The Mysterious Universe, P. 138.
82. Dr. Lincoln Barnett : The Universe and Dr. Eisntein, p. 78.

majasty by a cosmic intellect 82 దాని సంపూర్ణాన్నత్య
ముతో నది, భౌతిక మేధాశక్తిచే గ్రహింపబడజాలదు అని,
బార్నెట్ స్పష్టపరచియున్నాడు. కారణమును వివరించుచు, సుప్ర
ఖ్యాత జర్మనుశాస్త్రవేత్త యగు ఆచార్య మాక్సు ప్లాంక్ Science
cannot solve the ultimate mystery of Nature,
and that is because, in the last analosis we our-
selves are part of the mystery we are trying to
solve 83 భౌతిక విజ్ఞానము, ప్రకృతియొక్క సంపూర్ణ రహస్య
మును వెలిపరుపనేరదు. ఎందుచేతనన, జివరకు విశదపరుపబడ
వలసిన నిగూఢతత్త్వములో, మనముగూడ భాగమగుచున్నామని
శాస్త్రీయముగ వచించియున్నాడు. This event, we
should have had no foothold from which to
start our exploration of the true meaning of the
Universe 84 అట్టులగుచో విశ్వముయొక్క యాధార్థ్యమును
గవేషించుటకు, మనకెట్టి యాధారము లేదని, సర్ జేమ్సు జీన్సు
విచారించినాడు. 'ఇంత ఎందులకు పర్యవసాన వాక్యముల వినుడు'
అనుచు In the evolution of scientific thought,
one fact has become impressively clear there is no
mystery of the physical world which does not
point to a mystery beyond itself 85 భౌతిక విజ్ఞాన పరి
ణామమున నొక విషయము విస్పష్టమైనది. తన కతీతముగా
గల నిగూఢతత్త్వమును గోచరింపజేయని నిగూఢతత్త్వము భౌతిక
ప్రపంచమున కానరాదు. All high - roads of the

82. Dr. Lincoln Barnett : The Universe and Dr Einstein, P. 78
83. Prof. Franklin Plareck : Where is Science Going ? p. 217
84. Sir James Jeans : The Mysterious Universe, p. 112
85. Dr. Lincoln Barnett : The Universe and Dr. Einstein, p. 127

intellect, all byways of theory and conjucture lead ultimately to an abyss that human ingenuity can never span 85 సర్వవిజ్ఞాన మార్గములు, సకల ఊహాపోహసిద్ధాంత పథములు పర్యవసానమునకు, మానవప్రతిభ దాట నశక్యమైన యగాధమునకు ద్రోవదీయుచున్నవి. ఎందుచేతనన For man is enchained by the very condition of his being, his finiteness and involvement in neuture. Man is thus his own mystery 85 తన వ్యక్తిత్వమున, తన సంకుచితత్త్వమున, ప్రకృతిబద్ధుడై మానవుడు బంధింపబడియున్నాడు. అట్టి మానవుడు, తనకే నిగూఢతత్త్వమై యొప్పియున్నాడు. తనను తాను గ్రహింపకుండుటచే నతడు, విశాల విశ్వమును గ్రహింపజాలకున్నాడు. విశ్వాంతరాళమున గల ప్రకృతి శక్తిచే నతని దేహము, గర్వించునతని బుద్ధియు నిర్మితము. కావున Standind midway between macrocosm and microcosm he finds barriers on every side 85 బ్రహ్మాండ పిండాండములమధ్య మహదణువులమధ్యనుండి అతడు, సర్వదిక్కుల నాటంకములనే గనుచున్నాడని చాల చక్కగా, వివరముగ, ఆధునిక భౌతిక విజ్ఞాన నిజస్వరూప కథనము నతడు, గావించియున్నాడు. పై వాక్యాంశములవలన, ప్రస్తుత ప్రపంచమును తారుమారు గావించుచున్న భౌతికశాస్త్రము, విశ్వ ప్రకృతి రహస్యముల గ్రహింప నసమర్థ మనియు, తద్గ్రహణమునకు దానిపై నాధారపడుట ఉచితము కాదనియు, నది తాత్కాలిక సుఖాదుల మానవ జీవితమునకందించినను, యథార్థ సుఖస్వరూపమునది.

85. Dr. Lincoln Barnett : The Universe and Dr. Einstein, p. 127

మానవునకొసంగజాలదనియు, దష్టాంతజ్ఞుల ముఖతః గ్రహించి యున్నారము.

## భౌతిక విజ్ఞానము - గుణదోషములు

అయినను, సుమారు నాలుగువందల సంవత్సరములనుండి, ముఖ్యముగా, Galelio గెలీలియో కాలమునుండి, ఆధునిక భౌతిక విజ్ఞానధార విజృంభించినదై, పరమాణువునుండి విశ్వాంత రాళమువరకుగల సర్వ భౌతిక ప్రకృతిని గాలించి, తద్రహస్య ముల గ్రహింప యత్నించుచుండ, ననేక వినూత్నాంశములు బహిర్గతమయ్యెను. వాని ఫలితములే, ప్రస్తుత మానవలోకము యొక్క బాహ్యాభ్యంతర రూపముల మార్చివైచెను. అందుచే పూర్వము అతి విశాలమనిపించిన ప్రపంచము, నేటి మానవుని చేతిలో నతిసంకుచితమై, దేశకాలముల కట్టుబడి, గణనమునకే రాక పోయినట్లున్నది. అందుచేతనే సముద్ర, గగన యానములేగాక, అతిశీఘ్రగతుల నది సాధించి, భూమండలము మానవదృష్టికి జులకనయై, విశ్వాంతరాళమున గోచరించు గ్రహ, నక్షత్రాదుల పైకి అతని దృష్టి మరలినది. విద్యుదాది ప్రకృతిశక్తులు అతనికి స్వాధీనమై, అతని నిత్యకృత్యములలో జెలికానివోలె దోడ్పడుచు నతని సుఖలాలసత్వమునకు సహకారులైనవి. అతడు అడుగు దూరము నడువ నసావశ్యము. శారీరక శ్రమ బహిష్కరింపబడి, అతనికై యన్ని పనులను యంత్రములు చక్కబెట్టును. వ్యాధి నివారణోపాయములధికమయ్యెను. దూరశ్రవణ, దూరదర్శన, దూరగమనాదులు సామాన్యములు. ఈ విధముగ భౌతిక విజ్ఞాన శాస్త్రము, మానవుని యండదండల నిలచి, అతని ప్రపంచ జీవిత మును ఎంతయో సునాయాసమొనరించినట్లు గావించినది.

కాని To the majority of laymen, science is valuable chiefly for its practical application. But to all the greatest men of science practical applications have emerged incidentaly, as a sort of by-product 86 సామాన్య మానవులలో నధిక సంఖ్యాకులకు, భౌతిక శాస్త్రముయొక్క ఫలితాంశములు అతి ప్రధానములు. కాని, గొప్ప భౌతిక శాస్త్రజ్ఞులకు, ఆ ఫలితాంశములు ఒక విధమైన ఉపోత్పన్నముగ నాకస్మికముగనే గలిగినవి. కాక వారి దృష్టికి ప్రథమమున, నవి అప్రధానములు కాని, సామాన్య ప్రజానీకము వానినానందముగ నాహ్వానించుటచే, నా ఫలితాంశములకు ప్రాముఖ్యము కలిగినది. యథార్థముగ యోచించుచో, Science in spite of all its practical benefits, had seemed to many thoughtful men, perhaps to the majority, to have barkened life. 87 ఈ శాస్త్రము సకలవిధ ప్రత్యక్ష సదుపాయముల గలిగియున్నను, అనేక ధీమంతులకు, వారిలో నధికసంఖ్యాకులకు, జీవితము నది అంధకారబంధుర మొనరించినట్లు గోచరించుచున్నది. ఐన్‌స్టీన్ శిష్యుడైన ఫిలిప్ ఫ్రాంక్ అనునటుల, We are not even able to derive the biological phenomena from physical and chemical laws, let alone the psychological phenomena from the physiology of our nervous system 88 మనోప్రవృత్తులు మన శారీరికవిధానమునుండి జనిత

86. Dr. J. W. N. Sullivan : The Limitations of Science, p 164.

87. Dr. J. W. N. Sullivan : The Limitations of Science, p 148.

88. Dr. Philipp Frank : Relativety, p. 80.

మని తీర్మానింపజాలక పోయినను, ప్రాణాది జీవ పరిణామ సూత్రము భౌతిక రసాయనసూత్రజనితమనియు, మనము తెలిసి కొనజాలకపోతిమి. కావున Science does not tell us much or for the matter of that anything about the purpose of life 89 భౌతిక శాస్త్రము జీవన హేతువును గురించి కొంచెమైనను తెలుపదయ్యెను. ఎందుచేతనన 'purpose' is not yet a scientific notion 90 సంకల్పహేతు వింకను భౌతికశాస్త్ర భావముకాదని, ఆచార్య సల్లివాన్ ప్రస్ఫుట పరచెను. ఎంత దరిచిచూచినను నెహ్రూ పండితుని వాక్యమురీతి, Science will go on asking 'how'? భౌతిక శాస్త్రము 'ఎట్లు?' అని ప్రశ్నించుచుండును. కాని 'how' things happened was of no importance compared with the question of 'Why?' they happened 91 ఎట్లు ఏర్పడినవి అనువిషయముకంటె, ఎందుకేర్పడినవి అనుట ముఖ్య మని, పూర్వపు Aristotelean 'Why?' ఆరిస్టాటలుని 'ఎందుకు?' ననుసరించి, భౌతిశాస్త్రబద్ధుడైనను సల్లివాన్ పండితుడు ఆ భావమునకే ప్రాధాన్యమొసంగియున్నాడు. ప్రస్తుతమునకు తత్త్వశాస్త్రీయమైన Why? సంకల్పమును, భౌతిక శాస్త్రము నిర్లక్ష్యము చేసినను, దాని యన్వేషణాంశమైన How? ఎట్లు అనునది ఫలవంతమైన కొలది, అది Perhaps takes us some-

---

89. Pandit Jawaharlal Nehru : Discovery of India, p. 10

90. Dr. J. W. N. Sullivan : The Limitations of Science, p 125.

91. Dr. J. W. N. Sullivan : The Limitations of Science, p. 11

way to answering the. 'Why?' 92 బహుశః 'ఎందుకుః' ప్రశ్నకు, సమాధానమార్గమునకు, మనల గొంపోవునేమో యనియు నెహ్రూ పండితుడాశించియున్నాడు. అటుల భౌతికవిజ్ఞానము, జీవిత విధానమున ముఖ్యమైన సంకల్పాదుల గ్రహింపనేరక, లోపభూయిష్టమైనదని విదితము.

## భౌతిక విజ్ఞానము - ప్రమాదము

అట్టి, ప్రధాన విషయమును గ్రహింపజాలని యీ శాస్త్రము, Concern for mankind and its future should always be the principal purpose of any technical advance 93 మానవజాతియొక్క క్షేమము, దాని భవిష్యత్తును, ఏ భౌతికశాస్త్ర సాంకేతికాభివృద్ధియైనను ముఖ్యోద్దేశ్యముగ నుంచుకొనవలెనను, డాక్టరు ఐన్‌స్టీన్ వాక్యముల నలక్ష్యము చేయుటచే, For the first time in the history of humanity, man is afraid of what he has done with his intelligence and wonders whether he has chosen the right path 94 మానవ చారిత్రములో ప్రథమతః మానవుడు, తన ప్రజ్ఞావిశేషముచే సాధించిన ఫలితముల జూచి భయపడుచున్నాడు. తాను సరియైన మార్గమును ఎన్నుకొంటినా యనియు ఆశ్చర్యపడుచున్నాడని, నాయ్ మహాశయుడు వ్రాకుచ్చియున్నాడు. అంతియగాక, Today when humanity is threatened with complete destruction by the liberation of atomic forces, people

92. Pandit Jawaharlal Nehru : Discovery of India, p. 16
93. Einstein and Humanity, UNECO: The Hindu 9-5-1954.
94. Dr. Lecomte du Nouy : Human Destiny, p 46.

begin to realize that the only efficient protection lies in a greater and higher moral development 95 నేడు అణుశక్తి ప్రాపకముచేత, మానవజాతి సంపూర్ణ వినాశము నొందునట్లుండ, సమర్థవంత రక్షణము, దీనికి మించిన ఉన్నతమైన నైతిక తత్త్వాభివృద్ధియందే కలదని, ప్రజ నేడు గ్రహించినారనియు నతని వచనము. 'ఉదజని అస్త్రముల అవతరణముతోడ, ప్రపంచము విపత్కర ఘట్టములో బడినది. మన జీవితముల నడుపుటలో బలవత్తరశక్తిగ బనిచేయుచున్న భౌతిక వాదమే, పరమార్థముకాదను సత్యమును యీ తరుణములో నిఖిల ప్రపంచము గుర్తించి, దృక్పథమును మార్చుకొనవలసియున్నది. దీనికి గత్యంతరము సర్వవిధ్వంసమే, లోకమును ఆ దారినుండి మరలించి, ఆధ్యాత్మిక దృక్పథమును జూపుటలో మన దేశము, ప్రముఖపాత్ర నిర్వహించవలసియున్నది. మన చరిత్ర, మన సంప్రదాయము, సంస్కృతి, మన యర్హతను, ఇందులకావశ్యకతను నిరూపించుచున్నవి 96 యని రాష్ట్రపతి రాజేంద్రుడు, బుద్ధజయంతి సందర్భమున మద్రాసు నగరమున నుచ్చరించి యున్నాడు. ఇట్టి సమస్యల యావత్ప్రపంచదృష్టి వీక్షించి, నివారణోపాయాన్వేషణము నతి తీవ్రముగ గావించుచున్న, భారత ప్రధాని జవహరిలాల్ నెహ్రూ పండితుడును, పూర్వాపరముల విమర్శ గావించి, In the ancient civilizations of India and Greece, people though much more limited

95. Dr. Lecomti du Nouy : Human Destiny, p. 46.

96. Dr. Rajendra Prasad : Buddha Mahaparinirvana Jayanti 28-5-1956

in the knowledge at their disposal, certainly had an integrated view of life. They were not so distracted. - - they had a certain wisdom in their approach to life's problems 97 పురాతనమైన భారతీయ గ్రీకు నాగరికతలలో ప్రజలు, విజ్ఞానమున నేటికంటె వెనుకబడియున్నను, జీవితమునుగురించి, సారభూతమైన దృక్పథ మును తప్పక గలిగియుండిరి. వారికింతగ బెడమార్గములు లేవు. జీవిత సమస్యా విచారణమునుగూర్చి, వారికొక నిర్దుష్ట వివేకము గలదని వాకొనుచు, Am I right in saying that the mental life of the world is in a process of deterioration, chiefly because the environment that has been created by the industrial revalution does not give time or opportunity to individuals to think 98 ముఖ్యముగ, పారిశ్రామిక విప్లవముచే సృజింప బడిన వాతావరణము యోచించుటకైనను, వ్యక్తులకు సమయము నొసంగకుండుటచే, ప్రపంచమున మానసికస్థితి క్రమక్షీణతనొందు చున్నదని నే వచించుట సముచితముగ నున్నదా యనియు, నాతడు ప్రశ్నించెను. అవును. A slow foot and a quick hand indicate a thinking mind మందగమనము, శీఘ్ర లేఖనములు, యోచనాచిత్తమును సూచించునను సూక్తి యథా ర్థముగదా! సమస్యల శాంతచిత్తమున యోచించినగాని, సము చిత నిర్ణయము లభింపకుండుటచే, నట్టి ప్రశాంతత పరుగిడు దేహ

97. Pandit Jawaharlal Nehru : Jawaharlal Nehru's Speeches. 1949–53 p 426

98. Pandit Jawaharlal Nehru : Jawaharlal Nehru's Speeches, 1949–53 p 386

మున దుర్లభమగుటయు సహజమగును. అట్టిచో నిక, నతివేగ మున, గగనవీధి గమనించు వాహనమున బ్రయాణించు దేహమున, జిత్తమునకు బ్రశాంతి యభావము. అట్టి అభ్యాసమునకలవడిన వారు, ప్రశాంతమనస్కులై, యోచింపగలుగుటయు సుదూరము. వ్యక్తికి దెలియకగూడ, దేహగమనముతో బాటు చిత్తమునకు శీఘ్రత లభ్యమై, తొందరపాటు, దానితో దొట్రుపాటు, దానిననుసరించి పొరపాటులు గలుగుచు, సమస్యానివారణముకంటె సమస్యాగుణ కారములకు దోడ్పడగలదు. ప్రస్తుత ప్రపంచ రాజకీయ రంగము ననేగాక, సకల జీవితవ్యవస్థలలోగూడ నిదే లోపము గానవచ్చు డిని. శీఘ్రగమన సదుపాయమునకు లక్షించిన మానవజాతి, శీఘ్రయోచన, శీఘ్రనిర్ణయములకు లోనై, వెంటనే యా తీర్మాన దోషదర్శనమున, మరల శీఘ్రపునర్నిర్ణయముల బాలుబడి, స్థిరత, స్థిమితముల గోల్పోయి, కేవలాస్థిరత్వమున నిరికి, బాధనొందు చున్నదనుట, సర్వజన విదితము. ఈ ప్రమాదమునకంతటికి నెహ్రూ పండితుని పూర్వవాక్యమురీతి, పారిశ్రామిక విప్లవమే కారణము. అయినను యీ విప్లవ ప్రవాహమున, దానగల దోష ముల గ్రహించియు, విజ్ఞులుగూడ గొట్టుకొనిపోవుట తప్పనిసరియై పోయినది. ఈ మధ్య భారతమునకేతెంచిన పూర్వ ఆంగ్ల ప్రధాని అట్లీ, మద్రాసు విశ్వవిద్యాలయ స్నాతకోత్సవ సందర్భమున బ్రసంగించుచు, విశ్వవిద్యాలయముల సంబోధించుచు, To day more than ever, I think, we need Universities. I have seen in my time enormous advance in science and we need the work of Universities in science for the welfare of the human beings.

We also need to study humanities to see that the scientists donot destroy everithing 99 నేడు పూర్వముకంటె మనకు విశ్వవిద్యాలయముల యవసరమెక్కువయ్యె నని నా యుద్దేశ్యము. నా కాలములో భౌతికశాస్త్రము అద్భుతరీతి నభివృద్ధి గాంచుట గాంచితిని. మానవజాతి సంక్షేమముకొరకు, విశ్వవిద్యాలయములలో భౌతిక విజ్ఞాన కృషి యవసరము. భౌతిక శాస్త్రవేత్తలు, సర్వమును నశింపజేయకుండ మనకు, వివేకోదయ సాధనపరిజ్ఞాన పఠనముగూడ అవసరమని ప్రబోధించియున్నాడు. ఈ విషయమును అతఃపూర్వము గుర్తించిన నెహ్రూ పండితుడు గూడ, Then, I think that, in spite of our vaunted civilization, in spite of the advance of science and technolody, we have lost our grip on some of the basic things of life, something that gives anchorage to life and some standard with which we could measure value 100 మన యాడంబర నాగరికత యున్నను, భౌతికశాస్త్ర పారిశ్రామిక విజ్ఞానాభివృద్ధి గలిగి యున్నను, జీవితముయొక్క కొన్ని ముఖ్యవిషయములపై, మన జీవితమునకు నిలకడ, విలువ నొసగు విషయములపై, ప్రాముఖ్య నిర్ణయమునందు, గొంత యర్థస్థానము నొసంగు విషయములందు, మన పట్టును గోల్పోయితిమని నాకు దోచుచున్నదని, గట్టిగ, దాపరికములేక వక్కాణించెను. అటులనే ప్రఖ్యాత, భౌతికవిజ్ఞాన వ్యాఖ్యాత సల్లివాన్ పండితుడుకూడ, దాను భౌతికవిజ్ఞానవేత్తలలో

99. Earl Attlee : Address, Madras University, 18-10-1956.

100. Pandit Jawaharlal Nehru : Jawahal Nehru's speeches 1949-53 p 426

బహిర్ముఖుడయ్యెను, In the refinement and stabilizing of his emotions and bodily sensation it is doubtful if man has made much of an advance 101 తన మానసికోద్రేకములను, శారీరక సంవేదనములను సంస్కరించి, స్థిరపరచుటలో మానవుడు, కొంచెమేని ముందుకు సాగినాడా యని సందేహము కలుగుచున్నదని నిష్కపటముగ దెలియజేయు, ప్రస్తుత జాతీయాభివృద్ధికై, పారిశ్రామికాది రంగముల దేశము అభివృద్ధిజేయ, ననేకవిధముల శ్రమించుచున్న నెహ్రూ పండితుడు, దీర్ఘయోచనా నిమగ్నచిత్తమున, We are harnessing science for the service of the nation. Yet a doubt arises in my mind as to whether material progress really constitutes a remedy for our problems 102 జాతీయాభివృద్ధికై భౌతికశాస్త్రముయొక్క సేవను సంఘటితపరచుచున్నాము. కాని ఐహిక విషయాభివృద్ధి యథార్థముగ, మన సమస్యల నివారింప సామర్థ్యత గలిగియున్నదా యను సంశయము నా చిత్తమున దలయెత్తుచున్నదని యనుచు, It is at best, only a partial solution ; something more is needed. We need a solution of the broad problems that afflict the world today. Many of these are probably evils that have resulted from an indescriminate application of science which we have now begun to worship 102 అది ఎటుచూచినను, పాక్షిక సాధనమే యగును.

---

101. Dr. J. W. N. Sullivan : The Limitations of Science p 46.

102. Pandit Jawaharlal Nehru.

మరియొకవేదియో అవసరము. నేడు, ప్రపంచమును బాధించు చున్న గొప్పసమస్యలకు నివారణోపాయమవసరము. మనమారాధింప నారంభించిన భౌతిక విజ్ఞానమును, అవివేకముగ నుపయోగించుటవలననే, వీనిలో నధికసంఖ్యాకములైన దోషములుత్పత్తిల్లి యున్నవని, హృదయము విచ్చి Institute of Pacific Relations పసిఫిక్ వ్యవహార సంస్థ యాజమాన్యమున జరిగిన సభామధ్యమున, నెల్గెత్తి యోచించియున్నాడు. అటులయిన నిక గత్యంతరమేమి ? ప్రపంచమునకీ కల్లోలపరిస్థితి యంతరించి. శాంతి మానవులకు లభ్యపడజాలదా? ఇక మానవ జీవితమునకు శాంతి యనునది, గ్రంథములనే గననయ్యేడునా ? అనుభవమునకు దూరమేనా ? లేదు లేదని, డెబ్బదియేడు వత్సరముల ప్రాయముగల, యావత్ కేథలిక్కు క్రైస్తవమత పీఠాధినేతయైన పోప్ పయస్, ప్రస్తుత భౌతిక విజ్ఞానాభివృద్ధి నాహ్వానించుచు, but she (Church) has to add an urgent warning, when material progress is not counter-balanced by powerful religious and moral forces it threatens to become the cancer of human society [103] కాని క్రైస్తవసంస్థ ఒక హెచ్చరిక చేయవలసియున్నది. శక్తివంతమైన ఆధ్యాత్మిక నైతికశక్తులచే, నైహిక విషయసంవృద్ధిని సరితూచకపోయినచో, నది మానవసంఘమున నొక్క వ్రణముగ పరిణమించు ప్రమాదము గలదని హెచ్చరించియున్నాడు.

---

103. Pope Pius Pontif : The Hindu, 15-5-1954.

పూర్వ గ్రంథతాత్పర్యసమీక్ష గావించినచో నుపోద్ఘాతరము ప్రస్ఫుటమే. ఆ విషయము వివిధ విజ్ఞానకోవిదుల ముఖతః వినియే యున్నారము. వివేకములేని యైహిక విజ్ఞానమంధప్రాయమై, సర్వదుఃఖమూలమగునని గ్రహింపనేరక, Human dignity is not a vain word, and that when man is not convinced of this and does not try to attain this dignity. he lowers himself to the level of the beast[104] మానవ శ్రేష్ఠత వ్యర్థ పదముకాదు. మానవుడు దీని గ్రహింప, దీని బొంద యత్నింపకున్నచో, క్రూర మృగస్థితివరకు నతడు జారిపోవునను పరమార్థము నెరుంగక, మానవత్వమునకవసరమైన, దాని యౌన్నత్యసూచికమైన, దయా ప్రేమ సత్యాది లలితగుణసంపత్తిని బాసి జీవింపబూనుట, మానవ జాతికే కళంకము. ప్రమాదభూయిష్టము. ఇట్టి బరిస్థితివలననే మానసిక తత్త్వవేత్తయగు సి. జి. జంగ్ అనునట్లు, The majority of man of our times, who develop mental trouble, lack religion[105] మన కాలమున చిత్త చాంచల్యము నొందువారిలో నధికసంఖ్యాకులు మత చింతనము లేని వారగుట, మానవత్వమునకే చేటు గలుగుచున్నది. కావున Yet some faith seems necessary in things of the spirit which are beyond the scope of our physical world, some reliance on moral, spiritual and idealistic conceptions, or else we have

---

104. Dr. Lecomti du Neuy : Human Destiny, p 13
105. C. G. Jung : Modern Man in Search of a Soul : Prabuddha Bharata, 1955, p. 58

no anchorage, no objectives or purposes in life [106] నైతికాధ్యాత్మిక, తాత్త్విక, భావములగు స్థూల ప్రపంచ గ్రహణమునకతీత తాత్త్విక విషయములపై గొంత విశ్వాసమవసర మగుచున్నది. లేకున్న మనకు, శాంతిగాని జీవితోద్దేశ్యములుగాని లేకపోవునని నెహ్రూ పండితుడు తాత్త్విక చింతనావశ్యకతను నొక్కి వక్కాణించియున్నాడు. ఆ విచారణము భౌతికశాస్త్రమునకు పరమనియు, భౌతిక శాస్త్రవిషయములు స్వల్పమగుటచే తాత్త్విక నైతిక శాస్త్రములకవి అనవసరములనియు,ననుట ఉచితమే యని యొప్పుకొనుచు, It is probably true that the problems with which science deals are intrinsically inferior in human interest to those dealt with by either philosophy or religion [107] భౌతిక విజ్ఞానశాస్త్రము విచారించు సమస్యలు, పారమార్థిక తత్త్వశాస్త్రములు విచారించు విషయములకంటె సహజముగ మానవునకు స్వల్పములనియు, నాధునిక భౌతిక శాస్త్రవాదులు సమ్మతించుచున్నారు. లోకమునకాధ్యాత్మికతత్త్వమే ప్రధానమనుచు, ఆధునిక భౌతికతత్త్వవేత్తలకగ్రసరుడైన ఆల్బర్టు ఐన్‌స్టీన్ Restricting the body of knowledge to a small group deadens the philosopical spirit of a people and leads to spiritual poverty [108] విజ్ఞాన సముచ్చయమును అల్పసంఖ్యాకమైన కొందరిలో నిమిడ్చియుంచినచో ప్రజానీకము యొక్క తాత్త్విక వ్యవస్థ నశించి, పారమార్థిక దారిద్ర్యమునకు

106. Pandit Jawaharlal Nehru : The Discovery of India, p 441.
107. Dr. J. W. N. Sullivan : The Limitations of Science, p. 163
108. Dr Albert Einstein : Foreward, The Universe and Dr. Einstein

గొంపోవునని వక్కాణించెను. అందుచే ఆచార్య నాయ్ అనునటుల మానవాభ్యుదయమన మానవుడుపయోగించు పరికరముల యభివృద్ధియు, మానవ భౌతిక సౌఖ్య పరిపోషణముగాక, can only consist in perfecting and ameliorating man himself [109] మానవుని పరిశుద్ధిజేసి, సంస్కరించుటయందే గలదనియు వచించుచు, Our intellectual endeavours, our whole science will be of no avail if they do not lead man to a better comprehension of himself, of the meaning of his life, and of the resources, buried in his inner self [110] తననుగూర్చి యధికతర అర్థజ్ఞానమునకు, తన జీవిత తాత్పర్యగ్రహణమునకు, అతని యంతరాత్మలో నిగూఢమైయున్న సంపద్జ్ఞానమునకు మానవుని, మేథా విశేషములు, మన సంపూర్ణ భౌతిక జ్ఞానములు దారిజూపనిచో, నవి సంపూర్ణముగ నిష్ఫలములనియు హెచ్చరించియున్నాడు. కావున భౌతిక విజ్ఞానమున యథార్థమైన యభివృద్ధి, దాని శక్తుల నధికతరము గావించుటయందుగాక, but the change in its metaphysical foundations [111] దాని అభౌతిక ప్రాతిపదికలలో, మార్పు గలుగుజేయుటలోనే గలదని పండిత సల్లివాన్ ప్రతిపాదింప, with the temper and approach of Science, allied to philosophy, and with reverence for all, that lies beyond, that we must

---

109. Dr. Lecomte du Nouy : Human Destiny, p 107.

110. Dr. Lecomti du Nouy : Human Destiny, p. 178.

111. Dr. J. W. N. Sullivan : The Limitations of Science, p 150.

face life 112 భౌతికశాస్త్రముయొక్క స్వభావవిధానములతో తత్త్వశాస్త్రమును జోడించి, అతీతముగనున్న పరతత్త్వముపై గౌరవముంచి, మనము జీవితము నెదుర్కొనవలయును. దానిచే నొకవిధమైన సమగ్రదృష్టి జీవితమున నుదయించి, దానిచే భూత వర్తమానములు తమ తమ గుణదోషములతో ప్రత్యక్షముకాగా, we may look with serenity towords the future 112 మనము భవిష్యత్తునకు ప్రశాంతముగ జూడవచ్చు నని నెహ్రూ పండితుని సలహా.

అట్లయిన భౌతిక విజ్ఞానమునకు, ఆధ్యాత్మిక చింతనము నకు పొత్తు కుదరగలదా యను ప్రశ్న, ఆధునికులలో జాలమందికి గలదు. దానికి సమాధానముగ నాధునిక లోకమున, ప్రపంచ ప్రఖ్యాతి నార్జించిన తత్త్వవేత్త, మన ఉపరాష్ట్రపతి రాధాకృష్ణ పండితుడు, It is worng to imagine that science was opposed to religion. It was an unfortunate immpression and an untrue one. In all history of the world, whenever a religious thesis has to be sustained, it was sustained by the spirit and method of science 113 భౌతికశాస్త్రము, ధార్మిక చింతనమునకు వ్యతిరిక్తమనుట తప్పు. ఆ భావము దురదృష్ట కరము, అసత్యము. ప్రపంచ చారిత్రమునందంతట, మతవిషయిక సిద్ధాంత ప్రతిపాదనమును సమర్థించుకొనువేళల, భౌతికవిజ్ఞాన శాస్త్ర తత్త్వవిధానములమూలముననమాత్రమే కావింపబడుచున్నవి.

---

112. Pandit Jawaharlal Nehru : Discovery of India, p. 442

113. Sir S. Radhakrishnan : Address, Indian Institute of Culture Bangalore, 29-5-1956

మరియు The mind that split the atom is superior to atom itself. Service to Truth is service of God [113] పరమాణువును ఛేదించిన మనస్సు, ఆ యణువుకంటె శ్రేష్ఠముగదా! సద్వస్తుసేవాకార్యము భగవత్సేవయే యగుచున్నదని, మనము విస్మరింపరాదని, ఉపరాష్ట్రపతియొక్క ప్రబోధ. పూర్వోక్తవిధానమున, భౌతిక శాస్త్రము అస్థిరమై యొప్పారినచో, then perhaps the unknown quantity called 'mind' may yet guide man's destiny among the infinite uncertainities of a capricious Univerce [114] నిక అజ్ఞాతమైన మనస్సు అను తత్త్వము, అనంత, అనిర్ధారిత విషయములతోగూడిన వంచక విశ్వములో, మానవ భవిష్యత్తును నడుపగలిగియుండుననియు, భౌతికవాద నిష్ఫలత్వమును గ్రహించి మానసికతత్త్వశక్తులపై శాస్త్రజ్ఞులు ఆధారపడుచుండుటయు గమనార్హము. భౌతిక విజ్ఞానస్వభావము విమర్శారూపమైయుండ, తత్త్వ శాస్త్ర స్వభావము సమన్వయరూపమై యున్నది. భౌతిక శాస్త్రము సమష్టిని వ్యష్టిగా మార్చి, వాని స్వభావ లక్షణముల తత్కాలము నకు బరిశీలించి, గ్రహించి దృప్తి గాంచుచుండ, తత్త్వశాస్త్రము అప్పటి తత్త్వముతో సంతృప్తిగాంచక, సమష్టిదృష్టితో బరీక్షించి, సార్వకాలిక లక్షణముల నన్వేషించి గ్రహించును. ఒక్కమాటలో To observe processes and to construct meens is science; to criticize and coordinate ends is philosophy [115] విధానముల గమనించి, వాని నిర్మించుట

---

113. Sir S. Radhakrishnan : Address, Indian Institute of Culture, Bangalore, 29-5-56.

114. Dr. Lincoln Barnett : The Universe and Dr. Einstein, p 38

115. Prof Will Durant : The Story of Philosophy. p Xxvi.

భౌతిక శాస్త్రము, విమర్శించి సమన్వయించుట తత్త్వశాస్త్రముగ నని డ్యూరెంటు కథనము. అట్లు విభిన్న దృష్టులు రెండును గోచరించినను, Science without philosophy, facts without perspective and valuation, cannot save us from havoc and despair. Science gives us knowledge, but only philosophy can give us wisdom 115 తత్త్వశాస్త్రములేని భౌతిక విజ్ఞానము, దూరదృష్టి యోగ్యతలులేని వివరములు, మనల నిరాశా వినాశమునుండి రక్షింపజాలవు. భౌతిక విజ్ఞానము మనకు జ్ఞానము నొసంగ, తత్త్వార్థచింతనముమాత్రమే వివేకమును బ్రసాదించునని డ్యూరెంటు మహాశయుని గాఢ విశ్వాసము. If philosophy is to be a tool of integration or synthesis, the ties between philosophy and science are of the utmost importance 116 తత్త్వశాస్త్రము సమన్వయమునకే యుపకరణముగాన తత్త్వ, భౌతికశాస్త్రముల సంబంధము మిగుల ప్రధానమనియు, నందుచే Mankind needs religious leaders who face with open eyes the result s of science, and mankind needs scientists who have the moral courage to act according to their knowledge 117 భౌతిక శాస్త్రి ఫలితముల గమనించి, సమన్వయ దృష్టితో నెదుర్కొనగల మతాచార్యులు, మానవ సమాజమునకవసరము. అటులే తమ జ్ఞానమునకనుగుణముగ వ్యవహరింప నైతిక

115. Prof. Will Durant : The Story of Philosophy, p xxvi.

116. Prof Philipp Frank : Relatively, p 94.

117. Pr.f. Philipp Frank : Relatively, p 120

సామర్థ్యముగల భౌతిక శాస్త్రజ్ఞులుగూడ, మానవజాతికవసరముగ ఫిలిప్ ఫ్రాంక్ అను వేత్త సమన్వయదృష్టి ప్రదర్శించియున్నాడు. ఇతఃపూర్వము, భౌతిక విజ్ఞానవాదము మతదృష్టిని అణగద్రొక్కినది. కాని యుది దాని నుద్ధరింపవలెననియు, వేధశాలాదృష్టిని మాత్రమే గలిగిన భౌతిక శాస్త్రజ్ఞులుగాక, the philosophers of science తత్వార్థదృష్టి గలిగిన భౌతిక శాస్త్రవేత్తలే ప్రస్తుతము ముఖ్యమనియు, 118 What characterises man, as MAN is precisely, the presence in him of abstract ideas, of moral ideas, of spiritual ideas, and it is only of these that he can be proud. They are as real as his body and confer to his body a value and an importance which it would be far from possessing without them 119 నైతికాధ్యాత్మికాది పరమ సూక్ష్మ భావముల యునికియే, మానవుని మానవునిగా నిరూపించును. మరియు వానివలననే అతడు గర్వింపవలెను. అవి తన శరీరమువలెనే యథార్థమై, అతని దేహమునకొక విలువను ప్రాముఖ్యమును గలుగజేయును. వాని లేకుండుట దుర్లభమని ఆచార్య నాయ్ వ్రవచించెను. పరమార్థ రహస్య గ్రహణము, భౌతికజ్ఞాన, తత్త్వశాస్త్రముల సంబంధముపై నాధారపడునని, విద్యార్థులకు ప్రబోధించుట అవసరమని ఫిలిప్ ఫ్రాంక్ వచించుచున్నాడు. 120 అందుచే, భౌతికశాస్త్ర తత్త్వార్థశాస్త్ర సమన్వయవిధానము, ప్రస్తుత సంక్షుభిత ప్రపంచమునకవసరమగు

118. Dr. Lecomti du Nouy : Human Destiny, p 12.
119. Dr. Lecomti du Nouy : Human Destiny, p 13.
120. Prof. Philipp Frank : Relativety, p 94

చున్నదనుటకెట్టివారైనను సమ్మతింపక తప్పదు. ఈ రెండింటికి భేదమున్నటుల గోచరించుట భౌతిక విజ్ఞానముయొక్క అసంపూర్ణత్వమే కారణమనియు, నది ఎంత పరిపూర్ణమై సత్యపదార్థమును గ్రహించుకొనుచుండునో, అవిచ్ఛిన్నమైన తత్వార్థమునకు అంత చేరువ యది యగుననియు, డాక్టర్ ప్రవాస్ జీవన్ చౌదరి తెలిపియున్నాడు. 121 క్లార్ జస్పర్ అనునట్లు Philosophy as the knowledge of knowledge, the art of all arts, as the science confined to no particular field 122 జ్ఞానములకు జ్ఞానమై, కళలకు గళయై, వ్యష్టి దృష్టిలేని విజ్ఞాన శాస్త్రమై తత్త్వశాస్త్రముండుటచే, Philosophy is essentially the completion of science in the synthesis of wisdom 123 వివేకసమన్వయమున తత్త్వశాస్త్రము, భౌతిక విజ్ఞానమునకు ముఖ్యముగ సమాపనమే యగుచున్నది.

ఇటీవల 1958 జనవరిలో, మద్రాసునగరమున సమావేశమైన భారతీయ భౌతిక విజ్ఞానవేత్తల మహాసభలో నుపన్యసించుచు, నీ విజ్ఞానము అద్భుత మారణాయుధముల నిర్మించెననియు, గాని It is not the fault of science. It is the fault of the human mind. Science is neutral ........ If you blame scince for it you will be blaming knowledge of all kinds, because knowledge misused becomes dangerous. Yet we want knowledge and science so that we may know how to use

---

121. Prof. Pravas Jivan Choudary : Prabuddha Bharatha, 1955 p 19
122. Karl Jaspers : Way of Wisdom, p 13
123. Keyserling : Preface, The Story of Philosophy, p xii.

science properly and not allow it to be misused అది భౌతిక విజ్ఞానదోషముకాదు. మానవ చిత్తముయొక్క లోపము. దానికై భౌతికవిజ్ఞానమును, మీరు నిందించుచో, సర్వవిధ జ్ఞానముల నాక్షేపించినట్లగును. దురుపయుక్తమైన జ్ఞానము హానికరము గదా! అయినను విజ్ఞానమును దుర్వినియోగపరుపక, సదుప యోగము గావింప మనకు జ్ఞాన విజ్ఞానములు రెండును అవసరమని జవహర్‌లాల్ నెహ్రూ వచించెను. ఆ భావముల, సభాధ్యక్షుడైన ఆచార్య M. S. Thacker యం. యస్. థాకర్ ప్రతిబింబించు టయేగాక, కేరళ విశ్వవిద్యాలయ స్నాతకోత్సవ సందర్భమున 15-3-1958 న ప్రసంగించుచు, భౌతికవిజ్ఞాన ఫలితాంశముల, మానవాభ్యుదయమునకై యుపయోగించు నుపాయములకై వేత్తలు కృషిసల్పుచున్నారనియు, The quest of wisdom, the quest of knowledge of the nature, growth and destiny of human values, which was the function of philosophy had acquired equal emphasis as the quest for scientific knowledge తత్త్వజ్ఞాన కార్యములైన జ్ఞానాన్వేషణము, ప్రకృతి విజ్ఞానాన్వేష ణము మానవత్వ పరిణామ గమ్యములు, భౌతిక విజ్ఞానాన్వేషణ ముతో సమాన ప్రతిపత్తిని బొందియున్నవనియు వక్కాణించి యున్నాడు. అనగా మానవాభ్యుదయకరమైన తత్త్వశాస్త్రమును, జ్ఞానవేత్తలు స్వకార్య విమర్శనా ఫలితముగ గుర్తించి, దాని ప్రాధాన్యమును గ్రహించియున్నారని విదితము. అట్లు గుర్తింపని భౌతిక విజ్ఞానవేత్త నశించుటుచితమని, The sooner all of them were blown up, the better would it be for others వారందరు ప్రేలిపోయిన నితరులకు శ్రేయస్కరమని,

ప్రఖ్యాత విజ్ఞానవేత్త సి. వి. రామన్ 13-1-58 న బెంగుళూరులో వాక్రుచ్చి యున్నాడు.

కావున, నీరెండు విజ్ఞానములు చేదోడువాదోడులై, పరస్పరాపేక్షికములై, కార్ల్ జస్పర్సు Way to wisdom 'వివేకమునకు మార్గము' అను గ్రంథమున వాక్రొనినట్లు వ్యవహరింపవలెను, ఎట్లన Systematic philosophy calls for study. Such study may be divided into three parts (i) Participation in scientific inquiry 124 క్రమబద్ధమైన తత్త్వశాస్త్రము అధ్యయనము నాజ్ఞాపించును. ఆ యధ్యయనము త్రివిధముననగును. ప్రథమము : భౌతికశాస్త్ర విచారణమున బాల్గొనుట. దీనివలన భౌతిక విజ్ఞానముల అనుభూతి, వాని పద్ధతులు, వాని సద్విమర్శా దృక్పథము, యథార్థ తాత్త్విక విజ్ఞానాన్వేషణకార్యమునగూడ ననివార్యములగునని ఆతని విశ్వాసము. (ii) The study of great philosophers 124 గొప్ప తత్త్వజ్ఞులగూర్చి గ్రహణము, తత్త్వశాస్త్రము, దాని చారిత్రమును నెరుంగకున్న నవగాహనము కాదనియు, జిజ్ఞాసువులు, ఆ యుద్గ్రంథముల, ననేకవిధమగు నాహారము నాస్వాదింవగలరని యాతని నమ్మకము. iii) A conscious approach to the conduct of daily life 124 నిత్యజీవిత విధానమును సక్రమ దృష్టి నవలంబించుటయునని జస్పర్సు యాదేశము.

అట్లుకాక, బ్లావట్స్కి వచించినట్లు 'Physical philosopher' who sees the objects before him, but

124. Karl Jaspers : Way of Wisdom p 163

fails to see the light of the Universal Mind, which reveals them 125 ముందున్న పదార్థముల దిలకించి వాని దర్శనమునకు గారణమైన విశ్వాత్మక చిత్తతేజస్సును గాంచ జాలనిచో నెంత దురదృష్టము! కావుననే My suspicion of some unknown type of being associated with evoluation is my tribute to its beauty, and to that inexaustible queerness which is the main charecteristic of the universe that has inmpressed itself on my mind during twenty-five years of scientific work 126 సృష్టి పరిణామకార్యమున, సన్నిహిత సంబంధముగల యొక అవిజ్ఞాత తత్త్వముగల వ్యక్తి గలదని, నా యనుమానము. దాని సౌందర్యమునకును, ఇరువదియైదు వత్సరముల శాస్త్రగవేషణా కార్యమున, నా మనస్సు నాకర్షించిన విశ్వముయొక్క ముఖ్యలక్షణమైన ఆ అక్షయ వైచిత్ర్యమునకును నా నమస్కారము అని జె. బి. యస్. హాల్డెన్ అను శాస్త్రజ్ఞుడుచ్చరించి, విశ్వకారణతత్త్వమును స్మరించి, తలయొగ్గియున్నాడు. ఇటులే గెలీలియో, న్యూటన్ మొదలగు ప్రాచీన శాస్త్రాచార్యులే గాక ఎడ్డింగ్టన్, పియర్స్ మొదలగు అసంఖ్యాక తజ్ఞులు వాకొని తమ నమ్రతను ప్రదర్శించియున్నారు It is still possible to hold of course, that a mind, a Designer, is controlling the course of evolution 127 పరిణామ కార్యమును నడుపుచున్న యొక నిర్మాణకర్త, ఒక అభౌతిక

---

125. H. P. Blavatsky : The Secret Doctrine vol 3 p 8.
136. Dr. J. B. S. Haldene : The Limitations of Science, p 127
127. Dr. J. W. N. Sullivan : The Limitations of Science, p 88

చిత్తము గలదనుటకవకాశముగలదని యొక శాస్త్రవేత్త యుచ్చరింప, the universe is a thought in the mind of a Supreme Mathematician 128 పరమోత్కృష్ట గణిత శాస్త్రాచార్యుని చిత్తసీమలోని యొకభావమే యీ విశ్వము అని, సర్ జేమ్సు జీన్సు మహాశయుడు వ్యక్తపరుప, వీరినధిగమించిన ప్రపత్తితో My religion consists of a humble admiration of the illimitable superior spirit who reveals himself in the slight details we are able to perceive with our frail and feeble minds. That deeply emotional convection of the presence of a superior reasoning power, which is revealed in the incomprehensible universe, forms my idea of God 129 మన దుర్బలమైన చిత్తముల ద్వారా, స్వల్ప వివరములతో, దనకుదానై తొంగిచూచుచున్న యీ యనంత పరమోత్కృష్ట తత్త్వమునకు, వినంమ్రసంస్తుతియే నా మతము. అవిజ్ఞేయ విశ్వమున బహిర్గతమగుచున్న యీ పరమయౌక్తికశక్తియొక్క అస్తిక్యతయందు, నిగూఢ హృదయపూర్వక విశ్వాసమే నా ఈశ్వరభావ నిర్మాణము గావించును అని, ఆల్బర్టు ఐన్‌స్టీన్ తన హృదయగత భగవదుద్వేగమును వెలిగ్రక్కెను. అట్లు, సమరసభావ సంశోభితమనస్కులై ద్వివిధ విజ్ఞానులు కృషి సల్పినచో, నది విశ్వమానవభాగ్యోదయముహూర్తము. ప్రపంచ మందంతటను, శాంతి చంద్రికలు నాట్యము సల్పు రంగస్థలముగ మారు దివ్యసమయము. మానవుడు, తన పూర్వపరంపరాగత

128. Sir Jemes Jeans : The Limitations of Science, p 143,
129. Dr. Albert Einstein : The Universe and Dr. Einstein, p 118

పశుత్వలక్షణముల బాసి, మానవత్వమునొంది, దేవత్వసిద్ధికై యాకాంక్షించు శుభకాలము. అట్టి కాలమునకై ఎల్లరు నిరీక్షించుచు, అద్దాని శుభదాగమనమునకై కృషి చేసి తత్సిద్ధిని బ్రాపిల జేసికొందురుగాక.

—(౦)—

## తాత్త్వికదృష్టి - ఆవశ్యకత

'బ్రహ్మవిద్యయా సర్వం భవిష్యంతః' (ఋ. 1.49) బ్రహ్మవిద్యవలన సర్వము ప్రాప్తించుననియు, 'అన్యవిద్యాపరిజ్ఞానమవశ్యం నశ్వరం భవేత్ । బ్రహ్మవిద్యాపరిజ్ఞానం బ్రహ్మప్రాప్తికరం స్థితం॥' (శుకరహస్య. ౭.14) అన్య విద్యాపరిజ్ఞానము తప్పక నశించును. కాని బ్రహ్మవిద్యా పరిజ్ఞానముమాత్రము బ్రహ్మప్రాప్తికరమై యొప్పారుననియు, 'అధ్యాత్మ విద్యా విధానాం' (భ.గీ. 10.32) విద్యలలో నధ్యాత్మ విద్య తానే యని కృష్ణపరమాత్మ వచనము మొదలగు సూక్తులు, నశ్వర ప్రాపంచిక విషయముల కంటె, పారమార్థిక విద్యావిషయ సంపన్నత అతి ముఖ్యమనియు బోధించుచున్నవి. ఆధునిక పరిస్థితుల నవలోడనమాచరించి, భౌతిక విజ్ఞానజనిత పారిశ్రామికాదిక ప్రవర్ధమానము కేవలము మానవాభ్యుదయ హేతువు కానేరదనియు గ్రహించి, The challenge to us is, how we can get this world which is unified physically, politically and eco-

nomically, unified psycholocally and spiritu-ally 130 భౌగోళిక, రాజకీయ, ఆర్థికముగ నేకమైన ప్రపంచ మును, దాత్త్వికాధ్యాత్మికముగ నైక్యమొనరించుట ఎట్లు, అను విషయమే మనకు ముఖ్యము. అదెందులకన No fundamental unity can be regarded as enduring unless it is able to sustain itself as certain fundamental spiritual values 130 తన కొన్ని ముఖ్యాధ్యాత్మిక విశేష ముల నుద్ధరించుకొనజాలనంతవరకు ముఖ్యైకత్వము స్థిరము గాదని, బెంగుళూరులో నెలకొనియున్న Indian Institute of culture భారతీయ సంస్కృతీ సమాజ యాజమాన్యమున జరిగిన మహాసభలో, ఆచార్య రాధాకృష్ణ పండితుడు నొక్కి వక్కా ణించెను. అటుల ఆధ్యాత్మిక చింతనావసరమేమి? For all our powers of reason and understanding and all our accumulated knowledge and experience, we know little enough about life's secrets and can only guess at its mysterious processes 131 మన కింత తార్కిక, అర్థ జ్ఞానశక్తులున్నను, ఎంత జ్ఞానాగార అనుభూతు లున్నను, మనకు జీవిత రహస్యములు బొత్తిగా దెలియక, దాని యవిజ్ఞాత విషయముల నూహింప గలుగుటమాత్రమే చేయు చున్నాము. అంతియగాక Whether we believe in God or not, it is impossible not to believe in some-thing, whether we call it a creative life-grow-ing force or vital energy inherent in matter which it gives its capacity for self-movement

130. Sir S. Radhakrishnan : Address, Indian Institute of Culture, Bangalore, 29-5-1955

and change and growth, or by some other name, something that is as real though elusive as life is real when contrasted with death 132 మనము భగవంతునియందు విశ్వాసముంచినను లేకున్నను, ప్రకృతి పదార్థమునందుండుచు, నది స్వయముగా గదలుట, మారుట, పెరుగుట మొదలగు కార్యముల గలుగజేయుచున్న యొక అంతఃశక్తి, లేక దాని సృజనాత్మక జీవనాధారక శక్తి యని పిలిచినను, అది యందనిదైనను, మృత్యువుతో బోల్చినప్పుడు, సత్యమయిన ప్రాణశక్తివలె నొక యథార్థ తత్త్వము గలదని మనము విశ్వసింపక నుండజాలము. దీనికి దోడుగ జస్పర్సు అనురీతి I must die, I must suffer, I involve myself inexorably in guilt. We call these fundamental situations of our existance, ultimate situations. That is to say, they are situations which we cannot evade or change 133 నేను మరణింపవలెను, దుఃఖింపవలెను. నేను దుష్టత్వమున దగుల్కొందును. వీని మన జీవితమునకు మూలసన్నివేశములనియు, ముఖ్య పరిస్థితులనియు నందుము. అనగా, మనము నివారింపరాని, సవరింపసాధ్యముగాని పరిస్థితులనితాత్పర్యము. వీనినిచూచి ఆశ్చర్య సందేహముల నొందుటయు, వీనినిగూర్చిన స్ఫురణయు, దీవ్ర తాత్త్విక విచారణాగ్రస్తముగ మన చిత్తములజేయును. నైజమున, జాగ్రత్తగ విచారించినచో ఉపనిషద్వాక్యమురీతి 'శ్వోభావా మర్త్యస్య యదంతకైతత్ సర్వేంద్రియాణాం జరయంతి

---

132. Pandit Jawaharlal Nehru : The Discovery of India, p 441.

133. Karl Jaspers : Way of Wisdom, p 19

తేజః అపి సర్వజీవితమల్పమేవ.... (కఠ. 1.1.26) ఈ విషయ సుఖములన్నియు నిన్నటివి. ఈ యింద్రియముల తేజమంతయు నశించును. మరియు, సర్వజీవితమల్పమేసుమా! మరియు man lives not by breed alone మానవుడు ఆహారాదికము పై నమాత్రమే జీవింపడు అను సూక్తివలె, 'న విత్తేన తర్పణీయో మనుష్యః (కఠ. 1.1.27) మానవుడు. కేవలము, సంపదతోడనే తృప్తిపడజాలడను ఆర్యోక్తియు గలదు. అందుచేత, బాహ్య ప్రపంచజనితవిషయ సుఖములుగాక మానవునకు నిత్యసంతృప్తి కలుగజేయునది మరియొక సద్వస్తువు గలదనియు, దాని 'అచింత్యాః ఖలు యే భావా న తాం స్తర్కేణ సాధయేత్' (మహా భారత: భీష్మ. 5.12) అచింత్యములగు ఏ భావములు గలవో, వానిని దర్కముచే సాధింప యత్నింపరాదను పెద్దల సలహాను స్వీకరించి, ఆ భగవత్తత్త్వము ఒక వేళ తెలియబడినచో నది, భగవత్తత్త్వమే కాకపోవునురీతి నది అవిజ్ఞేయమైనదని సర్వజ్ఞ లోకాభిప్రాయమే గాక, గాఢవిశ్వాసమున గూడ నైయున్నది. కావున నది యింద్రియగోచరమైననె, భౌతిక శాస్త్రమున కంది ననేగాని, దాని యునికిని విశ్వసింపజాలమనుట కేవలమవివేక మనిపించును. 'ప్రకృతిభ్యః పరం యత్తు తదచింత్యస్య లక్షణం' ప్రకృతులకు పరమైయుండుట ఏది గలదో అది అచింత్యలక్షణమనిగదా పూర్వ సూక్తి పూరణవాక్యము, పూర్వ గ్రంథమున భౌతికశాస్త్ర, భౌతికవాదముల, పరిమిత శక్తిసామర్థ్య ముల దిలకించి యున్నారముగదా! కాన Aldous Huxly ఆల్డస్ హక్స్లీ అను ఆధునిక ప్రఖ్యాత విజ్ఞానవేత్త వక్కాణించినట్లు

Faith is a pre-condition of all systematic knowing, all purposive doing and all decent living సకల సక్రమ జ్ఞాన సముపార్జనమునకును, సహేతుక కర్మలకును, సంపూర్ణ గౌరవనీయ జీవితమునకును విశ్వాసమును ప్రథమ నిబంధనముగ నెల్లరు స్వీకరింపవలెను. మనకు దెలిసినవానినే విశ్వశించెదమను వాదన, ప్రత్యక్ష ప్రపంచమునగూడ బహుళ ప్రమాదములకులోనై, పరాజయము నొందగలదు. ఇక నభౌతికమై అప్రత్యక్షమై, నిర్విషయమైన ఆధ్యాత్మిక విషయములపై, నెంత బలీయముగ నిర్వర్తింపగలుగునో వచింపవలయునా ?

ఈ హేతువులవలన 'శ్రేయశ్చ ప్రేయశ్చ మనుష్యమేతస్తౌ సంపరీత్య వివినక్తి ధీరాః' (కఠ. 1.2.2) శ్రేయస్కరము, సుఖకరములు రెండును మానవుని జుట్టినవి. వివేకవంతులు రెండింటిని గ్రహించి, విమర్శించి, శ్రేయసమునే స్వీకరించెదరు. ఎందులకన 'తయోః శ్రేయ ఆదదానస్య సాధు భవతి' (కఠ. 1.2.1) శ్రేయోతత్త్వమును గ్రహించినవాడు ధన్యుడగుచున్నాడనియు శ్రుతి వాగ్దానము నొసంగుచున్నది. 'విజ్ఞానమానందం బ్రహ్మ' (బృ. 3.9.28) విజ్ఞాన స్వరూపమును, ఆనంధఘనమును అయిన బ్రహ్మము, 'సత్యం త్వేవ విజిజ్ఞాసితవ్యం' (ఛాం. 7.16.1) సత్యము గ్రహింపబడవలసినది. అది, మన విషయేంద్రియములచే గాక సూక్ష్మాతి సూక్ష్మమైనదగుటచే శ్రుతి వలుకురీతి, 'ఏషోఽణు రాత్మా చేతసా వేదితవ్యః' (ముం. 3.1.9) నా సూక్ష్మమైన యాత్మ చిత్తముచేతనే గ్రాహ్యయోగ్యము. ఆ చిత్తమైనను, సంతత చంచలభూయిష్టమై, ప్రపంచ విషయ లౌల్యమున నిమగ్నమై, యతిచంచలమై యొప్పు చిత్తముచేగాక, 'మనో హి

12)

ద్వివిధం ప్రోక్తం శుద్ధం చాఽశుద్ధమేవ చ। అశుద్ధం కామసంకల్పం శుద్ధం కామవివర్జితం॥' (మైత్రాయణ. 4.4.6) శుద్ధాశుద్ధ రూపమున మనస్సు ద్వివిధము. కామసంకల్పాత్మకము అశుద్ధము, కామవివర్జితము శుద్ధమనునటుల శుద్ధమైనదై, 'న హ్యధ్రువైః ప్రాప్యతే హి ధ్రువం తత్' (కఠ. 1.2.10) ఆ స్థిరమగు బ్రహ్మము అస్థిరములచే తన ప్రాప్యముగాన, నా స్థిరత్వ ప్రాప్తికై, యిసుమంత విషయముల దగ్గించి, దృష్టుల నా బ్రహ్మాన్వేషణ కార్యమున మగ్నము గావింపవలయునని శ్రుతి ఆదేశము. అందువలన, బ్రియోజనమునే గోరుచో నీ విషయములవలన గలుగు తాత్కాలిక అల్ప, క్షణిక సుఖములకంటె 'తమేవ విదిత్వాతిమృత్యుమేతి నాన్యః పంథా విద్యతే ఽయనాయ' (శ్వే. 6.15) దాని గ్రహించి, మృత్యువునకతీతస్థితి నొందుచున్నాడు. ఈ స్థితికి మార్గాంతరము లేదు అనియు నుపనిషత్తుల హెచ్చరిక. అనగ నేమి యనియు సందేహించినచో, 'యేఽనుపశ్యంతి ధీరాస్తేషాం సుఖం శాశ్వతం నేతరేషాం' (కఠ. 1-5-12) అట్లుగాంచిన ధీరులు అనగా వివేకవంతులు, నిత్య సుఖమును బొందుచున్నారు. ఇతరులు దాని బొందజాలరు అనియు, నుపనిషత్తు రహస్యమును వెలిబుచ్చియున్నది.

కావున What matter is not our knowledge of God but attitude towards God [134] భగవంతునిగూర్చి మనకుగల బుద్ధియే ప్రధానమనునటుల విశుద్ధ చిత్తమున నాతని గ్రహించి, వినమ్రచిత్తమున సర్వార్పణము గావింపకున్నచో సర్వము నిష్ఫలము. అదేవిధముగ Whatever conception

134. Karl Jaspers : Way of Wisdom p 47

we have of God, if it does not influence our daily conduct, if everyday life does not find an inspiration from it, and it is not found universally necessary, than that conception is useless 135 ఈశ్వరునిగూర్చి మనకెట్టి అభిప్రాయమున్నను, అది మన నిత్యజీవిత పద్ధతిపై దన ప్రభావమును జూపకున్నచో, దైనందిన జీవితము, దానినుండి యుత్సాహమును స్వీకరింపకున్నచో, అది విశ్వవ్యాప్తముగ నవరసము కానున్నచో నా నమ్మకము నిష్ప్రయోజనమనియు, యోగానందస్వామి వచించుచున్నాడు. ఎందులకన, Religion is not in books, nor in theories, nor in dogmas, nor in talking, not even in reasoning. It is being and becoming 136 గ్రంథములగాని, సిద్ధాంతములయందుగాని, విశ్వాసములయందుగాని, వాచాలత్వమునందుగాని, హేతువాదమునందుగాని ఆధ్యాత్మిక సాధనము లేదు. అది జీవన స్థితియందును, సాధనయందును గలదనియు, వివేకానందస్వామి నొక్కి వక్కాణించియున్నాడు. అటులే రాధాకృష్ణ పండితుడుకూడ దన ఆక్స్ఫర్డ్ ఉపన్యాసములో The process of spiritual realisation does not consist in speculation or in any amount of information 137 ఆధ్యాత్మికానుభూతి యన, నూహయు బహుళ గ్రంథజ్ఞాన సంపత్తియు గాదనియు విశదపరచియున్నాడు. కేవలము గ్రాంథిక జ్ఞానమును నిరసించుచు, The knowledge

135. Swami Yogananda : The Science of Religion, p 2.
136. Swami Vivekananda : The Complete Works, vol. 3 p 253.
137. Dr. S. Radhakrishnan : The World's Unborn Soul, Address, Oxford.

which is locked up in libraries or in the brains of the teachers again penetrate but little into contemporary life. Again if fails to give birth to active work [138] గ్రంథాలయములందును, ఆచార్యుల బుద్ధియందును బంధింపబడిన జ్ఞానము, సమకాలిక జీవితమున జొరసేరదు. అది కార్యాచరణత్వమునుగూడ జనింపజేయుజాలదని, ప్రస్తుతకాల మేధావంతులలో నొక ప్రముఖుడైన నికోలస్ రోరిక్ తెలిపియున్నాడు. Education does not make man good; it only makes him clever usually for mischief [139] విద్య మానవుని ఉత్తమునిగా జేయుజాలదు. అది అతని తెలివిగలవానిగ ముఖ్యముగ దుష్టత్వమున ప్రజ్ఞాశీలునిగ జేయునని, ఇమాన్యుయేల్ కాంట్ అను పాశ్చాత్య తత్త్వవిదులలో నగ్రగణ్యుడైన విద్వాంసుడు వచించినట్లు, అది కేవలము నిష్ప్రయోజనము, నిరర్థకము. కావుననే A man who is able to conquer himself is greater than the man who conquers the world [140] ప్రపంచమును జయించిన వానికంటె, తననుజయించుకొనినవాడధికుడు. It is not by intellect, learning and study, but by something else by which we will be able to discover ourselves [140] బుద్ధిచేగాక, విద్యా గ్రంథ జ్ఞానముచేగాక, మరియొక తత్త్వముచే మనము మనల గనుగొనగలము అనియు, ఆచార్య రాధాకృష్ణుని వచనము.

---

138. Nicholas Roerich : Prabuddha Bharata, 1945, p 229.
139. Immanuel Kant : The Story of Philosophy, of Will Durant, p 260
140. Dr. S. Radhakrishnan : Address, Indian Institute of Culture, Bangalore, 29-5-1955

ఈ రహస్యమును బూర్వమే యెరింగియున్న మన శ్రుతులుగూడ నిట్లే బోధించుచున్నవి. 'తత్కారణం సాంఖ్య యోగాధిగమ్యం' (శ్వే. 6.13) దాని గ్రహించుకొనునది సాంఖ్య, యోగములే యని శేతాశ్వతరముపదేశించుచుండ, 'నాయమాత్మా ప్రవచనేన లభ్యో న మేధయా న బహునా శ్రుతేన, (ముం. 3.2.3) వేదజ్ఞానముచేగాని, దాని గ్రహణముచేగాని, వివిధ విజ్ఞానములచే గాని యా యాత్మ గ్రహింపబడదని ముండక శ్రుతి హెచ్చరించు చుండ, పరమ గుహ్యమైన యీ వేదాంతవిద్యను, 'నాప్రశాం తాయ దాతవ్యం' (శ్వే. 6.22) ప్రశాంతిలేనివానికి బోధింపగూడ దనిగూడ శ్వేతాశ్వతరము నిషేధించినది. అయిన నింత కష్టసాధ్య మైనదానికై ఎందుకు ప్రయాస యనుచో, బూర్వ గ్రంథపఠనము మరియొక పర్యాయము గావింపవలయునని సలహా. అట్లైనను ప్రపంచోత్పత్తినుండి నేటివరకు, మానవుడెన్ని విషయముల నాలోచింపలేదు ! ఎన్నింటికై కృషి సలుపలేదు ! కొన్నివేళల నిష్ఫలము కాలేదు ! నేటికిని, సామాన్య మానవునికి ప్రస్తుతమప్ర యోజనమైన ఎన్నివిషయములలో అతిసాహసముగ మానవ ధీశక్తి ప్రవేశించుటలేదు ! ఎవరెస్టు నధిరోహించుట ఎందులకు ? పసిఫిక్ మహాసాగరమున మునుగుట ఎందులకు ? గ్రహాంతరాళ గవేష ణములెందుకు ? ఈ సాహస చర్యలు ప్రత్యక్షముగ సామాన్య మానవునకెట్లుపయోగపడుచున్నవి ? కాని యిది ఆ విధముగాక, మానవునకన్యముకానిది, మానవ ప్రవృత్తులకు, బుద్ధికి, తత్త్వము నకు, పరముగాని పరమతత్త్వ విచారణముగావించి, దాని సుగూఢ గుప్త రహస్యముల గ్రహింప యత్నించి, ఏయొక్క అదృష్ట వంతుడో సాధించి కృతకృత్యుడైనచో, దా దుఃఖ నివృత్తినొంది

పరమానంద ప్రాప్తి నొందుటయేగాక, 'అశ్వినా సారఘేణ మా మధునాం క్తం శుభస్పతీ। యథా భర్గస్వతీం వాచం అవదాని జగ్నా అను॥' (అధర్వణవేద. 6.69.2) తేజోదేవతలైన అశ్వనీ దేవతలారా! శుభత్కరములైన వాక్యముల నేను మానవ సంఘమునకు బలుకునట్లు, నాకు మధురశక్తి నొసంగెదరుగాక యని ప్రార్థించి, శక్తినార్జించి, తన కష్టార్జిత జ్ఞానధన సర్వస్వమును మానవ జాత్యభ్యుదయమునకై ధారబోయుచున్నాడు. కావున ఋూర్వోక్తచందము, 'ఆధ్యాత్మవిద్యా విద్యానాం' అను ఆర్యోక్తి ప్రాధాన్యమును గ్రహించి, సర్వేతర విజ్ఞానములకంటె నిదియే మానవ వికాసమునకు ముఖ్యకారణమని అవలోకించి, తద్విద్యా వ్యాపన, అనుసరణ, అనుష్ఠాన, అనుభవములకై యెల్లరు యత్నించి కృతకృత్యులగుదురుగాక అని యాశించుచున్నాను. 'స యథా కామోభవతి తత్క్రతుర్భవతి, తత్క్రతుర్భవతి తత్కర్మ కురుతే, యత్కర్మ కురుతే తదభిసంపద్యతే' (బృ. 4.4.5) పురుషుడెట్లు సంకల్పించునో అట్లు నిశ్చయించును. ఎట్లు తీర్మానించునో అట్లాచరించును. దేనికై ఆచరించునో దానిని పొందును అనిగదా ఆర్యవచనము!

—(౦)—

## భారతీయ తత్త్వరహస్యము

భారతీయ మహర్షికోటి అతి ప్రాచీనకాలముననే, ప్రపంచ తత్త్వమును సంపూర్తిగ నవలోడనముజేసి, దానసిరికి, సుఖదుఃఖద్వంద్వచక్రమున భ్రమించుచు, నదియు సౌఖ్యసంధానమను

భ్రాంతి దగుల్కొని ప్రయాసజెంద నిచ్ఛగింపక, దీవ్ర తపోనిమగ్నమానసులై, అలౌకిక విషయ మాధుర్యాన్వేషణము గావించి, అందుండు రసస్వరూపము నాస్వాదించి, తన్మయులై ఆనందించి తమ తోడి మానవకోటికి జ్ఞానోపదేశముజేయు దమ విధానముల నెరుకపరచియున్నారు. అందుచే నతి దూరకాలమునుండి యూ ప్రబోధ భారతీయ సకల జీవితవిధానము నావరించి, లయించి, యుప్పొంగి భారతి, India is the only country in the world to whom spirituality is the very breath of life 141 ప్రపంచమున నాధ్యాత్మిక సంస్థితిని ప్రాణముగ గలది భారతదేశము ఒకటియే యని శిశిర్ కుమార్ మిత్రచేతను, His (Hindu) soul is a book in which there are chapters unreadable by the practical European,....and kingdom of peace and quietude untravelled and unexplored by the busy and restless Englishman 142 కర్మనిష్ఠుడైన ఐరోపాదేశస్థునిచే పఠనసాధ్యముగాని ప్రకరణములు భారతీయ స్వభావ గ్రంథమున గలవు. ఆ శాంతి సామ్రాజ్యము, ఆత్మశాంతులు, అతివ్యవహారదక్షుడై విశ్రాంతిలేని ఆంగ్లేయునిచే ద్రొక్కబడలేదు తెలియబడలేదుఅనిగౌరవనీయుడైన యస్. ఫ్లెచ్చర్ విలియమ్స్ను అను పాశ్చాత్య తత్త్వవేత్తచేతను; India is pre eminently the abode of religion and richest mine of psychological ideas 143 భారతదేశము మతముల పుట్టినిల్లు అయి అమూల్య తాత్త్విక భావమని

---

141 Prof Sisir Kumar Mitra : The Vision of India, p 260

142. Rev. S. Fletcher Williams : Life and Work in india.

143. Rev. T. E. Slater : The Higher Hinduism in Relat on to Christianity.

యని టీ. యి. స్లేటర్‌చేతను; India For thousands of years has been a fountain-spring of spirituality 144 భారతభూమి అనేకవేల వత్సరములనుండి పారమార్థిక విషయ స్రవంతి యని సర్ ఫ్రాన్సిస్ యంగ్ హస్బెండు మొదలగు అసంఖ్యాక విద్వద్వరేణ్యుల దృష్టుల నాకర్షించి, వారి యపార సంస్తుతులకు బాత్రమై యొప్పారుట సర్వజన గమనార్హము.

India has produced the profoundest metaphysics that we know of 145 మనకు దెలిసియున్నంతలో భారతదేశము అత్యద్భుత తాత్త్వికశాస్త్రమును నిర్మించినదని ప్రసిద్ధ జర్మనువేత్త కౌంట్ హెర్మన్ కైసర్లింగ్ మొదలగు విజ్ఞుల మన్ననలందుకొనుటయందు గల భారతీయ విశిష్టత ఏమి? The East is bold in search of the mysteries of the internal world 146 ప్రాగ్దేశము, అంతఃప్రపంచ రహస్యముల నన్వేషించుటయందు అతి ధైర్యసాహసముల గలిగి యుండెను అని వివేకానందుడన్నటుల, ప్రత్యక్షానుభూతికందు బాటులోనుండి అత్యంతాకర్షణీయముగ నొప్పారి, అసంఖ్యాక మానవుల దనయందిమిడ్చికొనియున్న అతి విశాల ప్రపంచము, తన యుగణిత సుఖసంపదలతో ముందుండ దానిని ద్రోసివైచి, వీనియన్నింటికి నధిష్ఠానమై, ఆధారమై, అదృష్టమై, అగోచరమై

144. Sir Francis Younghusband : Spiritual Renaissance Stirs in India, New York Times Magazine Sep 1937.

145. Dr. Count Hermann Keyserling : The Vison of India, of S. K. M. p 211.

146. Swami Vivekananda : The Complete Works, vol. 3 p 459.

విరాజిల్లు బ్రహ్మవిద్యయందు భారత ఋషివర్యులు ఎక్కువ మక్కువ గలిగి, అద్దాని సాధింప ననంత త్యాగముల గావించుట ఆశ్చర్యము గదా ! అద్భుతముగదా ! సంతత వికారమై, చంచలమైన ప్రపంచమున మగ్నమైన భక్తులకు మరింత అవాఙ్మానసగోచరముగదా ! ఎచ్చోట నలుగురు సమావేశమైనను అతి ప్రాచీనకాలముననే 'కో ను ఆత్మా కిం బ్రహ్మేతి' (ఛాం. 5. 11.1) మన ఆత్మ ఎవరు? బ్రహ్మమనసెద్ది, అనియు, 'కిం కారణం బ్రహ్మ కుతః స్మ జాతా జీవామ కేన క్వ చ సంప్రతిష్ఠాః' (శ్వే. 1.1) కారణమైన యీ బ్రహ్మ ఎట్టిది ? మనమెటనుండి జనించితిమి ? ఎవరిచే మనము జీవించుచున్నాము ? మనమెటకు దుదకరుగుదుము ? అని బ్రహ్మమును గూర్చియు, దమకధిష్ఠానమును గూర్చియు వారు ప్రశ్నించుకొనుచు, జర్చించుకొనుచు, నా విషయ గ్రహణమునకై దేశదేశముల గ్రుమ్మరనేల? 'కేనేషితం పతతి ప్రేషితం మనః కేన ప్రాణః ప్రథమః ప్రైతి యుక్తః । కేనేషితాం వాచమిమాం వదంతి చక్షుః శ్రోత్రం క ఉ దేవో యునక్తి॥' (కే. 1.1) దేనిచే ప్రబోధింపబడి మనస్సు కర్మ చేయుచున్నది? ఎవరిచే నాదేశింపబడి ప్రథమ ప్రాణము జనించినది? ఎవరి ప్రాభవముచే నాదేశమొసంగబడినది? నేత్ర కర్ణముల నే దేవత అజ్ఞాపించును? 'భగవాన్ కుతో హ వా ఇమాః ప్రజాః ప్రజాయంత' (ప్ర. 1. 3) ఈ జీవులెందుండి యావిర్భవించినవి గురువర్యా? 'భగవాన్ కత్యేవ దేవాః ప్రజాం విధారయంతే?' (ప్ర. 2. 1) ఎందరు దేవతలు జీవుని ధరించుదురు? 'కుత ఏష ప్రాణో జాయతే? కథమాయాత్యస్మిన్ ఛరీర । ఆత్మానం వా ప్రవిభజ్య కథం ప్రతిష్ఠతే' (ప్ర. 3. 1) యీ ప్రాణశక్తి

ఎందుండి జనితము? ఈ శరీరములోనికీతడెట్లు చేరును? తనను విభజించుకొని యాతడెట్లుండెను? 'కాని స్వపంతి కాన్యస్మిం జాగ్రతి కతర ఏష దేవః స్వప్నాన్ వశ్యతి కస్యై తత్సుఖం భవతి' (ప్ర. 4.1) జీవునిలో నిద్రించునది ఏద్ది? అతనిని మేల్కొలుపున దెద్ది? స్వప్నముల జూచు దేవత ఎవరు? ఈ సుఖమెవరిది? 'క్వాసౌ పురుషః' (ప్ర. 6.1) ఆ పురుషుడెట నున్నాడు? మొదలగు ప్రశ్నా పరంపరలచే నాధ్యాత్మికవిద్య నెరుంగని, నవయౌవను లైన, శిష్యబృందము, బ్రహ్మాది స్తంబపర్యంతముగల జీవకోటి యొక్క పుట్టుపూర్వోత్తరములనేగాక, వానికాధారములైన ప్రాణాది శక్తులగూర్చియు, నద్దాని యధీనమున బ్రవర్తించు నింద్రియ ప్రవృత్తులనుగూర్చియు, జాగ్రత్స్వప్న సుషుప్త్యాది యవస్థల గూర్చియు, నింత నిగూఢ తత్త్వరహస్యములకై గురువర్యుల సన్నిధానంబుల జేరనేల? అంతియగాక జీవ లోక విషయతృష్ణతో దృప్తిగాంచక 'లోకస్య కా గతిః' (ఛాం. 1.8.7) ఈ లోకమునకు బుట్టుక ఏది? అని లోకములయొక్క కారణాదిక వివరముల గోర నేల? మరియు 'యేయం ప్రేతే విచికిత్సా మనుష్యేఽస్తీత్యేకే నాయమస్తీతి చైకే (కఠ. 1.1.20) జీవుడు మరణించిన పిమ్మట ఏమగును? అను ప్రఖ్యాత సందేహము నాకు గలదు. కొందరత డుండునని, కొందరుండడని యందురు అని, జీవుని మరణాంతర స్థితి అనగ మృత్యు రహస్యమునుగూర్చిగూడ ప్రశ్నించుట, యోగ్య గురువుల సన్నిధానమున జేరి సంతృప్తినొందుట నెందు లకో! ఆ గురువులైనను అడిగిన వెంటనే విషయముల బోధించి పంపెడువారలా? ఇంద్ర, విరోచనాది భూమండలాధీశ్వరులే ఆశ్ర యించినను, శతాధిక వత్సరముల కఠిన బ్రహ్మచర్యాది నియమ

ములనుంచి, కఠినతర పరీక్షల గావించి, తాము శిష్యుని యర్హతతో దృప్తి గాంచినగాని శిష్యుల దృప్తచిత్తుల గావించి శాంతి ప్రసాదించువారుకారు. సకల విధముల కష్టములకోర్చి నాటి ఆత్మ రహస్య జిజ్ఞాసువులు, దాని నన్వేషించి, సాధించి, ఆనందించి, తదనుభవరహస్య సంపదను భారతి పాదపద్మ సన్నిధి గ్రంథరూపముల నర్పించి, కృతకృత్యులైరిగదా! భారతీయ సంస్కృతికి ఆనాటి జ్ఞాతాజ్ఞాత మహర్షికోటియేగదా అచంచల ప్రాతిపదిక! అట్టి మహర్షిగణములకెల్లప్పుడును భారతియేగాక, యావత్ప్రపంచము కృతజ్ఞతాపురస్సరంబుగ జేతులు జోడించి యుండునుగదా! అది అనివార్యము, అజేయము, అనంతము!

అట్లు, త్యాగధనులై శ్రమించి, ఆర్య ఋషివర్గము Apparently it was they who kindled the light of science for the world 147 ప్రపంచమునకు భౌతిక విజ్ఞాన జ్యోతిని వెలిగించినవారు తప్పక వారేయని షెలింజ్ అనునట్లును, There is no intellectual problem in the West that had not its earlier discussion in the East, and there is no modern solution of that problem which will not be found anticipated in the East 148 పూర్వదేశముల, ప్రాచీనకాలముల జర్చింపబడని వైజ్ఞానిక సమస్య, పశ్చిమ దేశముల లేదు. ఆ సమస్యలకు ప్రాగ్దేశముల నూహింపబడిన సమాధానముగూడ, ప్రస్తుత కాలమున పాశ్చాత్యమున లేదు అని డాక్టరు మాథీసన్ వ్రాసినటుల

147. Schelenz : The Hindu, 29-5-1955.
148. Dr. Maatheson : Vedanta Kesari, 1930,

అర్షమండలి విచారింపని సమస్యయే లేదు. భారత దేశమున నడు గిడు యదృష్టమబ్బిన పాశ్చాత్య విద్వాంసుడైన సర్ విలియం జోన్సు ఆనందమున నుప్పొంగి, భారతిని సంస్తుతించుచు, Which has been esteemed the nurse of sciences, the inventress of delightful and useful arts, the scene of glorious actions, fertile in the productions of human genius, and infinitly diversified in the forms of religion and government, in the laws, manners, customs, and languages, as well as in the complexions of men 149 విజ్ఞానముల సంరక్షణిగ, సుందరోపయుక్తకళలకు నిర్మాతగ, ప్రభావోపేత కార్యరంగముగ, మానవాద్భుత మేధాజన్య విషయములకు మాత, ప్రభుత్వ స్వరూపములందును, నియమ ఆచార అభ్యాస భాషల యందేగాక, మానవశరీర ఆకృతులందుగూడ అనంత విధముల, సౌరభూతముగ నొప్పారినదని నుడివియున్నాడు.

పై విధానమున, సర్వ విషయములకు భారతభూమి ఘని మాత్రమేగాక, ఆమె అఖిలాభ్యుదయకర విషయముల నార్జించి, తృప్తిజెంది యుండుటయేగాక, అద్భుతలీల నిస్స్వార్థ హృదయముతో, యావత్ప్రపంచ గత మానవాభ్యుదయమపేక్షించు అతి విశాల హృదయగాన, India will appear to you the Mother of human race, the cradle of all our traditions 150 మానవజాతి మాతృదేవిగ, మన యాచారము

149. William Jones: India: What it can Teach Us, of Max Muller, p 29

150. Prof. F. Max Muller: India: What It Can Teach Us, p 17

లకు ప్రారంభ శక్తిగ భారతదేశము కనుపించుననీ, మాక్సు ముల్లరు వచించినట్లు గోచరించి, శిశిర్ కుమార్ మిత్రవాక్యము లలో, Almost from the dawn of her history it has been the sole privelege of India to carry the torch of her unique ideals to distant lands and inspire them to noble adventures both in the inner and outer fields of human activity 151 ఆమె చరిత్ర యుదయించిన కాలమునుండి, సుదూరదేశములకు గూడ దన అద్భుతాదర్శజ్యోతిని దీసికొనిపోయి, మానవ కర్మకలాపములలో, బాహ్యాభ్యంతరముల దివ్యమైన సాహస కృత్యములకు బురిగొల్పు యర్హతను నార్జించి యున్నది. అందుచేతనే most fascinating and most mysterious country on the face of the globe 152 భూగోళమున నిగూఢమై, అత్యాకర్షణీయమైన దేశమని దీని స్తుతించుచు, గౌరవనీయ ఫ్లెచ్చెర్ విలియమ్సు It is impossible to difine the endless spell which excercises on you 152 అది నీ మీద గలుగజేయు ననంత మోహనము నిర్వచింప దుర్లభమనియు నుడివెను. This is the land from whence, like the tidal waves of spirituality and philosophy have again and again rushed out and deluged the world 153 ఆధ్యాత్మిక, తాత్త్విక మహత్తరంగములు పుంఖానుపుంఖములుగ బహిర్గతమై, ప్రపంచమును ముంచెత్తినదీ దేశము

---

151. Prof. Sisir Kumar Mitra : The Vision of India, p 161

152. Rev. S. Fletcher Williams : Life and Work in india. p 12.

153. Swami Vivekananda : The Complete Works, vol. 3 p 285.

నుండియే యని, సగర్వముగ వివేకానందస్వామి చెప్పుకొని యున్నాడు. మానవుడు జీవిత స్వప్నమును ప్రారంభించిన అతి ప్రాచీనకాలమునుండి, If there is one place on the face of the earth where all the dreams of living man found a home .... it is India మానవ యూహాకల్పనములన్నియు గలిగిన, ఏదేని దేశము భూమండలమున గలిగి నచో నది భారతదేశమే యనియు, Romen Rolland రోమెన్ రోలా అను ఆధునిక వరాసు విద్వన్మణి, వినమ్రుడై జోహారు జేసి యున్నాడు. కావున అశాంతికారకమైన సర్వప్రపంచము, దృష్టుల భారతముపై గేంద్రీకరించి, జ్ఞానభిక్షకై యర్థించుచుండుటయం దాశ్చర్యములేదు. The eyes of the whole world are now turned towards this land of India for spiritual food, and India has to provide it for all the races. Here alone is the best ideal for mankind [154] ఆధ్యాత్మికాహారమునకై సమగ్ర ప్రపంచము, నేడు భారతదేశమువైపు చూచుచున్నది. దానిని భారతవర్షము సకల జాతులకు బ్రసాదింపవలెను. మానవజాతికి యిక్కడనే సర్వోత్త మాదర్శము గలదు అని సుమారు అరువది వత్సరముల క్రిందటి ప్రపంచ పరిస్థితిని గనిపెట్టిన వివేకానందుడుచ్చరింప, రెండు మహా దారుణ సంగ్రామముల ననుభవించి, తృతీయ రణభయ మున వడంకుచున్న ప్రపంచము, ప్రస్తుతము పూర్వముకంటె నధికతరార్తిలో, భారతదేశ శాంతి సందేశముకొరకు నిరీక్షించు చుండుట నుండాశ్చర్యముగాని, అద్భుతముగాని యావంతయును

154. Swami Vivekananda : The Complete Works, vol. 3 p 138.

లేదు. ఆధునిక వేత్తలుగూడ నిదే ధోరణిని Europe is today turning towards India in her search for a saner and surer attitude to life and humanity than that which has brought her to the brink of ruin 155 తనను, నాశన సమ్ముఖమునకు గొనివచ్చినదానికంటె వివేకవంతమును సుస్థిరమును అగు, జీవితతత్త్వ దయాళుత్వముల నన్వేషణమున భారతభూమి దిక్కునకు, నేడు ఐరోపాఖండ మెదురు చూచుచున్నదని డాక్టరు జేమ్సు. హెచ్. కసిన్సు Oriental Culture and World 'ప్రాక్సంస్కృతి - ప్రపంచము' అను గ్రంథ మునదెలిపియున్నాడు. In the world gone mad, India is the Oasis of sanity 156 ఉన్మత్తయైన ప్రపంచ యెడారిలో వివేకముగల రమ్య ప్రదేశము భారతదేశమే యని, ఆధునిక తత్త్వవేత్తలలో నగ్రగణ్యుడని ప్రఖ్యాతి గడించియున్న బెట్రాంక్ రస్సెల్ యిటీవలనే నుడివెను. అందుచే The revitalising and spiritulising of India are of value to the whole world 157 భారతీయ పునరుజ్జీవనము, తాత్త్విక చింత నాభివృద్ధియును నఖిల ప్రపంచమునకు ముఖ్యములని, సర్ ఫ్రాన్సిస్ యంగ్ హస్బెండు భారతిపై దృష్టినుంచి, దాని క్షేమమే విశ్వక్షేమముగ, భారతి ప్రపంచమునకు హృదయస్థానముగ స్వీక రించి పలికియున్నాడు. కావున Great is her past, she has to be yet greater in the future and accom-

155. Dr. James H. Cousins : Oriental Culture and World.

156. Dr. Bettrand Russel : Prabudda Bharata, 19:6 p 306.

157. Sir Francis Younghusband : Spiritual Renaissance Stirs in India.

plish the task given to her by God 158 ఆమెయొక్క ప్రాచీనత గొప్పది. భవిష్యత్తులో నింక నధికతరముగ నామె ఔన్నత్యమును గడించి, భగవంతునిచే నొసంగబడిన ఘనకార్యమును ఆమె నిర్వర్తించుగాక! అని శిశిర్ కుమార్ మిత్రునితో మనము ఆశించుచు, నట్టి శక్తి సామర్థ్యముల మన ప్రియతమమైన భారతికి పరమేశ్వరుడు ప్రసాదించుగాక యని ప్రార్థించెదముగాక!

## భారతీయ సంస్కృతీమూలము

## వేదము - ప్రాశస్త్యము

పూర్వోక్త భారతీయ సంస్కృతీ గ్రహణమునకు, వేద విషయజ్ఞానము కొంతవరకవసరమగుచున్నది. వేదవిషయమే యీ సంస్కృతికాధారము, అధిష్ఠానము, ఆద్యంత సంస్థితుల నిరూపణము. కావుననే I maintain that to everybody who cares for himself, for his ancestors, for his history for his intellectual development, a study of Vedic literature is indispensable 159 తనయొక్క, తన పితరుల యొక్క, తన చారిత్రముయొక్క, తన వైజ్ఞానికాభివృద్ధియొక్క శ్రేయస్సును గోరువానికి, వేదసాహిత్య పఠనము అత్యావశ్యకము అని మాక్సుముల్లరు వాకొనియున్నాడు. ఎందుచేనన 'యదేవ విద్యయా కరోతి తదేవ వీర్యవత్తరం భవతి (ఛాం. 1.1.10) దేనిని గ్రహించుకొని యాచరించెదమో అది శక్తివంతమై,

158. Prof. Sisir Kumar Mitra : The Vision of India, p 253

159. Prof. Max Muller : India, What It Can Teach Us, p 121

ఫలవంతమగునను ఆర్యోక్తి ననుసరించి, ఆర్ష విజ్ఞానమును గ్రహించి, పిమ్మట తదాచరణమునందు గాలిడిన, నది యమృత ఫలముల నొసంగును. ఈ వేదములు are not mere speculations but the record of the spiritual experiences of the race for centuries, actual realizations or super-conscious perceptions 160 కేవల మూహాగానములుగాక, ఆర్యుల శతాధిక సంవత్సరముల ఆధ్యాత్మికానుభవపుంజ లేఖాప్రమాణము, ప్రత్యక్షానుభవములు, అలౌకికానుభూతులు అని వీరేశ్వరానందుని వాక్యము. అట్లు, అవి కేవలమార్యజాతికి సంబంధించినవి మాత్రమే గాక, belong to the history of the world 161 అవి ప్రపంచ చరిత్రకు జెందినవని. రాల్ఫ్. టి. హెచ్. గ్రిఫిత్ నుడిపెను. వైదిక ఋషివర్యులు సంకుచిత స్వార్థపరత్వ నిమగ్నులు కాకుండుటచే, All the instruction and exhortation of the Vedas are addressed to humanity at large 162 వేదములగల ఉపదేశ ప్రబోధములు, అఖిల మానవజాతికి సంబోధింపబడి యున్నవని ఎ. సి. బోసు పలుక, ఎస్. ఎస్. సూర్యనారాయణ శాస్త్రి ఆ మహర్షిచంద్రుల నిష్కామ్యతా విశేషముల నుగ్గడించుచు, The Vedic utterances are the expressions of dispassionate seers wedded to truth 163 సత్యార్థ సన్నిహిత సంబంధముగల నిష్పక్షపాత జ్ఞానుల వాక్యములు వేద

160. Swami Vereswarananda : Introduction, Brahma Sutras, p 1
161. Ralph T. H. Griffith : The Hymns of the Rig Veda.
162. A. C. Bose : The Call of the Vedas, p 71.
163. Prof. S. S. Suryanarayana Sastry : Sankaracharya, p 61

వాక్యములుగ దెలిపి, వేదమునకు మరియొక మహత్తర మహిమ గలదని వచించుచు, and the whole body of doctrine is revealed by an omniscient Iswara. Hence our faith in scripture 163 సర్వజ్ఞుడైన పరమేశ్వరునిచే నా సిద్ధాంతమంతయు వెలువడుటచే అది మనకు, విశ్వాసపాత్రమై యున్నదనియు నతడు వివరించెను. అనాది కాలమునుండి నేటి వరకు వేదమును ముఖతః గురుశిష్య పరంపరాగతముగ గొనివచ్చి, దాని మహిమావిశేషముల నాధునికులకెరుకపరచిన భారతికి గృతజ్ఞత దెలుపుచు, విశ్వకవి రవీంద్రనాథుడు I love India, not because I cultivate the idolatory of Geography, not because I had the chance to be in her soil, but because she saved through tumultous ages the living words that have issued from illuminated consciousness of her great ones 164 నైసర్గికారాధనమలవడుటచేగాక, కాలవశమున ఆమె భూమిపైనే జనించుటచేగాక, తన మహాత్ముల జ్ఞాన సంపూర్ణ హృదయాంతరాళముల నుండి వెలువడిన సజీవ వచనముల, ననేక సంక్షుభిత యుగముల నుండి సంరక్షించుచు వచ్చినదిగాన, భారత దేశమును నేను ప్రేమించెదనని జోహారులర్పించియున్నాడు. వేదవాక్యములు దేశకాలముల నతిక్రమించి, సర్వదేశములకు సర్వకాలముల నన్వయించి, జ్ఞానప్రబోధాత్మకములై తేజరిల్లుట వాని ప్రత్యేక ప్రతిభ. సురేంద్రనాథ దాసు గుప్త అనునట్లు, Veda in its wider sense is not the name of any particular book

163. Prof. S. S. Suryanarayana Sastry : Sankaracharya p 61.
164 Ravindranath Tagore: Discovery of India, of Nehru, p 485

but of literature 165 దాని విశాల భావమున వేదము ఒక ప్రత్యేక గ్రంథముగాక, ఒక సాహిత్యమే అగుచున్నది.

'వేదయతీతి వేదః' తెలియజేయునది గాన వేదము అని వ్యుత్పత్తి, అది దేనినెరింగించును? 'ప్రత్యక్షేణానుమానేన యస్తూపాయో న బుధ్యతే। ఏతం విదంతి వేదేన తస్మాద్వేదస్య అతః' ప్రత్యక్షానుమాన ప్రమాణములచేతగాని, ఇతరోపాయముల చేగాని, తెలియబడజాలని విషయములను దెలుపునది గాన వేదమునకు వేదత్వము సిద్ధమగుచున్నది. అట్టి ప్రమాణాతీత విషయము లెవ్వి? 'విదంతి యతో ధర్మాధర్మావితి వేదః' దేనివలన ధర్మాధర్మములు తెలియబడునో అది వేదము అనురీతి, ధర్మాధర్మముల నది మానవకోటి కెరుంగజేయుటచే, వేదముగ బరిగణింపబడినది. ఈ ధర్మాదుల నభ్యశించుటచే లభించు యే పరానుభవ సముచ్చయము గలదో, అట్టి 'అలౌకికోపాయబోధకత్వం వేదత్వం' అలౌకికోపాయముల బోధించుటచేగూడ నది వేదమయినది. మరియు 'భూతం భవద్భవిష్యచ్చ సర్వం వేదాత్ప్రసిద్ధ్యతి' త్రికాలములం జరుగు సర్వవిషయములును, వేదము ననుసరించియే జరుగు ననియు నన్వయము. అనగా నిది సర్వ జ్ఞానస్వరూపమగుటచే, నందు బూర్వమే వచింపబడని విషయమెందును, ఎప్పుడును బ్రపంచమున వ్యక్తముగాదని తాత్పర్యము. 'శ్రూయత ఇతి శ్రుతిః' ఈశ్వరునినుండి 'జ్ఞానస్య పారగమాత్ ఋషిః' జ్ఞానము యొక్క పారమును బొందిన ఋషివరేణ్యులును, అట గురుశిష్య

---

165. Prof. Suredranath Das Gupta : A History of Indian Philosophy vol. 1 p 11.

పరంపరగా నేటివరకు నది ప్రవహించుచుండుటచే శ్రుతి యనబడు చున్నది. అటులనే 'ఆమ్నాయతే పరంపరయేత్యామ్నాయః' పరంపరగా అభ్యసింపబడుచుండుటచే నామ్నాయమనియు దాని నామాంతరము. ఈ విధముగ వేదము సర్వతోముఖమై, సార్వ కాలికమై, సర్వవ్యాప్తమై, సర్వవిషయసంపూర్ణమై యున్నదని విజ్ఞుల తాత్పర్యము.

## వేదకాలము

ఇటీవలవరకు వేదముల యపౌరుషేయత్వమును విశ్వసించు చున్న భారతీయుల మనముల, పాశ్చాత్య సంస్కృత విద్వాంసుల సామాన్య దృష్టిఫలిత గవేషణా మూలమున, సర్వ గ్రంథముల వలెనే వేదముగూడ నొక కర్తచే రచితమనియు, నందుచే నది యొకకాలమున లిఖితమనియు నను భావములచే నొక కలవర మేర్పడెను. రచయితలేని గ్రంథముండునా ? అను ప్రశ్న అతి బలీయముగ దోచెను. కాని తన్నిరూపణార్థము, సర్వసాధారణ ముగ గ్రంథములగల కర్తయొక్క వంశావళితోగూడిన గద్యా దులుగాని, సమకాలిక, కాలాంతర గ్రంథములందైనను వేదకర్త, లేక కర్తల ప్రశంసగాని లేకుండుటయు, నెంతయోచించినను దుస్తరమై, నిర్ణయింపబడజాలని అనేక సమస్యాపూరితమై, శాస్త్ర జ్ఞుని నెదుర్కొను సామాన్యమైన విషయము. కావుననే Can we, or can we not ascertain the age of the Vedas? This is a question which has baffled the ingenuity of many an ancient and modern scholar [166]

166. Sri Bala Gangadhar Thilak : Orion, p 2.

వేదకాలమును మనము నిర్ణయింపగలమా? జాలమా? ఈ ప్రశ్న ప్రాచీనాధునిక విద్వాంసుల మేధాశక్తిని భంగపరచుచున్నది. పూర్వము వచించియున్నట్లు అది, అతిప్రాచీన గ్రంథముమాత్ర మేగాక, For a study of man, or for the study of the Aryan humanity, there is nothing in the world equal in importance with it [167] మానవ తత్త్వగ్రహణమునకుకాక ఆర్యమానవుల గ్రహణమునకు, దానికి సమానమైన ముఖ్య గ్రంథము, ప్రపంచములో వేరు లేకుండుటచే విద్వాంసుల నది యాకర్షించి, వారి ప్రజ్ఞావిశేషముల బరీక్షించుచున్నది.

ఆ కాల నిర్ణయములకుపాయముల పై విజ్ఞులన్వేషణమును సాగించిరి. 'క్రి' = చేయుట 'తక్ష' = నిర్మించుట 'జన్' = జనింపజేయుట మొదలగు క్రియలు వేదమున గోచరించుటచే, వేదమునగల కొన్ని మంత్రముల గొందరు ఋషులు రచించినటుల విదితమనియు, నందుచే వేదము ఋషినిర్మితమనుట సమంజసమనియు, నందుచే నది యేదియో యొక కాలమున రచితమనియు, నా కాలమును అన్వేషించుట ముఖ్యమనియు, డాక్టర్ మోయిర్ నిర్ణయించెను. కాన నా వేదకాలమెద్దియో నిర్ణయింప, మార్గముల నన్వేషింప, విద్వాంసులు ప్రారంభించిరి. మహాభారత గ్రంథము, అంతకుముందుగల వాల్మీకి రామాయణములను ప్రధానముగ గైకొని, వానికంటె వేదము తప్పక ప్రాచీనముకాన, ముందు వీని కాలనిర్ణయమవసరమని కొందరు శాస్త్రజులు వీనియందుగల జ్యోతిషాంశముల దరచి, శ్రీరామజననమున

---

167. Prof. A. C. Clayton : The Rig Veda and Vedic Religion, p 245

గల గ్రహపరిస్థితిని, అటులే మహాభారతకాల గ్రహపరిస్థితిని, ఆ యా గ్రంథముల ప్రమాణముగ స్వీకరించి నిర్ణయింప యత్నించిరి. శ్రీరామ జన్మముహూర్తకాల స్థితి ననుసరించియు, మహాభారతము ననుసరించియు, క్రీ. పూ. 5000 లేక 6000 సంవత్సరముల క్రిందట ఆ సంఘటనములు జరిగియుండుననియు, వేదము అంతకు పూర్వమే అయియుండుటచే, క్రీ. పూ. 6000 సంవత్సరముల వెనుకనే తద్వచనము అయియుండునని ఇసుమంత యూహించిరి ఆ గ్రంథములనే ఆధారముగ గైకొని Bently బెంట్లీ, క్రీ. పూ. 961 సంవత్సరము శ్రీరామ జననముగ దీర్మానించెను. [168] అనగా నా గ్రహకూటమి అతని గణితము ప్రకారము అప్పుడుకూడ నేర్పడెను. కాని యార్షగణనము ననుసరించి, సృష్టి 195, 58, 85, 058 సంవత్సరములకు పూర్వము జరిగినదనియు, నందు ప్రథమమగు ఆరు మన్వంతరములు జరుగగా, నేడవది యగు వైవస్వత మన్వంతరము ప్రస్తుతము సాగుచున్నదనియు, నందును నేటికి 12,05,33,058 సంవత్సరములు గతించినవనియు, నందును మన్వంతరమునగల 71 మహాయుగములలో నేటికి ఇరువదిఏడు మహాయుగములు గతించి, 28 వ దాన 43,20,000 సంవత్సరములలో, 38,93,058 మాత్రము గడచినవనియు నిర్ణయము. అనగా నీ మహాయుగమున, ప్రథమ సత్య, ద్వాపర త్రేతాదులకాలము 1728000 + 1296000 + 864000 = 3888000 గతించి, కలిలో 5058 కూడ గతించుటచే, 3893058 సంవత్సరములీ మహాయుగమున జరిగిపోయినట్లు గణించిరి. మహాభారత యుద్ధము పూర్తియైన పిమ్మట యుధిష్ఠిరుని పట్టాభిషేకమగుటచే, నా ముహూర్తము నుండి, యుధిష్ఠిరశకముగ నొక కాలమానము ప్రారంభింపబడి

168. Sri Bala Gangadhara Tilak : Orion, p vi.

యున్నది. అది కలి ప్రారంభమునకు బూర్వము, 36 వ సంవత్స రమున జరిగినదని భారత గ్రంథ ప్రమాణము. అనగా క్రీ. పూ. 3,138 సంవత్సరములు, అనగా నేటికి 5096 సంవత్సరములని యుద్ధము. అంత 36 సంవత్సరములకు శ్రీకృష్ణ నిర్యాణము, ఆ ముహూర్తముననే కలి ప్రవేశము. అనగ క్రీ. పూ. 3102 వ సంవత్సరమున గలి ప్రారంభము. నేటికి 5060 సంవత్సరములగుచున్నవి. అందుచే భారతీయ సంప్రదాయము ననుసరించిచూడ, మహాభారత యుద్ధము నేటికి 5096 సంవత్సరములకు బూర్వమేర్పడియున్నదని నిర్ణయము.

అటులే శ్రీరామచంద్రుని జనన విషయమునను, భారతీయ సాంప్రదాయమునకును పాశ్చాత్య గణనమునకు, మిగుల వ్యత్యాసము గోచరము. శ్రీరామావతారము వైవస్వత మన్వంతరమున, నిరువది యైదవ మహాయుగమున, జరిగినదని ప్రమాణము. అనగా నేటికి సుమారు 1,46,16,000 సంవత్సరముల క్రిందట, రామాయణకాలముగ నేర్పడుచున్నది. అట్లుగాక, నీ 28 వ మహాయుగముననే, త్రేతాయుగమున జరిగిన దని కొందరు వాకొనుచున్నారు. దాని నంగీకరించినను 15,17,056 సంవత్సరములైనదని తేలుచున్నది. కావున నిట్టి విధానమున, శ్రీరామాది యుగపురుషుల కాలనిర్ణయము దుస్సాధ్యమై యున్నది. ఎందులకన మనకు గ్రంథముల జూపింపబడిన గ్రహకూటములు, నియమిత కాలక్రమముననుసరించి, మరల మరల నేర్పడుచునే యుండును. వానినాధారముగ గొని, వేదకాలనిర్ణయముగావించుట ఎంతటి దుర్లభకార్యమో యోచింపుడు. అందుచేతనే This will show how unsafe it is to act upon calculations

based upon such loose statements [168] అట్టి నిరాధార ప్రమాణములపై గణితము సాదించుట ఎంత ప్రమాదకరమో వ్యక్తమని, బాలగంగాధర తిలక్ మహాశయుడును తెలిపి యున్నాడు.

పై విధానము దోషభూయిష్టమగుటచే, వేదమునే ఆధారముగ గొని భాషాసంబంధముల, వాని వ్యత్యాసముల క్రోడీకరించి, వాని ననుసరించి కాలనిర్ణయము గావింప గొందరు యత్నించిరి. వేదసాహిత్యమును ఛంద, మంత్ర, బ్రాహ్మణ సూత్రములుగ విభజించి, వానియందు భాషావ్యత్యాసము, రచనావిధాన తారతమ్యములు స్పష్టముగాన, నవి ఒకే కాలమున నిర్మింపబడియుండవని తలంచి, యొక్కొక్క విధానమునకు సుమారు 200 సంవత్సరముల కాలవ్యత్యాసముండవచ్చుననియు నూహించి, యిప్పటికిని అనిర్ణీతమైన బుద్ధకాలము నాధారముగ గొని, బుద్ధునికాలము క్రీ. పూ. 400 సంవత్సరములుగ స్వీకరించుచో సూత్రకాలము క్రీ. పూ. 600 సంవత్సరములును, బ్రాహ్మణములకాలము క్రీ. పూ. 800 సంవత్సరములును, మంత్రములు క్రీ. పూ. 1000 వత్సరములును, ఛందములు క్రీ. పూ. 1200 సంవత్సరములుగ మాక్సుముల్లరు నిర్ణయించెను. [169] ఇదే విధానము నాశ్రయించి Dr. Haug డాక్టరు హగ్ అనునతడు, మాక్సుముల్లరు మహాశయుని 200 సంవత్సరముల వ్యవధి చాల స్వల్పమని భావించి, దాని 500 సంవత్సరములుగ హెచ్చించి, వేద వాఙ్మయ ప్రారంభము

168. Sri Bala Gangadhara Tilak : Orion: p vi
169. Sri Bala Gandhara Tilak : Orion, p 2.

క్రీ. పూ. 2400-2000 వత్సరములుగ దీర్మానించెను. [169] అటులే Prof. Whitny ఆచార్య విట్నీ క్రీ. పూ. 2000 సంవత్సరము నియు, వేదకాలమును నిర్ణయించెను. [170] Mecdonell మాక్డొనెల్ పండితుడును, క్రీ. పూ. 1500 వత్సరములేయని తృప్తిగాంచెను. [170] Dr. Maurice Bloomfield డాక్టరు మారిస్ బ్లూమ్ఫీల్డు వేదానుక్రమణికను వ్రాయుచు, ననేక విద్వాంసుల అభిప్రాయము క్రీ. పూ. 2000 వత్సరములే వేదకాలముగను, అందు వచింపబడిన సిద్ధాంత, మతములు దానికి ప్రాచీనము లనియు నుడివి, అంత కపరమైన క్రీ. పూ. 1500, 1200, 1000 వత్సరములుగా నిర్ణయించుట అనుచితమని వక్కాణించెను. [170] అంతియగాక నిష్కర్షగ, Once more, frankly, we donot know [170] మనకు దెలియదు అనియు తీర్మానించెను.

అందుచే నీ భాషాసంబంధ విషయాధారక నిర్ణయములును సహేతుకములుగావు. ఒకేకాలమున, విభిన్న భాషాసంప్రదాయ ములు, రచనావిధానములుండజాలవను వాదము యుక్తిబాహ్యము ఒక వ్యక్తియే, భిన్న భిన్న రచనాపద్ధతుల నుపయోగించి, గ్రాంధిక వ్యావహారికాది వ్యత్యాసములేగాక, విభిన్న భావ సాంప్రదాయక రచనల సాగించుచుండుట సర్వకాలముల గాంచగలము. కాన నీ నిర్ణయ పద్ధతియే మిగుల దోషభూయిష్టము. It is therefore evident that this method of calculation, how so ever valuable it may be in checking the results arrived at by othe methods, is, when

---

169. Sri Bala Gangadhara Tilak : Orion p 2.
170. Prof. A. C. Clayton : The Rig Veda and Vedic Religion, p 46

taken by itself, most vague and uncertain 171 ఈ కాలనిర్ణయ విధానము, యితర రీతుల నిర్ణయించిన వాని సవ రించుటకెంత అమూల్యమైనను, దానికై అవిస్పష్టములు అనిర్ధా రితములుగ నున్నపని తిలక్ మహాశయుడు నిరాకరించెను. Prof. Dhruva ఆచార్య ధృవ మొదలగు మరికొందరు విద్యా వంతులు, భూతత్త్వవిద్య Geology ననుసరించి కాలనిర్ణయము గావింప యత్నించిరి. కాని అదియు నిరుపయోగమైనది. వీని నన్నింటి విమర్శాదృష్టి బరిశీలించిన తిలక్ మహాశయుడు Astronomical method ఖగోళ శాస్త్రాధారక విధానము ననుసరింప యత్నించెను. సూర్య, నక్షత్ర, రాశి సంచారముల విధానమును బరిశీలించి,వాని సంచార భేదములవలననేర్పడుచున్న భూమండల వాతావరణ భేదముల నన్వయించుచు, వేదకాలము నుండి జరుగుచున్న జ్యోతిష, శాస్త్ర సంస్కరణముల విచారించి, వేదకాల నిర్ణయము గావింప నా పండితవరేణ్యుడుద్యమించెను, ప్రస్తుత కాలమానము ననుసరించి, అశ్వినీ నక్షత్రము Equinox విషు సంక్రాంతి సమయమున నుండుటచే, దానితో సంవత్సరా రంభమగుచున్నను, అట్లు ఎల్లకాలము జరుగనేరదనియు, నా నక్షత్రములును ఒక గతి ననుసరించి పరిభ్రమించుచుండుట గమనా ర్హమనియు, దాని ననుసరించి కొంతకాలము క్రిందట దాని వెనుక గల భరణి, కృత్తికాదిక నక్షత్రములకుగూడ నా యవకాశము గల దనియు, ఖగోళ రహస్యమును ఆధారముగ గైకొని నిర్ణయించెను. విషుసంక్రాంతి యన రాత్రింబవలులు సమముగా నుండుకాలము.

---

171. Sri Bala Gangadhara Tilak : Orion, p 3.

మేషాయనమును చైత్రవిషు వందురు. దానిని Vernal వసంత విషువనియు నందురు. అటులే తులాయనము భాద్రపదమున నేర్పడును. దీనిని విషుపదమందురు. దీనికి Autumnal శరత్కాల విషువనియు నామాంతరము. సంక్రమణముల సూర్యుడు భూమధ్యరేఖ దగ్గరనుండును.

ఆయన సంధి యనగా, సూర్యుడు భూమధ్యరేఖకు నుత్తరముగ బయనించి, తన ఆయనవృత్తమనబడు క్రాంతివలయమున, ఉత్తరాయణాంతమైన Cancer కర్కి చక్రమును జేరుట; మరల దక్షిణాభిముఖుడై భూమధ్యమును దాటి దక్షిణాయనాంతమున Capricorn మకర చక్రమును నొందుట. కర్కి, మకర చక్రభాగముల భాస్కరుడుండు కాలముల ఆయనసంధులనబడును. కర్కి వలయమున ఉత్తరాయణము పూర్తి అయి దక్షిణాయనము ప్రారంభమగును. అటులే మకరమున దక్షిణాయనము సమాప్తి నొంది ఉత్తరాయణము మొదలిడును. తైత్తిరీయ సంహితా వాక్యము ననుసరించి చూచినచో, ఫల్గుణీ పౌర్ణిమ సంవత్సరారంభ రాత్రిగ నుండినటుల విదితము. అప్పుడు మృగశిర నక్షత్రము, వసంతవిషు సంక్రాంతిన నుండుట గమనార్హము. సూర్యుడు winter Solstice శీతకాల ఆయనసంధిలో నున్నప్పుడు ఫల్గుణీపూర్ణిమ యగును. అప్పుడు చంద్రుడు పూర్ణుడుగ నుండుటకు సరిగా నెదురుభాగమున సూర్యున కుండవలెనుగాన ఫల్గుణీ నక్షత్రముననే నుండును. అందుచే, ఉత్తర ఫల్గుణీ నక్షత్రము Summer Solstice గ్రీష్మ ఆయనసంధిలో నుండగ, వసంత విషు సంక్రమణమున మృగశిరా నక్షత్రముండును. అటులే ఆయన సంధిలో మఘ యున్నపుడు సంక్రమణమున కృత్తికయుండును.

ఉత్తరాయణము పుష్యతో ప్రారంభించుకాలమున సంక్రమణమున అశ్వినీ నక్షత్రముండును. అట్లు అశ్వినీ పుష్యలు, కృత్తికా మఘలు మృగశిరా ఫల్గుణీలు పరస్పర సంబంధముతో జంటలై, సంక్రమణా విభేదముతో సంవత్సరారంభములుగా నేర్పడుచున్నట్లు విదితము. అటులే చిత్ర నక్షత్రము గ్రీష్మ ఆయనసంధిననుండగ, వసంత సంక్రమణకాలమున పునర్వసు నక్షత్రముండగలదు. అదేవిధముగ నాలోచించినచో అశ్వినీ-పుష్య, కృత్తిక-మఘ, మృగశిర-ఉత్తరఫల్గుని, పునర్వసు-చిత్ర, ఆశ్లేష-విశాఖ, పూర్వఫల్గుని-జ్యేష్ఠ హస్త-పూర్వాషాఢ, స్వాతి - ధనిష్ఠ, అనూరాధ - పూర్వాభాద్ర, మూల-రేవతి, నక్షత్రములు జంటలై యొకటి వసంతసంక్రమణమునయున్నచో, రెండవది గ్రీష్మ ఆయనసంధిలో నుండుచు, నాయా కాలముల, సంవత్సరారంభముల గలుగజేయుచున్నవని తాత్పర్యము.

ఈ విషయము నాధారముగ గొని తిలక్ విద్వాంసుడు, వేదముల గలయజూచి, యీ సూచనలెందైన గోచరించినవాయని వెతకి, కొన్నింటిని బహిర్గతమొనర్చెను. తైత్తిరీయ సంహితలో మృగశిర-ఉత్తరఫల్గునీ ద్వయముతో సంవత్సరారంభమును నతడు గమనించెను. అందుచే నా సంహితారచనకాలమదియై యుండ నగునని అతని తలంపు. అటులనే కొంచెము వెనుకకు పయనించి పరిశీలింపగ, పునర్వసు-చిత్ర సంవత్సరారంభముగూడ నతనికి గోచరించెను. పునర్వసు నక్షత్రాధిష్ఠానదేవత అదితి యనియు, ఐతరేయ బ్రాహ్మణము 1.7 లోను, తైత్తిరీయసంహిత 6.1.5.6 నందును, అఖిల యజ్ఞాదికము తనతో ప్రారంభింపబడి, తనతో సాంతమగునట్లు అదితికి వరమీయబడినట్లున్నదనియు నందుచే

అందుచే Aditi was thus the oldest and the first commencement of the sacrifice or the year 172 అతి ప్రాచీన కాలమున, అదితిచే యజ్ఞము అనగ సంవత్సర ప్రారంభము అగుచుండెననీ, తిలక్ మహాశయుడు తీర్మానించెను. ప్రస్తుతము నక్షత్రముల ప్రథమ స్థానమును అశ్వినీ నక్షత్రమధిష్ఠించియున్నట్లు, ఆ కాలమున అదితి అనగా బునర్వసు నక్షత్రము అలంకరించి యున్నదనియు, నది క్రీ. పూ. 6000 - 4000 వరకు గలదనియు, నాతని నిర్ణయము.

ఈ విధమున, జ్యోతిష, శాస్త్రానుసారముగ గణించినచో Sidereal నక్షత్ర సంవత్సరమునకును, Tropical అయన సంవత్సరమునకును 20.4 నిమిషముల తారతమ్యముండుటచే, రెండువేల సంవత్సరములకొక చాంద్రమాసము తారతమ్యముగ నేర్పడుచు, ఋతువుల నా మాసకాలము వెనుకకు జరుపుచు నుండునని గ్రహింపబడియున్నది. అట్లు గుణించి, అశ్వినీ నక్షత్ర నిర్ణయము వరాహమిహిరునిచే క్రి. శ. 500 లో నేర్పడియుండుటచే, కృత్తికా ప్రారంభము సంవత్సరాంతము క్రీ. పూ. 1400 - 2500 సంవత్సరములు జరిగియున్నదనియు, నటులే మృగశిరా సంవత్సరములు క్రీ. పూ. 2500 - 4000 వరకు నడిచెననియు, పునర్వసు వత్సరములు క్రి. పూ. 4000 - 6000 వరకు సాగెననియు నతని తీర్మానము. ఇందు బునర్వసు కాలమతిప్రాచీనమై, వేదములో నధికభాగమునకు బూర్వమనియు, కాని క్రీ. పూ. 4000 - 2500 వరకుగల కాలము ప్రాముఖ్యముగ గ్రహించి, This is the most important period in the history of Aryan

172. Sri Bala Gangadhar Tilak : Orion, p 204.

civilization. A good many Suktas in the Rig Veda were sung at this time and several legends were either formed anew or developed from the older ones [173] ఆర్య నాగరికతలో నీ కాలమతిప్రధానము. అధిక సంఖ్యాకములైన సూక్తముల క్రొత్త గాథల రచనము, పూర్వగాథల యభివృద్ధియు, నీ కాలము నందే ఏర్పడియున్నవనియు బాలగంగాధరుని వచనము. కృత్తికా కాలము మూడవది. అది క్రీ. పూ. 2500 - 1400 వరకు నున్నది. అపుడే తైత్తిరీయ సంహితా, మరియు ననేక బ్రాహ్మణముల రచనము జరిగినట్లు అతని భావను. నాల్గవది, చివరిది అయిన కాలము క్రీ. పూ. 1400 - 500 సంవత్సరములవరకు గలదు. అప్పుడే సూత్రరచనము, తత్త్వసిద్ధాంత నిర్మాణము ఏర్పడినట్లు అతని తలంపు, [173] కావున Rig Veda unmistakably point to a period not later than 4000 B. C., when the Vernal Equinox was in Orion or when the Dog-star commenced the equinoctial year [174] వసంత విషు సంక్రమణమున మృగశిర నక్షత్రమున్నప్పుడు, అనగా లుబ్ధక నక్షత్రము, విషుమండల సంబంధమైన వత్సరమును ప్రారంభించుచుండ, క్రీ.పూ. 4000 సంవత్సరములకు పూర్వముగా, నిర్దుష్టముగా, ఋగ్వేదము సూచించుచున్నట్లు స్పష్టమని బాల గంగాధరులు తీర్మానించెను.

అయినను ఇందును, దోషములు గోచరించుచున్నవి. వసంతవిషు సంక్రమణమునకు మృగశిర అపుడున్నది అని బాల గంగాధరుల వాదను. కాని యీ 27 నక్షత్రములు సుమారు 2000

---

173. Sri Bala Gandhar Tilak : Orion, p 207.
174. Sri Bala Gangadhar Tilak : Orion, p vii.

వత్సరములకు 2 నక్షత్రములు చొప్పున, 27 నక్షత్రముల యొక ఆవర్తనమునకు 27000 సంవత్సరముల వంతున, మున్నెన్ని యావర్తముల నొందియుండెనో గణింపలేదు. తిరుచినాపల్లి జిల్లాలోని అడియాచనలూరు గ్రామ పరిసరముల జరిగిన భూగర్భ పరీక్షలచే, క్రీ. పూ. 50,000 నుండి 5,00,000 సంవత్సరములవరకు నచట నార్యనాగరికత గలదని శాస్త్రజ్ఞులనిర్ణయముగ, కోట వెంకటాచలం మహాశయుడు వ్రాయుచున్నాడు. 175 అందుచే 20 × 27000 = 5,40,000 వత్సరములుకాగా, బాలగంగాధర ప్రోక్త నక్షత్ర ఆవర్తములు 20 జరిగినట్లు విదితము. ఆర్షగణితము ననుసరించి 175,58,85,058 సంవత్సరములలో విషువన్ బిందువు, రాశి చక్రము వెంట 72,440 ఆవర్తులు తిరిగి, పైన కలి 5056 సంవత్సరముల నాటికి 360 డిగ్రీలలో 70 డిగ్రీలు రాగా, ప్రస్తుతము రేవతినిగూడ దాటి ఉత్తరాభాద్ర నక్షత్రమార్గమున 6 డిగ్రీలలో నున్నట్లు వేంకటాచలం పండితుని అభిప్రాయము. 175 కావున జ్యోతిషము ననుసరించి యయినను, వేదకాల నిర్ణయము చేయుట దుస్సహముగ నొప్పారియున్నది. నేటికి సుమారు 1,46,66,000 సంవత్సరములకు బూర్వము రచింపబడిన వాల్మీకి రామాయణమున, వాల్మీకి మహర్షి సీతాన్వేషణమును వర్ణించుచు 'నష్టం వేద శ్రుతిం ఐవ' అని వాకొనియుండుటచే, నానాటికే వేదము కొంత ఖిలమై, యదృశ్యము అగుటయు, నాడే దాని పునరుద్ధరణకై కృషిసలుపబడి యుండుటయు వ్యక్తమగుచుండ నిక వేదముయొక్క పుట్టువే క్రీ. పూ. 4000 - 6000 వరకు అనుట సముచిత నిర్ణయముకాదని విజ్ఞులకు దోచకమానదు.

---

175. శ్రీ కోట వేంకటాచలం: ఆర్యుల ధృవనివాస ఖండము, పే 141

కావున తిలక్ మహాశయులే తన Arctic Home 'ఉత్తర ధృవ నివాసము' అను గ్రంథమున All that we can say is that its beginning is lost in geological antiquity or that the Vedic religion is as old as the Aryan language or the Aryan man himself. We may, however, still assent that for all practical purposes, the Vedic religion can be shown to be beginningless even on strict scientific grounds 176 భూగర్భమున దాని ప్రాదుర్భావము అదృశ్యమైనదనిగాని వైదిక మతము ఆర్యభాష లేక, ఆర్యమానవునివలె అతి ప్రాచీనమనిగాని మనము వచింపగలము, మరియు, కఠిన శాస్త్రీయ విధానముల బరీక్షించినను, వైదికమతము అనాది యని నిరూపింపబడగలదని, సర్వవ్యావహారిక విధానములకై యింకను మనము సమ్మతింప నగుననియు వక్కాణించి యున్నటుల, నదియే అనివార్య నిర్ణయముగ స్వీకరించుట సముచితము. The age of this venerable hymnal (Rig-Veda) is unknown 177 ఈ ఋగ్వేదకాలము అవిజ్ఞాతము అని డబ్ల్యు. డబ్ల్యు. హంటర్ వ్రాసి నట్లు గ్రహించి, పై దీర్మానమునకే విజ్ఞులు రాగలరని ఆశించె దము. 'అచింత్యా ఖలు యే భావాః న తాం స్తర్కేణ సాధయేత్' (భారత. భీష్మ. 5. 12) అచింత్యమైన వాని తర్కముద్వారా యోచింప యత్నింపకుము అనిగదా ఆర్యోక్తి.

---

176. Sri Bala Gangadhar Tilak : Arctic Home, p 458
177. W. W. Hunter : History of Indian People, p 45.

# వేదము నిత్యము

శబ్దము మీమాంసాశాస్త్రము ననుసరించి నిత్యమగుటయు, ఆ శబ్దము సూచించు యే యర్థము గలదో అదియును నిత్యముగ బరిగణింపబడుటయు, నట్లే శబ్దార్థముల పరస్పరసంబంధముగూడ నిత్యమగుటచే, నీ నిత్య త్రియ విశిష్టమైన వేదము నిత్యమగు చున్నదని సాంప్రదాయక వాదము. మరియు వేదమునకు గర్త కానరాక, 'యుగాంతేంతర్హితాన్ వేదాన్ సేతిహాసాన్మహర్షయః। లేభిరే తపసా పూర్వమనుజ్ఞాతాః స్వయంభువా'(తైత్తిరీయసంహిత 1. 1. 1) యుగాంతమందంతర్హితమైన వేదములను, ఇతిహాస పురాణాదులను, బూర్వము బ్రహ్మచే నాజ్ఞాపింపబడినవారై మహ ర్షులు తపస్సుచేత బొంది, లోకమునకనుగ్రహించిరి అనువాక్య మున బూర్వము బాలగంగాధరునికి బ్రమాణభూతమైన తైత్తిరీయ సంహితయే పూర్వ శబ్దము నుపయోగించి, వేదము యుగాంత మున నంతర్హితమగుటయు, బ్రహ్మ యాజ్ఞ ననుసరించి తపోనిష్ఠు లగు మహర్షికోటి, తపోమహిమచే మరల దాని నుద్ధరించిరనియు గలదు. ఇక బురాణములన్నన్నో 'అస్య ధర్మస్య సర్వజ్ఞః కల్పాదౌ పరమేశ్వరః। వ్యంజకః కేవలం విప్ర నైవ కర్తా న సంశయః॥' (మత్స్య) ఈ వైదిక ధర్మమును, సర్వజ్ఞుడైన పరమేశ్వరుడు తిరిగి వ్రచారమునకు దెచ్చెను గాని నిర్మింపలేదు. ఇది నిస్సంశ యము అని ఘంటాపథముగ వక్కాణించి యున్నది. అటులనే 'న కశ్చిద్వేదకర్తా చ వేదంస్మృత్వా చతుర్ముఖః।' (పరాశరస్మృతి. 1.21) వేదకర్త ఎవరును లేరు. చతుర్ముఖ బ్రహ్మ వేదమును స్మరించెను. అనగా బూర్వముండిన వేదస్మరణము గావించి,

మహర్షులకు వినిపించి, భూమండలమున ప్రచార మొనరించె ననియు పరాశరస్మృతి వచనము. కాన నది పూర్వపూర్వ పరంపరా ప్రోక్తమై, శ్రుతమై, స్మృతమై కాలప్రవాహమున నంతరింపక, నేటితో దానితో నిత్య స్రవంతివోలె బ్రవహించుచున్నదని విదితము.

## వేదవిభాగము

వేదము ఋగ్ యజుస్సామ అధర్వణములని చతుర్విధ ముగ విభజింపబడి యున్నది. అందు ఋగ్వేదమున 10622 మంత్రములు గలవు. అవి పుంజములుగ జేరి 1028 సూక్తము లయ్యెను. మరల నవి కొన్ని చేరి 85 అనువాకములయినవి. కొన్నికొన్ని అనువాకములు జేరి, 10 మండలములుగా ఋగ్వే దము విభాగింపబడియున్నది.

యజుర్వేదము, శుక్ల కృష్ణ విభేదమున రెండు ముఖ్య భాగ ములు. ఇందు శుక్ల యజుర్వేదము, వాజసనేయసంహిత యని ప్రఖ్యాతము. కృష్ణ యజుర్వేదము, తైత్తిరీయ సంహిత నాబడి, 7 కాండలై, మొదటిది 8 ప్రపాఠకములు, 148 అనువాకములు, 342 పనసలును; రెండవది 6 ప్రపాఠకములు, 75 అనువాకములు, 384 పనసలును; మూడవది 5 ప్రపాఠకములు, 55 అనువాకములు, 206 పనసలును; నాలుగవది 7 ప్రపాఠకములు, 82 అనువాక ములు, 279 పనసలును; అయిదవది 7 ప్రపాఠకములు, 120 అను వాకములు, 403 పనసలును; ఆరవది 6 ప్రపాఠకములు, 66 అను వాకములు, 331 పనసలును; ఏడవది 5 ప్రపాఠకములు, 107 అనువాకములు, 251 పనసలును గలిగి యొప్పారుచున్నది.

ఈ వేదమున మొత్తమునకు 2086 మంత్రములు గలవు. శుక్ల యజుర్వేదము 40 గ్రంథముల గలిగి యుండును.

సామవేదము, గానరూపమైన ఋక్కులు గలది. దీనిలో 1875 ఋక్కులు గలవు. అథర్వణ వేదమునందు 28 కాండలును, శతాధిక అనువాకములును, 760 కి మించిన సూక్తములును, 5987 మంత్రములును గలవు. మొత్తమునకు నాలుగు వేదములు, పద్యగద్యాత్మికముగ 20500 మంత్రములతో విరాజిల్లుచున్నవి. 'అనంతా వై వేదాః' అనురీతి, ననంత గ్రంథములో నధిక భాగము అగోచర కారణములచే నంతరింప, ప్రస్తుతము మనకు లభించినదంతమాత్రమే యనియు గ్రాహ్యము.

## వైదిక సంఘము - నాగరికత

ప్రస్తుతము, వేదమునగల సాంఘిక వ్యవస్థ ఎట్లు రూపింపబడి యున్నదియో విచారించెదముగాక ! There is no other book which carries us so near the beginning of the Aryan civilization, if not the beginning of all things, as maintained by the Hindu theologians 178 హైందవ వైదిక శాస్త్రాచార్యులు విశ్వసించునట్లు, సర్వ ప్రారంభమునకు గాకున్నను ఆర్యనాగరికతా ప్రారంభమునకు సన్నిహితముగ, మనల గొంపోగల గ్రంథము మరియొకటి గానరాదు అని భేదభావములులేక, ప్రాక్ప్రతీచీ పండితవర్గమంతయు నంగీకరించియున్నారు. అందు నాటి సంఘ జీవిత విధానము

178. Sri Bala Gangadhar Tilak : Orion p 1.

వివరింపబడియున్నదని In certain chapters of the Brahmanas and the Upanishads we see a picture of the social and intelletual life of India at that early time 179 బ్రాహ్మణ, ఉపనిషత్తుల గొన్ని ప్రకరణము లలో నా కాలమునాటి భారతీయ సాంఘిక, వైజ్ఞానిక, జీవిత చిత్రము మనము చూడగలమని వచించి, అతడాధ్యాత్మిక దృష్టి బరికించి యుండుటచే, which seems fully to justify the saying that India has always been a nation of philosophers 179 భారతదేశము, సర్వదా తత్త్వవేత్తల నిలయమను సూక్తిని అవి పూర్తిగ సమర్థించుచున్నవని మాక్సు ముల్లరు వ్రాసియున్నాడు.

జీవిత రహస్యమును బోధించి, దాని దరించు విధానము ప్రబోధించుచు, మూడు వేదములు 'అస్మన్వతీ రీయతే సం రభధ్వం, ఉత్తిష్ఠత ప్ర తరతా సఖాయః। అత్రా జహామ యే అసన్న శేవాః, శివాన్ వయం ఉత్తరేమాభి వాజాన్॥' (ఋ. 10. 53.8; య. వే. 35.10; అ. 12.2.26) పాషాణమయమైన నదము ప్రవహించుచున్నది. కలిసి నడుపుడు, మీ శిరముల, పైకి నిలు పుడు, సఖులారా! దాటుడు. సత్యవ్యతిరేకుల నిటు వదలుదము. శ్రేయస్కరమైన సంస్థితులకొరకై మనము తరించెదము రండు అనుచు, జీవితము కేవలము పూల పాన్పు కాదనియు, ముండ్ల బాటయైనను, ముండ్లు గోచరము అయిన జాగ్రత్త వహింప సాధ్యముగాని, అట్టి యవకాశముగూడ లేక, బాషాణముల నదృష్ట

179. Prof. F. Max Mullar : The Six Systems of Indian Philosophy, Intro.

ముగ బాదతలమునుంచి, దాట యత్నించువారి బాధించు నది వలె జీవితము యొప్పారినదని వివరించుచు, దాని దాటుటకు జాగ్రత పలుకుచు, నెల్లర నేకోన్ముఖముగ సంబోధించి, యా మహర్షిపుంగవులు ఆహ్వానించి యుండిరి. దాని దాటగల యర్హత దెలుపుచు, 'త్రాతారో దేవా అధి వోచతా నో మా నో నిద్రా ఈశత మోత జల్పిః' (ఋ. 8. 48. 24) నిద్రా వాచాలత్వములు మమ్ము అధీనము గావింపకుండునట్లు తరింపజేయు దేవతలారా! మమ్ము ఆశీర్వదింపుడు అని ప్రార్థించిరి. అనగా శారీరక బుద్ధి మాంద్యములు, తమకు దూరముగ నుండునుగాక యని, వాని వలన గలుగు ప్రమాదమును హెచ్చరించిరి. అటులే 'అక్షైర్ మా దీవ్యః కృషిం ఇత్ కృషస్వ' (ఋ. 10.34.13) జూదము నాడకుము. నీ క్షేత్రముల వ్యవసాయము జేయుము. 'పరి చిన్ మర్తో ద్రవిణం మమన్యాత్, ఋతస్య పథా నమసా వివాసేత్' (ఋ. 10.31.2) సంపదను బాగుగ విచారించి, ధర్మ భక్తి మార్గముల దాని నార్జింపవలెను. 'కేవలాఘో భవతి కేవలాదీ' (ఋ. 10.117. 6) తాను మాత్రమే భుజించువాడు, కేవల పాపాత్ముడగుచున్నాడు. 'సహృదయం సాంమనస్యం అవిద్వేషం కృణోమి వః। అన్యో అన్యం అభి హర్షత వత్సం జాతం ఇవాఘ్న్యా॥ అనువ్రతః పితుః పుత్రో మాత్రా భవతు సంమనాః। జాయా పత్యే మధుమతీం వాచం వదతు శంతివాం॥ మా భ్రాతా భ్రాతరం ద్విక్షన్ మా స్వసారం ఉత స్వసా। సమ్యంచః సవ్రతా భూత్వా వాచం వదత భద్రయా॥' (అ. 3.30) ఒక హృదయము ఒక మనస్సు గలిగి, ద్వేషరహితమై, తన బిడ్డను ప్రేమించు గోవువలె, బరస్పర ప్రేమతో మీరు మెలగునట్లు నేను మిమ్ముల జేయుదును. పుత్రుడు పితృ

భక్తి గలిగియుండుగాక! తల్లితో నేకమనస్కుడై యుండుగాక! భర్తతో భార్య శాంత మధురోక్తులాడునుగాక! అన్నదమ్ములు అక్కచెల్లెండ్రు పరస్పరము ద్వేషింపకుందురుగాక! ఐక్యముగ నొకే బుద్ధితో, సహృదయముగ ప్రసంగించుకొందురుగాక! 'సమానీ ప్రపా సహవోఽన్నభాగః' (అ. 3.30.6) సమాన ఆహార పానీయములు గలిగియుండుడు. సంఘమను పురుషునకు 'బ్రాహ్మణోఽస్య ముఖం ఆసీత్। బాహూ రాజన్యః కృతః। ఊరూ తద్ అస్య యద్ వైశ్యః పద్భ్యాం శూద్రో అజాయత' (ఋ. 10. 90.12) బ్రహ్మజ్ఞానపరుడు అతని ముఖము, అతని బాహువులు ప్రభుత్వాధినేతలు, వాణిజ్య కృషిశీలుడు అతని ఊరువులు, అతని పాదములు శూద్రులగుచున్నారు. 'బ్రహ్మ జిన్వతం ఉత జిన్వతం ధియః' (ఋ. 8.35.16) బ్రహ్మజ్ఞానమును బెంపొందించి, మేధా వృద్ధిని బొందుడు. 'క్షత్ర, జిన్వతం ఉత జిన్వతం నౄన్' (ఋ. 8. 35,17) క్షాత్రమును బెంచి శూరులకు బలము గలిగింపుడు 'ధేనూర్ జిన్వతం ఉత జిన్వతం విశః' (ఋ. 8.35.18) గోవుల వృద్ధిజేసి ప్రజల నభివృద్ధి జేయుడు. 'రుచం నో దేహి బ్రాహ్మణేషు, రుచం రాజసు నస్కృధి। రుచం విశ్యేషు శూద్రేషు, మయి దేహి రుచా రుచం॥' (య. వా. 18.48) బహ్మణ్యులకు ప్రకాశమొసంగుము. క్షత్రియులకు వికాసమిడుము. వైశ్య శూద్రులకు దేజస్సును బ్రసాదింపుము. 'విశో న రాజానం వృణానాః' (ఋ. 10.124.8) రాజు నెన్నుకొను ప్రజలవలె 'యత్ర బ్రహ్మ చ క్షత్రం చ సమ్యం చౌ చరతః సహ। తల్లోకం పుణ్యం ప్రజ్ఞేషం' (య. వా. 20.25) ఎచ్చట బ్రాహ్మణశక్తి, క్షాత్రశక్తి, సమ్యగ్గమమై ఏకముగ వర్తించునో అట్టి పుణ్యప్రద లోకమును

నేను చూచెదనుగాక అను అసంఖ్యాక వేదవాక్యములలో, ననేక సాంఘిక, సాంసారిక, ధార్మిక, రాజకీయ, ఆర్థిక, విషయములు వ్యక్తమగుచున్నవి. వీనినన్నింటి వివరించుట గ్రంథవిస్తరణము గాన, పాఠకులే వానిలో గల విశిష్టత్వ విశాలత్వ సమగ్రత్వముల గొంత గ్రహించెదరుగాక!

ఇట్టి సంఘ నిర్మాణమునకు, 'సత్యం బృహద్ రుతం ఉగ్రం దీక్షా తపో బ్రహ్మ యజ్ఞః పృథివీం ధారయంతి' (అ. 12. 1. 1.) సత్యము జ్యేష్టత్వము, ఖండితమైన న్యాయము, ఏకాగ్రత, తపస్సు, ప్రార్థన, యజ్ఞములు పృథ్విని ఉద్ధరించును అను వాక్యమున, సాంఘిక జీవితమునకవసర లక్షణములు విశదీకరింపబడియున్నవి. నాటి సాంఘిక వ్యవస్థ, వ్యక్తిజీవితమున నీ గుణగణముల బెంపొందించుచు నుండుటచే, నాటి సంఘము ఆదర్శవంతమై, ఛాందోగ్యమున నుడువబడినట్లు విరాజిల్లియుండె నని చెప్పనొప్పును. తన యాతిథ్యమును స్వీకరింపనొల్లని ప్రాచీనశాలాది జిజ్ఞాసువుల గాంచి, తన యందేగాక తన రాజ్యమునగూడ నెట్టి దోషము కానంబడదని, సగర్వముగ నశ్వపతి 'న మే స్తేనో జనపదే న కదర్యో న మద్యపో నానాహితాగ్నిర్నా విద్వాన్న స్వైరీ స్వైరిణీ' (ఛాం. 5.11.5) చోరుడుగాని, లోభులు గాని మధుసేవకులుగాని, నిత్యాగ్నిహోత్రదూరులుగాని, అవిద్వాంసులుగాని, జార జారిణులుగాని, నా రాజ్యమున లేరు అని చెప్పుకొనెనుగదా! కావున 'ఋచో అక్షరే పరమే వ్యోమన్, యస్మిన్ దేవా అధి విశ్వే నిషేదుః। యస్ తన్న వేద కిం ఋచా కరిష్యతి, య ఇత్ తద్ విదుస్ త ఇమే సమాసతే॥' (ఋ. 1.164.39)

నిఖిల దేవతలు వశించు స్థానమైనవి నిత్య వేదఋక్కులు. ఆ స్థానము నెఱుంగనివానికి వేదఋక్కుల ప్రయోజనమేమి? వాని నెరింగినవారు సిద్ధులు; 'దేవేషు మే అధి కామా అయంసత' (ఋ. 10.64.2) నా యధికామముల దేవతలలో నిలిపియుంచితిని; అను వాక్యముల, వేదము మానవ జీవిత పరమావధి, కేవలము ఐహిక సుఖసంపత్తి కాదని బోధించుచున్నను Vedic sages are positive, in their acceptance of life and death and life's struggles and imperfections; positive too, in their acceptance of the ultimate values of - truth, goodness, beauty-and of Eternal Law and the Ultimate Reality 130 జనన మరణముల జీవిత సంఘర్షణా సిద్ధత్వముల పరిస్థితిని సమ్మతించుటయందు, వేద ఋషీశ్వరులు వాస్తవ దృక్పథము ననుసరించిరి. సత్యత్వ శివత్వ సుందరత్వములను, నిత్య ఋతమును, పరమార్థమును స్వీకరించుటయందును వారు, వాస్తవ దృష్టినే గలిగియుండిరి అని, ఎ. సి. బోస్ మహాశయుడు వ్రాయుచున్నట్లు 'మా భేమ శవసస్పతే' (ఋ. 1.11.2) వీర్యాధిపతీ! మాకు భయములేదు అనుచు, 'ఆ రోహతాయుర్ జరసం వృణానా అనుపూర్వ యతమానా యతిష్ఠ।' (ఋ. 10.18 6) జరాదులకు స్వాగతమిడుచు, జీవితమును స్వీకరించి, ఒకరిననుసరించి యొకరు నడువుడు అని యొకరినొకరు హెచ్చరించుకొనుచు, 'అశ్మన్వతీ రీయతే సంరభధ్వం, ఉత్తిష్ఠత ప్రతరతా సఖాయః।' (ఋ. 10. 53.8.) పాషాణములతోనున్న జీవిత నదము ప్రవహించుచున్నది.

---

130. A. C. Boss : The Call of the Vedas, p 2.

కలిసి ముందుకు గమనించుడు; 'సం గచ్ఛధ్వం సం వదధ్వం సం వో మనాంసి జానతాం।' (ఋ. 10.191.2) సమావేశముకంటు సంభాషించుకొనుడు మీ మనముల నేకమొనర్చుకొనుడు. 'సం జానీధ్వం సం పృచ్యధ్వం' (అ. 6.64.1) ఏకీభవింపుడు, ఒకటిగ కండు, మొదలగు ప్రబోధములచే The Vedic seers emphasized the social unity as a necessity [181] సాంఘికైకమత్యమత్యావసరముగా వేద ఋషులు నొక్కి వక్కాణించుచుండిరి. 'సమానీ వ ఆకృతిః సమానా హృదయాని వః। సమానం అస్తు వో మనో యథా వః సుసహాసతి॥' (ఋ. 10.191. 4). మీ సంకల్పమేకముగ నుండునుగాక! మీ హృదయము లొక్కటి యగునుగాక! అందరు సుఖముగ జీవించుటకై మీ మనస్సొకటిగా నగునుగాక యని, సర్వసామరస్యముగల సంఘ ఆదర్శమును ప్రజానీకమునకు ముందుంచి, దాని సృజించిరి. తమ విశాల హృదయముల, దమ దేశీయులకుమాత్రమే స్థాన మొంపక, ప్రపంచమున గల సర్వమానవులకు అవకాశ మొసంగి, వారి అభ్యుదయమునకై వారు కాంక్షించువారగుటచే 'జనం బిభ్రతి బహుధా వివాచసం, నానాధర్మాణం పృథివీ యథౌకసం।' (అ. 12.1.45) వివిధ భాషల మాటలాడువారును, నానాధర్మముల, మతముల కర్మకలాపముల, నా యా దేశముల ననుసరించి యుండు వివిధ ప్రజానీకముగల భూమండలము అనుచు, ప్రపంచ మునగల నానావిధ ప్రజానీకమును గుర్తించి, 'యః సంద్వ్యేశో వరుణో యో విదేశ్యః' (అ. 4.16.8) మన దేశమునకు, పరదేశ ములకును జెందిన వరుణదేవుడనియు, 'అర్యమ్యం వరుణ మిత్ర్యం వా సఖాయం వా సదమిద్ భ్రాతరం వా। వేశం వా నిత్యం

181. A. C. Bose : The Call of the Vedas.

వరుణారణం వా యత్ సీమాగశ్ చక్రమా శిశ్రిథస్ తత్॥' (ఋ. 5.85.7) ఎల్లప్పుడు దగ్గరనుండు పొరుగువానిపైగాని, పర దేశీయునిపైగాని, మేము గావించిన పాపమునుండి వరుణా! మమ్ము రక్షింపుము అనియు, మొదలగు వచనములద్వారా స్వదేశ పరదేశ విభేదముల బాటింపక, సర్వశ్రేయస్సు నాకాంక్షించి, 'ఇంద్రం వర్ధంతో అప్తురః కృణ్వంతో విశ్వం ఆర్యం, అపఘ్నంతో అరావ్ణః' (ఋ. 9.63.5) మేధావులు ఈశ్వరుని స్తుతించుచు, అధర్మకును బారదోలి, సర్వమానవుల నార్యులుగ జేయుదురుగాక! యని సద్ధర్మసంస్థాపనమే కర్తవ్యముగ దృక్పథముల నుంచుకొనియుండిరి. కావున వారు Progressing on the way of Brahman - the Vedas and spiritual knowledge - one grows more and more liberal and the vision is widened. The Vedas proceed from fellowship with men to the fellowship with all living beings, insisting on the reciprocity of the feelings [182] వేదముల ఆధ్యాత్మిక జ్ఞానములను బ్రహ్మపథము ననుసరించుటచే, నధికతరముగ ఔదార్యము గలిగి దృక్పథము విశాలము నొందును. మానవ సౌభ్రాతృత్వమునుండి వేదములు ప్రారంభించి, సకలజీవ సౌభ్రాతృత్వము వరకు బరస్పర ప్రేమ భావముల బలపరచుచు, ముందుకు బయనించినవి అని ఎ. సి, బోస్ అనునట్లు, మిత్రస్య మా చక్షుషా సర్వాణి భూతాని సమీక్షంతాం। మిత్రస్యాహం చక్షుషా సర్వాణి భూతాని సమీక్షే। మిత్రస్య చక్షుషా సమీక్షామహే॥' (యు. 36.18) సర్వ భూతములు

182. A. C. Bose : The Call of the Vedas, p 72.

నన్ను స్నేహదృష్టుల జూచునుగాక! సర్వప్రాణుల నేను మిత్రత్వ మున జూచెదనుగాక! మేము పరస్పరము నెయ్యమున మనెదము గాక! అని నాటి ఋషీశ్వరులు యిట్టి పరమోత్కృష్ట ఆదర్శనీయ భావసంపదను ప్రజానీకమున జొప్పించి, Socialistic State సామ్యసంఘ స్థాపనమొనర్చిరి. దానినే Social Adwaita సాంఘికాద్వైతము అని ఏ. సి. బోస్ నామకరణమొనర్చి యున్నాడు అట్టి సద్వ్యాదర్శ సంఘమును, అతి ప్రాచీన కాలముననే స్థాపించి, భారతావనిని నాడే సర్వప్రపంచమున నగ్రగామినిగా నొనర్చిన ఆది పురుషులైన వేద ఋషివర్యులకు, సర్వమానవకోటి ఎల్లకాలము కృతజ్ఞులై యుండకతప్పదు.

## వేదము - భౌతిక విజ్ఞానము

'కృషిం ఇత్ కృషస్వ విత్తే రమస్వ బహుమన్య మానః॥' (ఋ. 10.34;13) నీ క్షేత్రముల బండింపుము. ఎక్కుగా గౌరవము నెంచి ధనమునందు ఆనందింపుము, మొదలగు అసంఖ్యాక వేద వచనములు, నాటి వ్యావసాయిక కృషిని సుమంత గోచరింప జేయును. Agriculture was the principal industry. Plough and harrow, mattock and hoe were used, and sometimes water was conducted in irrigation channels [183] నాడు వ్యవసాయము ముఖ్య పరిశ్రమ. నాగలి, గుంటక, కుద్దలి, పార, బొరిగెలువయోగింప బడుచుండెడివి, వ్యావసాయకమైన కాలువలద్వారా నీరు ప్రవ

183. Prof. A. C. Clayton : The Rig Veda and Vedic Religion, p 9.

హింప జేయబడెడిది అని ఏ. సి. క్లేటన్ వ్రాసెను. అట్లగా, నాడు వ్యవసాయ రంగము చాల అభివృద్ధిగాంచి, సంఘ పోషణము గావించుచున్నటుల వ్యక్తమగుటయేగాక, దానికవసరమైన లోహ పరికరములుగూడ ధారాళముగ నుపయోగమున గలవని విదితము. అటులే Wood workers, who had tools such as hatchets and planes, built wagons and war-chariots or carved wooden cups 183 గొడ్డలి, చిత్రిక గుల్ల, మొదలగు పరికరములుగల వడ్రంగులు, శకటములను యుద్ధ రథములను నిర్మించుచుండిరి. కర్రలో గిన్నెలనుగూడ దొలుచుచుండిరి అనియు నాతడే వాకొనుచు, There were workers in metal, smiths who made weapons and rims for the wheels of carts and potters 183 లోహకార్మికులు గలరు. బండ్ల చక్రములకు ఓరలను, ఆయుధ ములను, లోహకార్మికులు జేయుచుండిరి. కుమ్మరులు గూడ గలరు అనియు, Golden ornaments were beginning to be used 183 సువర్ణాభరణముల వాడుక అమలులో నున్నదనియు నాతడు, వేదకాల నాగరికతను వివరించుచు వ్రాసి యున్నాడు. నాడు ప్రజలు, మూడు అంతస్తులుగల మేడలలో నివసించుచున్నటుల (ఋ. 7.6.12.2), వాక్యమును, స్థిరమైన యజ్ఞశాలలు సహస్ర స్తంభములతో గట్టి, యజ్ఞముల నిర్వహించు చున్నట్లు (ఋ. 7.1.15.14) వేయి స్తంభములను, నూరు వాకి ళ్ళను గల గృహములను నిర్మించుచు, సహస్ర ద్వారములుగల యజ్ఞమండలముల నిర్మించుచున్నట్లు (ఋ, 7.5.13.5), మరికొన్ని

183. Prof. A. C. Clayton : The Rig Veda and Vedic Religion, p 9.

వాక్యములును తెలుపుచున్నవి. ఇనుప కంబములను, బంగారు రేకులను, రథనిర్మాణమునకుపయోగించిరి. (ఋ. 5. 5. 6. 7) 'అచక్రాయ వాహాయ' (ఋ. 5.3.5.4) చక్రరహిత రథములను, ఆకాశములో సంచరించు రథములను, అనగా విమానములను నిర్మించుచుండిరి. (ఋ. 4.4.4.1-3; 4.4.5.4-7). అటుల పారి శ్రామిక వ్యవహారమునగూడ, ననేక వస్తు నిర్మాణ కౌశల్యమున గూడ, నాటి ప్రజలు వెనుకబడియుండలేదని మంత్రములు బోధించుచున్నవి.

అలంకారిక వర్ణనములతోగూడిన పురాణ గాథల గాంచి, భారతీయులకు ఖగోళ రహస్యములు, గ్రహసంచార విషయములు తెలియవని భ్రాంతి పొందెదరుగాని, భూమి తన అక్షముపై దిరుగు చున్నదని (ఋ. 3. 6. 1. 9; 3. 1. 7. 5; 5. 2. 18. 10) వారెరుంగుదురు. Aitareya Brahmana 3.44 which states that sun never sets in reality 184 సూర్యుడు నైజమున నస్తమించుట లేదనియు, 'నైవోదేతా నాస్తమేతైకల ఏకమధ్యే స్థాతా' (ఛాం. 3.11.1) అతడు ఉదయించుటగాని అస్తమించుటగాని లేదు. అతడు మధ్యమున నిలచియున్నాడు. ఇటుల యసంఖ్యాక వాక్యములలో, ననేక ఖగోళవిషయములు తెలుపబడియున్నవి. అందుచేతనే Mathematical Science was so perfect, and Astronomical observations so complete, that the paths of the Sun and the moon were actually measured 185 గణితశాస్త్రము నిర్దుష్టము, ఖగోళ పరిశీల

184. Sri Bala Gangadhar Tilak : Orion, p 106.
185. Joseph Davi Cunningham : History of the Sikhs.

సము సంపూర్ణములుగ వారికుండుటచే, సూర్య చంద్ర సంచార ములు సరిగా లెక్కింపబడి యున్నవని జోసెఫ్ డేవి కన్నింగ్‌హాం వచించెను అదేవిధముగా పి. గురుదత్ తన Vedic Texts 'వేద పాఠములు' అను గ్రంథమునగూడ The Vedas contain the germs of all knowledge, and that there teachings are in complete consonance with the principles of science 186 సకల జ్ఞానబీజములను వేదము గలిగియున్నది. ఆ వాక్యములు, భౌతిక శాస్త్రానుగుణ్యముగ సంపూర్ణముగ నున్నవని నుడివియున్నాడు. అంతియుగాక They were in touch with the latest discoveries of science and religion 187 అధునాతన భౌతికశాస్త్ర, మత భావముల వారు గలిగియుండిరనియు, ఇ. వెర్నన్ ఆర్నాల్డు తెలిపియున్నాడు.

సర్వవిజ్ఞాన సంపన్నులై, భౌతికాధ్యాత్మిక విషయజ్ఞాన సంశోభితులై, నిత్య సంతుష్టి జీవించు ఆనాటి ఆర్యసంఘము, 'ప్రాంచో అగామ నృతయే హసాయ ద్రాఘీయ ఆయుః ప్రతరం దధానాః' (ఋ. 10.18.3) మా జీవితముల చిరకాలములకు బొడి గించుచు, మేము నృత్య సంతోషములకై వెళ్ళియున్నామని వచించినట్లు ఆనందించుచు, అట్టి ఆనందదాయక ఉత్సాహ ప్రవృత్తినుండియే వేదఛందములుద్భవించెను. వాని గానము చేయుటకును, నృత్యగీతాదికోత్సాహమున గానము జేసి ఆనందించుటకును, వీణా ఢమరు మృదంగాది వాద్యోపకరణముల నిర్మించి ఆనందించుచుండిరి.

---

186. P Guru Dath : Vedic Texts,/ No. 2.
187. E. Vernon Arnold : Popular Studies in Mythology etc.

పై విషయముల బరిశీలింప Civilization is philosophy concretised 188 తత్త్వశాస్త్ర ఘనస్వరూపమే నాగరికత, యను పండిత రాధాకృష్ణుని నిర్వచనము యథార్థ మనిపించును. వేద విజ్ఞానమును సంస్తుతించుచు, డాక్టరు రాధాకుముద ముఖర్జీ Especially the premordial work known as the Rig Veda, represents not merely the dawn of culture, but also its zenith. Indian thought is seen at its highest in the Rig Veda. On the one hand it is the book of india and also of mankind. At the same time it shows the highest point of human wisdom 189 ఋగ్వేదమను ఆది గ్రంథము, ముఖ్యముగ సంస్కృతి ప్రారంభమును మాత్రమే ప్రదర్శించుటగాక, దాని యుచ్ఛస్థితినిగూడ దెలుపుచున్నది, ఋగ్వేదమున భారతీయ విజ్ఞానము, దాని యున్నతిని బొంది యున్నది. అది యొకవిధముగ భారతీయుల ప్రథమ గ్రంథమైనను, అది మానవజాతియొక్క ప్రథమ రచనముగూడనై యున్నది. అది అతుల మానవ విజ్ఞానముయొక్క ఉచ్ఛస్థితిని జూపుచున్నది అని అతడు వాకొసెను. ఎందులకన We see in it the whole process of evolution from its beginning to its completion 189 దానిలో పరిణామము యొక్క సంపూర్ణవిధానము ఆద్యంతములలో మనము గాంచ గలము అనియు, వేద నాగరికతా విధానము నతండుగ్గడించి

---

188. Dr. S. Radhakrishnan : The Role of Philosophy in Civilization

189 Dr. Radhakumud Mukharjee : India, Address P. E. N. Conference.

యున్నాడు. Rig Veda is the most sublime conception of the greatest high ways of humanity మానవ జాతియొక్క అత్యున్నత జీవన విధానముయొక్క ఉత్కృష్ట భావమే ఋగ్వేదముగ గైగాల్టు పండితుడును కొనియాడి యుండెను. In the Yajur Veda was the most precious gift for which the West had been ever indebted to the East 190 యజుర్వేదమున నతి అమూల్య పారితోషికము గలదు, దానికై శాశ్వతముగ పాశ్చాత్య ఖండము, ప్రాక్ ఖండమునకు కృతజ్ఞమై యుండవలెను అని, ఆచార్య వోల్టేర్ వచించియున్నాడు. అచార్య మాక్సు ముల్లరుగూడ The Vedic litetature opens to us a chapter in what has been called the education of the human race, to which can find no parallel any where else 191 మానవ జాతికి విజ్ఞాన ప్రకరణము నాబడు దానిని, వేద వాఙ్మయము మనకు బహిర్గతమొనర్చుచున్నది. తత్తుల్యము మరెచ్చటను అగోచరము అనియు, The sacred hymns of the Brahmanas stand unparalleled in the literature of the whole world, and their preservation may well be called miraculous 192 బ్రాహ్మణుల పవిత్ర వైదిక మంత్రములు, అఖిల ప్రపంచ వాఙ్మయములో నసమానములు. వాని సంరక్షణము అత్యద్భుతముగ చెప్పవచ్చునని యు వచించి, పర్యవసానముగ The Veda, I feel con-

---

190. Prof. Voltaire : Wilson's Essays. vol. 3 p 804.

191. Prof. F. Max Muller : India : What It Can Teach Us, p 89

192. Prof. F. Max Muller : Rig Veda Samhita.

vinced, will occupy scholars for centuries to come, and will take and maintain for ever its position as the most ancient book in the library of mankind 193 కొన్ని శతాబ్దములవరకు వేదము పండితుల కృషికగమ్యమగుచు, మానవజాతియొక్క గ్రంథాలయమున, అతి ప్రాచీన గ్రంథముగ దన స్థానము నది అధిష్ఠించి నిలుపుకొను ననియు, నాతడు వచించియున్నాడు.

కాని యింత గవేషణము చేసియుండియు. ఆర్ష గ్రంథముల గాచి వడపోసి గ్రోలియుండియు, కారణాంతర ప్రాబల్యమునకు లొంగి, But the world has its childhood, and where it was a child it spoke as a child, it understood as a child, thought as a child, and I say again, in that it spoke as a child its language was true, in that it believed as a child its religion was true 194 అయినను ప్రపంచమునకు శైశవావస్థ గలదు. అది బిడ్డగ నున్నపుడు అది పసిబిడ్డవలె ప్రసంగించెను. శిశువవలెనే గ్రహించెను. శిశువువలెనే యోచించెను. అనగా శిశువుగ మాటలాడునప్పటి భాష యథార్థమే యగును, శిశువుగ విశ్వసించు మతముగూడ నప్పటికి సత్యమే యగును. Not only have some of the ancient childish religions been kept alive as for instance the religion of

193. Prof. F. Max Muller : Rig Veda Samhita, vol. I p x.

194. Prof. F. Max Muller : Introduction to Science of Religion p 17.

India 194 ప్రాచీనమైన అవివేక మతముల, నుదాహరణమునకు భారతదేశ మతమును సజీవముగ నుంచుటయేగాక, అవి వేలుపెట్టి చూపుచు, భారతీయ పూర్వసంస్కృతీ వైభవములనుగూర్చి, తన పూర్వసంస్తుతుల నన్నింటిని ఒక్క మాటతో గొట్టివేసినట్లు, స్వమత వ్యాఘాతముగ భారతీయాధ్యాత్మిక విజ్ఞానమును గేవలము అవివేకముగ బరిగణించివైచెను విద్వాంసుడైన మాక్సుముల్లరు మహాశయుడు. అటులే The Rig-Veda and Vedic Religion 'ఋగ్వేదము వైదిక మతము' అను గ్రంథమును రచించి, భారతీయ క్రైస్తవసంఘ యాజమాన్యమున బ్రచురించిన ఎ. సి. క్లేటన్‌గూడ, వైదిక సంస్కృతిని అనేకరీతుల నుతించియు, From the Vedas it is clear that like their civilization, the science of the Aryans was of a rude and elementary character 195 వారి నాగరికతవలె ఆర్యుల భౌతిక విజ్ఞానము ప్రాథమికమును, మూర్ఖమును అని, వేదములవలన స్పష్టము అని తేల్చివేసెను. వీరి కృషి యంతయు, నిట్టి ఫలితములమాత్రము వారి హృదయముల గలుగజేయుచున్నదని విదితము. వీనిని గ్రహించిన ఏ. సి. బోస్ పండితుడు, పరిణామక్రమము ననుసరించి, ప్రపంచము కాలక్రమముగ నధికతర పూర్ణత్వమును పొందుచున్నదనియు,నందుచే నెంత ప్రాచీనత గలిగియున్న నంత ప్రాథమికమై, అవివేకమై, మూర్ఖమై యుండుననియు గొందరు పాశ్చాత్య పండితుల భావ

194. Prof. F. Max Muller : Introduction to Science of Religion, p 204.

195. Prof. A. C. Clayton : The Rig Veda and Vedic Religion, p 17.

ముగ నతకు వాకొనుచు, This provided the Orientalists with a ready assumption that Vedic age, being extremely remote, must have been in an extremely crude stage of civilization 196 వేద కాలము అతి ప్రాచినమగుటచే, అతి మూర్ఖ, నాగరిక స్థితిలోనుండి యుండవలెనను సులభసాధ్యమైన యొక యూహ పాశ్చాత్య పండితవర్గమునకు, పై నుదహరింపబడిన రీతి అవకాశమొసంగి యుండెనని వచించియున్నాడు. పై గ్రహింపబడిన వేద నాగరికతకును, నవ నాగరికతా ప్రావీణ్యమున, ప్రాచీనమునంతటిని అవివేకముగ, ననాగరికముగ ద్రోసిపుచ్చు నాధునికుల నాగరిక ధృక్పథమునకును గల వ్యత్యాసము సువిదితమే. ఈ విషయమునే ప్రస్తావించుచు, ఢిల్లీలో 1956 నవంబరులో జరిగిన UNESCO ఐక్య దేశ విద్యాసాంఘిక సంస్కృతీ సంఘ మహాసభలో ప్రధాని జవహరిలాల్ పండితుడు Man does not live by politics alone, nor indeedwholly by economics మానవుడు రాజకీయము లమీదగాని, సంపూర్తిగ నార్థిక వ్యవస్థపైగాని నాధారపడి జీవింపడనియు Peace must be founded upon intellectual and moral solidarity of mankind వైజ్ఞానిక, నైతిక, స్థిరత్వముపై, శాంతి సంస్థాపితము కావలయుననియు,కాని What do we find? Violence and hatred still dominate the world .... We see today ... both human dignity and freedom outraged .... We use brave phrases to impress ourselves. But our actions belie those noble sentiments. And so we live

196. A. C. Bose : The Call of the Vedas. p 15

in a world of unreality where profession has little to do with practice మనము దేనిని గాంచు చున్నాము? ప్రపంచమున హింసాద్వేషములు అధికారము జేయు చున్నవి. నేడు మానవ గౌరవము, స్వాతంత్ర్యములు, భంగపరుప బడుచున్నవి. మన సంతృప్తికై మనము ధైర్యోపేతమగు పదము లను నుపయోగించెదము. కాని ఆ దివ్య భావములను, మన చేతలు రద్దుపరుచుచున్నవి. అందుచే జెప్పుచేతలకు సంబంధము లేని అసత్య ప్రపంచమున మనము, జీవించుచున్నామని, ప్రస్తుత కాల ప్రపంచ పరిస్థితిని గూర్చి నిష్కపట హృదయముతో వీక్షించి పలికియున్నాడు. వేదకాల నాగరికతకంటె నాధునిక నాగరికత యెంతదూరము పరిణమించినదో, ప్రస్తుత ప్రపంచ వార్తావాహి నిని జూచినవారికి సువిస్పష్టమే.

కావున, ప్రపంచము పరిణమించుచున్నదను వాక్యములు భ్రాంతియేగాని యథార్థముగాదని సద్విమర్శావరులు గ్రహింప గలరు. అందుచే The Hindus are not mere children in the school of civilization. They have far longer and greater experience in it than any other people on earth 197 భారతీయులు నాగరికతా పాఠ శాలలో గేవలము శిశువులుగారు. అందు వారికి, ప్రపంచమున మరేయితర జాతికికంటె సుదీర్ఘమును, ఉన్నతమును అయిన అనుభవము గలదు అని, ధీరేంద్రనాథుడు సత్యమును వెల్లడిం చెను. పర్యవసానమునకు In the History of the whole

197. Dr. Dairendranath Roy : The Spirit of Indian Culture, p 234

world, the Vedas fill a gap which no literary work in any other language could fill [198] ప్రపంచ చారిత్రమున, అన్యమగు నే యితర రచనము నిర్వహింపజాలని కొరతను వేదములు దీర్చును అని, డాక్టర్ విల్సన్ వాక్యముల యథార్థముగ స్వీకరించి, వేదవిజ్ఞాన స్వరూపమును, తన్నైజ మును, దాని ప్రాచీనతను, వైభవమును, యోగ్యతను, ఆచరణ యోగ్యతను, యుపయోగ సౌలభ్యమును గ్రహించి, గౌరవ ప్రపత్తులఁ ధరించి, భారతీయులే గాక, అఖిల మానవజాతి దానికి కృతజ్ఞులై యుందురుగాక ! అందుగల లౌకిక, ధార్మిక, ఆధ్యా త్మిక సంస్కృతీ సమన్వయమును గాంచి, ఆధునిక ప్రపంచమున నీ సమన్వయదృష్టియొక్క ఆవశ్యకతను ప్రబోధించి, అనుష్ఠాన మున నుంచి, ప్రపంచ శాంతిస్థాపనకు శంకుస్థాపనము జేయు దురుగాక! కాయిక మానసికాధ్యాత్మికముల నేకస్వనత్వమే మానవ జీవిత సార్థకతకు రాజబాటగ గ్రహించి, ఆచరించి, అనుభవించి, ఆనందించి తరించెదరుగాక ! పరమేశ్వరుడు, అట్టి శక్తిసామర్థ్య ముల మానవజాతి కొసంగి అనుగ్రహించునుగాక !

## దర్శనఖండము

సర్వ సిద్ధాంత సౌరభ గ్రంథమున, బూర్వప్రకటిత భాగ త్రయములో, భారతీయాధ్యాత్మిక సంస్కృతీ ప్రవాహమున కాదిమస్రవంతులనదగి, సర్వప్రపంచ పారమార్థికాభ్యున్నతికి గారణ

198. Dr, Wilson : Wilson's Essays, vol. 3, p 339.

ణములై విరాజిల్లు సాంఖ్యాది వేదాంతపర్యంత దర్శనషట్కము, ఆ యా కర్తల విశేషములు, తత్తత్సిద్ధాంత ప్రాముఖ్యము మొదలగు విషయములు, సింహావలోకనము జేయబడినవి. అందు ప్రస్తావింపబడని తాత్త్వికవిషయము మందెన్నడును గానరాకుండుటచే, వానికి జనకములైన ఉపనిషదాది శాస్త్రచయము తర్వాత నీ దర్శనములు అతి ప్రధానములై, ఉపనిషద్విషయముల సిద్ధాంత రూపమున లోకమునకందించి, మానవ విజ్ఞాన జ్యోతికపరిమిత తేజస్సు నొసగియుండుటయు గమనార్హము. అవి పరస్పర విరుద్ధములుగాక, ఉత్తరోత్తర పూరణములై, వేదాంతమున బరిపూర్ణమును బొందియుండుటయు విదితము. పూర్వభాగముల జర్చించి నిర్ణయించి యున్నటుల, న్యాయ వైశేషికములు భౌతికమును, సాంఖ్యయోగములు మానసికమును, మీమాంసాద్వయము పారమార్థికమును బోధించుచుండుటచే, నీ షట్కమునకు మించిన జ్ఞాన లేశ మెందును నుండబోవదనియు స్పష్టము. ఇవియే ముందు గ్రంథమున వివరింపబడనుండు లౌకిక, ధార్మిక, పారమార్థిక సంస్కృతిరూపములై, సర్వతోముఖత్వమున మానవ సాహిత్య లోకము నావరించి, ముంచి యున్నవనియు జెప్పనగును. సూక్ష్మదృష్టి బరిశీలించిన, సర్వ విజ్ఞాన కాంతులన్నియు యిందుండియే, ప్రసరించియుండుననియు దోపక మానదు.

## అద్వైత ఖండము

కాని ప్రథమ ద్వయము లౌకికమగుటచే నెక్కువ భిన్నాభిప్రాయములందుండవుగాని తృతీయమున, నగ్రస్థానము నలంకరించి,

శిరోభూషణమై రాజిల్లు వేదాంత తాత్పర్యనిర్ణయమున విభిన్న త్వము పండితలోకమున నేర్పడుట బూర్వము గాంచియున్నాము. ఉపనిషదర్థ నిర్ణయముననే భేదభావములుత్పన్న మగుటయు గాంచనగును. అయినను అట్టి భేదవాదముల నాలింగనమొనరించి, సమన్వయించి లయింపజేసికొని, వాని నతీతించి, మానవ విజ్ఞానధారను బరిపూర్ణత్వసిద్ధికి గొంపోవు పరమార్థముల నా ఉపనిషద్వాహిని నుండియే ఉద్ధరించి, ఆ అమృతరసమును వెల్లువగ గావించి, ప్రపంచమునెల్ల ముంచెత్తించిన అద్వైత సుధారుచుల ప్రథమతః నాస్వాదించుట యవసరమని తోచుట, మన 'సౌరభము', ప్రథమమైన దర్శనఖండానంతరము ద్వితీయముగ నద్వైతమునే గ్రహించినది. అదియు సమంజసమే గదా! ముఖ్యాంశముల ప్రథమతః ఉపదేశించి, అప్రధానముల బిమ్మట ప్రస్తావించుట ఆర్షవిధానము గదా! అధికారి నిర్ణయము గావించి, ఉత్తములకు జ్ఞానవిధానమును బోధించి, అంత మందప్రజ్ఞులకు కర్మభక్తి మార్గముల బోధించుట శాస్త్ర సంప్రదాయముగదా!

మరియు నీ అద్వైత స్రవంతి వేదములతో ననాదియై, శాస్త్రేతిహాసపురాణాదుల బ్రవహించి, విజృంభించి; వ్యాస ముఖమున సూత్రీకరింపబడి; శ్రీగౌడపాదాదుల కృషిచే విశాలముగ విస్తరించి, శ్రీ శంకరభగవత్పాదుని ప్రజ్ఞావైభవముచే నెల్లెడల వ్యాప్తినొందింపబడి, సర్వాకర్షణీయమై; యనంతరమున నసంఖ్యాక విజ్ఞుల శేముషీ వైదుష్యముచే ప్రఖ్యాతము గావింపబడుట సర్వస్పష్టము. అందుచే నీ 'అద్వైత ఖండము' త్రివిధ భాగములచే వెలుగొంది, ప్రథమము శ్రీ శంకరపూర్వాద్వైతమును, ద్వితీ

యము శ్రీ శంకరాద్వైతమును, తృతీయము శ్రీ శంకరానంత రాద్వైతమును బ్రస్తావించును. అనగా 'సౌరభ' చతుర్థ భాగము శ్రీ శంకరపూర్వాద్వైతమును, పంచమ భాగము శ్రీశంకరాద్వైత మును, షష్ఠము శ్రీ శంకరానంతరాద్వైతమును దెలుపును.

ఈ ఖండమున నద్వైతసిద్ధాంతము సర్వతోముఖ భారతీయ సంస్కృతీ స్వరూపమును గట్టెదుట నుంచునుగాన, మరియు నందే అధునిక భౌతిక విజ్ఞానమంతయు సమన్వయించుచు, మానవ సంస్కృతియొక్క సమగ్ర మూర్తిమత్వమును బోధిం చునుగాన, సంస్కృతియొక్క యథార్థత్వము మీమాంసించి గ్రహించుట అత్యావశ్యకము.

## శ్రీ శంకరపూర్వాద్వైతము

అందు జతుర్థ భాగమైన శ్రీశంకరపూర్వాద్వైత మీమాంస, అద్వైతమునకు బుట్టినిల్లగు ఋగ్వేదముతో ప్రారంభించి, ఉపనిష త్పురాణేతిహాస స్మృతులను బారచూచి, శ్రీ శంకరుని పరమ గురు వర్యుడైన శ్రీ గౌడపాదాచార్యుని మాండూక్యకారికా సమీక్షతో ముగియును. శ్రీ శంకరునకు సన్నిహిత భూతకాలసంబంధమైన యీ కారికా గ్రంథమే శ్రీ శంకరునకు బరమ ప్రమాణమగుటచే నీ భాగమునందు శ్రీ గౌడపాదీయ కారికలు విశదీకరింపబడి, శ్రీ శంకరాద్వైత గ్రహణమునకున్ముఖు లగునట్లు గావింపబడి యున్నది. అద్వైత వాదమున గౌడపాదుని స్థానము అద్వితీయము గదా! కాన నీ యద్వైతఖండ ప్రథమ భాగమైన శ్రీ శంకర

పూర్వాద్వైత గ్రంథమున, గౌడపాదప్రోక్త మాండూక్య కారికా సంచయమునకు అగ్రస్థానమొసంగబడియున్నది.

కావున యీ గ్రంథద్వారమున నద్వైత స్రవంతియొక్క పుట్టుపూర్వోత్తరముల జర్చించి, సమీక్షించి, తత్సిద్ధాంత గ్రహణమునకు గడంగెదముగాక! అద్వైతతాత్పర్యమే సర్వసంస్కృతుల కాధారముగ గ్రహింపజాలుదుముగాక! ఈ స్రవంతి ఋగ్వేదాదికమునుండి శ్రీ శంకరు నెట్లు చేరుకొనియుండెనో గ్రహింప ఆ వాహినితో బయనించెదముగాక! దాని సమగ్రముగ గ్రహించి శ్రీ శంకరవాద గ్రహణమునకు సన్నద్ధులమగుదుముగాక!

మంగళమ్ మహత్



# సర్వ సిద్ధాంత సౌరభము

## అద్వైత ఖండనము

## శంకరపూర్వాద్వైతము

# శంకరపూర్వాద్వైతము

## ఉపోద్ఘాతము

### అద్వైత సిద్ధాంతము

యథా పుత్రకామేష్టినా పుత్రం,
వాణిజ్యాదినా విత్తం, జ్యోతిష్టోమేన స్వర్గం,
తథా పురుషప్రయత్నసాధ్య వేదాంతశ్రవణాది జనిత
సమాధినా జీవన్ముక్త్యాది లాభో భవతి॥

ముక్తికోపనిషత్తు 2,4

ఎట్లు పుత్రకామేష్టివలన పుత్రులను, వ్యాపారాదులవలన ధనమును, జ్యోతిష్టోమముచే స్వర్గమును, పురుషులు పొందుచున్నారో అట్లు పురుషప్రయత్న మూలమున వేదాంత శ్రవణ ఫలితమగు సమాధిద్వారా జీవన్ముక్తి లాభమును బొందుచున్నారు. 'అమిత వేదాంతవేద్యం బ్రహ్మ' (త్రి. మ. నా. 1) బహుళ వేదాంత శ్రవణాదికముచే బ్రహ్మజ్ఞానము గలుగును. 'పరేణ నాకం నిహితం గుహాయాం బిభ్రాజదేతద్యతయో విశంతి। వేదాంతవిజ్ఞానసునిశ్చితార్థాస్సన్న్యాసయోగాద్యతయశ్శుద్ధసత్వాః'

(కైవల్య. 4.) స్వర్గముకంటె శ్రేష్ఠమైనదైన హృదయగుహాయం దుండునదై, ఏది ప్రకాశించుచున్నదో ఆ పరబ్రహ్మమును వేదాంత జ్ఞానముచేత జక్కగా నిశ్చయింపబడియుండు అర్థమును గ్రహించినవారు, సన్న్యాసయోగముచే బరిశుద్ధాంతఃకరణము గల యతులు ప్రవేశించుచున్నారు అని ఉపనిషత్తులు యింత ఎక్కువగ ప్రస్తావించి స్తుతించిన యీ వేదాంతమననెద్ది?

సంహితా, బ్రాహ్మణ, ఆరణ్యక, లేక ఉపనిషద్రూప త్రివిధ విభాగములు గలిగిన వేదము, కర్మ ఉపాసనముల ప్రథమ భాగ ద్వయమున వివరించి, 'న కర్మణా న ప్రజయా ధనేన త్యాగేనైకే అమృతత్త్వమానశుః' (కైవల్య. 3) కర్మచేతను, పుత్రాదుల చేతను, ధనముచేతనుగాక త్యాగముచేతనే అమృతత్త్వమును జ్ఞానులు బొందిరి అని కర్మనిరాసమును, 'యద్వాచా నభ్యుదితం యేన వాగభ్యుద్యతే। తదేవ బ్రహ్మత్వం విద్ధి నేదం యదిదముపాసతే॥' (కేన. 1. 4.) వాగింద్రియముచే నేది యుచ్చరింపబడ నేరదో, దేనిచే వాక్కు ప్రకాశించునో దానినే బ్రహ్మముగా గ్రహింపుము. దేని నుపాసించెదరో అది బ్రహ్మముకాదు అనియు, 'అథ యోఽన్యాం దేవతాముపాస్తే అన్యోఽసావన్యోహమస్మీతి న స వేదయథా పశురేవ దేవానాం' (బృ. 1. 4. 10) అతడు వేరు నేను వేరు అని యితర దేవత నుపాసించువాడు తెలియనివాడు. అతడు దేవతలకు పశుసమానుడు అని ఉపాసనా విధానమును, 'అంధం తమః ప్రవిశంతి యేఽవిద్యాముపాసతే। తతో భూయ ఇవతే తమో య ఉ విద్యాయాం రతాః॥' (బృ. 4. 4. 10) కర్మ ననుష్ఠించువారు అజ్ఞానాంధమున బ్రవేశించెదరు. జ్ఞానము అనగా ఉపాసనా

దిక కర్మకాండ ననుసరించువారు ఇంతకంటె నధికతరమైన అజ్ఞానమున మునుగుదురని యుపనిషత్తులు, వేదమున బూర్వోక్త కర్మ ఉపాసనముల ఖండించి, 'జ్ఞానాదేవ తు కైవల్యం' (శ్రుతి) 'మనసైవానుదృష్టవ్యం నేహ నానాస్తి కించన। మృత్యోః స మృత్యుమాప్నోతి య ఇహ నానేవ పశ్యతి॥' (బృ. 4. 4 19) అది మనస్సుచేతనే గ్రాహ్యము. అందు సుమంతయైన నానాత్వము లేదు. దానిలో నానాత్వమును గాంచువాడు మృత్యువరంపరలో మునిగిపోవును. కావున 'అద్వైతం నావమాశ్రిత్య జీవన్ముక్తత్వమాప్నుయాత్' (సన్న్యాస. 2. 98) అద్వైతమను నావను ఆశ్రయించి, జీవన్ముక్తి లభించునను వాక్యములద్వారా పరతత్త్వ రహస్యమును సాధకదృష్టికి దెచ్చి, పూర్వము ప్రవృత్తిమార్గమున మునిగియున్న అతని చిత్తమును బరతత్త్వముపైకి ద్రిప్పి, జీవిత సార్థక్యతకు దారి జూపుచు, సాధకుడుగా బ్రస్తుతము గోచరించుచున్న జీవుడు నైజమున, సర్వాధిష్ఠానమైన బ్రహ్మమే యను పరమార్థ బోధను ఉపనిషత్తులు గావించియున్నవి. అందుచే వేద భాగత్రయమున నంత్యభాగమై యుపనిషత్తులొప్పారుటయు, నంతియగాక వేదతాత్పర్యమున కర్మ, ఉపాసనా, జ్ఞానముల నంత్యభాగమున ఉపనిషత్తులు విరాజిల్లుటయు, మరియు సాధన భాగమున నంత్యస్థితియైన 'అహం బ్రహ్మాస్మి' అను చరమ వృత్తిని ఉపనిషత్తులు సాధకునకు జూపించుటయు, తుదకు జ్ఞానమునకే అంతమును సూచించియుండుటచే నీ ఆరణ్యకములనబడు ఉపనిషద్వేదభాగమే వేదాంతమని ప్రఖ్యాతి గాంచియున్నది. ఉపనిషత్తులతోడనే యీ పదముత్పన్నమనియు విదితము. అందుచే నీ వేదాంతము వేదహృదయమై, వేదతాత్పర్య పర్యవ

సానమై, సర్వమానవ గమ్యస్థానమై, సకల జీవులకాలవాలమై యొప్పుచున్నదనియు సువిస్పష్టము.

'తత్త్వజ్ఞానం సుదుర్లభం యేన విజ్ఞాతమాత్రేణ జీవన్ముక్తో భవిష్యసి' (అక్షి. 1) తత్త్వజ్ఞానము దుస్తరమైనది. దాని గ్రహించినంతనే జీవన్ముక్తుడవగుదువు అనునట్లు జీవిత పరమావధిని జూపించునదియే తత్త్వజ్ఞానమగుటచే Civilization is philosophy concretised తత్త్వజ్ఞాన ఘనస్వరూపమే నాగరికత యగుటచే, నాగరికతా స్వరూప సమగ్ర గ్రహణమునకు దత్త్వశాస్త్రజ్ఞానము అవసరముగాన, దానికాధారభూతమైన యుపనిషత్తులగూర్చి తెలిసికొనెదముగాక !

## ఉపనిషత్తులు

The top-knots of the Vedas వేదములకు ఐర్యవసానములుగను; Products of the highest wisdom ఉన్నత వివేక జనితములని షోపెన్ హార్; The Eternities నిత్యములు అని Thoreau థోరు; Himalayas of the Soul ఆత్మకు హిమాలయములని J. Mascaro జె. మాస్కరో; First recorded attempts of the Hindus at systematic philosophizing [1] సక్రమ తత్త్వచింతనయందు భారతీయుల లిఖితరూప ప్రథమ ప్రయత్నములని Dr. R E. Hume డాక్టరు ఆర్. ఇ. హ్యూం, The dawn of the religious consciousness of man; one of the

1. Dr. R. E. Hume : Prabuddha Bharata, 1946 p 472.

most inspiring and hallowing sights in the whole history of the world [2] మానవుని తాత్త్విక ప్రవృత్తియొక్క ప్రారంభదశయు, అఖిల ప్రపంచ చారిత్రమున అద్భుత ఉత్సాహమును పవిత్రమునైన దృశ్యమని మాక్సు ముల్లరు మొదలగు ననంఖ్యాక పాశ్చాత్య పండితవర్గముచే సంస్తుతింపబడిన యుపనిషత్సంచయము ఆచార్య రాధాకృష్ణుని వచనములో Their aim was not science of philosophy, but right living [3] కేవలము తాత్త్విక విజ్ఞానమును ముఖ్యముగ నెంచక, సత్క్రమ జీవనపద్ధతిని బోధించుచు, షోపెన్ హార్ అనునట్లు so benificial and so elevating అధిక ప్రయోజనకరమును, దివ్యమును అగు భావజాలముల పాఠకుల హృదయాంతరాళముల రేకెత్తించి, మానవజాతికి మిగుల అభ్యుదయకారణమై చెల్వొందుచున్నవి. ఎస్. దాసు గుప్త ఉపనిషత్తులగూర్చి వ్రాయుచు, These are not reasoned statements, but utterances of truths intuitively percieved or felt as unquestionably real and indubitable and carrying great force and vigour and persuasiveness with them [4] ఇవి యోచనాపూర్వక వాక్యములుగాక, నిస్సందేహముగ యథార్థములై, అతార్కికములై, గొప్ప శక్తిసామర్థ్యముల ప్రాబల్యమును గలిగి, అంతఃజ్ఞాన ప్రబోధిత సత్యములయొక్క ఉచ్చారణములే యని

---

2. Prof. F. Max Muller : Sacred Books of the East.
3 Dr. S. Radhakrishnan : Indian Philosophy, vol. 1, p 145.
4. Prof. Surendranath Das Gupta : A History of Indian Philosophy vol. 1, p 7

వాకొనియున్నాడు. The most inspiring record of revelatory knowledge 5 హృదయ ప్రబోధిత జ్ఞానము యొక్క అద్భుతోత్సాహకర వాక్యములనియు, నవి భారతము ననేగాక ప్రపంచమంతట దమ ప్రాబల్యమును తాత్త్విక, ధార్మిక, సాంస్కృతిక జీవితమున జూపియున్నవనియు శిశిర్ కుమారుని వచనము. Contain such godlike fullness of wisdom on all things 6 సర్వవిషయములలో సంపూర్ణ దివ్య జ్ఞానమును గలిగియున్నవని జి. డబ్ల్యు. రస్సెల్ వాని నుతింప From every sentence of the Upanishads, deep original and sublime thoughts arise, and the whole is pervaded by a high and holy earnest spirit 7 ప్రతి ఉపనిషద్వాక్యమునుండి, గాఢ, సహజ, పావన భావములుదయించును. అంతయు ఉన్నత దివ్యతత్త్వముచే ప్రావృతముగ షోపెన్ హార్ అనందించెను. ఉపనిషత్తుల సార్వకాలికత్వమును, విశ్వవిశాలత్వమును నుతించి, అవి సర్వ మానవజాతికమూల్యములుగ వచించి, One thing we may assert with confidence : whatsoever new and unwonted paths the philosophy of the future may strike out, this principle will remain permanently unshaken and from it no deviation can take place 8 ఎట్టి వినూత్న అనభ్యస్త తత్త్వశాస్త్రము భవిష్యత్తులో ముందుకేతెంచినను, యీ విషయము అచంచలమై

---

5. Prof. Sisir Kumar Mitra : The Vision of India, p 12.
6. C. W. Russel : Discovery of India, of Nehru' p 67.
7. Arthur Schopenhauer : Discovery of India, of Nehru, p 67.
8. Prof. Paul Deussen : The Philosophy of the Upanishads.

శాశ్వతముగ నిలుచుటయేగాక, దీనినుండి ఎట్టి మార్పుగూడ గలుగబోదు అని, మనము సంపూర్ణ విశ్వాసముతో సమ్మతింప నగునని ఆచార్య పాల్ దేవసేన్ వక్కాణించెను. కాని వాని ప్రాచీనత్వముచేగాక నవీనత్వమునుగూడ వివరించుచు సి. రాజగోపాలాచారి The specious imagination, the majestic sweep of thought, and the almost reckless spirit of exploration with which, urged by the compelling thirst for truth, the Upanishad teachers and pupils dig into the open secret of the universe, make this most ancient of the world's holy books still the most modern and most satisfying [9] అతి విశాల యోచనానిరతి, గంభీర భావవిజృంభణము, అన్వేషణకార్యమున నిర్లక్ష్యతత్త్వము, మరియు సత్యతృష్ణచే నిర్బంధపరుపబడి, యుపనిషద్గురుశిష్యులు విశ్వముల అనిర్ధారణ రహస్యముల లోనికి ద్రవ్వెరి. ఈ విషయము ప్రపంచమున నత్యంత పవిత్ర గ్రంథములగల ప్రాచీనుల నత్యంతాధునికులనుగను, మిగుల సంతృప్తికరముగను నొనర్చినది యని తెలపియున్నాడు. ఈ యుపనిషద్భావములైనను యుపనిషత్తులతో జనింపక the last ramnants, నవి చివరి అవశేషములనియు, while the original springs are lost to us ever [10] వాని యాధార స్రవంతులు, మనకు శాశ్వతముగ నష్టములనియు మాక్సు ముల్లరు వచించియున్నాడు.

---

9. Sri C. Rajagopalachari : Discovery of India, of Nehru, p 65.
10. Prof. F. Max Muller : The Six Systems of Indian Philosophy, p 2.

ఉపనిషత్తులు వేదమున గల భాగత్రయమున, జివరి భాగమైన ఆరణ్యకమే యని పూర్వమే వచించియుంటిమి. నాలుగు వేదములగల 1180 శాఖలకు, శాఖకొక్కొక్క యుపనిషత్తువంతున 1180 యుపనిషత్తులుండగా 'సర్వోపనిషదాం మధ్యే సారమష్టోత్తరం శతం' (ముక్తిక. 1. 44) సర్వోపనిషత్తులలో సారభూతములైనవి నూట ఎనిమిదిమాత్రమని ముక్తికోపనిషత్తు వచించుచున్నది. ఇందు యోగవిషయమును బోధించి, దానిద్వారా అద్వయ ఆత్మతత్త్వానుభూతిని గలుగజేయు యోగోపనిషత్తులు 20, శివతత్త్వమును స్తుతించి, వివరించి, తద్ద్వారా అద్వైతజ్ఞానమును నుపదేశించునవి శైవోపనిషత్తులు 15, అటులే శక్తిస్వరూపబోధను గావించి అద్వైతమార్గమునకే దృష్టుల ద్రిప్పు శాక్తోపనిషత్తులు 8, విష్ణుతత్త్వప్రబోధకమైనవి 14, సామాన్యముగ నేపక్షమునకు జెందనివి 24, అద్వైత సిద్ధికి అవసరమైన సన్న్యాసమును వివరించు సన్న్యాసోపనిషత్తులు 17, సుప్రఖ్యాతమైన ఈశాది బృహదారణ్యకములు 10, మొత్తమునకు 108 ఉపనిషత్తులు. పరిశీలనాదృష్టి వీక్షించుచో సర్వోపనిషత్తులను 'తద్వేద గుహ్యోపనిషత్సు గూఢం తద్బ్రహ్మ' (శ్వే.5.6) వేదాంతాంతర్గతమైన యుపనిషత్తుల నిగూఢమైయున్న బ్రహ్మమునే 'యేనాశ్రుతం శ్రుతం భవత్యమతం మతమవిజ్ఞాతం విజ్ఞాతం' (ఛాం. 6. 1. 3) దేనిచేత నశ్రుతములు శ్రుతములగునో, అదృశ్యములు దృశ్యములగునో, అవిజ్ఞాతములు విజ్ఞాతములగునో అట్టి పరమగోప్యమైన బ్రహ్మమును బోధించుచునది 'తిలేషు తైలం దధినీవ సర్పిరాపస్స్రోతస్స్వరణీషు చాగ్నిః॥ ఏవ మాత్మాఽఽత్మని జాయతేఽసౌ సత్యేన తపసాయోఽనుపశ్యతి॥' (బ్రహ్మ. 22) నువ్వులందు నూనెవలెను, పెరుగునందు

నేయి వలెను, ప్రవాహము నందుదకమువలెను, దారువునందగ్ని వలెను. సత్యతపస్సులచేత అంతఃకరణమునందే ఆత్మ గోచరము అనుచు, బ్రహ్మజ్ఞానమునకు మార్గమునుగూడ ఉపనిషత్తులు బోధించుచున్నవి.

## మాయ

'భేదః సర్వత్ర మిథ్యైవ' (పంచబ్రహ్మ. 33) సర్వత్ర గోచరించు భేదము మిథ్యమాత్రమే. 'మయి జీవత్వమీశత్వం కల్పితం వస్తుతో న హి' (సరస్వతీరహస్య. 33) ఆ జీవత్వ ఈశత్వములు కల్పితములే, వస్తుతః శూన్యములే యనియు, అంతియగాక 'బ్రహ్మాత్మైకత్వవిజ్ఞానం హేయం మిథ్యాత్వ కారణాత్' (పరబ్రహ్మ) జీవబ్రహ్మైక్యవిజ్ఞానముగూడ మిథ్యాకల్పితమగుటచే హేయమైనదనియు జీవ బంధ మోక్షముల భ్రాంతిని వెల్లడించుచు, నీ బంధ మోక్షముల, జీవ బ్రహ్మ, భేదాభేదముల గల్పించునది మాయాశక్తి యనియు నుపనిషత్తులు నిర్వచించుచున్నవి. 'అస్మాన్మాయీ సృజతే విశ్వమేతత్ తస్మింశ్చాన్యో మాయయా సంనిరుద్ధః' (శ్వే. 4. 9) ఈ విశ్వమును మాయతో గలిసి యాతడు సృజించెను. దీనికి జీవుడు మాయచేతనే బంధింపబడి యుండెను. 'ఇంద్రో మాయాభిః పురురూప ఈయతే' (బృ. 2. 5. 19) ఈశ్వరుడు మాయాకారణమున పురుషరూపమున జూడబడుచున్నాడు. 'యద్ధరితం తన్మాయయా' (అవ్యక్త) ఏది ధరింబడినదో అది మాయచేతనే; 'ప్రకాశతే స్వయం భేదః కల్పితో 20)

మాయయా తయోః।' (అన్నపూర్ణ. 4. 33; రుద్రహృదయ. 42) జీవేశ్వరులకు మాయచేత గల్పింపబడి భేదము స్వయముగా ప్రకాశించును. 'యథాపకృష్టం శేవాలం క్షణమాత్రం న తిష్ఠతి। ఆవృణోతి తథా మాయా ప్రాజ్ఞం వాపి పరాఙ్ముఖం॥' (అధ్యాత్మ. 15) ప్రక్కకు ద్రోయబడినను నీటిపై పాచి క్షణమాత్రమైన నిలువదో, అటుల మాయ నెట్టబడుచున్నను ప్రాజ్ఞునిగూడ ఆవరించును. 'మాయోపాధిర్జగద్యోనిః' (అధ్యాత్మ. 80) జగత్కారణము మాయోపాధిని గలిగినది. 'మాయావిద్యే విహాయైవ ఉపాధి పరజీవయోః।' (అధ్యాత్మ. 32) మాయా అవిద్యలు స్నేహితులవలె ఈశ్వర జీవులకు ఉపాధులగుచున్నవి. 'ఉత్పద్యంతే విలీయంతే మాయామారుతవిభ్రమాత్' (కుండిక. 14) మాయావాయు విభ్రాంతిచే సృజింబడుచున్నవి, లయింపబడుచున్నవి. 'చక్షుః పశ్యతి రూపాణి - - ప్రవర్తకత్వం చాప్యస్య మాయయా న స్వభావతః' (పాశుపతబ్రహ్మ. 10) నేత్రములు రూపముల జూచుచున్నవి. వాని ప్రవృత్తియైనను స్వభావతఃగాక మాయాప్రాబల్యముననే జరుగును. 'మాయయావృతాః' (పాశుపతబ్రహ్మ. 33) మాయచే నావరింపబడినవారై; 'సకలా మాయయా చ' (త్రిపుర. 3) సర్వము మాయచేతనే. 'ఏకః సంభిద్యతే భ్రాంత్యా మాయయా న స్వరూపతః' (జాబాలదర్శన. 10. 2) ఆత్మ ఒకడై యుండి మాయచే గలిగిన భ్రాంతి వలన నానాత్వమగును. స్వరూపతః కాదు. 'మాయామాత్రం జగత్కృత్స్నం' (జాబాలదర్శన. 10. 12) ఈ జగత్తు అంతయు మాయామాత్రమే. 'మాయా తత్కార్యవిలయే నేశ్వరత్వం న జీవతా' (వరాహ. 2. 52) మాయా దాని కార్యము లయింపగా

ఈశ్వరత్వ జీవత్వములు లేవు అని కొన్ని యుపనిషచ్చయము, మాయాప్రాభవముననే సృష్టి స్థితి లయములును, జీవేశ్వర విభేద కల్పనమును భ్రాంతిచే నేర్పడినట్లు వచించుచున్నవి. ఇంక గొన్ని మాయనుయే ఈశ్వరశక్తిగ విశ్వసించి, 'హృదయే చైతన్య రూపిణీం - - - స్మితముఖీం సుందరీం మహామాయాం సర్వ శుభగాం' ( త్రిపురతాపిని. 1 ) హృదయస్థమైన చైతన్య రూపిణిని, మందస్మితాననము గల దానిని, సుందరిని, మహా మాయా స్వరూపిణిని సర్వ శుభప్రదమైన దానినిగ స్తుతించి యున్నవి. 'మాయాం తు ప్రకృతిం విద్యాన్మాయినం తు మహే శ్వరం।' (శ్వే. 4. 10) ప్రకృతినే మాయగా గ్రహింపుము. దానితో గలిసియున్నవాని మహేశ్వరునిగా దెలిసికొనుము. 'అతి మోహ కరీ మాయా' (శరభ. 21) అతి విమోహనమైనది మాయ. 'నాస్తి మాయా పరాత్మని' (పాశుపతబ్రహ్మ. 18) పరమాత్మలో మాయ లేదు. 'సంకోచవికాసాత్మక మహామాయా' (త్రి. మ. నా. 3) సంకోచవికాసములు గలది మహామాయ. 'మహామాయా శక్తిః' (త్రి. మ. న, 6) 'మాయోపాధికో నారాయణో ఆసీత్' (త్రి. మ. నా. 2) మాయోపాధికుడైన నారాయణుడుండెను. 'వైష్ణవీం మహామాయాం నమస్కృత్య' (త్రి. మ.నా.6) వైష్ణవ శక్తియైన మహామాయకు నమస్కరించి, 'అజేయా వైష్ణవీ మాయా' (కృష్ణ) జయింపరానిది వైష్ణవమాయ. 'వైష్ణవీ మహాయోగమాయా' (త్రి. మ నా. 4) వైష్ణవమైన మహాయోగమాయ యని కొన్ని యుపనిషత్తులు దాని ఈశ్వరశక్తిగ రూపొందించి స్తుతించి యున్నవి. 'మాయయా మోహితం జగత్' (కృష్ణ) జగత్తు

మాయచే మోహింపబడి, 'మాయ చ తమోరూపానుభూతి' (నృ. ఉ. 8) మాయ తమోరూపమైనది. 'మూలప్రకృతిర్మాయా' (శాండిల్య. 3. 0) మూలప్రకృతియే మాయ; 'నమ త్రిశక్తి మాయా స్వరూపః' నా త్రిశక్తి మాయాస్వరూపము; 'నాస్తి మాయా చ వస్తుతః' (పాశుపతబ్రహ్మ. 44) వస్తుతః మాయ లేదు. 'సత్త్వప్రధానా ప్రకృతిర్మాయేతి ప్రతిపాద్యతే' (సరస్వతీరహస్య. 14) సత్త్వగుణప్రధానమైన ప్రకృతియే మాయ యని చెప్పబడుచున్నది. 'మాయత్వమేకత్వం సర్వజ్ఞం చ తస్య తు' (స.ర.15) మాయత్వము ఏకము సర్వజ్ఞములు గలది. 'శక్తిద్వయం హి మాయాయా విక్షేపావృత్తిరూపకం॥' (స. ర. 17) విక్షేపావరణ రూపముగ శక్తిద్వయము మాయకు గలదు అని, మాయను వర్ణించినవి కొన్ని యుపనిషత్తులు. 'వర్ణాశ్రమాదయో దేహే మాయయా పరికల్పితాః' (నా. ప. 6. 10) దేహికి వర్ణాశ్రమాదులు మాయచేతనే కల్పితమైనవి. 'మాయా క్లృప్తౌ బంధమోక్షౌ న స్తః స్వాత్మని వస్తుతః' (ఆత్మ. 26) బంధమోక్షములు మాయా నిర్మితములు. ఆత్మలో వస్తుతః లేవు. 'మాయా వా ఏషా నారసింహీ సర్వమిదం సృజతి -- ఏతాం మాయాం శక్తిం వేద స పాప్మానం తరతి' (నృ. పూ. 3. 0) నారసింహశక్తియైన మాయయే యీ సకలమును సృజించుచున్నది. ఆ మాయాశక్తిని గ్రహించినవాడు పాపమునుండి తరించును. 'మాయాసంబంధతశ్చైశో జీవో2విద్యావశస్తథా' (కఠరుద్ర. 30) మాయాసంబంధముచే అవిద్యావశమున జీవేశ విభేదము గలుగుచున్నది. 'మాయోపాధి వినిర్ముక్తం శుద్ధమిత్యభిధీయతే' (కఠరుద్ర. 38) మాయోపాధినుండి విడిబడగా శుద్ధమని చెప్పబడును అనియు, వివిధ రీతుల మాయా

తత్త్వమును నిర్వచించి, వివరించి, యుపనిషత్తులు దాని నివారణోపాయములగూడ నుపదేశించియున్నవి.

అటుల మాయోపాధికల్పితత్వమును బోధించి, దాని నివారణాంతరస్థితిని వివరించుచు, 'ఘటే నష్టే యథా వ్యోమ వ్యోమైవ భవతి స్వయం । తథైవోపాధివిలయే బ్రహ్మైవ బ్రహ్మవిత్స్వయం॥' (ఆత్మ. 22) ఘటము నశింప, నందున్న ఆకాశము మహాకాశమై యొప్పారురీతి, ఉపాధిరహితమైన బ్రహ్మవిదుడు స్వయముగ బ్రహ్మమే యగుచున్నాడు అనియు, 'యథా రజ్జో రధిష్ఠానాత్ భిన్నః సర్పో న విద్యతే। జగన్న భిద్యతే సత్యబ్రహ్మాధిష్ఠానతస్తథా॥' ఎట్లు రజ్జువధిష్ఠానమై యుండుటచే భిన్నమైన సర్పము లేదో, అట్లే సత్యబ్రహ్మాధిష్ఠానముచేత జగత్తు వేరుగలేదు. 'అహో వికల్పితం విశ్వమజ్ఞానాన్మయి వర్తతే। రౌప్యం శుక్తౌ ఫణీ రజ్జౌ వారి సూర్యకరే యథా॥' శుక్తియందు రజతము, రజ్జువునందు సర్పము, మృగతృష్ణయందుదకముపలె అజ్ఞానము వలన విశ్వము నాయందు వర్తించుచున్నది. 'బింబసత్తాం వర్జయిత్వా ప్రతిబింబో న విద్యతే॥ బ్రహ్మణః ప్రతిబింబత్వాత్ జీవో బ్రహ్మైవ నాపరః॥' బింబము లేక ప్రతిబింబముండనట్లు బ్రహ్మముయొక్క ప్రతిబింబమగుటచేత జీవుడు బ్రహ్మమే, అన్యముకాదు అనియు నుపనిషత్తులు, విశ్వము మాయాకల్పిత భ్రాంతి రూపమే యని రూపించియున్నవి.

# మహావాక్యములు

అటులే యుపనిషద్విద్యాసారమైన యద్వైత జ్ఞాననిరూపకమైన మహావాక్యములు, 'అథ మహావాక్యాని చత్వారి' ఇక మహావాక్యములు నాలుగు అని శుకరహస్యోపనిషత్తు వచించునట్లు 'ప్రజ్ఞానం బ్రహ్మ। అహం బ్రహ్మాస్మి। తత్త్వమసి। అయమాత్మా బ్రహ్మ।' అనునవి గలవు. అవి నాలుగు జీవేశ్వర భేదమును, జీవబ్రహ్మ విభిన్నత్వముల నిరాసమొనర్చి, 'జీవో బ్రహ్మైవ కేవలం' జీవుడు కేవలము బ్రహ్మమే యను అద్వైత పరమార్థ బోధను గావించుచున్నవి. 'తత్త్వమసీత్యభేదవాచకమిదం యే జపంతి తే శివసాయుజ్యముక్తిభాజో భవంతి' (శుకరహస్య. 2) 'తత్త్వమసి' యని అభేదవాచకమగు దీనినెవరు జపించెదరో వారు శివసాయుజ్య ప్రాప్తి నొందుదురనియు, నా యుపనిషత్తు మహావాక్యజ్ఞాన సత్ఫలితమును వచించుచున్నది. ఆ యుపనిషత్తు ప్రథమతః 'ప్రజ్ఞానం బ్రహ్మ' అను మహావాక్య వివరణమును ప్రారంభించి, 'యేనేక్షతే శృణోతీదం జిఘ్రతి వ్యాకరోతి చ। స్వాద్వస్వాదు విజానాతి తత్ప్రజ్ఞానముదీరితం॥' (3. 1) దేనిచే నిది జూచుచు, వినుచు, ఆఘ్రాణించుచు, చేయుచు, మంచిచెడ్డల గ్రహించుచున్నదో అది ప్రజ్ఞానమనబడును. 'చతుర్ముఖేంద్ర దేవేషు మనుష్యాశ్వగవాదిషు। చైతన్యమేకం బ్రహ్మాతః ప్రజ్ఞానం బ్రహ్మ మయ్యపి॥' (3. 2) బ్రహ్మాది దేవతలు, మనుష్యాది పశువులవరకు, ఏక చైతన్యమై యొప్పారునది బ్రహ్మము. అందుచే 'ప్రజ్ఞానం బ్రహ్మ' అనియు, 'పరిపూర్ణః పరాత్మాస్మిన్ దేహే విద్యాధికారిణీ। బుద్ధేః సాక్షితయా స్థిత్వా స్ఫురన్నహమితీ

ర్యతే ॥' (3. 3) పరిపూర్ణమును, పరాత్మయు, నీ దేహమునందు విద్యాధికారిణియై, బుద్ధికి సాక్షివలె నుండి స్ఫురించునది 'అహం' అనబడుచున్నది. 'స్వతః పూర్ణః పరాత్మాత్ర బ్రహ్మశబ్దేన వర్ణితః అస్మీత్యైక్యపరామర్శస్తేన బ్రహ్మ భవామ్యహం॥' (3. 4) స్వతః పూర్ణమైన పరాత్మ, అక్కడ 'బ్రహ్మ' శబ్దముచే వర్ణితము. 'అస్మి' వాని యైక్యపరామర్శ గావించుటచే 'అహం బ్రహ్మాస్మి' అనియు, 'ఏకమేవాద్వితీయం సన్నామరూపవివర్జితం । సృష్టేః పురాధునాప్యస్య తాదృక్త్వం తదితీర్యతే॥' (3. 5) ఏకమై, అద్వితీయమై, 'సత్' నామరూప వివర్జితమైనదై, సృష్టికి బూర్వ, ప్రస్తుతముల గూడ నున్నది 'తత్' అనబడును. 'శ్రోతుర్దేహేంద్రియాతీతం వస్త్వత్ర 'త్వం' పదేరితం । ఏకతా గ్రాహ్యతేఽసీతి తదైక్యమనుభూయతాం॥' (3. 6) శ్రోతయొక్క దేహేంద్రియాతీతమై యున్న వస్తువే 'త్వం' పదముచే గథితము. ఏకత్వము 'అసి' పదముచే గ్రాహ్యము అనియు, 'స్వప్రకాశాపరోక్షత్వమయమిత్యుక్తితో మతం। అహంకారాది దేహాంతం ప్రత్యగాత్మేతి గీయతే॥'.(3. 7) దృశ్యమానస్య సర్వస్య జగతస్తత్త్వమీర్యతే। బ్రహ్మశబ్దేన తద్బ్రహ్మ స్వప్రకాశాత్మరూపకం॥' (3.8) స్వప్రకాశమపరోక్షత్వము 'అయం' శబ్దము, అహంకారమునుండి దేహమువరకు ప్రత్యగాత్మ యనబడును. దృశ్యమానమగు సర్వజగత్తునందుగల తత్త్వము, బ్రహ్మ శబ్దమున బలుకబడును. ఆ బ్రహ్మ ప్రత్యగాత్మరూపమే యని, 'అయమాత్మా బ్రహ్మ' అను మహావాక్యము బోధించుచున్నదని యీ శుకరహస్యోపనిషత్తు తెలుపుచున్నది. అనగా నిందు సంపూర్ణముగ జీవబ్రహ్మాదిభిన్నత్వ కల్పనము నిరసింపబడి, అభిన్నత్వము ప్రదర్శింపబడి, జీవబ్రహ్మైకత్వము నిరూపింపబడి యున్నది.

అటులే పైంగలోపనిషత్తుగూడ 'తత్త్వమసి' మహావాక్యార్థమును సూక్ష్మముగ బోధించియున్నది. 'తత్త్వమసీత్యహం బ్రహ్మాస్మీతి వాక్యార్థవిచారః శ్రవణం భవతి। ఏకాంతేన శ్రవణార్థానుసంధానం మననం భవతి। శ్రవణ మనన నిర్విచికిత్సేర్థే వస్తున్యేకతానవత్తయా చేతః స్థాపనం నిదిధ్యాసనం భవతి॥' (పైంగల. 3. 0) 'తత్త్వమసి' 'అహం బ్రహ్మాస్మి' యను వాక్యార్థవిచారము శ్రవణము. ఏకాంతముగ శ్రవణార్థమును అనుసంధానమొనర్చుట మననము. శ్రవణ మననములచే నేర్పడు నిస్సందేహార్థ వస్తువున, ఏతత్వమున జిత్తమును స్థాపించుట నిదిధ్యాసనమగును అని పైంగల, అధ్యాత్మ, మొదలగు ఉపనిషత్తులు, మహావాక్య శ్రవణ మనన నిదిధ్యాసనా విధానమునుగూడ వివరించియున్నవి. పై నుదహరింపబడిన నాలుగు మహావాక్యములేగాక, 'సోహం' అనియు 'త్వం తదసి' అనియు, నా వాక్య చతుష్టయము కొన్ని రూపాంతరముల బొంది, ఉపనిషత్తుల గానబడును.

అట్టి అద్వైతప్రబోధక మహావాక్యములు, ఈ క్రింద జూపబడినట్లు ఆ యా యుపనిషత్తుల గోచరము. 'తత్త్వమసి' అను వాక్యము శాండిల్య 2. 0, అవధూత, ఛాందోగ్య, 6. 8. 7, హయగ్రీవ, బహ్వృచ, పైంగల, 3. 0, అధ్యాత్మ 30, శుకరహస్య 3.6, మొదలగు ఉపనిషత్తుల గాననగును. 'అయమాత్మా బ్రహ్మ' అను వాక్యమును మండూక్య 2, హయగ్రీవ, బహ్వృచ, శుకరహస్య 3.8, బృహదారణ్యక 2.5.19 యుపనిషత్తులును; 'అహం బ్రహ్మాస్మి' అను వాక్యమును పైంగల 4, మహా 2. 11, 4. 25, 4. 72. 5. 69, పరమహంస పరివ్రాజక, అన్నపూర్ణ 1. 19, అధ్యాత్మ 10, కఠరుద్ర 12, పంచబ్రహ్మ 20, త్రిపాద్విభూతి మహానారాయణ 6,

బృహదారణ్యక 1. 4. 10, నారద పరివ్రాజక 5. 29. 6. 1, హయగ్రీవ, బహ్వృచ, మొదలగు ఉపనిషత్తులును; 'ప్రజ్ఞానం బ్రహ్మ' అను వాక్యమును ఐతరేయ 3. 3, బహ్వృచ, మొదలైన యుపనిషత్తులు ప్రస్తావించి వివరించియున్నవి. 'సోహం' వాక్యమును బృహదారణ్యక 1. 4. 1, శాండిల్య 3. 2. 0, మొదలగు ఉపనిషత్తులు సూచించియున్నవి. అందుచే నుపనిషత్తులలో నధికసంఖ్యాకములు అద్వైత ప్రతిపాదకములుగ నుండుట స్పష్టము.

## ఉపనిషత్తులు - అద్వైతము

మరియు 'ఈశ కేన కఠ ప్రశ్న ముండ మాండూక్య తిత్తిరిః। ఐతరేయం చ ఛాందోగ్యం బృహదారణ్యకం దశ ॥' అను దశోపనిషత్తులును, శ్వేతాశ్వతర కౌషీతకీబ్రాహ్మణోపనిషత్తులును, కేవలాద్వైతభావ ప్రతిపాదకములే యని శ్రీ శంకరులు తీర్మానించి, భాష్యముల వ్రాసియుండెను. ఇతర ఉపనిషత్తులలో ననేకములు అధికసంఖ్యాకములును, అద్వైతమునేపర్యవసానముగ స్వీకరించినట్లు గ్రాహ్యము. ఈ విషయసందేహ నివారణార్థము, క్రింది వాక్యముల గమనించెదముగాక!

'యథా పరమతేజో మహానదీ ప్రవాహపరమతేజః పారావారే ప్రవిశతి। -- తథైవ సచ్చిదానందాత్మోపాసకః -- ప్రవిశేశ। యస్త్వనేన మార్గేణ సమ్యగాచరతి స నారాయణో భవత్యసంశయమేవ।' (త్రి. మ. నా. 11) మహాప్రవాహముతోనుండు మహానది, పరమతేజోశాలియైన సముద్రమున లయించును. అటులే సచ్చిదా

నందము నుపాసించువాడు సచ్చిదానందమున లయించును. అట్టి మార్గమున స్వక్రమాచరణము జేయువాడు, నారాయణుడే యగుచున్నాడు సందేహము లేదు. 'అనంతోపనిషదర్థస్వరూప మఖిలప్రమాణాతీతం' (త్రి. మ. నా. 7) అనంతమైన యుపనిషత్తుల యర్థము అఖిల ప్రమాణములకతీతమైనది. 'ఉపాసకః క్రమేణాద్వైతసంస్థానం ప్రాప' (త్రి. మ. నా. 7) ఉపాసకుడు క్రమముగ నద్వైత సంస్థానమును, బొందును. 'గోపాలోఽహమితి భావయేత్ గోపాలోఽహమేవ' (గోపాలోత్తర) నేను గోపాలుడనే యని భావింపవలెను. నేను గోపాలుడనే. 'ఆత్మానం చేద్విజానీయాదయమస్మీతి పూరుషః। కిమిచ్ఛన్కస్యకామాయ ---' (శాట్యాయన. 22) నేనే ఆత్మను అని గ్రహించినవాడు ఏమి కోరును? ఏ కోరికలుండును? 'అద్వైతే బోధితే తత్త్వే వాసనా వినివర్తతే॥' (వరాహ. 2. 70) అద్వైత తత్త్వబోధచేత వాసనా క్షయమగుచున్నది. 'అస్తి బ్రహ్మేతి చేద్వేద పరోక్షజ్ఞానమేవ తత్। అహం బ్రహ్మేతి చేద్వేద సాక్షాత్కారః స ఉచ్యతే॥' (వరాహ. 2. 41) బ్రహ్మము గలదని గ్రహించుట పరోక్షజ్ఞానమే యగును. నేనే బ్రహ్మమునని గ్రహించుట సాక్షాత్కారమనబడును. 'అహమాత్మా న చాన్యోఽస్మి' (జాబాలదర్శన. 1. 13) నేను ఆత్మను. అన్యమునుగాను 'అద్వైతం పరమానందం శివం యాతి తు కేవలం' (రుద్రహృదయ. 47) అద్వైతము పరమానందము, శ్రేయస్కరప్రాప్తము, కేవలము. 'తర్కతశ్చ ప్రమాణాచ్చ చిదేకత్వవ్యవస్థితేః।' (రుద్రహృదయ. 46) తర్క ప్రమాణముల మూలమున జిదేకత్వము నిశ్చయింపబడినది. 'స్వయం మృత్వా స్వయం భూత్వా స్వయమేవావశిష్యతే' (కఠరుద్ర. 43) తానే

మరణించి, తానే జనించి, తానే మిగిలియుండును. 'ప్రకాశ ఏవ సతతం తస్మా ద్వైత ఏవ హి।' (పాశుపతబ్రహ్మ. 20) సర్వదా ప్రకాశమే గలదు. అందుచే నద్వైతమే గలదు. ఇందు బ్రతిపాదింపబడిన అద్వైత భావములు 'ఏతాం విద్యామపాంతరత మాయ దదౌ। అపాంతరతమో బ్రహ్మణే దదౌ। బ్రహ్మా ఘోరాంగి రసే దదౌ। ఘోరాంశిరారైక్వాయ దదౌ। రైక్వో రామాయ దదౌ। రామః సర్వేభ్యో భూతేభ్యో దదావిత్యేతన్నిర్వాణాను శాసనం వేదానుశాసనం। (అధ్యాత్మ. 70) అపాంతరతముని కొరకు నొసంగబడెను. అపాంతరతముడు బ్రహ్మకొరకిడెను. చతుర్ముఖుడు ఘోరాంగిరసునకు బ్రసాదించెను. అతడు రైక్వునకు బోధించెను, రైక్వుడు రామునకుపదేశించెను. రాముడు సర్వభూతములకు బోధించెను. ఇది నిర్వాణానుసరణము, వేదానుశాసనము. 'తత్త్వమస్యాది వాక్యం తు కేవలం ముక్తిదం' (రామరహస్య, 5. 14) తత్త్వమస్యాది వాక్యములు కేవలము ముక్తిహేతువులు. 'కార్యోపాధిరయం జీవః కారణోపాధిరీశ్వరః। కార్యకారణతాం హిత్వా పూర్ణ బోధోవశిష్యతే॥' (శుకరహస్య. 2. 12) ఈ జీవుడు కార్యోపాధి, ఈశ్వరుడు కారణోపాధి. కార్యకారణములు నశింప బూర్ణ బోధయే మిగులును. 'అంతః పూర్ణో బహిః పూర్ణః పూర్ణ కుంభ ఇవార్ణవే। అంతః శూన్యో బహిః శూన్యః శూన్యకుంభ ఇవాంబరే॥' (మైత్రేయ. 2. 27) సాగరముననున్న ఘటమువలె బాహ్యాభ్యంతరముల బూర్ణమునై, ఆకాశముననున్న ఘటము చందము అంతఃబాహ్యముల శూన్యమునై బ్రహ్మముండును. 'భావనామఖిలాంత్యక్త్వా యచ్ఛిష్టం తన్మయో భవ' (మైత్రేయ. 2. 28) భావనా సర్వమును త్యజించి, అవశేషమునందు లయిం

పుము. 'అద్వైతభావనా భైక్షం' (మైత్రేయు. 2. 10) అద్వైత భావనయే స్వీకార్యము. 'ఏకాంతే ద్వైతవర్జితే' (మైత్రేయు. 2. 3) ఏకాంతమున ద్వైతమును త్యజించి, 'అభేదదర్శనం జ్ఞానం' (మైత్రేయు. 2. 2) నానాత్వము గోచరము కాకుండు టయే జ్ఞానమని, 'దేహో దేవాలయః ప్రోక్తః స జీవః కేవలః శివః। త్యజేదజ్ఞాననిర్మాల్యం సోఽహం భావేన పూజయేత్॥' (మైత్రేయు. 2. 1) దేహము దేవాలయముగ జెప్పబడును. ఆ జీవుడు కేవలము శివుడే. అజ్ఞాన నిర్మాల్యమును త్యజించి, సోఽహం భావముతో బూజ చేయుము. 'విరాడ్ఢిరణ్యగర్భేశ్వరా ఉపాధి విలయాత్ పరమాత్మని లీయంతే।' (పైంగల. 3) విరాట్ హిరణ్య గర్భ ఈశ్వరాదులు, ఉపాధివిలయమున బరమాత్మలో విలీనమగు దురు. 'తావదేవ నిరోద్ధవ్యం హృది యావత్ క్షయం గతం। ఏతత్ జ్ఞానం చ మోక్షం చ శేషాస్తు గ్రంథవిస్తరాః॥' (మైత్రా యణి. 4. 8) హృదయము సంపూర్ణముగ క్షయ మగువరకు నిరో ధింపబడవలెను. అదియే జ్ఞానము, అదియే మోక్షము. అన్యము లన్నియు గ్రంథవిస్తరములు. 'ప్రవృత్తి లక్షణం కర్మ జ్ఞానం సన్న్యాసలక్షణం' (నారదపరివ్రాజక. 3. 16) ప్రవృత్తియొక్క లక్షణము కర్మ, జ్ఞానము యొక్క లక్షణము సన్న్యాసము. 'బ్రహ్మాత్మైకకత్వవిజ్ఞానం హేయం మిథ్యాత్వకారణాత్' (పర బ్రహ్మ) బ్రహ్మాత్మైకకత్వవిజ్ఞానము హేయము. అది మిథ్యకావున. 'మయి జీవత్వమీశత్వం కల్పితం వస్తుతో న హి' (సరస్వతీరహస్య 33) నాలో జీవత్వ ఈశ్వరత్వములు కల్పితములు. యథార్థమున లేవు. 'భేదః సర్వత్ర మిథ్యైవ। - - అత్ర కారణమద్వైతం శుద్ధ చైతన్య మేవ హి॥' (పంచబ్రహ్మ. 36. 34) సర్వత్ర గల

నానాత్వము మిథ్యయే. శుద్ధచైతన్యమైన అద్వైతమే అక్కడ కారణము. 'దేహో దేవాలయః ప్రోక్తః స జీవః కేవలః శివః' (స్కంద. 10) దేహము దేవాలయమనబడును. జీవుడు కేవలము వదా శివుడు. 'అద్వైతం నావమాశ్రిత్య జీవన్ముక్తత్వమాప్నుయాత్' (సన్న్యాస. 2. 96) అద్వైతమను నావ నాశ్రయించి, జీవన్ముక్తిని బొందగలరు అను అసంఖ్యాక వాక్యముల, అధిక సంఖ్యాకములైన యుపనిషత్తులు, కేవలమద్వైతమునే బోధించుచు, నదియే తారకమని యుపదేశించుచు, తదనుష్ఠానమునకై ప్రోత్సహించుచు, సాధకుని శ్రవణవిధి ననుసరించి శ్రవణ మనన నిదిధ్యాసనములద్వారా చేయుమత నొసంగి, 'ధ్యాతృధ్యానే పరిత్యజ్య క్రమాద్ధ్యేయైకగోచరం। నివాతదీపవచ్చిత్తం సమాధిరభిధీయతే॥' (అధ్యాత్మ. 35) ధ్యాతృధ్యానాదుల ద్యజించి, క్రమముగా ధ్యేయమే గోచరమగునట్లుంచి, వాయువు లేనిచోట దీపిక వలె గదలక జిత్తము నుంచుట సమాధి యని యందురని పరమ రహస్యోపదేశము గావించి, జీవేశ్వరభ్రాంతుల నిరాసమొనరించి, కేవలము బ్రహ్మభావమునందే బ్రహ్మస్థితిలో, బ్రహ్మనుగ సాధకుని యుంచివైచినవి. ఇది నిస్సందేహము, అనివార్యము, అకుంఠితము. అందుచే బూర్వోక్త వేదవిజ్ఞానజ్యోతి, మానవ సమాజమునకు అద్వైత గమ్యమును జూపించియుండుటచే, సర్వమానవులు దానికి ఋణపడియున్నారు. ఆదర్శము ఎల్లప్పుడును గష్టతరమై, సుదూరముగనే యుండి అల్పసంఖ్యాకులకే సాధ్యము. అయినను, ఎల్లరకాదర్శమై, ఎల్లరును బఠింప నర్హమై యొప్పారుట గమనార్హము. అధికారియై నవారందరు దాని బొంది, తద్గతానంతాతిశయమును ఎల్లరకు బంచిపెట్టుచుండుటయు విదితమే. కావున ఉపనిష

త్తులయొక్క బరమ బోధతాత్పర్యము, సంపూర్ణముగ నద్వైతమే యని గ్రహింపగల్గుదురుగాక! కృషించి, దర్శించి, అనుభవించి, ఆనందించి, లయించి యుండెదరుగాక!

## అద్వైత ప్రాశస్త్యము

'అద్వైతం పరమార్థో హి ద్వైతం తద్భేద ఉచ్యతే' (మాండూక్య కారిక. 3. 18) అద్వైతము పరమార్థము. ద్వైతము తద్భేదమని చెప్పబడును. 'తస్మాదేవం విదిత్వైనం అద్వైతే యోజయేత్ స్మృతం। అద్వైతం సమనుప్రాప్య జడవల్లోకమాచరేత్॥' (మాం. కా. 2. 36) కాన, ఆత్మలక్షణముల గ్రహించి, అద్వైతమునందే బుద్ధినుంపవలెను. అద్వైతసిద్ధిని బొందిన పిమ్మట జగత్తులో జడునివలె జరింపుము. అని, శ్రీ శంకరాచార్య గురు పరంపరలోని గురువర్యుడైన గౌడపాదాచార్యుని ఉద్బోధ. అవును. 'వేదాహం ఏతం పురుషం మహాంతం ఆదిత్యవర్ణం తమసః పరస్తాత్ తం ఏవ విదిత్వాతిమృత్యుమేతి నాన్యః పంథా విద్యతే। అయనాయ॥' యజుర్వేద. వా. 31. 18) అంధకారమగు అజ్ఞానమున కావలనున్న సూర్యునిబోలు ప్రకాశముగల యా మహా పురుషుని నే గ్రహించితిని. అతని గ్రహించుటచే మాత్రమే అమృతత్వము సిద్ధించును. మరియొక మార్గము లేదు అని, వేదవచనమునగూడ నా అమృతత్త్వసిద్ధికి జ్ఞానమార్గోపదేశము జేయబడి యున్నది. దాన నద్వైతసిద్ధియే ప్రాప్తించునని పూర్వమే వచింపబడినట్లు, వేదగత ఉపనిషద్భాగముద్ఘోషించుచున్నది. ఈ కఠినతరమైన యుపనిషద్భావ గ్రహణమునకు సూక్ష్మతత్త్వవిచార

ణము, ప్రయోజనకర విమర్శాశీలతయు ప్రధానములు. అద్వైత శాస్త్ర గ్రహణమునకు ప్రధానాంశముల దెలుపుచు All people can not take up this Adwaita philosophy, it is hard. First of all, it is very hard to understand it intellectually. It requires the sharpest of intellects, a bold understanding. Secondly it does not suit the vast majority of people 11 అందరు అద్వైతశాస్త్రమును స్వీకరింపజాలరు. అది కఠినము. ప్రథమమున, మనసా దాని గ్రహించుటయు గష్టసాధ్యమే యగును. అతి సూక్ష్మబుద్ధియు, సాహసోపేతమగు అర్థజ్ఞానము అవసరము. అధిక ప్రజానీకమునకది పొసగదు అని వివేకానందుడు వివరించియున్నాడు. అట్లైనను, The crown of Hindu philosophy is the Adwaita Vedanta 12 అద్వైత వేదాంతమే హిందూ తత్త్వశాస్త్రమునకు మకుటమై రాజిల్లుటయు, To only religion that can have any hold is the rationalistic religion of Adwaita 13 ప్రజానీకమున ప్రాబల్యము గడింపగల మతము యౌక్తికామతమైన అద్వైతమే అని రొమెన్ రోలా అనునట్లు, Vedanta represents the philosophical views of the Indian thinkers of today 14 ప్రస్తుత భారతీయ విద్వాంసుల తాత్త్విక భావముల, వేదాంతమే ప్రతిబింబించుచున్నదని

---

11. Swami Vivekananda : The Complete Works, vol. 1 p 402,
12. Prof. S. S. Suryanarayana Sastry : Sankaracharya, p 1.
13. Romain Rolland : Sankaracharya of S. S. S. Sastry. p v.
14. Prof. A. A. Macdonell : The History of Sanskrit Lecturer, p 385.

ఎ. ఎ. మాక్డోనెల్ కూడ వచించియున్నట్లు భారతీయ విజ్ఞాన రంగమున నగ్రస్థానము నధిష్టించి, సతీశచంద్ర ఛటర్జీ వాక్యములలో of all the systems, the Vedanta, specially as interpreted by Sankara, has exerted the greatest influence on Indian life, and it still persists in some form or other in different parts of India [15] ఇతర సిద్ధాంతములన్నిటికంటె వేదాంతము, ముఖ్యముగ సంకర ప్రోక్తము, భారతీయ జీవితమున అత్యధిక ప్రాబల్యమును గలిగియున్నది. మరియు నది ఏదియో ఒక రూపమున భారతదేశ వివిధ ప్రాంతములలో నింకను నిలిచియున్నది. ఇంకను It is true, that even here in the sanctuary of Vedantic meta - physics, the realistic tendencies, natural to man, have penetrated, producing the misinterpreting variations of Sankara's Adwaita, known under the names of Visishta- -adwaita, Dwaita, Suddhadwaita, of Ramanuja, Madhwa, Vallabha, but India till now has not yet been seduced by their voices, and of hundred Vedantins fifteen perhaps adhere to Ramanuja, five to Madhva, five to Vallabha, and seventy five to Sankaracharya [16] వేదాంత తత్త్వ సిద్ధాంత పవిత్రస్థానమునగూడ, మానవునకు స్వాభావికమైన ద్వైతభావములు ప్రవేశించి, శంకరాద్వైతమునకు వివిధ అపార్థ

15. Prof. Satischandra Chatterjee : An Introduction to Indian Philosophy. p 55.

16. Prof. Paul. Deussen, The Philosophy of the Vedanta, p 1.

ములఁ గలుగజేసియున్నవి. అవి విశిష్టాద్వైత, ద్వైత, శుద్ధాద్వైతము లనబడుచు, రామానుజ మధ్వ వల్లభాచార్యులకు జెందియున్నవి. కాని భారతదేశమింతవరకు వాని నినాదములకు మోసపోక, నూరు గురు వేదాంతులలో బహుశః పదునైదుగురు రామానుజునకు, అయిదుగురు మధ్వునకు, అయిదుగురు వల్లభునకు, డెబ్బది అయిదుగురు శ్రీ శంకరాచార్యులకు జెందునట్లు జేసియున్నది అని, ప్రసిద్ధ పాశ్చాత్య వేదాంతవ్యాఖ్యాత డాక్టరు పాల్ దేవసేన్ ఖండితముగ వక్కాణించెను. కావున నట్టి యద్భుత ప్రభావము ప్రజపై శంకరాద్వైతము భారతదేశమున గనబరచి యుండుటచే Whenever we speek of Vedanta philosophy we mean the philosophy that was propounded by Sankara 17 వేదాంతసిద్ధాంతమనుటతోడనే శంకర ప్రబోధిత తత్త్వశాస్త్రమే యని యర్థముగ, సురేంద్రనాథ దాసు గుప్త వచించియుండుట మిగుల సముచితము, నిర్వివాదము. 'తావత్ గర్జంతి శాస్త్రాణి జంబుకా విపినే యథా। న గర్జతి జటాక్షపాద్ యావద్ వేదాంత కేసరి॥' ఎంతవరకు మృగరాజు గర్జింపకుండునో, అంతవరకు జంబుకాదులు అరణ్యమున నరచునట్లు వేదాంత కేసరి గర్జింపనంతవరకు నన్యశాస్త్రములు అరచుచుండును. ఇట్లు వేదాంతాద్వైతము సర్వ సిద్ధాంతములకగ్రస్థానము నధిష్ఠించి, భారతీయ సంస్కృతీ వికాసమునకు బరంజ్యోతియై, విశ్వమందంతట అజేయ ప్రతిభావిశేషమున బ్రకాశించుచుండుట మానవజాతి యదృష్టము. అన్యసిద్ధాంతములవలెగాక It has an impor-

17. Prof. Surendranath Das Gupta : A History of Indian Philosophy, vol. 1, p 429.

tant part to play helping man to realise his destiny [18] మానవుడు తన గమ్యమును బొంద సహాయపడుట యందు అది ప్రముఖస్థానము గలిగియుండుట గమనార్హము.

దీని నసంఖ్యాక పండితలోకము సహస్రాధికముగ సంస్తుతించియున్నది. The system of the Vedanta, as found on the Upanishads and Vedanta Sutras and accomplished by Sankara's commentaries on them .... is one of the most valuable products of the genius of mankind in his researches of the eternal truth [19] వేదాంతసిద్ధాంతము, ఉపనిషద్వేదాంతసూత్రముల నధిష్ఠానముగ నుంచి, శంకర భాష్యములచే సంపూర్ణమై, నిత్యసత్యాన్వేషణాకార్యమున మానవజాతియొక్క అద్భుత నైపుణ్యముయొక్క అమూల్య ఫలితముగ డాక్టర్ పాల్ దేవ సేన్ కొనియాడియున్నాడు. it stands in the history of human thought as the most consistent system of moism [20] మానవ విజ్ఞాన చారిత్రమున నిది గొప్ప సుదృఢ అద్వైతవాదముగ సతీశచంద్ర ఛటర్జీ వాకొనియున్నాడు. The fairest flower of philosophy and religion that any country in any age has produced, where human thoughts attain its highest expression and even goes beyond the mystery

---

18. Dr. P Nagaraja Rao : Prabuddha Bharata, 1955, p 493.
19. Dr. Paul Deussen : The Philosophy of the Vedanta, p 2.
20. Prof. Satischandra Chatterjee : An Introduction to Indian Philosophy, p 469.

which seems to be impentrable 21 అద్వైతము ఏ కాలమునగాని ఏ దేశమునగాని నిర్మింపబడని సుందర తాత్త్విక పుష్పరాజము. ఇచ్చట మానవ ధీశక్తి ఉన్నతోన్నతోచ్చారణము నొంది అభేద్యమగి పించురహస్యతత్త్వమును అతీతించియు వెడలి యున్నది అని వివేకానందస్వామి స్తుతించెను, The Stupendous system 22 అద్భుత సిద్ధాంతమని ఆచార్య రాధాకృష్ణ పండితుడుచ్చరింప, The crown of Indian philosophy 23 హిందూతత్త్వశాస్త్ర శిరోభూషణమని ఎస్. ఎన్. సూర్యనారాయణశాస్త్రి వచించియున్నాడు. శంకరాద్వైతవాదము అతీతింప బడలేదనియు, It represents the highest pinnacle of thought ever reached by the human intellect 24 మానవబుద్ధిచే నందుకొనబడిన ఉత్కృష్ట విజ్ఞానశిఖరముగ నమెరికా దేశస్థుడైన అతులానందుడు చిత్రించియున్నాడు. అట్టి విశిష్ట సిద్ధాంత ప్రతిపాదనమునకు Dielectic is necessary to put intuition to the proof 25 అనుభూతిని నిర్ధారణ మొనరించుటకు దర్క మవసరమని బెర్గ్సన్ అనునట్లు Discussion or Veda is breath of intellectual life 26. వైజ్ఞానిక జీవితమునకు వాద మావశ్యకమని పండితరాధాకృష్ణుడు నుడువునట్లు, అద్వైత సిద్ధాంతమున వాదతర్కములు అకుంఠిత

---

21. Swami Vivekananda : The Complete Works, vol. 2, p 247.
22. Dr. S. Radhakrishnan : Indian Philosophy, vol. 1.
23. Prof. S. S. Suryanarayana Sastry : Sankaracharya, p 1.
24. Swami Atulananda : The Story of Sri Sankaracharya Vedanta Kesari, 1928.
25. Bergson : Creative Evolution, p 251.
26. Dr. S. Radhakrishnan : Indian Philosophy, vol. 2, p 33.

రీతి ప్రదర్శింపబడి నృత్యమాడినవి. అందుచే In Sankaracharya, we saw tremendous intellectual power, throwing the scorching light of reason upon everything 27 శంకరాచార్యునిలో అద్భుత మేధాశక్తి, సర్వముపై దన దహించుయుక్తి జ్యోతిని బ్రసరింపజేయుట మనము గాంచెదమని వివేకానందుడు తెలిపియున్నాడు. కావున To him all eyes have turned and will continue to turn with loving reverence, so long as man retains his nobility and wisdom its prestige 28 ఆతనిపైకి అఖిల మానవ నేత్రములు తిరిగినవి. మానవుడు, తన ఘనవివేక గౌరవముల కాపాడుకొనుచున్నంతవరకు, శంకరుపైకి నతని దృష్టులు ప్రేమః గౌరవములతో ప్రసరించుచునే యుండునని ఎస్. యస్. సూర్యనారాయణశాస్త్రి యథార్థమును తెలిపియున్నాడు. కావుననే అద్వైతము only for the strong hearted 29 దృఢ హృదయము గలవారికే యని వివేకానందునివలె సతీశచంద్ర ఛటర్జీగూడ వచించియున్నాడు.

ఈ వేదాంతసిద్ధాంతప్రభావవిభూతుల నెంత కొనియాడినను తృప్తిచెందని పాశ్చాత్యప్రకృతీచీ పండితలోకము తమ సంస్తుతుల ననేకరీతుల గావించియున్నారు. వానియందు మరియు గొన్నింటిని జూచి యానందించెదముగాక! ఆధునిక పాశ్చాత్య విజ్ఞాన వేత్తలలో బ్రముఖ స్థానము నలంకరించియున్న ఆల్డస్ హక్స్లీ

27. Swami Vivekananda : The Complete Works, vol. 2, p 140.
28. Prof. S. S. Suryanarayana Sastry : Sankaracharya, p 74.
29. Prof. Satischandra Chatterjee : An Introduction to Indian Philosophy, p 470.

Vedanta is one of the clearest and most comprehensive summeries of the Perennial Philosophy ever to have been made. Hence its enduring value is not only for Indians, but for all mankind [30] ఇంతవరకేకాలమున నిర్మింబబడని నిత్యప్రవంతిరూప తత్త్వసిద్ధాంతముయొక్క సమగ్ర అద్భుత సువిస్పష్ట సంక్షిప్త రూపమే వేదాంతము. అందుచే నది ఒక భారతీయులకేగాక, అఖిల మానవ సంఘమునకు సుస్థిరామూల్యము అని, దాని సర్వోపయుక్తమును వివరించియున్నాడు. అట్లే మాక్సుముల్లరు కూడ Vedanta philosophy, a system, in which human speculation seems to me to have reached its very acme [30] వేదాంత సిద్ధాంతమున, నా యుద్దేశ్యమున, మానవ మనోవ్యాపారము తన ఉన్నతాగ్రమును జేరియున్నదని దోచుచున్నదని వచించెను. అంతియగాక, If Philosophy or religion is meant to be a preparation for after life, a happy life, and happy death, I known no better preparation for it than the Vedanta [31] మరణానంతరమునకు, సుఖజీవనమునకు, సుఖామరణమునకు తత్త్వశాస్త్ర మతములు సంసిద్ధముజేయ సంకల్పింపబడినవగుచో, వేదాంతముకంటె నుత్తమ సన్నాహమొండుండనేరదని నాకు దెలియుననియు నాతని దృఢవిశ్వాసము. ఇక రాధాకృష్ణ పండితుడు the Vedanta determines the world view of the Hindu thinkers of the present

---

30. Aldou Huxley : Prabudda Bharata, 1955, p 407.

31. Prof. F. Max Muller : The Six Systems of Indian Philosophy, Preface.

time 32 ఆధునిక కాల భారతీయ విజ్ఞానుల విశ్వ దృక్పథమును, వేదాంతము నిర్ణయించును అనియు; సతీశచంద్ర ఛటర్జీ మహాశయుడు The paragon of all monistic systems 33 సకల ఏకేశ్వర సిద్ధాంతములలో సర్వోత్తమమనియు; practically forms the scripture of the Hindus, and all systems of Philosophy that are orthodox, have to take it as their foundation 34 అది భారతీయుల శాస్త్రమై, నిఖిల వైదిక సిద్ధాంతములును దానినే తమ యధిష్ఠానముగ గైకొనవలెనని వివేకానందుడును; that is, the end the goal, the highest object of the Veda 35 అది అంతము, గమ్యము, వేదముయొక్క ఉన్నత ఆదర్శమునై యున్నదని మాక్సుముల్లరు నుడివియున్నాడు. అసలు భారతీయ స్వభావమే అనేక శతాబ్దములనుండి nourished-moulded, kneaded, and rolled out by Vedanta Philosophy 36 వేదాంత తత్త్వముచే బోషింపబడి, రూపొందింపబడి చిత్రింపబడినట్లు రోమెన్ రోలా వచించియున్నాడు. ఇటుల నెంత వచించినను, విశ్వకవి రవీంద్రనాధుని వాక్యములలో, The meaning of the living words, that come out of the experience of the great hearts, can never be exhausted 37 ఉత్కృష్ట హృదయుల అనుభవ ఫలిత

32 Dr. S. Radhakrishnan : Indian Philosophy, vol. 2, p 430.
33. Prof. Satischandra Chatterjee : An Introduction to Indian Philosophy, p 169.
34. Swami Vivekananda : The Complete Works, vol. 1 p 357.
35. Prof Max Muller : India, p 244.
36. Romain Rolland : The Life of Ramakrishna, p 70.
37. Dr. Rabindranath Tagore : Sadhana, p viii.

ములుగ బయల్వెడలు సజీవ వాక్యముల తాత్పర్యము, ఎన్నటికిని బూర్తిచేయబడనేరదు. అట్టిచో the thinkers of the East, seem to me, again, superior to most of the philosophers of the West 38 పాశ్చాత్య తత్త్వవేత్తలలో నధిక సంఖ్యాకులకంటె బ్రాగ్దేశీయ తత్త్వవిదులు అధికులని, మరల నాకు దోచుచున్నదని మాక్సుముల్లరు; The Hindus, alone of mankind, have penetrated behind the veil and possess the knowledge, whic is really not philosophical i. e., wisdom loving, but wisdom itself 39 హిందువులుమాత్రమె మానవకోటిలో, అవనికను దాటి, తత్త్వజ్ఞానమునుమాత్రమేగాక, వివేకమునే గలిగి యున్నారని డగ్లస్ గ్రాంట్ డఫ్ ఆన్సిలిచేత అతులమైన మన్ననల నొందుటయందాశ్చర్యమావంతయును గానుపింపదు.

అద్వైతశాస్త్రము యింతగ కఠినవాద తర్కభూయిష్ఠమై, సామాన్య ప్రజ్ఞాయుక్తులకతీతమై, మేటియై, సర్వ సిద్ధాంత సార్వభౌమత్వమున విరాజిల్లినను, అతి విశాల హృదయమున, సాధకుల ఆధ్యాత్మిక మార్గమునగల కష్టనిష్ఠురముల, సమగ్రముగ నవగాహనమొనరించుకొనిన సహృదయ గావున, బరసిద్ధాంత దోషముల నా యా యవలంబకుల కట్టెదుట నుంచినను, వానిపై నెట్టి అసూయా ద్వేషముల జూపక, వారికిగూడ దన విశ్వవ్యాప్త హృదయసీమలో నవకాశమొసంగియున్నది. The main stren-

38. Prof. F. Max Muller : The Six Systems of Indian Philosophy, p xii.

39. Douglas Grant Duff Ainslie : The Science of Religion of Swami Yogananda, p vii.

gth of Sankara's position is also that of Adwaita generally, that it seeks not to destroy, but to fulfil. It has no quarrel with other systems; for, - - one does not quarrel with his own hands or feet [40] శంకరుని తత్త్వము, అద్వైత సిద్ధాంతములలో గూడ నొక ముఖ్య బలము గలదు. అది నశింపజేయ యత్నింపక, సంపూర్తి చేయును. ఇతర సిద్ధాంతములతో దాని కెట్టి స్పర్ధలును లేవు. తన కాలుసేతులతో నెవ్వడును బోట్లాడడుగదా అని, సూర్య నారాయణశాస్త్రి వచించును, Hence it is that the true Advaitin does not go forth ravening for controversial pray; rather does he seek to conserve and anoble [40] కావున యథార్థమైన అద్వైతి వివాదాహారము నకై కాంక్షింపడు. కాని రక్షించి పరిశుద్ధపరచును. అందుచే Not for nothing is Sankara glorified as the consolidator of the six religious faiths [40] షణ్మతస్థాపనా చార్య అని శంకరుడు, కారణములేక బిలువబడలేదని సూర్యనారా యణశాస్త్రి వివరించెను. అవును కర్మకాండను, ఉపాసనా విధాన మును, సిద్ధాంత విచారణమును, జీవరకు సగుణ బ్రహ్మమును గూడ భ్రాంతిజన్యముగ సిద్ధాంత విచారణమున ద్రోసిపుచ్చిన శంకరుడు, ఎల్ల అధికారులకు సాధనలో నవకాశమొసంగుటయే గాక, నా యాదర్శమును అనుష్ఠానమునగూడ జూపింప బంచా యతన పూజాపద్ధతిని బ్రతిపాదించి, మరియు దానే అనేక దేవత లపై నసంఖ్యాక భక్తిప్రబోధక, పద్య గద్యాత్మిక రచనల

---

40. Prof. S. S. Suryanarayana Sastry : Sankaracharya, p 71.

గావించి యుండుట, శంకరుని విశ్వతోముఖ కరుణార్ద్రహృదయ ప్రదర్శనమునకు నిదర్శనముగదా! అందుచే It sets before itself the object of finding a truth, 'free from all dispute' and not opposed to any school of thought or religion? or interpretation of scriptures. It's truth is independent of sect, creed, colour, race, sex and belief And it aims at what is 'Equally good for all beings' 41 నిర్వివాదమై ఏ సిద్ధాంతమునకుగాని, మతమునకుగాని వ్యతిరేకము కానట్టి, శాస్త్రార్థములకు భిన్నముగాని,సత్యమును గనుగొనుటయే ముఖ్యోద్దేశ్యము దానికి గలదు. దాని సత్యము జాతి వర్గ మత లింగ విశ్వాసములకతీతమై, స్వతంత్రమైనది. సర్వజీవులకు సమాన శ్రేయస్సుమాత్రమే దాని ఆదర్శముగ, శృంగేరీ పీఠాధ్యక్షులైన శ్రీ సచ్చిదానంద శివాభినవ నరసింహ భారతీస్వామి అద్వైత వాదమునుగూర్చి విశదము చేసియున్నారు. ఈ విషయమునే మాండూక్య కారికాకారుడైన గౌడపాదుడును, 'స్వసిద్ధాంత వ్యవస్థాసు ద్వైతినో నిశ్చితాదృఢం। పరస్పరం విరుధ్యంతే తైరయం న విరుధ్యతే॥' (మాం. క. 3. 17) తమ విచారణా ఫలితములగు నున్న నిర్ణయముల ద్వైతులు పట్టుకొనియుందురు. కాన వారు పరస్పరము కలహించుకొందురు. కాని అద్వైతికి వారితో నెట్టి వైరమును లేదు అని వాకొనుచు, 'అద్వైతం పరమార్థో హి ద్వైతం తద్భేద ఉచ్యతే' (శ్లో. 18) అద్వైతము పరమార్థమైనది, దాని వ్యతిరేకము ద్వైతముగ జెప్పబడును అని నిశ్చయించి

41. Sri Satchidananda Sivabhinava Narasimha Bharathi Swami Mandukyopanishad, of Swami Nikhilananda, p iii.

యున్నాడు. కావున అద్వైతశాస్త్రమతిగంభీరమై, సర్వాదరమై, సర్వతోముఖమై, నిర్వైరమై, అజేయమై యొప్పారియున్నదని, యిందలి విజ్ఞతాత్పర్యము.

అద్వైత దృష్టికి, 'Whence is this? .... Who projected this Universe? How? Who knows the secret?' - - Millions of attempts have been made to answer it, yet Millions of times it will have to be answered again, It is not that each answer was a failure; every answer to this question containd a part of truth [42] ఇది ఎక్కడ నుండి? ఎవరీ విశ్వమును సృజించెను ? ఎట్లు ? ఈ రహస్యము నెవ రెరుంగుదురు? ఈ ప్రశ్నకు సమాధానమునకై, యనేక కోట్ల యత్నములు గావింపబడియున్నవి. ఇంకను కోట్ల పర్యాయములు మరల సమాధానములొసంగబడుచుండును. ప్రతి సమాధానము నిష్ఫలముగాక, ప్రతి సమాధానములో గొంత సత్యము ఇమిడియున్నదని దోచును అని వివేకానందుని వచనతాత్పర్యము. యథార్థమున యోచించునో, రాధాకృష్ణ పండితుడనునట్లు The long procession of thinkers struggled hard to add some small piece to the temple of human wisdom, some fresh frangment to the ever incomplete sum of human knowledge. But human speculations fall short of the ideal, which it can neither adandon nor attain [43] తీర్ఘ ప్రజ్ఞాధురీణ

42. Swami Vivekananda : The Complete Works, vol. 2, p 203.
43. Dr. S. Radhakrishnan : Indian Philosophy, vol. 2, p .767

శ్రేణి మానవ విజ్ఞానాలయమునకొక చిన్న ముక్కను జేర్చ, నిత్యముగ నసంపూర్ణ మానవ విజ్ఞానమునకొక నూత్న ఖండమును జేర్ప శ్రమించిరి. కాని తా ద్యజింపజాలని, పొందజాలని ఆదర్శమునకు మానవ ప్రజ్ఞ కొరవబడుచునే యున్నది. ఎందుచేనన Every attempt to bring Brahman into connection with the world of becoming ends in failure. The relation of the finite world to the infinite spirit is mystery, for human understanding [44] బ్రహ్మమును బ్రపంచముతో సంబంధింపజేయు ప్రతి కృషి, నిష్ఫలముగ నంతమగుచున్నది. అనంత సాంతములకు గల సంబంధము మానవ ధీశక్తికతీతమై నిగూఢముగనే నిలచి యున్నది అని, మరల నాతడు వచించునట్లు అద్వైతము విచారించి, అనిర్వచనీయ ఖ్యాతిగ బ్రపంచమును నిర్ణయించి, బ్రహ్మ పదార్థమును అనుకూల నిర్వచనములగాక, వ్యతిరేక పదములతో నిర్వచించినట్లు గానుపించి, యథార్థమునకు ఆ బ్రహ్మము సర్వ ప్రమాతీతముగనే నిర్ణయించియున్నది. ఎందుచేతనన ఆచార్య గిబ్బర్టు ముర్రే వచనములరీతి As the most beautiful image carved by man was not the god, but only a symbol to help towords conceiving the god, so the god himself when conceived, was not the reality but only a symbol to help towords conceiving reality [45] మానవునిచే జెక్కబడిన విగ్రహము భగవంతుడు గాక, భగవంతుని రూపొందిచుకొన దోడ్పడు సంజ్ఞా

44. Dr. S. Radhakrishnan : Indian Philosophy, vol. 3, p 568.
45. Prof. Gibbert Murray : Discovery of India, of Nehru, p 77.

రూపమే యగునట్లు, భగవంతుడుకూడ ఎల్లప్పుడు భావింపబడునో, యథార్థము గాక, సత్యమును భావించుకొన నుపయోగించు సాంకేతికము మాత్రమే యగునను నదియే అద్వైతవాదము.

అటులైన భావింపబడి మానవ తారణమున కుపయుక్త తత్త్వమొండు మానవునెదుట నున్నగాని మానవునకు గతి ఏమి ? ఇక నతీతమైన బ్రహ్మపదార్థమువలన మానవునకుపయోగమేమి ? అను సందేహములు అద్వైతసిద్ధాంత పాఠకులకు గలుగకమానవు. అందులకై జీవ బ్రహ్మములకు విభిన్నత్వము లేకపోయినను, అనాదియు అనిర్వచనీయమును అగు మాయాప్రాభవమున భిన్నత్వభ్రాంతి గలిగి, తనకు తారణోపాయమేమి అను సందేహమున దన నైజమును విస్మరించుటచే, దన సంకల్పరూప ప్రజ్ఞాశక్తియు జిదంశమై యుండుటచే, గ్రిమన్యాయమున దన యాథార్థ్యమును నతనికి గ్రహింపజేయ శాస్త్రము యోచించినది. బ్రహ్మ ప్రకృతిసంబంధమున గొన్ని రహస్యముల బెకలించినది. ఉపనిషత్తులచే వ్యతిరేక పదములచే వర్ణితమైనట్లు గోచరించు నిర్గుణబ్రహ్మము సర్వ సృష్టికతీతముగ నున్నను, ఆతనియందు అనిర్వచనీయ స్థితినున్న మాయ యను శక్తి మహిమచే బ్రహ్మమునందు ఈశ్వరత్వ మేర్పడుచున్నది. అఖండాద్వైత బ్రహ్మమునందు, ఈశ్వరత్వమెట్లేర్పడుటయను ప్రశ్నయే లేదు. మాయా ఈశ్వర తత్త్వములు బ్రహ్మమునకు భిన్నములుగాక, బ్రహ్మము నధిష్ఠానముగ గలిగియే యున్నవి. ఎట్లు అనుట కది అతీతము, దురూహ్యము, అనిర్వచనీయము. ఇట్లు మాయా దృష్టికి దోచు బ్రహ్మమే ఈశ్వరుడనియు, కాక మాయయందు ప్రతిబింబిత బ్రహ్మమే ఈశ్వరత్వమనియు ననేకరీతుల విజ్ఞులు

నుడివియుండిరి. అట్లు ఏర్పడిన ఈశ్వరునకు, జ్ఞాన ఇచ్ఛా క్రియా శక్తిత్రితయరూపమునగల నీ మాయ దోడ్పడి, తా స్వతంత్రించి యే కార్యము జేయుటకు జడముగాన, నశక్తగాన, సృష్టినంతటిని గలుగజేయుటకాధారమగుచున్నది. అందుచే సృష్టికర్త ఈశ్వరుడగుచున్నాడు. ఆతని సృష్టిలో జేరిన వారలే జీవులెల్లరును. ఈ జీవులైనను మాయా ప్రతిబింబములే యగుచున్నారు. అనగా నా మాయ ఈశ్వరుని కల్పించునప్పుడు శుద్ధమై, మూలప్రకృతి యనియు శుద్ధమాయ యనియు బిలువబడును. కాని, ఈశ్వరువోలె చైతన్యమూర్తియై యొప్పు జీవుని గల్పించునప్పుడు అశుద్ధమై, తూలావిద్య అనియు, అశుద్ధమాయ యనియు, అవిద్య అనియు బేర్కొనబడి, తన శుద్ధత్వముచే నీశ్వరునకు సృష్టి, స్థితి, లయ, సర్వజ్ఞత్వ, సర్వశక్తిత్వ, సర్వేశ్వరత్వాది సిద్ధులనొసంగియుండియు, అశుద్ధత్వముచే జీవునకు వానినన్నింటిని దీసివైచి, సంకుచితునిగ గావించి, కర్తృత్వ భోక్తృత్వములమాత్రమే ప్రసాదించి, మరల సత్క్రమ శ్రవణాదిక సాధనానుష్ఠానమహిమచే దననుగూడ దాటి, తన మాయాజాలమునుండి విముక్తుడై బింబమునందు ప్రతిబింబము, ప్రతిబింబకారణము విచ్ఛిన్నముకాగా లయించునట్లు, ఘటభంగమున గల్పిత ఘటాకాశము మహాకాశమున లయించునట్లు, బ్రహ్మమునందు లయింప శక్తినిగూడ నొసంగియున్నది. ఆ సాధన గమ్యముగ నవాఙ్మానసగోచరమైన బ్రహ్మమునుగాక, విశుద్ధతత్త్వమైన ఈశ్వరుని జీవునకు జూపించి, ఆతని బూజించి, అర్చించి, ప్రార్థించి, ఉపాసించి, ఆతని అనుగ్రహవిశేషమున నీ నిజతత్త్వమును బొందుమనియు సలహానొసంగెను. జడమని వచింపబడిన మాయకిట్టి సామర్థ్యముండునా

యనుట సముచితమే. కాని, దాని యధిష్ఠానమైన బ్రహ్మచైత న్యము కర్తృత్వరహితముగనే మాయకుపయుక్తమగుచున్నది. స్వప్రకాశముతోనున్న సూర్యుడే యిందుకుదాహరణము. అట్లైనను యీ కర్తృత్వముల దనపై నుంచుకొనక, ఈశ్వరత్వమేర్పడిన పిమ్మట తదధిష్ఠశక్తిగ నుండుటచే నా ఈశ్వరునకే సర్వకర్తృత్వ ముల నొసంగి, తానుదాసీనయై మాయ యుండినది. కాన జీవ ఈశ్వర ప్రకృతులు మాయాప్రభావజనితులే యని తాత్పర్యము. కాని, ఈ భావములన్నియు ప్రకృతివ్యవహారమున మునిగి యుండువారికొరకే గాని, దాని నతీతించియున్న జ్ఞానులకెంత మాత్రమును లేవు. వారికంతయు లేనిదే. వారికి సర్వత్ర బ్రహ్మమే భావమగుచుండును. అచ్చట భావశబ్దము ఇంద్రియ జన్య జ్ఞానమునకతీతమై యొప్పారునని గ్రాహ్యము. కావున నద్వైతశాస్త్రము ఈ ద్వివిధానుభూతుల గమనించి, విమర్శించి, సత్యములు రెండు అని నిర్ణయించినది. ప్రస్తుత సామాన్య మాన వునికి గోచరించుచున్న కల్పిత జగత్తు, తద్గతానుభూతులు సర్వము చేరి, జీవ వ్యవహారమై యుండుటచే వ్యావహారిక సత్య మనియు, ఈ ప్రకృతి వ్యాపారమున కతీతించి, కేవలముపనిష ద్గత పరమార్థతత్త్వముగ నుండు సర్వాతీత అవాఙ్మానగోచర తత్త్వము పారమార్థిక సత్యమనియు తీర్మానించినది. పారమార్థిక సత్యమున నానాత్వ మెట్టి విధముననైన లేక, కేవలాఖండ నిర్మ లానంత నిర్గుణ బ్రహ్మమే యుండును. వ్యావహారిక సత్యమున ప్రత్యక్షగోచర నానాత్వము భాసించి, తదధిష్ఠానైకత్వమును మరుగుపరచి, నానా విభేదములతో నెల్వొందును జీవేశ్వర ప్రకృతి స్వరూపమ్ము. పారమార్థికము 'కాలత్రయేఽపి తిష్ఠతీతి సత్॥' త్రికాల

విభేదమున కతీతమై, సర్వథా సర్వదా గోప్యమై నిర్వికారమై యొప్పారును. కాని, వ్యావహారికము ప్రవాహనిత్యత్వము గలిగి, సంతత వికారభూయిష్టమై, చంచలమై, అస్థిరమై, అసంపూర్ణమై చెల్వొందును. మరల నీ వ్యావహారికమున అతి సంకుచితమై, స్వల్పకాలబద్ధమై యొప్పు ప్రాతిభాసిక సత్యమొండు గలదు. అది చాలవరకు వ్యక్తిగతము. స్వప్న భ్రాంతులు దీనియందంతర్గతము. కావున బూర్వము నిర్వచింపబడియున్న మాయాశాస్త్ర ప్రభావములు, ఈశ్వర కర్తృత్వాదులు, బంధ మోక్షాదులు సర్వము, వ్యావహారికముగ సత్యములేగాని పారమార్థికముగ నసత్యములే యగుచున్నవి అని అద్వైతసిద్ధాంత తాత్పర్యము. అయినను, అది వ్యావహారిక జీవులకు వ్యావహారికముగ నుపయుక్తమగును గాన, దాని ద్రోసిపుచ్చు నవకాశములేదు.

పై జేర్కొనబడిన మాయ, సృష్టి, ఈశ్వరనిర్వచన వివరణముల విషయమున, బండితలోకమున మిగుల కలవరము భిన్నభావములు గలవు. మాయ అనునది బ్రహ్మముయొక్క అంతర్గత శక్తియనియు, దాని ప్రాబల్యముననే బ్రహ్మము సృష్టికర్తృత్వము గలిగియున్నదనియు, గాన నీ సృష్టియంతయు నా బ్రహ్మమునే కారణముగ గలిగియున్నదనుటచే, మాయ భ్రాంతి యని అజ్ఞానమని యనుట సమంజసము కాదనియు, సృష్టియైనను భ్రాంతిగాక, బ్రహ్మమువోలె సత్యమే యని కొందరు విద్వాంసుల మతము.
He is the wielder of maya. But maya, is nothing different from Him, being but His now potency or energy - - -. Maya is the energy while Iswara, is the energiser; and between

energy and energiser there is non-difference [46] అతడు మాయాధినేత. కాని మాయ అతని అంతఃశక్తి యగుటచే నతనికన్యముగాదు. మాయ శక్తి, ఈశ్వరుడు శక్తిమానుడు. శక్తి శక్తిమానులకు అభేదము అని సూర్యనారాయణశాస్త్రి వివరణము. The world appearance is not however so illusory as the perception of silver in the conch shell, for the later type of worldly illussions is called 'pratibhasika' as they are contradicted by other later, experiences - - -. [47] శుక్తిరజత భ్రాంతివోలె ప్రపంచ దృశ్యము భ్రాంతి కానేరదు. ఆ భ్రాంతి స్థితులు మరియొక స్థితిలో నదృష్టములుగాన ప్రాతి భాసికములగుచున్నవి అని సురేంద్రనాథుడు వాకొనును. Imperfect is the manifestation of the perfect---. In fact, imperfection is not a negation of perfectness; finitude is not contradictory to infi- nity; they are but completeness manifested in parts, infinity revealed within bounds [48] అశుద్ధత్వము పరిశుద్ధత్వము యొక్క మూర్తిమంతము. యథార్థమున అపరిశుద్ధమన బరిశుద్ధమునకు వ్యతిరేకార్థముగాదు. పరిమితత్వము అపరిమితత్వమునకు విరుద్ధమునుగాదు, కాని అనంతత్వము నానాత్వ భాగములుగ బరితత్వమున గోచరించుటయే యగునని విశ్వకవి రవీంద్రుని వివరణము.

---

46. Prof. S. S. Suryanarayana Sastry : Sankaracharya, p 51.
17. Prof. Surendranath Das Gupta : A History of Indian Philosophy, vol. 1, p 445.
37. Dr. Rabindranath Tagore : Sadhana, p 48.

కాని Ajnana is not a positive entity (భావ) like another positive entity, but it is called positive simply because it is not mere negation [49] (అభావ) అజ్ఞానము యితర భావ పదార్థములవోలె భావతత్త్వము కాదనియు, గాని అది అభావము కాదనుటకే భావముగ భావింప బడినదనియు సురేంద్రుడు వివరించుచు, ప్రస్తుతము గోచరించు చున్న విశ్వము ప్రస్తుతమునకు సత్యమే యని శాస్త్రము సమ్మతించుననియు, కాని సర్వదా అది యిటుల ఉండదనియే దాని వాదమనియు వచించి, and a time will come when to the emancipated person the world - appearance will cease to exist [50] ముక్తపురుషునకు నీ ప్రపంచ దృశ్యము అదృశ్యమగు సమయము వచ్చుననియు సురేంద్రుడు ఒక కాలమున ప్రపంచముయొక్క అభావస్థితిని సూచించెను. అందుచేతనే శంకరుడు 'దృష్ట నష్టస్వరూపత్వం మాయా' దృష్టమైన స్వరూపమును నష్టపరచు తత్త్వము గలదిగ మాయను నిర్వచించెను. ఈ సిద్ధాంతమును గూలంకషముగ గ్రహించి వివరించి యున్న దేవసేన్ పండితుడుగూడ We come to the esoteric Cosmology, whose simple doctrine is this, that in reality there is no manifold world, but only Brahman, and that what we consider as the world is a mere illusion (maya) sim ilar to mrigatrishnika which disappear when we

---

49. Prof. Surendranath Das Gupta : A History of Indian Philosophy, vol. 1, p 453.

50. Prof. Surendranath Das Gupta : A History of Indian Philosophy, vol. 1, p 447.

approach it, and not more to be feared than the rope, which we took in the darkness for serpent There are, many similies in the Vedanta, to illustrate the illusive character of this world, but the best of them is perhaps when Sankara compares our life with a long dream ---. This life a dreem! 51 నిగూఢ సృష్టితత్త్వమునకు చేరితిమి. దాని సులభ సిద్ధాంతరూపము యిది. ఈ నానాత్వ ప్రపంచము యథార్థమున లేదు, కాని బ్రహ్మమే గలదు, మనచే బ్రపంచమని భావింపబడునది మనము దగ్గరకు చేరిన నదృశ్యమగు మృగతృష్ణ వలె మాయ. మందాంధకారమున ద్రాటిపై జూడబడిన సర్పము నకు భయపడనట్లు మనము భీతినొంద నవసరములేదు. ప్రపంచ భ్రాంతితత్త్వ నిరూపణమునకై యిట్టి దృష్టాంతములు అనేకములు వేదాంతమున గలవు. కాని, జీవితమును దీర్ఘస్వప్నముగ శంక రుడు పోల్చినది సర్వోత్కృష్టము. జీవితమొక స్వప్నము ; అని శంకర భావమును అతడు సమర్థించియున్నాడు. అంతియగాక This world is maya, is illusion, is not the very reality, that is the deepest thought of the esoteric Vedanta, attained not by calculating Tarka but by Anubhava, by returning from this verigated world to the deep recess of our own self (Atman) 51 ఈ ప్రపంచము మాయ, భ్రాంతి, అని త్యము అని నిగూఢ వేదాంతముయొక్క అగాధ భావమిది. ఇది యూహాగ్రస్తమైన తర్కముచేగాక, ఈ నానాత్వ ప్రపంచము

---

51· Prof. Paul Deussen : The Philosophy of Vedanta, p 9.

నుండి వెనుదిరిగి, నిగూఢ ఆత్మసంధానమునగల అనుభవముచే సంపాద్యము అని దేవసేన్ గట్టిగా సమర్థించెను. ఈ ప్రపంచము మాయ, భ్రాంతి, బ్రహ్మముతో బోల్చిన నంతియే. స్వప్న ప్రపంచము తత్కాలమునకు సత్యమైనటుల so has this world so long as we are in ignorance 52 ఎంతకాలము మన మజ్ఞానమున నుందుమో యంతకాలము యిది సత్యమే యని వీరేశ్వరానందుడు వచించియున్నాడు. అయినను మాయ బ్రహ్మము వలె సత్యమునుగాక, వంధ్యాపుత్రునిచందము అసత్యమునుగాక, సదసత్తుల రెండింటిని గలిగియుండుటచే సదసద్విశిష్టముగా వర్ణింపబడియున్నది. ఈ మాయా, సృష్టి విధానములు అద్వైతఖండమున, రెండవ భాగమైన శంకరాద్వైతమున ఎక్కువగా చర్చింపబడునుగాన యీ భాగమున నిక ముగించెదము. ఆ భాగమున దాని సమగ్రముగ జర్చించి గ్రహించుకొనెదముగాక !

ఈ మాయ యనబడు అవిద్య అనగా అజ్ఞాన ప్రభావము చేతచే ప్రపంచము సృజింపబడుట, దానియందు ననేక నానాత్వములేగాక, దన్మూలముగ గల్పింపబడిన ననంఖ్యాక కష్టసుఖములు సుఖదుఃఖములు నాపడు సహస్రాధిక ద్వంద్వములేర్పడి, జీవుల జీవితవిధానములో బహుళ క్లిష్టత్వము ఏర్పడియున్నది. కాని వీని బరమకారణాన్వేషణము వ్యర్థము. అందుచేతనే రవీంద్రనాధుడు The question why there is evil in existance is the same as way there is imperfection, or, in other words, why there is creation at all. We must take it for granted that it could not be

52. Swami Veereswarananda : Brahma Sutras, p xiix.

otherwise; that creation must be imperfect, must be gradual, and that it is fulfile to ask the question, why we are? 53 పాపమెందులకున్న దనుట, అజ్ఞానమెందులకున్నదనియు, అసలు సృష్టి ఎందుల కేర్పడినదని ప్రశ్నించుటయే యగును. అది యితర విధముగ నుండ జాలదని నిర్ణయించుకొనుటయే యుచితము. సృష్టి అపరి శుద్ధమే, క్రమత్వమే యగును. మనమెందుకున్నామని ప్రశ్నిం చుట వ్యర్థము అని వచించెను. అటులే డాక్టరు పాల్ దేః సేన్ గూడ The fact is, that we are here in ignorance, sin and misery, and that we know the way out of them, but the question of a cause for them is senseless 54 మనము యిచట అజ్ఞానము, పాపము, దుఃఖ ములలో నుంటిమనియు, వానినుండి విడివడు మార్గము మన మెఱింగి యున్నామనియు, కాని వాని కారణములగూర్చిన ప్రశ్నము అవివేకమనియు ననుట యథార్థము అని నుడివి యున్నాడు. అటులే బుద్ధభగవానుడుగూడ నీ విషయ పరిశోధ నము గావించి, దుఃఖకారణములకంటె దుఃఖనివారణోపాయము లకే ప్రాధాన్యము నొసంగి, గృహము దహనమగుచుండ దహన కారణమును విచారించుచు గూరుచుండుట అవివేకమనియు, స్వాత్మ బంధు వస్తు నిచయ సంరక్షణమే ప్రథమ కర్తవ్యముగ బోధించియున్నాడు. కావుననే శంకరాచార్యులును షడనాదుల బ్రతిపాదించి, అందు ఈశ్వర, కాల, కర్మ, ప్రకృతి, మాయ, బ్రహ్మముల జేర్చియున్నాడు.

---

53. Dr. Rabindranath Tagore : Sadhana, p 47.
54. Prof. Paul. Deussen, The Philosophy of Vedanta, p 14.

అట్లైనను మానవ గవేషణాస్వభావమూరకుండదు గదా. అటుల నాలోచించినను అద్వైత సిద్ధాంత ప్రతిపాదిత సర్వ విషయములును, అధునాతన భౌతిక విజ్ఞానపరిశోధనా ఫలితములతో దులదూగుచున్నట్లు I may make bold to say, that the only religion which agrees with, and even goes a little further than modern researches, both physical and moral lines is the Adwaita, and that is way it appeals to modern scientists so much [55] ప్రస్తుత పరిశోధనలకనుగుణముగ నుండుటయే గాక, గొంత ముందుకుగూడ భౌతిక విజ్ఞానమున నైతిక విషయముల నధిగమించిన మతము ఒక్క అద్వైతము మాత్రమే. అందుచే నది, యాధునిక భౌతిక విజ్ఞానవేత్తల కెక్కువగ నచ్చిన దని వివేకానందుని వాక్యము. మరియొకచోట Vedanta Philosophy of which the latest discoveries of science seems like echoes [56] అత్యాధునిక భౌతిక శాస్త్ర పరిశోధనాంశములు వేదాంత సిద్ధాంతముయొక్క ప్రతిధ్వనులు మాత్రమే యనియు వివేకానందుడు పలికియున్నాడు. My own conception is that on examination of Indian Vedantic Doctrine shows that it is, in important respects, in confirmity with the most advanced scientific and philosophic thou-

55. Swami Vivekananda : The Complete Works, vol. 2, p 138.

56. Swami Vivekananda : Vedanta Kesari, 1929.

ght of the West, and that where this is not so, it is Science which will go to Vedanta and not the reverse 57 వేదాంతతత్త్వ పరిశీలనము గావించిన తర్వాత, అది ముఖ్య విషయములలో పాశ్చాత్య దేశముల నత్యంతాభివృద్ధి జెందిన భౌతిక తాత్త్విక విషయములకనుగుణముగ నున్నదనియు, ఎచ్చటనైన నటుల లేనిచో, భౌతిక విజ్ఞానమే వేదాంత సన్నిధాన మునకు జేరవలెనుగాని తద్వ్యతిరేకము కాజాలదనియు నా విశ్వా సము అని సర్ జాన్ వూడ్రాఫ్ వక్కాణించెను. Such critics can turn profitably to the latest developments in scientific thought which lend greatest support to Sankara's conclusions 58 కాదను విమర్శ కులు, శంకర నిర్ణయములకు అధికతర బలము చేకూర్చుచున్న అత్యాధునిక భౌతిక విజ్ఞాన రహస్యముల ప్రయోజనకరముగ జూచెదరుగాక అని ఎస్. ఎన్. ఎల్. శ్రీవత్సవ గట్టిగా వచించెను. వి. సుబ్రహ్మణ్య అయ్యరు గూడ మాండూక్యోపోద్ఘాతమున, I find that Vedanta is far in advance, not merely of the most modern Western philosophic thought, but also of scientific thought 59 నేటి పాశ్చాత్య తాత్త్విక భావములకంటె మాత్రమేగాక, భౌతిక విజ్ఞాన విషయ ములకంటెగూడ వేదాంతము, చాల అధిగమించినట్లు నే గాంచితిని అని వచించియున్నాడు. అవును, Logic means, simply

---

57. Sir John Woodroffe : The World as a Power, – Reality,

58. Sri S. N. L. Shrivastava : Was Sankara an Illusionist ? p 8, 1954 – p 22.

59. Sri Subra manya Iyer : Mandukyopanished, of Swami Nikhilananda, p iv.

the art and method of correct knowing తర్క మనగా నిర్దుష్ట జ్ఞానమునకు మార్గము, కళ యని ఆరిస్టోటల్ అనునట్లు, నా తర్క కళను సక్రమ విధానమున 'ఆర్షం ధర్మోపదేశం చ వేద శాస్త్రావిరోధినా। యస్తర్కేణానుసంధత్తే స ధర్మం వేద నేతరః॥' (మనుధర్మ. 12. 106) ఆర్షము, ధర్మోపదేశములును వేదశాస్త్రమునకవిరుద్ధమైన తర్కముచే నెప్పుడు అనుసంధానమగునో అప్పుడే అది ధర్మమగును అనురీతి, శ్రుతియుక్తి అనుభవముల మేళవించి, వాని సమిష్టి ఫలితాంశముల ప్రపంచమున ప్రగుమ్మరించిన అద్వైతాచార్యుల ప్రబోధ ఏ దృష్టి బరికించినను నిర్దుష్టమై, సర్వసమన్వయమై, విరాజిల్లుట యందాశ్చర్యమేమి ?

## భ్రాంతి

ప్రథమమున నెందరినో, కలవరపరచుచున్న భ్రాంతి విషయము నాలోచించెదముగాక: The mere fact that I perceive the world - appearance cannot prove that what I perceive is true or real, if it is contradicted by inference [60] ప్రపంచ దృశ్యమును నే గాంచుచున్నాననునంతమాత్రమున, నేను చూచునది పర్యవసాన జ్ఞానముచే ఖండింపబడినచో నది సత్యము కానేరదు. ఎట్లన We all perceive the Sun to be small, but our perception in this case is contradicted by inference and we have hence to admit that our perceptions are erroneous [60] మనము సూర్యుని చిన్నవానిగ

60. Prof. Surendranath Das Gupta : A History of Indian Philosophy, vol. 1, p 447.

గాంచుచున్నాము. కాని చివరకు ఆ జ్ఞానము లోకభూయిష్ఠమగును. అందుచే, మన దృశ్యములు భ్రాంతిజన్యములుగ మనము సమ్మతింపవలెను అని సురేంద్రనాథుని వాదము. ఇట్టి వివరణమునకు అద్వైత శాస్త్రమున నసంఖ్యాకములైన యుదాహరణములు గలవు. అందు రజ్జుసర్ప, శుక్తిరజత, మరుమరీచి, స్థాణుపురుషాదికములు సుప్రసిద్ధములు. అనగా, మదాంధకారమున జనుచున్నవానికి, ముందున్న త్రాడు సర్పరూపమున గోచరించి, భయోత్పాతముల గలుగజేయును. అటులే, మెరయుచున్న ముత్యపు చిప్ప వెండి యని చూపరులకు భ్రాంతి గలుగజేయుచున్నది. దూరమందున్న ఎండమావు నీరములను అపోహనుగలుగజేయును. చీకటిగల స్తంభము పురుషాకృతి వహించి, చోరభయమును గలిగించుచున్నది. కాని, వీని నిర్మాణమున గారణమునకై వివిధ శాస్త్రజ్ఞులు, తమ మేధాశక్తుల నుపయోగించి, యోచించి, నిష్ఫల మనోరథులైనట్లు తజ్ఞులకు విదితము. Why does the rope appear as the snake, is a question which school boys raise and philosophers fail to answer [61] త్రాడు పాముగ గోచరింపనేల యని విద్యార్థులు ప్రశ్నింపగలరు కాని, తత్త్వవేత్తలే సమాధానము నొసంగజాలరు అని రాధాకృష్ణ పండితుడు వచించెను. 'భ్రామ్యతే నయేతి భ్రాంతిః' (అ...ర. 1. 144) భ్రమింపజేయునది భ్రాంతి అనిగదా తాత్పర్యము. ఇట్టి నిత్యానుభవములేగాక నింక బ్రత్యక్షములు మనకు గలుగుచునే యున్నవి. In daily life, we say that a currency note is really paper, but conventionally it is

61. Dr. S. Radhakrishnan : Indian Philosophy, vol. 2, p ...

money; a photograph is really paper, but appears as man; the image in a mirror appears as real object, but is not really so, and so on. This ordinary kind of distinction between the appearant and the real is philosophically utilized by Vedanta for explaining the relation of God to the world 62 నిత్య జీవితములో, రూపాయి కాగితమును కాగితమని యందుముగాని, వ్యావహారికముగ నది ధనము; ఒక రూపచిత్రము యథార్థమున కాగితమే కాని అది మనుష్యునివలె గోచరించును; అద్దమందు ప్రతిబింబము యథార్థముగ గానుపించునుగాని సత్యమునకాదు. ఇట్టివింక ను జాలకలవు. ఇట్లు భాన భానములకు గల వ్యత్యాసమును, బ్రహ్మ ప్రపంచ సంబంధ వివరణమునకై వేదాంతము తాత్త్వికముగ నుపయోగించుకొని యున్నది అని, సతీశ్ చంద్ర ఛటర్జీ దెలిపియున్నాడు. అటులే యీ కాలమున మాయ బంగారమును గాంచి, సత్యమే యని ఎందరు ప్రజ్ఞాశీలురే మోసపోవుటలేదు! ఆకసమందు గోచరించు ఇంద్రధనువు యథార్థమని ఎందరు భ్రాంతి నొందుటలేదు! గుండ్రని భూమండలమున భూమధ్యరేఖ వద్దనున్న వాడును, ధృవములందున్న వాడును, యథార్థమున బరస్పరము 90 డిగ్రీల వ్యత్యాసమున నున్నను, ఊర్ధ్వముగనే నున్నటుల భ్రమించుట లేదా? అటులే భూమధ్యరేఖనైన భూవిష్కంభమున నెదురెదురుగా గల దేశములనున్నవారు 180 డిగ్రీలు తారతమ్యమున నిలచియున్నను, నొకే యూర్ధ్వ దిశను దమ శిరములున్నట్లు

62. Prof. Satischandra Chatterjee : An Introduction to Indian Philosophy, p 447.

భ్రాంతినొందుటయు గలదు. రైలులో ప్రయాణించు పాంథుడు తా నిశ్చలముగ నున్నట్లు భ్రమించుచుండ, అవివేకులు క్షేత్రములనున్న వృక్షాదులు పరుగిడుచున్నట్లు భావించుచున్నారుగదా! కాలిన ఇనుపకాడను దెలియక వాకి, చేతుల గాల్చుకొనినవా రెందరులేరు? ఒకనిని మరొకనిగా భ్రాంతిపడుటలేదా? ఇవన్నియు బ్రత్యక్షములే. ఈ భ్రాంతి ప్రభావమువలన ఉన్నది ఉన్నట్లు కనుపింపక, లేనిది ఉన్నట్లు కనుపించుటచే నింత సంక్షోభము నిత్యజీవితమున నేర్పడుచుండుట సర్వజన విదితము.

ఈ భ్రాంతులు కేవలము సామాన్య జీవితముననేగాక అతి మేధావంతుల రంగమైన భౌతిక విజ్ఞానమునగూడ ప్రత్యక్షము. There are also many optical illusions : a stick plunged in water looks broken; parallel lines separated by others disposed in herringbone formation seem to diverge; white figures appear larger than black figures etc [63] నేత్రభ్రాంతులు అనేకములు గలవు. కొంతవరకు నీట నుంపబడిన పుడక విరిగినట్లు కానుపించును. చేపఎముకల రూపమున ఖండింపబడిన సమానాంతర రేఖలు దూరమగుచున్నట్లు గోచరించును. తెలుపు వర్ణమునగల చిత్తరువులు నల్లని వానికంటె బెద్దవిగ దోచును అనియు, అట్లు స్పర్శజ్ఞానముగూడ నమ్మదగినది గాదనుచు, మధ్యవ్రేలు చూపుడు వ్రేలునకు మధ్య బంతినుంచినచో, రెండు బంతులున్నట్లు భ్రాంతి కలుగుననియు, మొదలగు నెన్నియో భ్రాంతుల లికోటి డు నొయ్ వ్రాసియున్నాడు. భౌతిక విజ్ఞాన

63. Dr. Lecomte du Nouy : Human Destiny, p 16.

రంగమున నన్నినో పూర్వము Gravity ఆకర్షణ శక్తి గ్రహము లకు గలదని Newton న్యూటన్ మొదలైన వేత్తలు భ్రాంతి నొందినట్లు, Einstein ఐన్‌స్టీన్ దీర్మానించెను. పూర్వము కాంతి ప్రసరణోపకరమైన Ether ఈథర్ గలదను పూర్వ భ్రాంతి నాధు నికులు కొందరు నివారించిరి. అంతియగాక నక్షత్రమునుండి వచ్చు కాంతికిరణము Strait line సమానరేఖలో ప్రసరింపక, బృహద్గ్రహ సన్నిధానమున వక్రమై ప్రయాణించుచున్నదనియు, నందుచే మనకు గోచరించు నక్షత్రములు, మనకు గనుపించు స్థానములగాక నన్య స్థానముల నుండియు నీ స్థానముల గోచ రించుచున్నవనియు, ఐన్‌స్టీన్ మొదలగు శాస్త్రజ్ఞుల వివరణము. అందుచే నవి ఉన్నచోట గోచరింపక లేనిచోట గానుపించుచు, ద్రష్టకు భ్రాంతిని గలుగజేయుచున్నవి. విశ్వాంతరాళమున జిన్న మెరుగుడు పురుగులవోలె నగపడు నక్షత్రాదులు, మన భూమండల మునకేగాక అనేకరెట్లు అధిక ఘనత్వముగల సూర్యగోళముకంటె బెద్దవియై యుండియు, జూపరులకు రేణువులవలె భ్రమను గలి గించుచున్నవి. అందు కొన్ని బృహద్విశ్వములు గూడనై యున్నవిగదా! నాటక ప్రదర్శనమునకరిగి, పాత్రాభినయన కౌశల్యము ప్రదర్శించు నటకుల నటకులనుగా గాక నిజమూర్తు లనియే భ్రాంతి జెంది, వారి అభినయ విధానములంనుసరించి హాసదుఃఖాదుల ననుభవించుట సామాన్యమేగదా! అంతకంటె విచిత్రము సినిమా ద్రష్టలకు అనుభూతమేగదా! అచట ప్రత్యక్ష పాత్రలు, నటకులుగూడ నభావము. కేవలము అవనికపై గోచ రించు నీడలజూచి భ్రాంతులై, సుఖదుఃఖముల నా చిత్రములతో ప్రాజ్ఞులుగూడ ననుభవించుచుండుట సామాన్యమే.

కావున common sense cannot be trusted [63] సామాన్య జ్ఞానము విశ్వసనీయముగాదు అని నాయ్ విజ్ఞానవేత్త అనునట్లు, అద్వైతిగూడ 'సోదరా సామాన్య జ్ఞానము వస్తువు యొక్క యథార్థతను జూపింపక, దానితో సరిపోలు మరియొక వస్తువు నట జూపించి, అన్యవస్తు భ్రాంతిని గలుగజేయుచున్నది. జాగ్రత్త' అని హెచ్చరించుచున్నాడు. సామాన్య జ్ఞానముపై నాధారపడి, అదియే యథార్థమని విశ్వసించి, భ్రాంతిపడి దుఃఖి తులు గాకుండ, నా సామాన్య జ్ఞానముకంటె దృఢతరమై, అప్ప టికి గుప్తమై, కృషి గోచరమైన విశేష జ్ఞానము వస్తు సత్యస్వరూ పమును దెల్పి, పూర్వానుభూత భ్రాంతిని బోద్రోలి, ఆనందమును జేకూర్చును అని అద్వైత ప్రబోధ. పై నుదాహరింపబడిన భ్రాం తులన్నియు సామాన్య జ్ఞాన ఫలితములే, విశేషాజ్ఞానజన్యములే. రజ్జు సర్పములయొక్క సామాన్య విషయములైన వక్రత, దీర్ఘత మొదలైన విశేషములకన్యములైన నా రెండింటి విభేదాంశముల గ్రహించినచో, అనగ త్రాటియందు సర్పమునకుండవలసిన చేత నత్వమేది? తల తోకలేవి? మొదలగు విశేషములచే త్రాడు పాముకాదను జ్ఞానమేర్పడునుగాని అది దండమని మాలయని యితర భ్రాంతుల కవకాశమేర్పడును. కాన రజ్జువుయొక్క విశేషజ్ఞానాం శములైన పురి, రంగు మొదలైన విషయగ్రహణమున యథా ర్థము బయటపడి, త్రాటి నిజతత్త్వము బోధపడి, మరల భ్రాంతి కారణము కాకపోవునని అద్వైత విచారణము. అట్లు నిత్యజీవి తమున ప్రతి వస్తువుయొక్క బాహ్య లక్షణ వీక్షణముచే భ్రాంతి

---

63. Dr. Lecomte du Nouy : Human Destiny, p 16.

నొందక, ఆ వస్తుత్వ పరీక్ష గావించి జ్ఞానము నార్జింప అద్వైతి హెచ్చరిక. అట్లు కేవలము నేత్రేంద్రియజన్య జ్ఞానముననేగాక, ఇతర ధీంద్రియపంచకజన్య జ్ఞానమునగూడ నిట్టి భ్రాంతులేర్పడు ననియు, నందుచే జాగ్రత్తవహింపవలయుననియు అద్వైతబోధ.

ఈ విధముగ నద్వైతశాస్త్రము, అధునాతన భౌతిక విజ్ఞాన మునగల రహస్యములగూడ నాడే క్రోడీకరించి, నిరూపించి యుండుట గ్రాహ్యము. we can only see Nature blurred by the clouds of dust we ourselves make 64 మనమే నిర్మించిన ధూళి మేఘములచే గళంకితము చేయబడిన ప్రకృతినిమాత్రమే, మనమే జూడగలుగుచున్నామని ప్రఖ్యాత భౌతిక శాస్త్రవేత్త సర్ జేమ్సు జీన్సు హెచ్చరించును. Thins are not what they seem 65 మనము గోచరించునట్లు వస్తువులు యథార్థముగ నుండవు అనియు దెలిపి, The appeal of the new Physics to probabilities may merely cloak its ignorance of the true machanism of Nature 66 నవీన భౌతిక విజ్ఞానముయొక్క అనిర్ధారణ వాదములు ప్రకృతి యంత్రాంగముయొక్క సత్యత్వమును గూర్చి, దానిని గూర్చిన అజ్ఞానమునే సూచించుననియు వ్రాక్రుచ్చి ఆధునిక భౌతిక విజ్ఞానమున The Principle of Uncertainty అనిశ్చయ సిద్ధాంతము, The Principle of Identer-

---

64. Sir James Jeans : The New Background of Science, Prabuddha Bharata, 1954 p 349.
65. Sir James Jeans : The Mysterious Universe, p 111.
66. Sir James Jeans : The Mysterious Universe, p 19.

minacy అనిర్ధారణ సూత్రముల సూచించినట్లు, దానియొక్క అవధులు వ్యక్తపరచెను. కావున వివేకానందుడు గట్టిగా వక్కాణించినట్లు Thus we see that the religion of the Vedanta can satisfy the demands of the scientific world 67 వేదాంత సిద్ధాంతము, భౌతికవిజ్ఞాన ప్రపంచము యొక్క సమస్యలను దృప్తిపరుపగలుగునని మనము గ్రహింపగలము అనియు, It seems to us, and to all who care to know, that the conclusions of modern science are the very conclusions of the Vedanta reached ages ago, only in modern science they are written in the language of matter 68 మనకు గ్రహించుకొన నిచ్ఛయున్నవారికి గూడ, కొన్ని యుగముల పూర్వమే వేదాంతముచే నిశ్చయింపబడిన నిర్ణయములే ఆధునిక భౌతిక విజ్ఞానముయొక్క నిర్ణయములనియు, గాని నేటి భౌతిక శాస్త్రము వాని ప్రాకృతిక భాషలో రచించినదనియు దెలియగలదని తెలిపియున్నాను. Science has metaphysical implications, but they have to be brought out through reflection upon its method and not speculating upon its results. They, when thus recovered, will be found to be not much different from the tenets of perennial philosophy.... 69 భౌతికవిజ్ఞానమునకు దార్త్వికి అన్వయములు గలవుకాని, నూహాగానము జేయక, విధానములపై యోచనల సల్పి, వానిని బహి

76. Swami Vivekananda : The Complete Works, vol. 1, p 373.
68. Swami Vivekananda : The Complete Works, vol. 3, p 422.
69. Dr Prava sJivan Choudary : Prabuddha Bharata, 1955, p 63

గ్గతమొనరింపవలెను. అట్లు వాని నుద్ధరింపగా నవి నిత్యస్రవంతి యగు తత్త్వశాస్త్రమునకు అన్యములు గావని దెలియగలదు అనియు, డాక్టరు ప్రవాస్ జీవన్ చౌదరి వ్రాసియున్నాడు.

విశాలదృష్టి బరికించుచో, బూర్వ అద్వైతాచార్యులు తీర్మా నించినట్లు, 'ఏకమేవాద్వితీయం బ్రహ్మ' సజాతీయ విజాతీయ స్వగత విభేదరహితమైన వస్తువు, 'సదేవ సోమ్యేదమగ్ర ఆసీత్' అనునట్లు సృష్టికి బూర్వము సద్వస్తువొక్కటియే ప్రథమమున గల దనియు, దానినుండి 'బహుస్యాం ప్రజాయేయ' నానాత్వ సంకల్ప మనిర్వచనీయముగ నుప్పతిల్లగా, 'ఆత్మనః ఆకాశస్సంభూతః ఆకాశాద్వాయుః - - -' అనురీతి ఆత్మనుండి ఆకాశాది పంచ మహాభూతములుద్భవించినట్లును, మరల ప్రళయకాలముల నా యా భూతములు తమ కారణముల లయింప, సర్వము పరబ్రహ్మము నందు లీనమై పోవుననియు శాస్త్రతాత్పర్యము. అనగా యీ నానాత్వమునకు ఆధారము, అధిష్ఠానము తొలికారణము ఏక త్వమే. అటులే అంత్యమునగూడ యీ నానాత్వము ఏకీభూతమై, 'యథా నద్యః స్యందమానాః సముద్రేస్తం గచ్ఛంతి నామరూపే విహాయ' ప్రవహించుచు నామరూపముల ద్యజించి, సముద్ర మున నదులు లయించినట్లు యీ నానాత్వసర్వము ఏకత్వమున నభేదవిధముగ లయించునని అద్వైత సిద్ధాంత మతము. ఈ విష యమునే రవీంద్రనాధుడు తన సాధన గ్రంథములో బ్రస్తావించి,

The fundamental unity of creation was not simply a philosophical speculation for India, it was her life-object to realise great harmony in

feeling and in action 70 సృష్టియొక్క ఏకత్వము కేవలము తాత్త్విక విచారణార్థమేగాక, భారతదేశమున నది కర్మ, లలితభావములందుగూడ జీవితాదర్శముగ నుండును అని వచించి యున్నాడు. అందుచే వేదాంత శ్రవణాదులు, కేవలము బుద్ధి వ్యవసాయమునకుగాక గార్యరంగ జీవితమునగూడ నన్వయింప భారతీయులు వెనుకాడరైరి. అందుచే వారి పరమశాస్త్రమగు అద్వైతము దానికే ఎక్కువ ప్రాధాన్యము నొసంగియున్నది. Vedanta should be studied with the view of reducing the multiplicity of theworld-process to unity 71 నానాత్వముగ నున్న ప్రపంచ విధానమును ఏకమొన రించు దృష్టితో, వేదాంత పఠనము గావింపవలయునని గర్గ్య యానాచార్యుడు ప్రణవవాద గ్రంథమున వచించియున్నాడు. అటులే వివేకానందస్వామి You must always remember that the one central idea of Vedanta is this Oneness. Everything is that One. the difference is in degree and not in kind. 72 వేదాంతమునగల మూలసూత్రము యీ ఏకత్వమే యని జ్ఞాపకముంచుకొనుడు. సర్వము ఆ ఒక్కటియే. భేదము వస్తుత్వమునగాక బరిణామమున మాత్రమే యని వివరించియున్నాడు. ఎన్ని విభేదములు పర స్పరమున్నను, there is in all philosophy ONE 73 సకల తత్త్వశాస్త్రములలో నా ఏకత్వమే గోచరమై, సర్వము

---

70. Dr. Rabindranath Tagore : Sadhana, p 7.

71. Dr. Babu Bhagavandas : Pranava Veda, vol. 2, p 137.

72. Swami Vivekananda : The Complete Works, vol. 2, p 295.

73. Karl Jaspers : Way of Wisdom, p 15.

నాకర్షించుచున్నదని కార్ల్ జస్పర్స్ వచించియున్నాడు. ఈ విధముగ, ప్రత్యేకముగ సర్వ తత్త్వశాస్త్రములకు శిరోమణియైన అద్వైతశాస్త్రము, ఆ ఏకత్వమును దృష్టినుంచుకొనుటయేగాక యనేక ఉదాహరణములచే నీ నానాత్వ భంజనము గావించి, దాని క్లిష్టత్వమును భేదించి, సర్వాధిష్ఠానమైన ఏకత్వమునే బహిర్గత మొనరించి మానవున కందించెను.

అదే విధానమున వేదాంతము, అనంతాఖండవిశ్వమున నంతర్గత తత్త్వమును గ్రహించి, అది మానవునకు లోనున్న జీవ చైతన్యమే యని నిరూపింప, మానవుని అంతర్దృష్టులుప యుక్తము జేయు, పాశ్చాత్య ఖండమున నిటీవల బాహ్య ప్రకృతిచే మానవుడాకర్షింపబడి, తనకన్యముగ నున్న స్థూలప్రపంచ గత రహస్యముల నన్వేషించి, దానియందిమిడియున్న ఏకత్వమును గ్రహింప నుద్యమించెను.అదియే భౌతిక విజ్ఞానశాస్త్రముగ రూపొంది యున్నది. నాటి సర్వశాస్త్రాధ్యయన పారీణుడైన వివేకానందుడు భౌతిక శాస్త్ర తాత్పర్యమును దెలుపుచు Science has proved to me that physical individuality is a delusion, that really my body is one little continously changing body in an unbroken ocean of matter and Advaitism (unity) is the necessary conclusion with my other part, Soul [74] నా శరీరము అనవచ్ఛిన్నమైన ప్రకృతి సాగరమున, సంతత వికారభూయిష్టమైన అల్పవస్తువనియు, గాన నా భౌతిక వ్యక్తిత్వ మొక భ్రాంతి యనియు, దానితో నాయందు రెండవ భాగమైన

74. Swami Vivekananda : The Complete Works, vol 2, p 295.

ఆత్మతో, దాని యద్వైతము అనగా నేకత్వము సిద్ధింపవలెననియు భౌతికశాస్త్రము నాకు నిరూపించియున్నదని పాశ్చాత్య ఖండమున ఉపన్యసించియున్నాడు. మరియొకచోట Science is nothing but finding unity. As soon as science would reach perpect unity, it would stop from future progress, because it would reach the goal [74] భౌతికశాస్త్రమన ఏకతాన్వేషణమే యగును. ఆ శాస్త్రము సంపూర్ణ ఏకత్వము నందుకొనినప్పుడు, అది గమ్యము నందుకొనును గావున నిక ముందుకు గమనింపదు అని వచించియున్నాడు. When the scientific teacher asserts that all things are the manifestations of one force does it not remind you of the God of whom you hear in the Upanishads?[75] భౌతిక విజ్ఞానాచార్యుడు సర్వపదార్థములు లోకశక్తియొక్క మూర్తిమంతములని వక్కాణింప, నుపనిషత్తులలో నీవు వినిన బ్రహ్మముస్మృతికి వచ్చుట లేదా? యనియు వివేకానందుని సూటి ప్రశ్న. సర్వము ఏకమునుండియే జనితమను భావము చాల ప్రాచీనమని సమ్మతించి, కాని నేడు ఆ ఏకత్వము కేవల మూహగగాక, విశ్వాసముగగాక, but as a principle of science based on proof as shorp and clear as anything which is known [76] విస్పష్టలీల దెలియబడినవానివలెనది సునిశిత విస్పష్ట

---

74. Swami Vivekananda : The Complete Works, vol. 1, p 12.
75. Swami Vivekananda : The Complete Works, vol. 2, p 140.
76. Karl K. Darrow : Renaissance of Physics, Discovery of India of Nehru, p 16.

నిరూపణములపై నాధారపడు భౌతిక విజ్ఞానసూత్రముగ దెలియ బడినదిగ, కార్ల్ కె. డారో అను భౌతికవేత్తయొక్క గంభీర వచనము. అనగా, భౌతికశాస్త్ర తాత్పర్యముగూడ ఏకత్వాన్వేషణమే. యని పై వాక్యములచే నిరూపితము.

ఈ విషయమును, తన వివరణసహితమగు చక్కని వ్యాసమున జగదీశ సాహ విశదీకరించుచు [77] వేదాంతమున ఆత్మ ముఖ్యమై, తజ్జనితముగ సర్వవిశ్వము ఏర్పడుచున్నదగుటచే జేతనాచేతనముల ఏకత్వము ఏర్పడుచున్నది. అనగా అచేతము చేతనజన్యమగుటకు అవకాశము గలుగుచున్నది. కాని పాశ్చాత్య ఖండ ప్రబోధిత భౌతికశాస్త్రమున ద్రష్టృ దృశ్యముల కెడబాటు లట్లేయుండి, వాని ఏకత్వస్ఫురణమెందును గానరాకయున్నది. ప్రకృతి శాస్త్రము Natural Science అను నొకటి ఏర్పడి Astronomy భూగోళ శాస్త్రము, Meteorology అంతరిక్ష శాస్త్రము, Geology భూతత్త్వ శాస్త్రము, Physics భౌతిక శాస్త్రము Chemistry రసాయన శాస్త్రము, Biology జీవతత్త్వ శాస్త్రములుగ వివిధముగ రూపొంది, అమానుషలీల బరిశోధన గావింపబడియున్నది. ఈ యనంత సృష్టికి ఆధారము మనకు బ్రస్తుతము వ్యక్తమైన పదార్థములుగాక, వానికాధారమైన Hydroged ఉదజని యని, దానిమూలమున 92 పదార్థములు ఏర్పడినవనియు, తద్వికారమే ప్రకృతి యనియు, నీ ప్రకృతి శాస్త్రము 400 సంవత్సరముల కృషిచే గనుగొనెను. ఈ పదార్థములు నశింపని పదార్థములచే, నవి నశింపక మార్పుచెందు

77. Prof. Jagadish Saha : Prabuddha Bharaa. 1954, p 342.

చుండును. విశ్వవ్యాప్తమై దాని గుణముల నందజేయని ఒక నిగూఢ పదార్థము తనలో నంతర్గతముగనున్న, ఒక విధమైన ఆకర్షణశక్తికి లోబడి, విశ్వాంతరాళమున గొప్ప వాయుమేఘ రూపము Galaxies నొంది, మరల నా శక్తి ప్రేరితమై, భ్రమణమును బొంది దిరుగుచు, అధికోష్ణత్వమునుండి శీతలమగుచు, క్రమముగ సూర్య చంద్ర భూమ్యాధిక అసంఖ్యాక గోళాకృతుల సృజించినది. ఆ గోళములో భూగోళమున జీవరాసులనేకములు ఏర్పడినవి. ఎట్లో యింకను ప్రకృతిశాస్త్రమునకగ్రాహ్యము.

కాని, యీ ప్రకృతిపదార్థమెందుండి జనితము అనునది ప్రశ్న. దానినొక ఆధారక పదార్థముండునని భౌతిక శాస్త్రము అది సూక్ష్మాతిసూక్ష్మమై, ప్రస్తుత భౌతికశాస్త్రోపకరణములకందని గుణములుగల రేణువులచే నిర్మితమనియు దాని వాదము. అనియు Proton, Newtron, Electron ప్రోటాన్, న్యూట్రాన్, ఎలెట్రాన్ అను శక్తిబీజములచే నిర్మితములు. అత్యంత దూరమున గల ప్రవాహరూపశక్తి, కాలగతమున ప్రకృతిపదార్థమై, ప్రస్తుత శక్తి ప్రకృతుల మేళన మేర్పడి విశ్వమైనట్లు తాత్పర్యము. ఈ విధమున నొక కాలమునగల శక్తి, ప్రకృతిపదార్థమగునున్నదని యీ శాస్త్రము యొక్క విశ్వాసము. దీనినే Matter-Energy-tensor ప్రకృతి-శక్తి మేళనము అని Eddington ఎడ్డింగ్టన్ వచించియున్నాడు, ప్రస్తుత శాస్త్రగోచరమైన శక్తి వివిధమై, Heat ఉష్ణము, Light కాంతి Electricity విద్యుచ్ఛక్తి, Magnetism గురుత్వాకర్షణశక్తి, Sound శబ్దములుగ నున్నవి. ఈ శక్తులు విశ్వాంతరాళమున నతివేగముగ బయనించు

చుండును. ఈ శక్తులన్నియు విభిన్నములుగాక, పరస్పరాపే క్షికములై విశ్వమున నెన్ని మార్పులుప్పతిల్లినను ఏకముగనే యుండుచు, దమ నిర్వికారతను బ్రకటించుచున్నవి. ఇట్లు ప్రకృతిలో వ్యక్తమయిన నీ శక్తులు అన్యములుగాక నొక్కటియే యనియు, బ్రకృతిలో సర్వము సంతత స్పందనములతో నుండు ననియు, నా స్పందనా విభేదముచే నా యా శక్తులుత్పన్నమైన వనియు, గాన నవి వస్తుతః విభిన్నములుగాక స్పందన భేద మును మాత్రము గలిగి, గుణభేదమున వ్యక్తమగుచున్నవనియు ఆచార్య ఐన్‌స్టీన్ విశ్వసించి, Unified Field Theory ఏకత్వ సిద్ధాంతమును ప్రతిపాదించి, తన్నిరూపణమునకై శ్రమించెను. పదార్థము శక్తియే యని గ్రహించి, ఆ శక్తి ఆ పదార్థము యొక్క Weight భారమును కాంతికిరణవేగముతో (సెకనుకు 1,86,243 మై) గుణించిన, నా పదార్థముయొక్క శక్తి గోచర మనియు నాతడు వివరించి, శక్తి పదార్థములకభేదమును బ్రద ర్శించి, యా పదార్థములగల శక్తియు Gravitational force గురుత్వాకర్షణశక్తియు నొక్కటియే వస్తుత్వమున గలవనియు వివరించి, ఐన్‌స్టీన్ పదార్థ శక్తులను, దేశ కాలములను, ఆకర్షణ జడత్వశక్తులను ఏకముగ గ్రహించి, Electro-magnetism విద్యుదయస్కాంత సమన్వయము గావించెను. ఆకర్షణశక్తి విశ్వాంతరాళగ్రహముల బాలింప, విద్యుదయస్కాంత శక్తులు పదార్థమునకన్వయము. ఇట్లు ఐన్‌స్టీన్ మొదలగు శేముషీదురం ధరుల ప్రజ్ఞావిశేషముచే భౌతిక విజ్ఞానలక్ష్యము, తత్త్వశాస్త్ర ముతోబాటు ఏకత్వము నందుకొన యత్నించుచున్నదనుట విది తము. కాని యింకను, యీ జడ ప్రకృతి కాధారమగు ప్రత్యక్ష

శక్తులును చేతనములుగాక, మరొక చేతన సహాయమున నడుప బడుచుండుటచే. వీనికంతటి కాధారమైన, Unified Field Theory ఏకత్వ సిద్ధాంత గమ్యమైన నా ఆద్యశక్తియు, స్వతంత్రము కాదేమో యను సందియముల విజ్ఞులకేర్పడక తప్పదు. ఆద్యశక్తి అనుటతోడనే, తత్త్వశాస్త్రము స్ఫురించుట న్యాయమే. ఆ శక్తినే సాంఖ్యులు ప్రధానమని మూలప్రకృతియనియు బిలిచి, దానికి స్వాతంత్ర్యమొసంగి, పురుషాధీనముగాక సృష్టి గావించునని భావింప; నందును జడ చైతన్యముల ఏకత్వము అభావమగుటచే నద్వైతము దాని మాయగ రూపొందించి, బ్రహ్మాధీన శక్తిగనే చిత్రించి, అస్వతంత్రను గావించి, దానికి ప్రత్యేకత నొసంగక, బ్రహ్మమునకన్యము గానిదానిగజేసి, బ్రహ్మ మాయల నేకత్వ ప్రదర్శనమున జడ చైతన్యముల నేకత్వమును అద్భుత లీల గావించి, ప్రస్తుత భౌతిక శాస్త్రమునకాదర్శమును వ్యక్తము గావించినది. Just as the scientist's ultimate is mass-and-energy and not exclusively either one or the other or a third something and just as we cannot make either mass or energy basic, both being found together and mutually convertible; even so Maya is mass-energy consciousness and not one of them nor a fourth, none of them being basic and all mutually convertible according to definite laws [78] పదార్థశక్తులే భౌతిక శాస్త్రముయొక్క గమ్యమై, ప్రత్యేకముగ యొక్కటియుగాని

78. Editor: Prabuddha Bharata, 1955, p 280.

గాక, మరియొక మూడవ పదార్థముగూడ, గాకయున్నదో, మరి రెండును ఏకస్థలముగ నుండుచు, బరస్పరమైన మార్పునకు అవకాశమిచ్చుచుండుటచే, నెట్లు పదార్థమునుగాని కేవలము శక్తిని గాని ప్రత్యేకము సర్వాధారముగ జేయజాలమో, అటులే మాయ-ప్రకృతి-శక్తి-ప్రజ్ఞయై వానిలో నే యొక్కటియుగాక నొప్పారు చున్నదని ప్రబుద్ధ భారత సంపాదకుని వివరణము. అందుచేతనే సుప్రసిద్ధ ఆధునిక భౌతిక విజ్ఞానశాస్త్ర వ్యాఖ్యాతయైన ఎల్. బార్నెట్, భౌతిక విజ్ఞాన శాస్త్రమును, తత్త్వశాస్త్రమును బరిశీలనాబుద్ధి జూచి, Thus gradually philosophers and scientists arrived at the startling conclusion that since every object is simply the sum of its qualities, and since qualities exist only in the mind, the whole objective universe of matter and energy, atoms and stars, does not exist except as a construction of the consciousness, an edifice of conventional symbols shaped by the senses of man 79 సర్వవస్తువు గుణసముదాయముగాక, ఆ గుణములైనను చిత్తముననే యుండుటచే, నీ సకల దృశ్యమాన జగత్తు అనగా ప్రకృతి-శక్తి, అణు నక్షత్రములు అన్నియు మానవుని యింద్రియములచే నిర్మింపబడిన సాంకేతిక రూపములవోలె చిత్తనిర్మాణములకన్యములుగ లేవను ఆశ్చర్యకర తీర్మానమునకు దత్త్వవేత్తలు, భౌతికశాస్త్రవేత్తలు, క్రమముగా నేతెంచిరి అని వ్రాసియున్నాడు. ఇదంతయు నద్వైతశాస్త్ర ప్రభావమేగదా !

79. Lincon Barnett : The Universe and Dr. Einstein, p 21.

Let him (man) above all never forget that the divine spark is in him, in him alone [80] దివ్య జ్యోతి రేణువు తనలో నున్నదని మానవుడు మరువకుండునుగాక అనియు, నాయ్ మానవుని హెచ్చరించియున్నాడు.

ఈ విధముగ నే దృష్టి గాచినను అద్వైతసిద్ధాంతము, అత్యాధునిక భౌతిక విజ్ఞాన రహస్యములకనుగుణరూపమై చెల్వొందుటయేగాక, నింకను నా యా శాస్త్రములు గ్రహింపవలయునని కృషి చేయుచున్న యనేకరహస్యముల నది యూర్వమే వెలిబుచ్చి, యింకను భౌతిక శాస్త్రమునకు అతీతమైన కేవల పరమాత్మ విషయములగూడ వ్యక్తపరచి, తనను బ్రిస్తుతమునకు ద్రోసిరాజనిన భౌతిక శాస్త్రమునకందరాని నిలచియుండుట గమనార్హము. దాని తీర్మానము అజేయములు. అకుంఠితములు. అసమానములు. సర్వాదర్శములు. దాని వేదికముందు, గర్వాహంకారముల ప్రదర్శించు భౌతికవిజ్ఞాన కన్యకయు జోహారులర్పింపక గత్యంతరము కానరాదు. అద్వైతశాస్త్రమునే చుక్కానిగ స్వీకరించి,ఆభౌతికవిజ్ఞాన శాస్త్రము తన పరిశోధనల సాగించుచో, నింతవరకు దనకందరాక దూరముగనున్న ఎన్నియో రహస్యములు తనకు స్వాధీనమగును. అందుచే నిక నీ అద్వైతశాస్త్ర రహస్యములు సర్వమానవులకు మార్గదర్శకములుగ నుండుగాక! అట్టి మహదవకాశమును ఎల్లరు స్వీకరించి, కృతకృత్యులగుదురు అని విశ్వసించెదము.

---

80. Dr. Lecomte du Nouy : Human Destiny, p 189.

# అద్వైతము-నైతిక ధర్మము-సంఘము

పై బేర్కొనబడిన విధమున సర్వవిధ సమన్వయముగావించి, మానవ జీవన పద్ధతియందు అంతర్లీనమయిన అద్వైత సిద్ధాంతము, నైతిక ధర్మమునుగూర్చి ఏమనును? 'సర్వం ఖల్విదం బ్రహ్మ' (ఛాం.3.14 1) ఇదియంతయు బ్రహ్మమే యనియు, 'అహం బ్రహ్మాస్మి' నేనే బ్రహ్మము అనియు ప్రజ్ఞాపూర్వక వచనములు బలుకుచు, సాంఘిక జీవితమున సక్రమ పద్ధతికి భంగముగ ప్రవర్తించునా? యను విషయమున నపోహ జనింపగలదు. కాని ఆ వాక్యముల కేవలము గ్రంథములనుండి సేకరించి, వాచాలత్వమున నుచ్చరితమా? లేక వాని నపరోక్షము కావించి, హృదయాంతరాళమున దదనుభూతి బ్రథమతః గాంచి, 'సర్వం ఆత్మైవాభూత్' (బృ. 2. 4. 14) అంతయు నాత్మగాగ, 'ఏకత్వమనుపశ్యతః' (వరాహ. 4) ఏకత్వమునే గాంచుచు, 'యద్యత్ పశ్యతి చక్షుభ్యాం తత్తదత్మేతి భావయేత్। యద్యచ్ఛృణోతి కర్ణాభ్యాం తత్తదాత్మేతి భావయేత్ -- ' (యోగతత్త్వ. 71) మంత్రార్థము ప్రకారము చూచునదంతయు, వినునదంతయు, ఆత్మపదార్థముగ గాంచుచు, 'సర్వం ఖల్విదం బ్రహ్మ' 'అహం బ్రహ్మాస్మి' అనుచున్నాడా అనునది మీమాంస్యము. కాన నట్టి వాచాలాద్వైతుల నుదాహరించి, శాస్త్రమునంతటిని ఖండించుట సముచితము కాదు. అద్వైతతత్త్వార్థ జిజ్ఞాసువు అయినవాడు, 'పరీక్ష్యలోకాన్ కర్మచితాన్ బ్రాహ్మణో నిర్వేదమాయాత్ నాస్త్యకృతః కృతేన। తద్విజ్ఞానార్థం స గురుమేవాభిగచ్ఛేత్ --- ' (ముం. 1. 12) కర్మ ఫలితములైన పరలోకముల బరీక్షించి సర్వము కర్మ ఫలితములే

గాన, గల్పితములు గాని వేనియు లేవని యోచించి, త్యజించి, అస్పష్టమైన దాని గ్రహించుకొనుటకు గురు సన్నిధానమును జేరును అనియు దెల్పుచు, గురులక్షణములుగ 'శ్రోత్రియం బ్రహ్మనిష్ఠం' (ముం. 1. 12) వేదార్థజ్ఞానము, బ్రహ్మనిష్ఠయు గల వాడై యుండవలెని సూచించుచు, శిష్యలక్షణముల 'ప్రశాంత చిత్తాయ శమాన్వితాయ' (ముం. 1. 13) అని శ్రుతి నిర్దేశించి యున్నది. అటులే 'శాంతో౽ దాంతో౽ పరతి స్తితిక్షు స్సమాహితో భూత్' (సుబాల. 9; బృ. 4.4.23) శమాది షట్కసంపత్తి యవసర మనియు శ్రుతి ఆదేశము. ఈ విద్యను 'నాప్రశాంతాయ దాతవ్యం' (సుబాల. 16) ప్రశాంతి లేనివానికి, దపస్సులేనివానికి బోధింప రాదనిగూఢ శ్రుతి హెచ్చరిక. 'నావిరతో దుశ్చరితాన్నాశాంతో నాసమాహితః' (కఠ. 2.24) దుశ్చరితమునుండి వైదొలగనివాడు, శాంతుడుకానివాడు, సమాహితత్త్వము కుదరనివాడు, 'జితేంద్రియాయ, శమదమాది షడ్గుణపూర్ణాయ' (అద్వయతారక) జితేంద్రియునికొరకు, శమాదిషడ్గుణ పూర్ణునికొరకు, 'సాత్వికాయాంతర్ముఖాయ' (మహావాక్య. 2) 'నాస్తికాయ కృతఘ్నాయ దురాచార రతాయ వై' (ముక్తిక. 1. 47) నాస్తికునికొరకు, కృతఘ్నుని కొరకు దురాచారపరునికొరకును కాదు; 'అసూయకాయా నృజవే శఠాయ మా మాం బ్రూయా - - -' (ముక్తిక. 1. 51) అసూయాగ్రస్తునికి, కుటిలునికి, వంచకునికి నన్ను దెలుపకుము, అని యుపనిషత్తులు ఈ అధ్యాత్మ విద్యా గ్రహణాధికారి అర్హతలను గడు జాగ్రతగ విచారించి యుంచినవి. వీని ననుసరించియే వేదాంతసూత్ర కర్తయైన వ్యాసభగవానుడు, నైతికధర్మముపై ఆధ్యాత్మికధర్మమాధారపడుట గ్రహించి, తన సూత్రముల ముఖ

ద్వారముననే 'మోక్షద్వారే ద్వారపాలాశ్చత్వారః పరికీర్తితాః।
శమో విచారస్సంతోషశ్చతుర్థః సాధుసంగమః॥' (మహా. 4. 2)
మోక్షద్వారమున, శమ విచార సంతోష సాధుసాంగత్యములనెడు నలుగురు ద్వారపాలకులున్నట్లు తెలుపు వాక్యాధారముగ నన్నటుల 'తథాతో బ్రహ్మ జిజ్ఞాసా' (1. 1. 1) అనుచు, 'అథ' అనగా శమాదిక సాధనసంపత్తిగల్గిన పిమ్మట, బ్రహజిజ్ఞాస కర్తవ్యముగ హెచ్చరిక జేసియున్నాడు. అనగా నీ అద్వైత మార్గముననేగాక ఆధ్యాత్మిక మార్గమున బ్రవేశించుటకుకూడ, ప్రథమమున వచింపబడినట్లు త్రివిధ సంస్కృతులలో లౌకిక, ధార్మిక, సంస్కృతులలోగూడ బరిపూర్ణత్వము నొందినకాని అవకాశము గలుగనేరదని స్పష్టముగ శ్రుతులుద్ఘోషించియున్నవి. అనగా నద్వైతానుభూతి గలుగవలె ననుచో నెట్టి కళంకము లేనివానికే సాధ్యముగాని, సామాన్యముగాదు అని గ్రాహ్యము. అనగ, ప్రథమమున దమోగుణనిమగ్నుడై, పశుత్వమున నున్న మానవుడు, నైతిక ధర్మము ద్వారా మానవుడై, తర్వాత అధ్యాత్మవిద్యాబలమున దైవత్వము నుు బొందవలయునని శ్రుతి తాత్పర్యము. Biologically, man remains as animal. Later on, we shall see that it was necessary, for it is by fighting against his instincts that he humanizes himself [81] జీవశాస్త్రానుసారముగ మానవుడు పశువుగ నుండును. పిమ్మట దాను మానవత్వము నార్జింప, దన స్వభావములతో బోరాట మొనర్చుట యవసరమగుట మనము గాంతుమని లికోటిు నాయ్‌గూడ తెలిపియున్నాడు. Morality is attempt

---

81. Dr. Lecomte du Nouy : Human Destiny, p 84.

to govern the outer conduct by certain mental rules - - -, whereas spirituality is a change into a higher consciousness through the realization of the Divine within and without and making him absolute ruler of life [82] కొన్ని మానసిక నియమములచే, బాహ్య వర్తనమును నియమబద్ధమొనర్చు ప్రయత్నము నీతి యగును. బాహ్యాభ్యంతరములగల పరమాత్మను అనుభూతిలో గ్రహించి, అతనిని జీవితాధినేతగ గావించి, ఉన్నత ప్రజ్ఞాస్థానమునందుండుట పారమార్థిక మని శిశిర్‌కుమార్ మిత్ర వివరించియున్నాడు. దాని సంకను వివరించుచు, ఇమాన్యూల్ కాంటు అను పాశ్చాత్య తత్త్వవేత్తలలో నగ్రగణ్యుడు, Placing of duty above beauty, of morality above happiness; but only so can we cease to be beasts, and begin to be gods [83] అందమునకుకంటె గర్తవ్యమునకు, సుఖమునకంటె నీతిసూత్రమునకు ప్రాధాన్య మొసంగుటచే మనము పశుత్వమును బాసి, దేవతలగుటకు ప్రారంభించెదమని వాకొనియున్నాడు. నైతికమన నెద్ది అని వివరించుచు నాతడే, Morality is not properly the doctrine of how we may make ourselves happy, but how we may make ourselves worthy of happiness [83] మనము సౌఖ్యవంతులముగ నగుట ఎటులా అనునదిగాక, సౌఖ్యమునకు మనమర్హులముగ నెట్లు అగుచున్నామనునదియే నీతి అని

82. Prof. Sisir Kumar Mitra : The Vision of India, p 247.

83. Immanuel Kant : The Story of Philosophy, of Will Duarant, p 277.

వక్కాణించెను. అందుచేత నొక్కొక్కప్పుడు అతి తెలివి, నైతిక పతనము గావించుచుండును గాన It would be better to abandon our-rapid development of the intellect, and to aim rather at training the heart and the affections 84 మన అతి శీఘ్ర మేధావృద్ధి నిసుమంత త్యజించి హృదయము అనురాగాదిక గుణములలో శిక్షణము నొంద యత్నించుట ఉచితము అనియు నొక్కి వక్కాణించియున్నాడు. అదియే గదా మానవ ధర్మము! కావున To be a philosopher, is not merely to have subtle thoughts, - - -but to love wisdom, as to live, according to its dictates, a life of simplicity, independence, magnanimity and trust 85 తత్త్వవేత్త యగుట యనగా గొన్ని సూక్ష్మ భావముల గలిగియుండుటకాక, వివేకమును ప్రేమించి, దాని ప్రబోధననుసరించుచు, నిరాడంబర స్వతంత్ర దయార్ద్రి విశ్వసనీయ జీవితమును నడుపుటయే యనియు మరియొక సుప్రసిద్ధ తత్త్వవేత్త యగు థోరు వాక్యము. Philosophy as a human pursuit ought to be - - - an illuminating vision of truth which - prompts to self-culture and social service 86 మానవాన్వేషణరూప తత్త్వ శాస్త్ర మనగా, ఆత్మజ్ఞాన సంఘసేవాసక్తుల గలుగజేయునదిగా నుండునని ఆచార్య ఎ. ఆర్. వాడియా పండితుడు గూడ వివరించి

---

83. Immanuel Kant : The Story of Philosophy, of Will Duarant, p 260.

85. Thoreau : The Story of Philosophy, Will Dnarant, p xxvi.

86. Prof. A. R. Wadia A Peop into Centemporary Philosophy.

యున్నాడు. అవును 'ఆత్మనో మోక్షార్థం జగద్ధితాయ చ' తన మోక్షముకొరకును, జగత్తుయొక్క క్షేమము కొరకు అనిగదా ఆర్య సూక్తి. అట్లు తత్త్వవిచారణయు, నిత్యజీవిత విధానము రెండును ఏకత్రాటి మేళవించి, యెప్పుడు రూపొందునో అప్పుడే that makes religion alive and real[87] మతము సజీవమై సత్యమై యొప్పారునని, పండిత రాధాకృష్ణుని వచనము. తత్త్వశాస్త్రము కేవలము విషయ గ్రహణమునుమాత్రమేగాక is essentially creative in the sense of transforming of life[88] జీవితమునందు పరివర్తనమును గలుగజేయుటయందు, ముఖ్యముగ సృజనాత్మకశక్తి గలిగినదై యుండవలయుననియు నాతని హితోక్తి. యథార్థమున నాలోచించుచో To know the Self means to be in love and friendship with all men, all creatures, all the world, because it means the experience of inner sameness of all. For the sake of Self itself, everyone should be in love with love all others, since these others are the embodiments of the same Self[89] ఆత్మజ్ఞానమన సర్వమానవులతో, సకల ప్రాణులతో, అఖిల ప్రపంచముతో ప్రేమస్నేహముల నుండుటయే యగును. అది సర్వముతో గల ఆదే అంతరాత్మయొక్క అనుభూతి యని భావముగదా! ఈ ఇతరములన్నియు నాత్మయొక్క మూర్తులే యగుటచే, నాత్మ

---

87. Dr. S. Radhakrishnan : Indian Philosophy, vol. 1, p 26.

88. Dr. S. Radhakrishnan : The Role of Philosophy in Civilization International Philosophical Congress, Harvard.

89. Prof. A. K. Banerjee : Prabuddha Bharata, 1945, p 397.

కొరకుగ సర్వము సకలముపై ప్రేమ గలిగి వర్తింపవలెను. అని, ఎ. కె. బెనర్జీ సత్యమును వెలిబుచ్చియున్నాడు. అద్వైతాత్పర్యముగూడ నదియే గదా!

ఈ పరమార్థమును గ్రహించిన ఆర్ష తత్త్వజ్ఞులు, పూర్వోక్తమురీతి ఆధ్యాత్మిక పథమున బ్రవేశించుటకే యిన్ని నిబంధనముల గావించియున్నటుల విదితముగదా! అందుచే బ్రవేశమునకు బూర్వమే కొంత సాధించియున్న శిష్యునికి 'మన ఏవ మనుష్యాణాం కారణం బంధ మోక్షయోః। బంధాయ విషయాసక్తం ముక్త్యైర్నిర్విషయం స్మృతం॥' (మైత్రాయణి.4.4.11) మానవులకు మనస్సే బంధమోక్షములకు గారణము. విషయలాలసత్వమే బంధము, నిర్విషయత్వమే మోక్షముగ చెప్పబడునని, మనో ప్రాముఖ్యమును దాని స్వభావమును, 'మనో హి ద్వివిధం ప్రోక్తం శుద్ధం చాశుద్ధమేవ చ। అశుద్ధం కామసంకల్పం శుద్ధం కామవివర్జితం॥' (కైవల్య. 1) ఆ మనస్సు శుద్ధాశుద్ధరూపమున ద్వివిధము. అందు గామసహితము అశుద్ధము, కామరహితము శుద్ధమని యుపనిషత్తులు బోధించినవి. 'చిత్తమేవ హి సంసారో రోగాది క్లేశదూషితం।' (మహా. 4.66) రోగాదిక్లేశదూషితమైన సంసారము చిత్తమే యనియు, జిత్తముయొక్క సంసార కారణత్వమును గూడ నవి వివరించినవి. కాన నట్టి సంసారహేతువైన, విషయాసక్తమైన చిత్తమును నిరోధించి, దాని కామవివర్జిత మార్గమున నుంచి, నిర్విషయరూప విముక్తి నార్జింప 'త్రయో ధర్మస్కంధా యజ్ఞోఽధ్యయనం దానమితి, ప్రథమస్తప ఏవ, ద్వితీయో బ్రహ్మచర్యాచర్యకులవాసీ తృతీయోఽత్యంతమాత్మాన మాచార్యకులేఽవసాద

యన్ సర్వ ఏతే పుణ్యలోకా భవంతి' (ఛాం. 2. 23. 1) ధర్మము త్రివిధము. యజ్ఞాధ్యయన దానములు ప్రథమము. తపమే ద్వితీయము. ఆచార్యగృహమున నివసించుచు, తపోనిష్ఠనుం డుట తృతీయము. ఇవి యన్నియు పుణ్యలోకప్రాప్తిని, బ్రహ్మ సంస్థితిని గలుగజేయును అని వ్యక్తిగతమైన యజ్ఞాధ్యయన దానములేగాక ఉత్తీర్ణుడైన ఆచార్యసన్నిధానమున అంతేవాసియై, తగు శిక్షణము నొంది, సత్క్రమాచారనిష్ఠాశీలుడై, ఆదర్శ గృహ స్థుడై చెలరారుటకు నీ ధర్మాంగములెంతేని యుపయుక్తము. అట్టి సుశిక్షిత వ్యక్తి సంఘమున ప్రేమదయాన్వితుడై, ఆదర్శ వంతుడై, సంఘోద్ధరణ కార్యదీక్షా దక్షుడై చెలంగును. ఆ యాచార్యకులవాసమున అధ్యాత్మవిద్యా ప్రవేశము నొందిన వాడై, గృహస్థాశ్రమమున ప్రవేశించి, దానియందు పూర్ణస్థితి నొంద యత్నించుచున్నను గృహధర్మముల నాదర్శవంతముగ నిర్వర్తించుచుండును. అట్లాదర్శవంత జీవితమును గొంతకాలము నడిపి, సంఘమును బునీతమొనర్చి, కృతకృత్యుడై, ఆధ్యా త్మికసాధన నతితీవ్రగతి సాగింప దురీయాశ్రమ ప్రవేశమును గావించుట బరిపాటి. కొందరు సంపూర్ణాధికారులు మాత్రము గురుకులవాసానంతరము గృహమున బ్రవేశింపకయే, తురీయా శ్రమమును గౌగిలించెదరు. అయినను, వారు సంఘమునకు అవసరమగు సర్వసద్గుణముల యందు బ్రథములై విరాజిల్లినగాని వారి కా బుద్ధి గలుగుట గష్టసాధ్యమని తజ్ఞులకు విదితము.

అట్లు సంఘమున బ్రవేశించి, గృహస్థాశ్రమస్వీకార మొన రించిన వానిని హెచ్చరించుచు, శాస్త్రము 'తద్య ఇహ రమణీయ

చరణా అభ్యాసో హ యత్తే రమణీయాం యోని మాపద్యేరన్ బ్రాహ్మణయోనిం వా - - - అథ య ఇహ కపూయచరణా అభ్యాసో హ యత్తే కపూయాం యోని మాపద్యేరన్ శ్వయోనిం - - -' (ఛాం. 5. 10. 7) సద్వర్తనముగలవాడు బ్రాహ్మణాది యుత్తమ జన్మలను ద్వరగా నొందును, కాక దుష్టమార్గానువర్తి, శ్వానము మొదలైన నీచ జన్మల లొందునని దుష్టత్వమున గల ప్రమాద ముల సూచించి, సాధకుని దుష్టమార్గగామి కాకుండ జాగ్రత్తపడి యున్నది. 'మాతృ దేవో భవ। పితృ దేవో భవ। ఆచార్య దేవో భవ। అతిథి దేవో భవ। యాన్యనవద్యాని కర్మాణి। తాని సేవిత వ్యాని। నో యితరాణి॥' (తై. 1. 11. 2) తల్లి దైవముగ నారా ధింపబడుగాక! తండ్రియు నటుల నారాధింపబడుగాక ! గురువు దేవునివలె బూజింపబడుగాక ! అతిథియు నటుల నర్చింపబడును గాక ! నిర్దుష్టకర్మలే చేయబడునుగాక ! యితర కర్మలు కాదు. అతిథి అభ్యాగతుల విషయమేగాక, 'యత్సప్తాన్నాని మేధయా తపసా జనయత్పితా। ఏకమస్య సాధారణం। ద్వే దేవానభాజ యత్॥ త్రీణ్యాత్మనేఽకురత, పశుభ్య ఏకం ప్రాయచ్ఛత్। తస్మిన్ సర్వం ప్రతిష్ఠితం యచ్చ ప్రాణితి యచ్చ న' (బృ. 1. 5. 2) మేధా తపస్సులచే దండ్రి సప్తాన్నముల సృజించెను. అందొకటి సాధారణము. రెండు భాగములు దేవతలకు అర్పణము. మూడు భాగములు తనకొరకు ఉంచెను. ఒక భాగము పశువులకు ఒసం గెను. ఈ విభాగములమీదనే సర్వ జీవాజీవములన్నియు నాధార పడియున్నవి అని, శ్రుతి పండిన పంటను, ఆర్జించిన సంపదను బై విధాన సప్త భాగములుగా విభజించి, అందు మూడు భాగ

ములే అనగ నూటికి నలువదిమూడు భాగములు స్వార్థమునకును, దైవకార్యములకు 28%, పశువులకు 14%, యితర జీవులకు 14%, వంతున వ్యయపరుపవలెనని ఆదేశించుట విదితము. పై మంత్రార్థమును వివరించుచు, బృహదారణ్యకము 'ఏకమస్య సాధారణం ఇతీదమేవాస్య తత్సాధారణమన్నం యదిదమద్యతే। స య ఏతదుపాస్తే న స పాప్మనో వ్యావర్తతే మిశ్రం హ్యేతత్ ।' (బృ. 1. 5. 2) సాధారణమైన అన్నము అనగా సర్వసాధారణముగ నెల్లరు భుజించునది, దీనిని స్వాధీనపరచుకొనినవాడు పాపాత్ముడగును, ఇది సామాన్యాహారముగాన అని వివరించునది. ఈ మంత్రమును బరమాద్వైతాచార్యులైన శంకరాచార్యులవారు భాష్యమున వివరించుచు, నిది సాధారణముగ నెల్లరి ఆహారమనియు, 'సర్వభోజ్యత్వా దేవ యో ముఖే ప్రక్షిప్యమాణోపి గ్రాసః పరస్య పీడాకరో దృశ్యతే మమేదం స్యాదితి హి సర్వేషాం తత్రాశా ప్రతిబద్ధా। తస్మాన్న పరమపీడయిత్వా గ్రాసితుమపి శక్యతే॥' అది సర్వుల ఆహారముగాన ముఖమునందుంచిన ప్రతి గ్రాసము, యితరులకు బాధాకరముగనుండును. అది తమదిగదా అని ఎల్లరు ఆతురతతో నిరీక్షించెదరుగదా! అందుచే నితరులకు బాధలేకుండ ఒక గ్రాసమునైన భుజించుట దుర్లభము అని వివరించి, తన హృదియ విశాలత్వమును ఆ యద్వైతాచార్యుడు ప్రదర్శించియున్నాడు.

అట్లు బ్రహ్మనిష్ఠులైన ఆచార్యసన్నిధానమున, నిట్టి ధర్మప్రబోధక శాస్త్రాధ్యయనము గావించి, వివేక వైరాగ్య శమాదిక షట్క ముముక్షాదుల నార్జించి, ఆధ్యాత్మిక వ్యాసంగమున నర్హత

నార్జించి, నిరంతర చంచలచిత్తనిరోధమును, దీవ్ర తపోనిమ గ్నతచే నపూర్వ ఆత్మానుభూతి సంపాదించి, జితేంద్రియుడై యున్న అద్వైతస్థితుడు, అసందర్భ మార్గగామియై తా జెడి, యితరుల భ్రష్టుల జేయ నవకాశముండునా? అది దుర్లభము. సకలశాస్త్ర పారంగతునకు అక్షరజ్ఞానము గలదా అనునట్లుండును అద్వైతానుభూతస్థితునకు నైతిక ధర్మపాలనముండునా యని ప్రశ్నించుట. God the principle of the highest good అనునట్లు, ఉత్కృష్టశ్రేయస్కరమూర్తియైన భగవంతుని బొంది ఆనందించు కృతకృత్యుడు; పాపకార్యములకొడిగట్టుననుట దుస్సహము, దుర్లభము, దుస్సాధ్యము. కావుననే The Vedanta in its unfalsified form is the strongest support of pure morality, and is the greatest consolation in the sufferings of life and death. Indians keep to it [90] నిర్దుష్టమైన వేదాంతము, శుద్ధ నైతిక ధర్మమున సుదృఢమైన ఆధారము. జన్మ మరణ దుఃఖములందు అది అద్భుత విశ్రామ స్థానము. భారతీయులారా! దానిని అంటి పెట్టుకొనుడు అని, వేదాంతాచార్యుడైన డాక్టరు పాల్ దేవసేన్ హెచ్చరించియున్నాడు. 'ఆత్మానం సతతం జ్ఞాత్వా కాలం నయ మహామతే' (నాదబిందు. 21) ఆత్మజ్ఞానమును సతతము గలిగి కాలము నడుపుము అని ఉపనిషత్తు సలహా. అప్పుడే దోషములును బాధలును అతని జేరజాలవని వాగ్దానము. అందుచేతనే శ్రీ రామ కృష్ణ పరమహంసదేవుడుగూడ Perform your work keeping always the knowledge of Advaita in your

90. Prof. Paul Duessen : Address, Royal Asiatic Society, Bomboy 1893.

pocket 91 అద్వైత జ్ఞానమును నీ జేబునందుంచుకొని, కర్మల జేయుమని యుపదేశించెను. సర్వదోషములకది కవచమని జగద్గురుని అనుభవము. the fact is, that the highest and purest morality is the immediate consequence of the Vedanta 92 ఉత్కృష్టము, అతి పవిత్రమును అయిన నైతిక ధర్మము, వేదాంతమునకు వెంటనే నేర్పడునని మరల దేవసేన్ ప్రబోధ.

అంతియగాక, అద్వైతము మేధావంతుల ధీశక్తిని వ్యర్థము చేయుచు, సంఘమున కుపయుక్తము గాకుండ నిర్వీర్యమై, అకర్మత్వమునకు దారి తీయుచున్నదా అనిన, This is wrong interpretation of Vedanta. Vedanta never teaches one to fly away from the world or to shut himself up in caves and forest. Shankara, the lion of Vedanta, Swami Vivekananda the paragon the Vedantists of the modern times lived in humsn society and made the mightiest efforts for the uplift of humanity 93 అది తప్పుటర్థము. ప్రపంచమునుండి పారిపొమ్మనిగాని, అరణ్యమునగాని, గుహలలోగాని, దాగుమనిగూడ వేదాంతము బోధించుటలేదు. వేదాంతసింహమైన శంకరుడు, ఆధునిక కాలమున వేదాంతులకగ్రగణ్యుడైన వివేకానంద స్వామియు సంఘమునవే

91. Sri Ramakrishna : Mandukyopanishad, of Swami Nikhilananda, p xxxvii.

92. Prof. Paul Duessen : The Philosophy of Vedanta, p 16.

93. Swami Nikhilananda : Mandukyopanished, p xxxv.

జీవించి, మానవజాత్యుద్ధరణమునకై శ్రమించి యుండిరిగదా అని నిఖిలానందుని ప్రశ్న. Sankara was not merely a philosopher, not merely a religious teacher; but he was the greatest nation builder and thought leader.94 శంకరుడు కేవలము తత్త్వవేత్తమాత్రమే గాక, కేవలము మతాచార్యుడేగాక గొప్ప జాతినిర్మాత, ప్రజ్ఞాధినేత అని అక్షయ కుమార బెనర్జీ వచనము. అట్లు These fine Intellects, though few in number, became movers of mankind 95 ఆ దివ్య మేధాసంపన్నులు కొలది మందియైనను, మానవ సంఘమును గదిలించినవారైరి యని సుస్పష్టము. అద్వైతానుభవమూర్తి బుద్ధభగవానుడును, సంఘమును నిర్వీర్యము గావించెనా ? ఆదర్శ చక్రవర్తులనే తయారు గావించెనుగదా ! అందుచే, నద్వైతము సంఘశ్రేయమునకు దూరమనుటయు యోచనలేని మాటయే యగునట్లు అసంఖ్యాక అద్వైతాచార్యులే విశదము గావించియున్నారు. సంఘమునే జీవిత విధానముగ స్వీకరించువానికైనను I know no better preparation than the Vedanta 96 వేదాంతాధ్యయనముకంటె వేరు శిక్షణమొండులేదని మాక్సుముల్లరు వచించియున్నాడు. దీనిలో Religion, the expression of the devotional impulse, and art - - - - are rooted

---

9. Prof. Akshaya Kumar Benarjee : Prabuddha Bharata, 1945, p 898.

95. Editor : Prabuddha Bharata, 1955, p 75.

96. Prof. F. Max Muller : The Six Systems of Indian Philosophy, p 193.

in the Vedanta [97] భక్తి, భావోద్రేకస్ఫూర్తికి, గళకు ఆధారమైన మతజీవనము వేదాంతములో బాదుకొనియున్నదని డాక్టరు జేమ్సు హెచ్. కజిన్సు తెలిపియున్నాడు.

అందుచే, అనగా నద్వైతము ఇంతగ సర్వతోముఖమై, సర్వమానవ ప్రవృత్తులకాకరమై, ఉన్నత జీవితాదర్శ గురుపీఠమై చెలరారుటచే, It (Adwaita) comes whenever religion seems to disappear, and irrelion seems to prevail [98] మతజీవితమెప్పుడు అదృశ్యమగునో, అధర్మము తలయెత్తునో అద్వైతము ప్రవేశించును అని, వివేకానందుడు సత్యమును వెలిబుచ్చెను. అటులే నిఖిలానందుడును, Renaissance of Indian life, in its various aspects, political, social, material, aesthetic and religious, always followed the restoration of the Truth of Adwaita to its pristine, glory [99] అద్వైత సత్యమును, దానిశుద్ధ ప్రతిభ నుద్ధరింపగ, రాజకీయ, సాంఘిక, ఐహిక, కళాత్మక, మత విషయాది వివిధ విషయములతోగూడిన భారతీయ పునరుద్ధరణము అనుసరించునని వచించియున్నాడు. కాన అద్వైతాదర్శమైన సమిష్టిత్వమును, అనగా సంఘము వినా వ్యష్టి లేదు అనియు, వ్యష్టియే సంఘముగాన సంఘశ్రేయమే వ్యష్టి క్షేమమనియు, సర్వవ్యష్టియొక్క అభ్యుదయమే స్వీయ శ్రేయమనియు, గుర్తించుట ముఖ్యమని తాత్పర్యము. కావున

97. Dr. Jemes H. Cousins : Oriental Culture and World Renaissance.

98. Swami Vivekananda : The Complete Works, vol. 2, p 139.

99. Swami Nikhilananda : Mandukyopanishad, p xxxvi.

It is a truth that man is not a detached being, that he has a universal aspect; and when he recognizes this, he becomes great [100] మానవుడు యితరసంబంధములేని వ్యక్తికాదు. అతనిలో విశ్వతత్త్వముగలదు దాని నెప్పుడు గుర్తించునో అప్పుడతడున్నతుడగునని విశ్వకవి రవీంద్రుని వాక్యము. అదియే అద్వైతతత్త్వబోధ, ప్రబోధ, ఆదేశము. అట్టిచో దాన నింక నెట్టి కళంకములుండుటయు దుస్సాధ్యము, అసంగతము. అందుచే సర్వేతర విధానములకంటె అద్వైత శాస్త్రము, తదవలంబకులే, మానవాభ్యుదయకారకశక్తిసంపన్నత గల తత్త్వములు. అద్వైతమతావలంబనమున సంఘము తేజకరమై, సర్వసద్గుణములకాలవాలమై, పరిశాంతినిలయమై, ప్రకాశించుట సాధ్యము అని సద్విమర్శాపరుల ముఖ్యోద్దేశ్యము, మహత్తరాదేశము.

## అద్వైతము - విద్య - మేధాశక్తి

పై గ్రంథభాగమున వివరముగా వచింపబడినట్లు అద్వైత శాస్త్రము అతి సూక్ష్మభావగర్భితమై, విద్యాసంపద్విశిష్టమై, భాషాజ్ఞానశోభితమై, మేధావిరాజమానమై యుండుటచే, సామాన్య ధీశాలురకు దూరమై,కష్టసాధ్యమై యొప్పారినదని వినియున్నాము. 'క్షురస్య ధారా నిశితా దురత్యయా దుర్గం పథస్తత్ కవయో వదంతి' (కఠ. 1. 3. 14) క్షురికముయొక్క నిశితాగ్రమువలె ఆత్మను బొందుమార్గము అతి కష్టసాధ్యమైనదని బుధులు పలుకు

100. Rabindranath Tagore : Sadhana, p 55.

దురు. 'కశ్చిద్ధీరః ప్రత్యగాత్మానమైక్షదావృత్తచక్షురమృతత్త్వ మిచ్ఛన్' (కఠ. 2. 1. 1) విషయ విముఖులైన ధీశాలురు అమృతత్వాభిలాషులై ఆత్మను బొందెదరు. 'ఏష సర్వేషు భూతేషు గూఢోఽత్మా న ప్రకాశతే। దృశ్యతే త్వగ్ర్యయా బుద్ధ్యా సూక్ష్మయా సూక్ష్మదర్శిభిః॥' (కఠ. 1. 3. 12) సర్వభూతముల నిగూఢముగనున్న ఆత్మ ప్రకాశింపదు. కాని, సూక్ష్మాతిసూక్ష్మ బుద్ధిగలవారిచే నది చూడబడుచున్నది అను వాక్యములలో, నద్వైతజ్ఞాన సంపాదనమునకు అతి సూక్ష్మ మేధాశక్తి ఆవశ్య మగుచున్నది. మరియు శ్రుతులలో నాచార్యునిగూర్చి నిర్వ చించుచు, 'శ్రోత్రియం బ్రహ్మనిష్ఠం' (ముం. 1. 2. 12) శ్రుతివా క్యార్థ జ్ఞానసంపన్నుడును, బ్రహ్మానుభూతి విభూషితుడును అనియు 'ఆచార్యో వేద సంపన్నః' (అద్వయతారక) 'వేదవిద్యావ్రతస్నాత దేశికస్య ముఖాత్స్వయం గృహీత్వా' (ముక్తిక.1.41) 'శ్రోత్రియం శాస్త్రవాత్సల్యం' (ముక్తిక. 1. 59) వేదవిద్యా వ్రతశీలు డైన ఆచార్యునిముఖతః స్వయముగ స్వీకరించి అనియు, శ్రోత్రి యుడై శాస్త్రప్రేమగల ఆచార్యుడనుటచే, వేదశాస్త్ర విజ్ఞానపారం గతుడై యుండవలెనని శ్రుతి తాత్పర్యము. అనగా నుపదేశకుడు మేధావియై, సకల శాస్త్రాధ్యయనము గలవాడుగ నుండవలెను. అటులనే విజ్ఞానార్థియైన శిష్యుడును, అదే గమ్యమును బుద్ధినుంచి సర్వవిషయ గ్రహణాదర్శముతో, నట్టి గురువరేణ్యుని జేరవలయును అని భావము. The great Poets of India wrote for the audiences of experts [101] భారత ప్రాచీన ఋషిశ్వ రులు, మేధావుల సభలకొరకు బ్రసంగించిరని అనునట్లు, వారి

100. Dr. A. B. Keith: A History of Sanskrit Literature, Preface.

గ్రంథములుగూడ సులభసాధ్యములుగాక, కేవలము పండిత పరికాండులకై యుండుటచే, నా విద్యా మాధుర్యమును జవిజూడ వలెనని, భాషా పాండిత్యమే గాక భావగ్రహణ సామర్థ్యమునకు వలయు శిక్షణము, పూర్వోక్త రీతి సద్గురు సన్నిధానమున దప్పక బొందవలసిన అవసరమేర్పడుచుండెడిది. కాన నీ అద్వైత విద్యాప్రచారమెక్కువగ నేర్పడినకొలది, తద్విద్యాధ్యయన కుశలత్వమునకై, విద్యా సంపన్నత నార్జించువారెక్కువయై, ఆశ్రమ దేవాలయాది నాటి విద్యా కేంద్రములు ప్రజ్ఞాశీలురచే సంపూర్ణమై, అట్టి విద్యావాసంగములతో వాతావరణము సమ్మర్ధమై, సామాన్యులకుగూడ నాకర్షణీయమై, ఉత్సాహకరమై విరాజిల్లుచుండుట, జక్రవర్తుల ఆధ్వర్యమున జరుగుచుండెడి నాటి విద్వత్సభలే తార్కాణము. ఆ సభలలో దమ విద్యానిష్ణాతత్వ ప్రదర్శకునకు, సువర్ణాలంకృత గోసహస్రాధిక బహుమానములుగూడ ఆర్ష విద్యా పోషణ ప్రోత్సాహముల గావించుటచే నాటి విద్యాభివృద్ధియు, మేధాసమృద్ధియు నసమానములు, అజేయములు. అందుచేతనే నాడు మ్రోగిన విద్యాదుందుభి నేటికి నెల్లెడల వినిపించుచు, దుర్భేద్యమై, నెల్లరహృదయాంతరాళముల బ్రతిధ్వనించుచున్నది. నాటి అజ్ఞాత ఋషీశ్వరులచే జెప్పబడిన వాక్యసముదాయము నేటికిని యినుపగుళికలే గదా! ఎంత మేధావంతునికైనను దుర్ధర్షములేగదా! నాటి గ్రంథానువాదములు, అనుకరణ సాహిత్యమే గదా! నేడు సర్వత్ర సన్మానింపబడుట! అందులేని భావజాలములనే విద్వాంసుడైనను వెలువరించియుండెనా? ఆ గ్రంథముల కర్థముల జెప్పగలవాడేగదా నేటి మహావిద్వద్వరేణ్యుడు, సభాపూజ్యుడు! అందుచే నాటి విద్యావైభవమే, విద్యాగమ్యము నంది

రేమో యను సందియము సకల ధీమంతులకేర్పడినట్లు జేయు నాటి విద్యాభివృద్ధి, కేవలము అతి సూక్ష్మ విషయమైన ఆత్మ గ్రహణ కార్యమునకవసరమై, సూక్ష్మాతిసూక్ష్మ మేధాకృషియే గదా! అందుచే నీ అధ్యాత్మ విద్యయే నాడు, నేడు, మానవ మేధారంగము నావరించి, బుద్ధిప్రకాశము గలుగజేయుచున్న దనుట సముచితము.

సుప్రసిద్ధ అద్వైత వ్యాఖ్యాన దురంధరుడైన శ్రీ శంకరులు, పూర్వ సాధకులగల విద్యా నిర్లక్ష్యమును నిరసించి, శ్రోత్రియత్వమునకు ప్రాధాన్యమొసంగి, అద్వైతవిద్యా వ్యవసాయమునకు భాషాధారకమైన వ్యాకరణ న్యాయాదికములేగాక, సిద్ధాంత ప్రతిపాదకములైన సాంఖ్యాది షడ్దర్శన పాండిత్యముగూడ నవసరమనుటతోడ, తదనుగుణముగ దమ భాష్య రచనముల, బరసిద్ధాంతముల బూర్వపక్షమొనర్చి, స్వసిద్ధాంతమైన అద్వైత ప్రతిపాదన, నిర్వచన సమర్థన, తీర్మానముల గావించి యుండుటచే, నా గ్రంథావలోకనము గోరువారు, ఆ యా విద్యలబఠించియుండ వలసియుండుటచే విద్యాధ్యయన మెక్కువయై, మేధాసంపత్తి దృఢతరమును సుస్థిరమును, అద్భుతమునునై యొప్పారియుండుటచే, శ్రీ శంకరమఠములగల సన్న్యాసులు విద్వత్సన్న్యాసులై రాజిల్లుటయు, వారి నాశ్రయించిన గృహస్థులగు శిష్యులుగూడ నదే పథమును ద్రొక్కి, వాని గడించుట జరిగినదగుటచే, నద్వైత సిద్ధాంత ప్రభావమున దేశము నల్దడల, ధీకుశలత అగ్రము నందుకొనెను. నాటనుండి నేటివరకు బ్రపంచమునగల ప్రజ్ఞావంతులందరు అద్వైత సిద్ధాంతముచే నాకర్షింపబడుచుండుటయు

విస్పష్టము. కావున అద్వైతశాస్త్రము ప్రపంచమున అకుంఠిత సమగ్ర విద్యావ్యాప్తికిని, బుద్ధిశక్త్యభివృద్ధికిని అసమానలీల దోడ్పడి, ప్రపంచమున వినూత్న ప్రజ్ఞాయుగమును నెలకొల్పిన దని చెప్పుటయు నుచితమే యగుచున్నది. తద్విధానమే ప్రపంచ తరుణోపాయమేమో యనియు దోపకమానదు.

## అద్వైతము - సిద్ధి - ముక్తి

Whether we call it Vedantism or any ism, the truth is that Adwaitism is the last word of religion and thought, and the only position which one can look upon all religions and sects with love [102] దానిని వేదాంతమనిగాని, మరి ఏ యితర నామముతో బిలిచినను అద్వైతము, మతవైజ్ఞానిక విషయమున మలిపలుకు. ఆ స్థితినుండి మాత్రమే సర్వేతర మతముల, శాఖల నాకే ప్రేమదృష్టుల నవలోకింప సాధ్యమగును అని, అద్వైత సాధనా నిమగ్నుడై, తత్సిద్ధి నచిరకాలమున నొంది, ఖండఖండాంతరముల నా మాధుర్యమును వెదజల్లిన ప్రత్యక్షాద్వైతి వివేకానందస్వామి వచనము. అనుభవజన్యములగుటచే నా వాక్యము లమూల్యములు. Religion is realisation మతమన అనుభూతి యను శ్రీరామకృష్ణుని నిర్వచనమును స్వీకరించుచో, సర్వ మతానుభూతులు అద్వైతమున నిమిడియుండుటయేగాక, నద్వైతము వాని నతిక్రమించి, అనుభవపర్యవసానము నందుకొని యున్న

102. Swami Vivekananda : The Complete Works, vol. 6, p 375.

దని అతని తాత్పర్యము. అటులే మానవ భావప్రవాహము అనేక సిద్ధాంతములద్వారా ప్రవహించి, తన గమ్యమైన నద్వైతమును జేరి, పరిష్వంగ మొనరించి, అందే లయించిపోవుటచే నా భావ స్రవంతికిగూడ నద్వైతము గమ్యస్థానముగ నా యాచార్యుని భావము. Religion is applied philosophy అనుసూక్తి ప్రకారము తత్త్వశాస్త్రము, is essentiality concerned with the present 103 వర్తమాన సంబంధమును గలిగి' Not wealth but wisdom is the way 104 అనునట్లు సంపదపేక్షగాక వివేకదృష్టి గలిగి, Philosophy purifies the will. Philosophy is to be understood as experience and thought 105 తత్త్వశాస్త్రము సంకల్పశుద్ధిని గలుగ జేయును. దాని అనుభవముగ, విజ్ఞానముగ గ్రహింపవలయు ననునట్లు చిత్త పారిశుద్ధ్యమును గలుగజేయుటచే, మత జీవిత మునవలె ననుభవసంపత్తి నొసంగుచుండుటచే, తత్త్వశాస్త్రమే మతమగుచున్నది. కాన వివేకానందుని వాక్యమున, అద్వైతమే సర్వమత, సర్వతత్త్వచింతనమునకు శిఖరము, పర్యవసానము, గమ్యముగనుండును. ఎట్లు?

India's reverence has never been for the material form, but for pure spirit 106 భారతదేశ

103. Karl Jaspers : Way of Wisdom, p 144.
104. Arther Schopenhauer: The Story of Philosophy, of Will Durant, p 332.
105. Arther Schopenhauer : The Story of Philosophy, of Will Durant, p 330
106. Rev. T. E. Slater : The Higher Hinduism in Relation to Christianity, p 85.

భక్తి ప్రాపంచిక విషయమునగాక, శుద్ధ ఆత్మపరముగనే నున్నది. ఎందుచేత? India is the land of the infinite. Its skies are so deep and blue, its mountains so lofty and inaccessable, its forests so dense and boundless, its rivers so broad and long, that it is natural for the Indian to conceive the infinite [106] భారతదేశము అనంతత్వమునకు నిలయము. దాని యాకాశమతి గాఢము నీలము. దాని పర్వతములతి ఉన్నతములు అభేద్యము. దాని యరణ్యములు సాంద్రములు నిరవధికములు. దాని నదులు అతి విశాలములు దీర్ఘములు. కాన ననంతమును భావించుట భారతీయునికి సహజమే అని టి. ఇ. స్లేటరు వచించురీతి, భగవత్సంకల్ప, పరిపూర్ణానుగ్రహ విశేషములచేత లభించిన అనుకూల నైసర్గిక వాతావరణ స్థితులచే, భారతీయుల మహాపుణ్యభాగ్యవిశేషమున, మన మాతృభూమికట్టి అసమాన స్థానము ప్రపంచమున ప్రాప్తించి యుండుటచే, స్వాభావికముగ అభౌతిక, అలౌకిక, ఆధ్యాత్మికదృష్టి లభించియున్నది. దాని సమగ్రతల గ్రహించుకొనియున్న మన ప్రాచీన మహర్షి వరేణ్యులు, అట్టి సదవకాశమును జారవిడుచుకొనక, సక్రమ లీల నుపయోగించుకొని, అందు సాధారణ ప్రజ్ఞ నార్జించి, The Rishis spoke of Brahma from the intuitions reached during the rare moments of ecstatic communion with Him, arrived at after steady attempts at keeping down all mental activity and

106. Rev. T. E. Slater : The Higher Hinduism in Relation to Christianity, p 85.

reaching a plane above the storms of human passions 107 మనోవ్యాపారమును స్తంభింపజేసి, మానవోద్రేక సంక్షోభములకతీత సంస్థితిని జేరుటకు సుస్థిర యత్నముల యనంతరము సంప్రాప్తించిన అసాధారణక్షణముల నా పరబ్రహ్మ మునతో నైక్యానుసంధానము నార్జించి, యందుండి, ఋషీశ్వరులు బ్రహ్మమునుగూర్చి వచించియుండిరని వి. టి. శ్రీనివాస అయ్యంగారు వ్రాసినట్లుగ, వారు బ్రహ్మానుభూతినిగూడ నార్జించి, బోధించి, Philosophy is the highest music తత్త్వశాస్త్రము అత్యున్నత సంగీతము అని పైథాగొరసు అను గ్రీకు దేశ తత్త్వవేత్త అనురీతి, దమ అనుభవసుధాస్వాదనోన్మత్తత గానమొనరించియున్నారు. అట్టి సుస్థిర విధానము నవలంబించుటచేతనే వారి-కృషిఫలితములును అజేయములు, అద్భుతములై The only religion that can have any hold is the rationalistic religion of Adwaita 108 వివేకజ్ఞానముగల అద్వైత మతమే స్థిరత్వమును గనజాలియున్నదని రొమెన్ రోలా అనునట్లు స్థిరత్వమును గడించియున్నది. అంతియుగాక The labours of the Indian thinkers are so valuble to the advancement of human knowledge భారతీయ మేధావంతుల కృషియే మానవ విజ్ఞానాభివృద్ధికి అమూల్యమని విక్టరు కజిర్సు; I make no secret that all my life I have been very fond of the Vedanta 109 నా జీవితమునందంతయు వేదాంతమునందే అధిక ప్రేమ

107. V. T. Srinivasa Iyangar : The Outlines of Hindu Philosophy, p 34.

108. Romain Rolland : Sankaracharya of S. S. S. Sastry

109. Prof. F. Max Muller : The Six Systems of Indian Philosophy, p 193.

గలిగియున్నానను రహస్యమును, నే దాచవలసిన అవసరము లేదని మాక్సు ముల్లరు మొదలగు పండిత పశ్చిమాండుల సంస్తుతుల కాలవాలమై యున్నది. I have been attracted towards the Adwaitic philosophy of the Vedanta 110 వేదాంతముయొక్క అద్వైత సిద్ధాంతముచే నే నాకర్షింపబడితినని నెహ్రూ పండితుడుగూడ వచించియున్నాడు. Philosophy is the principle of concentration through which man becomes himself, by partaking of reality 111 మానవుడు తాను తానై, సత్యమునందు బాల్గొనుటకు ధ్యానవిధానమే తత్త్వశాస్త్రము అని, కార్ల్ జస్పర్సు అనునట్లు సర్వుల నాకర్షించి, Philosophy is the self-expression of the growing spirit of mankind 112 మానవజాతి యొక్క, పరిణామ తత్త్వముయొక్క స్వయంవ్యక్తిత్వమే తత్త్వచింతనమని రాధాకృష్ణ పండితుడు వచించునట్లు సర్వతోముఖమై, the subtle invigorating breath of Hindu Idealism swept across our national thought 112 ఉత్సాహకరమైన సూక్ష్మ హిందూ జ్ఞానసిద్ధాంతము, మన జాతీయ విజ్ఞానముపై బ్రవహించినదను Howsin హౌసిన్ వాక్యములరీతి, Adwaita-nonduality, the Oneness, the idea of the impersonal God is the only religion that can have any hold on any intellectual people 113 అద్వైతమే, నిర్గుణ బ్రహ్మభావమే, ప్రజ్ఞావంతులచే గ్రహింపబడు

110. Pandit Jawaharlal Nehru : Discovery of India, p 12.
111 Karl Jaspers : Way to Wisdom, p 14.
112 Dr. S. Radhakrishnan : Indian Philosophy, vol. 2.
113. Swami Vivekananda : The Complete Works, vol. 2, p 139.

మతము అని, వివేకానందుడును వచించు రీతి, నది ఖండఖండాం తరముల నాకర్షించి వెడలి, ఎల్లర హృదయసీమల నాక్రమించి యున్నది. అయిన దాని విశిష్టత ఏమి ?

To philosophize - - to learn how to live and to know how to die 114 ఎట్లు జీవించుట, ఎట్లు మరణించుట యను విషయముల గ్రహించుటయే తత్త్వశాస్త్రము అనునట్లును, Man is fundamentally more than he can know about himself 115 తననుగూర్చి తాను గ్రహించుకొనినదానికంటె మానవుడు, ముఖ్యముగ నధికుడు అని కార్ల్ జస్పర్సు వాక్యరీతి, మానవుడు తా వెలికి దోచు దానినంటె నగాధ తత్త్వమనియు, 'తదా దేవమవిజ్ఞాయ దుఃఖస్యాంతో భవిష్యతి' భగవంతుని గ్రహింపనంతవరకు దుఃఖము నశింపదను రహస్యముగూడ గ్రహించి, 'యో వా ఏతదక్షరం - - అవిదిత్వాఽ స్మాల్లోకాత్ప్రైతి స కృపణః' (బృ. 3. 8. 10) ఆ యక్షరుని గ్రహింపక మరణించువాడు దురదృష్టవంతుడు. 'అథ యో హ వా అస్మాల్లోకాత్స్వం లోకమదృష్ట్వా ప్రైతి స ఏనమవిదితో న భునక్తి' (బృ. 1. 4. 15) స్వాత్మను గ్రహింపక మరణించు వానిని ఆత్మ రక్షింపదు అనురీతి, స్వాత్మజ్ఞానము లేకుండుట వ్యర్థము అని గ్రహించి, తీవ్ర సాధనా పాటవముచే, సద్గురు కృపావిశేషముచే, తదనుభూతి నొందుట మానవ కర్తవ్యముగ శ్రుతులు, వేత్తలు తెలుపుచున్నారు.

---

114. Karl Jaspers : Way to Wisdom, p 125.
115. Karl Jaspers : Way to Wisdom, p 63.

దాని నార్జించుటకై సాధకుని శక్తిసామర్థ్యముల ననుస రించి, అధికార నిర్ణయము గావించి, తదనుగుణ సాధనా విశేష ముల నాతనికి బోధించి, క్రమక్రమముగ మెట్ల నెక్కించి, చివ రకు అద్వైత శిఖరమునందాతని శ్రుతి యుపవిష్టుని గావించు చున్నది. ఆ నిశ్రేణిలో ప్రథమ స్థానము కర్మమార్గమున కీయబడి యున్నది. కర్మసాధనము నిత్య, నైమిత్తిక రూపమున ద్వివిధమై యున్నది. నిత్య కర్మ ఎట్టి యలౌకిక ఫలమును ఒసంగదు. అట్లే అది నిష్ఫలమును గాదు. కాని, మనోవాక్కాయములకు బలము జేకూర్చి, నైమిత్తిక కర్మానుష్ఠానమునకు శక్తిమంతునిగ నొనర్చును. నైమిత్తికమునగల యజ్ఞ యాగాదిక కర్మలు, ప్రపంచ జీవితమున సత్ఫలహేతువులై, యతని యైహిక జీవిత మును సుఖవంతమొనర్చి, చాంద్రాయణ జ్యోతిష్టోమాది స్వర్గ హేతుక యజ్ఞముల జేయింప సమర్థములగును. కాని జ్యోతిష్టో మాదిక కర్మలైనను సద్యోఫలము నొసంగనేరక, యజ్ఞగుండము నుండి 'అపూర్వ' మను నొక యపూర్వశక్తి నుద్భవింపజేసి, ఆ సాధకుని శరీరత్యాగానంతరము, వాని స్వర్గాది లోకముల డ్రిప్పి, అందందుగల సుఖాదుల నాతని పుణ్యమునసరించి అనుభవింప జేయుచు, గ్రమముగ దానుగూడ దరిగిపోవుచు, నతని పుణ్య వ్యయమున దాగూడ వ్యయమైపోవును. అంత నా సాధకుడు యజ్ఞఫలమును గోల్పోయి, సామాన్యుడై, మరల జన్మము నొందును. అందుచే గర్మమార్గము ప్రత్యక్షముగ నిందు జీవునికి శాశ్వత సుఖ హేతువు గాకుండుటయేగాక, బహుళ ప్రయాసమున సాధించిన యజ్ఞముచే నైనను నతనికి జన్మరాహిత్యము నొసంగ జాలక బునరావృత్తినే పొందించుచున్నది. కావుననే 'పరీక్ష్య

లోకాన్ కర్మచితాన్ - - -' అను ముండక శ్రుతి వాని నిష్ఫలత్వ ముల గట్టెదుట నుంచియున్నది. అటులే 'తద్యథేహ కర్మచితో లోకః క్షీయతే ఏవమేవాముత్ర పుణ్యచితో లోకః క్షీయతే' (ఛాం. 8. 1. 6) కర్మ సముపార్జితములెట్లు యిచ్చట నశించు చున్నవో అట్లు పుణ్యకర్మార్జిత లోకములును నశ్వరములే యగు చున్నవి అని శ్రుతులు చాటుచున్నవి. జీవితమున గర్మలాచరింప గలుగ, వ్యయప్రయాసలే కష్టనిష్ఠూరములే అతనికి మిగిలిన సంపద యగునుగాని, ఆనందము కర్మమార్గావలంబకునికి నుండనేరదని తజ్ఞుల తాత్పర్యము. అందుచే, దాని దూరదృష్టిగలవారెవ్వరా శ్రయింపరని విదితము.

రెండవది భక్తిమార్గము. నిర్గుణమైన బ్రహ్మమును, అవా ఙ్మానసమైన బ్రహ్మమును బుద్ధికధీనము గావించి, నిరవధికుని అవధికునిగ జేసి, అతనికి మాయావిశిష్టత్వము గల్పించి, సృష్టి స్థితి లయాది కర్మల నంటించి, ఆ సకల కర్మవిదూరుని సకల కర్మల ముంచి, శిష్టరక్షణ దుష్టశిక్షణలకై లోకమున మానవత్వ మున గూడ సరికించి, మానవ లక్షణములైన అహంకార మమకా రాదికమునగూడ నతని ముంచి, అతనిచే ఘనకార్యముల జేయించి, అందులకై పూజించి, అర్చించి, ప్రార్థించి, దర్శించి ఆనందించి, శరీరానంతరమున నాతడుండునని భావింపబడు లోక మున, నిత్యసేవలో సాధకుడు ఉండిపోవుట నీ భక్తిమార్గ తాత్ప ర్యము, గమ్యము. ఈ మార్గము సులభగ్రాహ్యమై, స్థూలమై విరాజిల్లినను, సిద్ధాంతమున గొన్ని దోషములు వాటిల్లినవి. అంతియగాక, సాధకుడు తన యిష్ట దైవమును అర్చనాదుల

బూజించి, ప్రార్థించి, దర్శించుటలో భావోద్రేకము గలుగుచు, దమో రజోగుణ విజృంభణము గోచరించును. దాని బ్రిపత్తిలో నా యిష్ట దైవమునకు సర్వమును సాధకుడు సమర్పించినను, ఉద్రేకములతో సాధ్యమైన దర్శన సుఖము వెంటనే అదృశ్యమై, విరహాది దుఃఖముల ముంచుట, భక్తుని జీవితము సుస్థిరానంద మున నిమగ్నత జెంది యుండజాలదు. ఇట్టి ఘట్టములు మహా భక్తుల జీవితములలో వ్యక్తము. అందుచే భగవద్దర్శనము గలు గక బూర్వము దర్శన నిరీక్షణముచే దుఃఖము, దర్శనానంతరము విరహముచే దుఃఖమును గలిగి, మధ్యలో లేశమాత్రిమానంద మును భక్తుడనుభవించుచుండును. మరియు దేహత్యాగమున అర్చురాదిమార్గముల ననుసరించి స్వర్గాదిక లోకముల బొందియు, మరల నీ మానవ శరీరమునో, యెట్టి శరీరమునో బొంది, సామా న్యముగ సావయవములుగల దేశ కాల వస్తు విభేదప్రాబల్యమున గలుగు 'అస్తి జాయతే వర్థతే పరిణమతే అపక్షియతే వినశ్యతే' (గర్భోపనిషత్తు) అను వికారముల బొందుచు, ఆ యా లోకములగల సుఖాదులలో వీని నెక్కువకాలము మరచుచు, కాలము గడుపును. అందుచే భక్తుడు వైకుంఠ కైలాసాదులందుగూడ, ఇంద్రియా పేక్షిక సుఖములనే యనుభవించుండుటచే నవి సంకుచితములై, నిత్యఆనందవిభూతిని జవిజూపక, దమయందే తృప్తిగలిగియుండు నట్లొనరించును. కాన నతడు బాహ్య పదార్థములచే క్రీడించుచు, దత్సంబంధ సుఖముల నొందుచు, దత్కాలమున నవి నిత్యము లని భ్రాంతినొందుచు, నా బాహ్య వస్తువంతరించిన తమ సుఖ మంతరించిన తమ సుఖమును బాసి చింతించుచు నుండుటచే,

భక్తునికి నిహపరముల రెండింట శాశ్వదానందము దూరముగనే యుండును. ఆ యానంద లేశమునుగూడ నతడనుభవింపనేరడు.

కాని, జ్ఞానమార్గమనబడు అద్వైత మార్గమున, ప్రథమము నుండియు సత్యాసత్య అనగ ఆత్మానాత్మ వివేచనమును సాధకుడు గావించి, అసత్యమగు ప్రపంచ సుఖముల ననిత్యములుగ, భ్రాంతులుగ ద్రోసిబుచ్చి, విరాగ సంపన్నుడై తజ్జనిత శాంత దాంత్యాది షడ్వర్గమును సంపాదించి, రజస్తమోగుణముల ద్రొక్కివేసి, చిత్తమున నుద్వేగాది తొందరపాటుల నిర్మూలించి, 'బ్రహ్మ సత్యం జగన్మిథ్య జీవో బ్రహ్మైవ నాపరః' అను ఆర్యోక్తిని స్మరించి, ముముక్షువై, 'శ్రోత్రియం బ్రహ్మనిష్ఠం' లక్షణములు గల సదుపదేశకు నాశ్రయించి, గురుకులవాసమున, నయ్యాచార్య సమక్షమున, నా పరమాదర్శ క్షేత్రమున, చిత్తవిక్షేప కషాయాదిక జ్ఞానాటంకముల జయించి, 'సమ్యగాధీయతే అనేనేతి సమాధిః (అమర. 1. 145) అనునట్లు, 'ధ్యాతృధ్యానే పరిత్యజ్య క్రమాత్ ధ్యేయైకగోచరం । నివాతదీపవచ్చిత్తం సమాధిరభి ధీయతే॥' (అధ్యాత్మ) అను శ్రుతి వచనమురీతి గర్త, కర్మ, క్రియాత్మక దృగ్దృశ్యదర్శనరూప త్రిపుటి నతీతించి, కేవల ధ్యేయైకచిత్తుడై తదానందమున నిమగ్నుడై యొప్పారును. ఇట్లు, ప్రథమము నుండి క్రమశిక్షణమున చిత్తశోధనము గావించి, దాని సాధించి యుండుటచే 'ప్రభాశూన్యం మనశ్శూన్యం బుద్ధిశూన్యం చిదాత్మకం । అతద్వ్యావృత్తిరూపోసౌ సమాధిః - - -' (ముక్తిక. 2. 56) జాగ్రత్స్వప్నసుషుప్త్యాది అవస్థాత్రయరహితమై, చిన్మాత్రమై యొప్పు సమాధిని బొందును. అశుద్ధమైన విషయేంద్రియ

ములకు లొంగి, వానివెంట బర్విడుచుండు మలిన మనస్సు నశింప, 'మనో నాశో మహోదయః' (ముక్తిక. 2. 39) మహోదయమై, 'తావజ్జీవో భ్రమత్యేవ యావత్తత్త్వం న విందతి' (ధ్యానబిందు. 50) ఎంతవరకు తత్త్వమును గ్రహింపజాలడో అంతవరకు జీవుడు భ్రమించుచుండును అను నిందను నిరాసమొనర్చి, 'ఏషాస్య పరమా గతిః, ఏషాస్య పరమా సంపత్, ఏషోస్య పరమో లోకః। ఏషోస్య పరమ ఆనందః, ఏతస్యైవానందస్యాన్యాని భూతాని మాత్రాముపజీవంతి' (బృ. 4. 3. 32) అది అతని పరమ గతి, పరమ సంపద, పరమ లోకము, పరమానందము. ఈ ఆనందము యొక్క లేశముపై నితరజీవులు జీవించును అను పరమ రహస్యము గ్రహించి, ఆ పరమానంద విభూషితుడై, 'రసో వై సః। రసం హ్యేవాయం లబ్ధ్వాఽనందీ భవతి' (తై. 2. 7) అతడు రసస్వరూపుడు, ఆ రసమును బొంది ఆనందించినవాడై, అస్పర్శ యోగో వై నామ సర్వసత్త్వసుఖో హితః। అవివాదోఽవిరుద్ధశ్చ దేశితస్తం నమామ్యహం॥' (మా. కారిక. 4. 2) శాస్త్రబోధితమై. సర్వజీవ క్షేమంకరమై, అవివాదమై, అవిరుద్ధమై యొప్పు నా అస్పర్శయోగమునకు నమస్కరించెదను అనియు, 'దుర్దర్శమతి గంభీరమజం సామ్యం విశారదం। బుద్ధ్వా పదమనానాత్వం యథా నమస్కుర్మో యథా బలం ॥' (మా. కారికా. 4. 100)దురిజ్ఞేయమై గంభీరమై, అజాతమై, సామ్యమై, ప్రకాశభూయిష్ఠమై, నానాత్వ రహితమై యుండు నా అస్పర్శ యోగమునకు నమస్కరించుచున్నా ఉను అనియు గౌడాపాదాచార్యునిచే స్తుతింపబడి, 'అస్పర్శయోగో వై నామ దుర్దర్శః సర్వయోగిభిః। యోగినో బిభ్యతి హ్యస్మాద భయే భయదర్శినః॥' (మా. కారిక. 3. 39) దేనితోడను

సంబంధింపని యీ యోగము, సర్వేతర యోగులకు దుస్సాధ్యము. అభయరూపమైన దీనిలో భయమును గాంచి యోగులు, భీతిజెందెదరు అని నిర్వచింపబడిన నీ అద్వైత సహజ సమాధిని, సాధకుడు బొందుచున్నాడు. 'వేదాహమేతమజరం పురాణం సర్వాత్మానం సర్వగతం విభుత్వాత్। జన్మనిరోధం ప్రవదంతి యస్య బ్రహ్మవాదినో హి ప్రవదంతి నిత్యం॥' (శ్వే. 3. 21) అవ్యయుడును, పురాణమైనవాడును, సర్వాత్మస్వరూపుడును, విభుత్వముచే సర్వవ్యాపకుడును, బ్రహ్మవిదులచే నజమనియు నిత్యుడనియు బిలువబడిన అక్షరుని నే గ్రహించితిని అను నిత్యానందమే, అతని బాహ్యాంతరముల బ్రకాశించును. 'యస్మిన్ సర్వాణి భూతాన్యాత్మైవాభూద్విజానతః। తత్ర కో మోహః కః శోకః ఏకత్వమనుపశ్యతః॥' (ఈశ. 7) సర్వభూతములు ఎప్పుడు తన యాత్మతో నేకమగునో, యీ ఏకత్వ ద్రష్టకు శోకమోహములెచ్చట ? The highest freedom is experienced in freedom from the world, and this freedom is a profound with transcendence 116 ప్రపంచ పాశములనుండి విడివడుటయే యుత్కృష్ట స్వాతంత్ర్యము, ముక్తి. అది అభౌతిక తత్త్వముతో గాఢ సంబంధముచే నేర్పడునని కార్లు జస్పర్సుగూడ వచించియున్నాడు. విల్ డ్యూరెంటు అనురీతి Truth will not make us rich, but it will make us free 117 సత్పదార్థము మనల ధనాఢ్యులనుగా జేయక, స్వతంత్రులనుగ నవగా ముక్తులనుగ జేయును. అట్టివానికి బ్రాపంచిక సంబంధమైన ఏ

116. Karl Jaspers : Way to Wisdom, p 45.

117. Will Durant : The Story of Philosophy, xxvi.

బంధములు లేక, 'భిద్యతే హృదయగ్రంథిశ్ఛిద్యంతే సర్వ సంశయాః। క్షీయంతే చాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరే' (ముం. 2. 2, 8) పరావరమైన నా పరమాత్మ దర్శనమగుటతోడ, హృదయ గ్రంథులు విడివడును, సర్వసంశయములు విచ్ఛిన్నము గును. సర్వకర్మలు నశించును. అందుచే నతడు పరతత్త్వానంద సాగర విహారమున, నెట్టి వికారములులేని స్థితిలో, నెట్టి భేదములు లేక జరించుచుండు. అతని స్థితి సామాన్యులకు దురూహ్యము, దుర్గ్రాహ్యము, దుస్తరము. అతనికి నతడే సమానము. అతని నతడే గ్రహించును. సర్వప్రపంచ నానాత్వమున నేకత్వమునందే మునింగి, 'జ్ఞాతే ద్వైతం న విద్యతే' అనునట్లు ద్వైతదృష్టి వివర్జితుడై, ప్రవర్తించుచుండును.

కాని, యింకను అతడు శరీరధారియై యుండవచ్చును. సామాన్య మానవులవోలె ఆహార పానీయ నిద్రాదుల స్వీకరించుచు నుండవచ్చును. భ్రాంతికధిష్ఠానమైన రజ్జుజ్ఞానముతో సర్పజ్ఞానము అదృశ్యమైనట్లు, యిచట నా సిద్ధునికి సర్వ బాహ్యప్రపంచము అదృశ్యముకాక, **The realisation of truth does not mean the abolition of plurality, but the removal of the sense of plurality** 118 సత్పదార్థానుభూతి యనగ నానాత్వ నిర్మూలనముగాక నానాత్వదృష్టి నాశనమేయని రాధాకృష్ణ పండితుడు వాకొనునట్లు, మృగతృష్ణలోని నీరముపై భ్రాంతి మృగతృష్ణ తత్త్వదర్శనమున నదృశ్యమైనను, నీరభ్రాంతి నశించినను, ఆ మరుమరీచి యింకను ద్రష్టకు గోచరించుచునే

118. Dr. S. Radhakrishnan : Indian Philosophy, vol. 2. p 637

యున్నటుల; అజ్ఞానియై దశముని విషయమున భ్రాంతినొంది, అన్యథాజ్ఞాన విమోహమున దశముడు తాను గాదని భ్రాంతుడైన వాడు, దశముడు తానే యని గ్రహించినను, తన స్వరూపదర్శనము నింకను జేయుచున్నటుల, అటులే అస్పర్శయోగసిద్ధుడు గూడ ప్రపంచ దర్శనము గావించుచున్నను, పూర్వోక్త శ్రుతి వాక్యములరీతి నెట్టి శోకమోదులును అహంకార మమకారాదులును లేక, శుద్ధ సత్వప్రధానుడై, సర్వభ్రాంతి రహితుడై, అచలుడై పరిపూర్ణుడై విరాజిల్లును. ఆతడే జీవన్ముక్తుడు అని శాస్త్రములు వక్కాణించియున్నవి. ఈ జీవన్ముక్తస్థితి అంతరశమునగల, తరతమ అనుభవస్థితి ననుసరించి బ్రహ్మవిదుడు, బ్రహ్మవిద్వరుడు, బ్రహ్మవిద్వర్యుడు, బ్రహ్మవిద్వరిష్ఠుడు అను నాలుగు విధములుగ విభజింపబడియున్నది. అయినను వారి దృక్పథమున దారతమ్యము అభావము. సిద్ధిలో గించిన్మాత్ర విభేదము గోచరము.

There are two ways of enjoying a theotrical show. Both spectators and those who take part in the show enjoy it. The actors identify themselves with their respective characters and take the show as real. Therefore, they cannot be said to enjoy the show in reality. But the spectators on account of their detached outlook, with their knowledge of the unreality of the show really enjoy it 119 నాటకము ననుభవించుట ద్వివిధము. నటకులును, ద్రష్టలును దాని ననుభవించెదరు. నటకులు తమ పాత్రలతో నేకత్వము నొంది, నాటకమును యదార్థ

119. Swami Nikhilananda : Mandukyopanishad, p xXxii.

ముగ స్వీకరించెదరు. కాన వారు నాటకమును యథార్థముగ ననుభవింపజాలరు. కాని ద్రష్టలు, వాటి పాత్రలతో సంబంధింపని దృష్టిచే నాటకమును నాటకముగనే జూచుచు, సత్యమున ఆనందించెదరని నిఖిలానందస్వామి వచించినట్లు, బ్రహ్మవిదులు సాక్షిభూతులై, కేవల ద్రష్టలై యుండి వ్యవహరించెదరు. అందుచే వారు, నిరంతర ఆనందమగ్నులై విరాజిల్లుట శాస్త్రవచనమేగాక, అనేక జ్ఞానుల జీవిత విశేషములు ప్రత్యక్ష నిదర్శనములేగదా!

జీవన్ముక్త్యనంతరము విదేహకైవల్యము, దేహవిముక్తి నాబడునది, ప్రాజ్ఞుని దేహపతనానంతర స్థితి. దానివిషయమై శాస్త్రము మౌనము. 'బ్రహ్మవిత్ బ్రహ్మైవ భవతి' అనునట్లు, బ్రహ్మవిదుడు బ్రహ్మమే యగుటచే బ్రహ్మమువలె 'యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ' (తై. 2. 4) అనుచందము అవాఙ్మానస గోచరమైన తత్త్వమై,'అదృష్టమవ్యవహార్యమగ్రాహ్యమలక్షణమచింత్యమవ్యపదేశ్య మేకాత్మప్రత్యయసార్యమై' (మాండూక్య. 7) యుండునని శ్రుతి తాత్పర్యము. అందుచేతనే అనుకూల పదములుగాక, వ్యతిరేకపదములతోడనే శ్రుతి, బ్రహ్మమును నిర్వచించియున్నది. Since from our human point of view it is not possible to describe the fullness of the absolute reality, the Upanishads do not describe precisely the conditions of ultimate freedom 120 మన వ్యావహారికదృష్ట్యా సంపూర్ణ సత్యమును వర్ణించుట సాధ్యము కాదు. పర్యవసాన విముక్తినిగూర్చి, యుప

---

120 Dr. S. Radhakrishnan : Indian Philosophy, vol. I. p 238

నిషత్తులు ఖండితముగ వర్ణింపలేదు. 'ముక్తి శరీరేంద్రియాభ్యా మాత్మనో ముక్తిత్వం ముక్తిః' శరీరేంద్రియములనుండి ఆత్మ యొక్క విమోచనమే ముక్తి అనియు, 'ఆత్మానం సంసారబంధా న్మోచయతీతి ముక్తిః ఆత్మను సంసారబంధమునుండి విడిపించు నది ముక్తి అనియు, 'శరీరేంద్రియానివిరహాణః ఆత్మనః అద్వితీ యతయా అవస్థానం కైవల్యం' శరీరేంద్రియములతో విడివడిన ఆత్మ అద్వితీయమై యుండుట కైవల్యము, 'నిర్వాంతి నిర్గ చ్ఛంతి దుఃఖాదయోస్మిన్నితి నిర్వాణం' దుఃఖాదులనుండి నిర్గత ములగుట నిర్వాణము, 'దుఃఖాదీనాం మోక్షణమవసానం మోక్షః' దుఃఖాదులయొక్క వినాశము మోక్షము, 'ఆత్మానాం పాశేభ్యః మోచయతీతి మోక్షః' (గురుబాలప్రబోధిక. 1. 145) పాశముల నుండి ఆత్మయొక్క ఎడబాటు మోక్షమనియు, ననేక రీతుల అమరము నిర్వచించియున్నది. కాని ఆ నిర్వచనములు వ్యతిరేక భావ భూయిష్టములేగాని, మోక్షస్థితి విషయ వివరణములెంత మాత్రము కాకపోవుట గమనార్హము. ప్రాపంచిక సుఖమునకును, మోక్షగత ఆనందమునకును దారతమ్యమును నిర్వచించుచు, యోగానందుడు, Pleasure is a double consciousness made up of an 'excitation consciousness' of possession of the thing desired and of the consciousness that the pain for want of the thing is felt no more That is, there is an element of both feeling and thought in it [121] కోరిన వస్తు ప్రాప్తిచే గలిగిన 'ప్రకోపజ్ఞానము', వస్తువులేమిచే గలుగు బాధ

---

121. Swami Yogananda : The Science of Religion, p 30.

గోచరింపకుండుట యను అజ్ఞాతస్ఫురణము అనబడు రెండింటి స్ఫురణమే సుఖము. అనగ నందు హృదయ స్ఫురణము, భావములు రెండును యిమిడి యున్నవి. కాని In Bliss there is no excitement, nor is it contact consciousness that 'my pain or want has been removed by the presure of such and such objects - - -.' It is a native state of the Spirit 122 ఆనందములో ఉద్రేకము లేదు. ఆ యా వస్తువులచే నా బాధ, ఆ లేములు నిర్మూలింపబడినవను స్పర్శాజ్ఞానముగూడ అభావము. అది ఆత్మయొక్క సహజ స్థితి అని అతడు వివరించియున్నాడు. కాన 'తమేవ ధీరో విజ్ఞాయ ప్రజ్ఞాం కుర్వీత బ్రాహ్మణః। నానుధ్యాయాత్ బహూన్ శబ్దాన్ వాచో విగ్లాపనం హితత్॥' (బృ. 4. 4. 21) బ్రహ్మజ్ఞానార్థుడైన జిజ్ఞాసువు ఈ విషయమునే గ్రహించి, ప్రజ్ఞను బొంది యుండవలెను. అతడు, బహుశాస్త్రముల నన్వేషింపరాదు. అవి అన్నియు వాచాలత్వముమాత్రమే యని ఉపదేశించుచు, ఉపనిషత్తు హెచ్చరిక జేసియున్నది. గాన సర్వైహిక సుఖముల కంటె నైతిక జీవితానందము, దానికంటె నాధ్యాత్మికానందము, అందును నద్వైతానుభవసుఖము సాటిలేనివై, ఒకదాని నొకటి అతీతించి, అగ్రస్థానము నద్వైతమునకే యొసంగియుండు పూర్వగ్రంథ తాత్పర్యము గమనార్హము.

122. Swami Yogananda : The Science of Religion, p 37.

ఐహిక సుఖముతెన్నియున్నను, చిత్త మాలిన్యముల బోనాడి, the theory that endeavours to explain the mutual relations of Nature, Man, and God 123 ప్రకృతి, మానవ, భగవంతుల పరస్పర సంబంధమును వివరింప యత్నించు సిద్ధాంతమే తత్త్వశాస్త్రము అను, పండిత సీతానాథ తత్త్వభూషణుని వాక్యమురీతి, తత్త్వశాస్త్రముద్వారా ఆ తత్త్వ త్రయ సంబంధము నారసి, Life is not merely a list of opportunities for self-satisfaction, but a set of obligations for realising spirtual good 124 స్వాత్మ తృప్తికై యొక అవకాశముల పంక్తియే జీవితముగాక, అది ఆధ్యాత్మిక శ్రేయో సంపాదనమునకై గల కర్తవ్యములుమాత్రమే యని రాధాకృష్ణుడనునట్లు జీవిత పరమావధిని గుర్తించి, Philosophical thought is inward action 125 అంత ర్ప్రవృత్తియే తత్త్వచింతన యనునట్లు అంతర్దృష్టిని పెంపొం దించుకొని, తదనుగుణ సాధన సాధించుచు, దత్ఫలితమగు ఆనంద మున మునింగి, The philosopher mediates on the deeper problems, and the people at large absorb the results of his enquiry 126 తత్త్వజ్ఞాని నిగూఢ సమ స్యల ధ్యానింప, సామాన్యప్రజలు ఆ యోచనా ఫలితముల

---

123. Pandit Sithanath Tatwabhushan : The Three Great Acharyas, p 63.

124. Dr. S. Radhakrishan : Vedanta Kesari, 192.9

125. Karl Jaspers : Way to Wisdom, p 162.

126. Dr. S. Radhakrishnan : The Role of Philosophy in Civilization

గ్రహించెదరనునట్లు, తన యనుభవ సుధను 'స తరతి స తరతి లోకాన్ తారయతి' (నా. భ. సూత్ర. 3. 50) అతడు తరించును, అతడు తరించును, లోకముల దరింబజేయును. 'స్వయం తీర్ణః పరాం తారయతి' తాను తరించి, పరుల దరింపజేయుననురీతి నెల్లరకాదర్శప్రాయుడై, సంతత ప్రశాంతచిత్తుడై, పరిసరముల శాంతిచంద్రికల బ్రసరింపజేయ యత్నించుట నెల్లర కర్తవ్యము.

తత్త్వచింతనము, తత్త్వార్థదృష్టి మొదలగు పదముల తాత్పర్యమెట్టిదను సందేహము యితవరకు మన గ్రంథముల జూచువానికి గలుగబోదుగాని, కొందరు మేధావులు దానిగూర్చి తెలిపిన విషయముల గొన్నింటిని వివరింప యత్నించెదముగాక!

జీవుడు అజ్ఞాత కారణవశమున, నీ ప్రపంచ సంబంధము గలిగి, యిట్లు శరీరధారియై జీవిత నౌకను నడుపుకొనుచుండగా, Philosophy arises when we become aware of our own weakness and helplessness [127] మనము మన అశక్తతను, అసహాయతను గుర్తించినపుడు తత్త్వార్థ దృష్టియు గలుగునని, ఎపిక్టిటస్ అను ప్రాచీన తత్త్వవిదుడు వచించురీతి, జీవుడు తత్త్వదృష్టిని ఆశ్రయించును. అనగా The precariousness of all worldly existence is a warning to us, it forbids us to content ourselves with the world, it points to something else [128] ఐహిక జీవితముయొక్క అస్థిరత్వము మనకొక హెచ్చ

---

127. Karl Jaspers: Way to Wisdom, p 19.
128. Karl Jaspers: Way to Wisdom, p 22.

చ్ఛరికయై, ప్రపంచ సుఖముల దృష్టి గాంచి యుండవలదని సూచించుచు, బర విషయములపై దృష్టి సారింపజేయును. The ultimate situations, death, chance, guilt and the uncertainly of the world-confront me with the reality of the world 128 మృత్యువు, ఆకస్మిక సంఘటనము, నేరము, ప్రపంచముయొక్క అస్థిరత్వముల, ప్రపంచముయొక్క యాథార్థ్యమునుగూర్చి సందేహముల గలుగ జేయునని, Epictituse ఎపిక్టిటస్ మొదలైనవారు సూచించి యున్నారు. అనగా ప్రస్తుత ప్రపంచ పరిస్థితులు తనకు అనుభూత మగు విషయములవలన విసిగి అసంతృప్తి జనించియు, నిత్యావ సరముల కొరకు గాంక్షవలనను మానవునికి, తత్త్వవిచారణ కాంక్ష అభివృద్ధి యగును. అనగ దా సమర్థుడనను భీరుత్వమున గాక, బ్రపంచముయొక్క యాథార్థ్యమును గుర్తించి, దానిపై నాధార పడుట అవివేకమనియు, బ్రపంచ సుఖములు క్షణికములేగాక దుఃఖభాజనములనియు వివేకముచే గ్రహించినవాడగుచున్నాడు. ఎంత కాదని దాని ద్రోయ యత్నించినను, అడుగడుగునకు, Philosophy is a task which man will face in one form or other as long as he remains man 129 ఎంత కాలము అతడు మానవుడుగ నుండునో అంత కాలము అతని నేదో యొక రూపమున నెదుర్కొను భారము తత్త్వచింతనమే అని, కార్ల్ జస్పర్సు వాకొనెను. అనగ మానవుడెంతకాలము బుద్ధినుప యోగించు శక్తిగలవాడై యుండునో అంతకాలము తత్త్వార్థదృష్టి

128. Karl Jaspers : Way of Wisdom, p 22.
129. Karl Jaspers : Way to Wisdom, p 14.

అతని వెన్నంటుచునే యుండునని భావము. అదే భావమును సతీశచంద్ర ఛటర్జీ గూడ It has been found again and again in the history of human thought that every reasoned attempt to avoid philosophy lands a thinker into a new kind of philosophy 130 తత్త్వదృష్టిని నిరాకరించు ప్రతి సహేతుక యత్నము, వినూత్న తత్త్వచింతన విధానమున యోచనాశీలుని దించుట, మానవ విజ్ఞాన చారిత్రమున మరల మరల గాంచబడియున్నదని తెలిపియున్నాడు. అందుచే మానవుడు దీర్ఘచింతనమున Metaphysics is consideration of what is implied in the fact of experience 131 అనుభవ సత్యమునగల యథార్థమును గ్రహించుటయే తత్త్వచింతనమనునట్లు గ్రహించి; కేవలము తన యనుభవము ప్రమాణహేతువు కానేరదు గావున Philosophy is only an endeavour to interpret the widening experience of humanity 132 విశాలము నొందుచున్న మానవ కోటియొక్క అనుభూతిని వ్యాఖ్యానించుకొనుటయే తత్త్వార్థము అనియు దెలిసికొని, అది is a human effort to comprehend the problem of the Universe 133 విశ్వసమస్య నవగాహనమొనరించు యత్నమెనది కేవలము భ్రాంతి జ్ఞానముగూడ నగుటకు అవకాశమేర్పడు

---

130. Prof Satischandra Chatarjee : An introduction to Indian Philosophy, p 160.

131. Dr. S. Radhakrishnan : Indian Philosophy, vol. 2.

132. Dr. S. Radhakrishnan : Indian Philosophy, vol. 2, p 19.

133. Dr. S. Radhakrishnan : Indian Philosophy, vol. 1, Introduction.

యనియు నెరింగి, తన యనుభూతియొక్క సత్యత్వమును విశ్వ దృష్టి వీక్షించి, సత్యమును గ్రహించుకొనవలయును. లేకున్న చున్నది. అట్లు చింతింప నా తత్త్వార్థదృష్టి it can only awaken, it can remind, and help to secure and preserve [134] మేల్కొలుపగలదు, జ్ఞాపకము జేయుగలదు, స్థిర త్వమునకు రక్షణమునకు దోడ్పడగలదు. అందుచేతనే Socre-tes సోక్రటీస్కూడ, భౌతిక దృష్టిలో మానవుడు తన అమూల్య మేధాశక్తిని దుర్వినియోగపరుపవలదని యుద్బోధించుచు, There is the mind of man. What is man, and what can he become? [135] మానవ చిత్తము గలదు. మానవు డనగ నెవరు? అతడేమి కాగలడు? అను విషయ చింతనము ప్రధానమని బోధించియున్నాడు. అటులయుని భౌతిక విషయ ములగాక గేవల ప్రపంచ సంబంధమునగల నైతిక విషయ పరి శీలన, తచ్చింతనము జాలదా యనినచో, నైతికశాస్త్ర గ్రంథకర్త యైన జాన్ ఎస్. మెకంజీ తన గ్రంథమున, The science of Ethics in incomplete in itself, and stretches out its hands to metaphysics [136] నైతిక ధర్మ శాస్త్రము స్వతః నసంపూర్ణమై, తత్త్వశాస్త్ర దిక్కునకు దిరుగును అని వ్రాసియున్నాడు. అవును. ఆ స్థితికి సంపూర్ణ నైతిక స్థితికి వచ్చినతోడనే అక్కడగూడ దృప్తిగాంచక, దానికాధారమైన, అనగా, ప్రకృతి మానవ సంబంధమునగాని, మానవ మానవ సంబంధమునగాని, గాక, మానవ ఈశ్వర సంబంధమైన తత్త్వ

---

134. Karl Jaspers: Way to Wisdom, p 51.
135. Socrates: The Story of Philosophy, of Will Durant, 6.
136. John S. Mackenjee, A Mannual of Ethics, p 435.

చింతనముననే శాంతి గలదని గ్రహించుకొనునని సువిస్పష్టము. అందుచే నీ శాస్త్రరాజము, మానవుని పూర్వానుభూతుల బరిశీలించి, వాని మానవకోటి యనుభూతితో బోల్చి, నిర్ధారణము గావించి, వాని యథార్థతను అవగాహనము గావించి, భవిష్యత్తు నాలోచించి, వర్తమాన కర్తవ్యమునకై కృషి సలుప ప్రోత్సహించును. The history of philosophy in its true meaning deals not with the past, but with the eternal and veritable present తత్త్వశాస్త్ర చారిత్రము భూతమునుగూర్చి వ్యవహరింపక, నిత్యమై వాస్తవమైన వర్తమానమునే జూచుచున్నటుల దన యథార్థ తాత్పర్యమున దెలుపుచున్నదని, Hegel హెగెల్ అను పాశ్చాత్య తత్త్వవేత్త పలికియున్నాడు.

పై వచనముల ప్రకారము యోచించినచో, నిష్పక్షపాత బుద్ధి గలవానికి, ధన కనక వస్తు వాహనాది సిరి సంపత్తులుగాక, భోగ్యమైన జడప్రకృతికి, భోక్తయగు జీవునికి బరస్పర సంబంధమును గలిగించి,వీనితో దా నప్రత్యక్షముగ సంబంధమునుంచుకొని అగోచరలీల నీ ద్వయమును బోషించుచు, రక్షించుచు, బాలించుచు నొక్కొకవేళ శిక్షించుచునున్న పరమేశ్వరుడే ముఖ్యమని తోచును. ఆ పరమేశ్వరుడెచ్చటనో, ఏ రూపముననో, ఎట్టులో నున్నటుల భావించి, అతని దూరస్తుని జేయు దోషమును గావింపక, నతని సర్వవ్యాప్తునిగ గ్రహించి, అతని చిత్కళా ప్రతిబింబమువలె దానుంటినని ఎరింగి, ప్రతిబింబ బింబసంబంధము కల్పితమనియు, నా సంబంధము బాధాకరమనియు శాస్త్ర, ఆప్త

వచనములద్వారా విని, మననము గావించి, సత్యము నెరింగి, చివరకు ఆ ప్రతిబింబమును బింబమున లయింపజేసి, యొక్కడై విరాజిల్లుటయే మానవ కర్తవ్యముగా మానవులు వ్యవహరించెదరని ఆశయము. అట్టి మతము సర్వాదరణీయమై Religion is a sacred subject - - - it has a right to our highest reverence 137 మతము పవిత్ర విషయము. అది, మన ఉత్కృష్ట గౌరవమునకు పాత్రము అని అనునట్లు, గౌరవనిలయమై, సర్వాలంబనమై యొప్పారి, సర్వమానవాభ్యుదయకారణమగుగాక అని ఆకాంక్ష. Therefore, my friends, the way out is that first and foremost we must keep firm hold on spirituality-that inestimable gift hadded down to us by our ancient forefathers 138 కాన మిత్రులారా! మన పితృదేవతలనుండి అమూల్య పారితోషికముగ నందజేయబడిన తత్త్వచింతనమునే గట్టిగ పట్టుకొనియుండుటయే ముఖ్య కర్తవ్యము, అదియే దారి.

# శంకరపూర్వాద్వైతము

## అద్వైతము - శ్రీ శంకరాచార్యులు

ఇంతవరకు మనము గ్రహించియున్నవిధాన నద్వైత సిద్ధాంతమతివిశాలమై, సర్వమత సర్వసిద్ధాంతములకాకరమై, సర్వ

137. Prof. F. Max Muller : The Science of Religion, p 4
138. Swami Vivekananda : The Complete Works, vol. 3, p 153.

సమన్వయరూప సర్వావలంబనీయ మతరాజమై, Like Taj Mahl in architecture, Sankara's Adwaita, in philosophy is one of the wonders of the World 139 గృహనిర్మాణ శాస్త్రమున టాజ్ మహల్‌వలె శంకరాద్వైతము తత్త్వశాస్త్రమున బ్రపంచమునగల సద్భుతములలో నొకటిగ బేరొందినదై, His influence, extra-ordinary from the first, has steadily grown, and now dominates most of the schools of Indian Philosophy 140 శంకరుని అసాధారణ ప్రతిభాప్రాబల్యమున బ్రథమనుండి యది క్రమక్రమాభివృద్ధినొంది, ప్రస్తుతమున భారతీయ తత్త్వ శాస్త్రమున అనేక సిద్ధాంతములయందాధిపత్యము వహించియున్న దని ఎల్. డి. బార్నెట్ వచించురీతి నతిప్రధానమై యొప్పారుటచే, రొనాల్డ్ షే ప్రభువు వాక్యములలో It, undoubtedly meets with the acceptance of an important section of the Hindus themselves, and it is wholly congenial to the idealistic trend of Indian thought 141 నది భారతీయులలో ముఖ్య భాగమున కవలంబనీయమై యుండుట నిస్సందేహమై, భారతీయ వైజ్ఞానిక తత్త్వమునకు సంపూర్ణముగ అనుగుణమైనదగుటచే, భారతీయాధ్యాత్మిక సంస్కృత చారిత్రమున నతి ప్రాచీనములై షడ్దర్శనముల యనంతరమైన సర్వాచీన సిద్ధాంతములలో, నీ అద్వైత సిద్ధాంతమునకు బ్రముఖమును ప్రధానమును అగు ప్రథమస్థాన

139. Dr. P. T. Raju : Prabuddha Bharatha, 1956, p 34.
140. Dr. L. D. Barnett : The Heart of India, p 38.
141. Earl of Ronaldshay : The Heart of Aryavarta.

మొసంగుట సమంజసమను అభిప్రాయమున, సర్వ సిద్ధాంత సౌరభమున నద్వైత ఖండము అర్వాచీన సిద్ధాంతముల నగ్ర స్థానము నలంకరించియున్నది. Ever since Sankara's time the majority of the best thinkers of India have been men belonging to this school 142 శంకరకాలమునుండి భారతీయ ఉన్నత శేముషీదురంధరులలో నధిక సంఖ్యాకులు, ఈ సిద్ధాంతావలంబకులే యయియున్నారని శ్రీశంకర, రామానుజ భాష్యానువాద కర్తయు, వ్యాఖ్యాతయు నగు జి. థిబేట్ అనునట్లు, నదియే అఖిల ధీమంతుల నాకర్షించి యుండుటచే సౌరభ నిర్ణయమే సముచితమని విజ్ఞులకు దోపక మానదు.

ఈ అద్వైత సిద్ధాంతము అతి ప్రాచీనమై, When and by whom the threads that constituted the warp and woof of Adwaita were spun, we do not know - - - 143 ఎప్పుడు, ఎవరిచేత నీ యద్వైత సిద్ధాంతముయొక్క యల్లిక జరిగియున్నది. అను విషయము మనకు అగ్రాహ్యము. అందులకు గారణము, అది దేశకాలముల నెదుర్కొనియుండిన వేదముల సహోత్పన్నమై, వ్యక్తుల నతీతించి, కేవల బ్రహ్మమునే జూపించు ఆధ్యాత్మిక శక్తిస్వరూపములైన ఉపనిషత్ హృదయసీమయై, పురాణప్రదములైన పురాణేతిహాస స్మృత్యాదుల యందధిష్ఠానమై యొప్పు నద్వైత సిద్ధాంతము యొక్క పుట్టుపూర్వోత్తరముల నిర్ణయింప గష్టసాధ్యమే. అయి

142. Dr. G. Thibaut : The Vedanta Sutras Sankara Bhashya. Introduction.

143. Prof S. S. Suryanarayana Sastry : Sankaracharya, p 74.

నను ఈ చారిత్రక యుగమున The main fabric of Adwaita, the garment which has clothed Indian thought for so much of domestic as well as foreign service through these long centuries, that is essentially the handiwork of Sankara, the youthful preceptor of elderly disciples, the nondualist champion of six faiths, the orthodox opponent of ritualism, and the rational opponent of logicism 143 ఈ దీర్ఘ శతాబ్దములనుండి దేశీయాన్యదేశీయ సేవాకార్యముల, భారతీయ విజ్ఞానముల నావరించినట్టి అద్వైతముయొక్క ముఖ్యనిర్మాణము, వృద్ధశిష్యులకు యౌవనోపదేశకుడును, షణ్మతములకు నద్వైతసిద్ధాంత వీరుడును, కర్మసిద్ధాంత ఖండనోద్యమ సనాతనపరుడును, తర్కవిధానమునకు యౌక్తిక ప్రత్యర్థియునగు శంకరుని నిర్మాణమే యగును. అందుచే To him all eyes have turned and will continue to turn with loving reverence, so long as man retains his nobility and wisdom its prestige 143 మానవుడెంత కాలము తన శ్రేష్ఠత్వమును, వివేకమును, దాని గౌరవమును గలిగియుండునో అంతకాలము అఖిలనేత్రములాతని దిక్కునకే ప్రేమగౌరవములతో బ్రసరించుచునే యుండును అని ఎస్. ఎస్. సూర్యనారాయణశాస్త్రి వచించి యున్నాడు. అందువలన బూర్వోత్పన్నమైన అద్భుత అద్వైత సిద్ధాంతమును, అమానుష శక్తిధనులైన శ్రీ శంకరభగవత్పాద ధీస్పర్శతో నఖండమై, అజేయమై, పూర్వాధునముల సర్వదేశ

143. Prof. S. S. Suryanarayana Sastry : Sankaracharya, p 74.

ములనేకైక సిద్ధాంత చక్రవర్తియై విరాజిల్లినదని తాత్పర్యము. The loftiness, calmness, and firmness of his mind, the impartiality with which he deals with various questions, his clearness of expression all these make us revere the philosopher, more and more 144 అతనిలోగల ఔన్నత్యము, శాంతము, మానసిక స్థిరత్వము, వివిధ సమస్యలతో వ్యవహరించునపుడు అతని నిష్పాక్షిక బుద్ధి, అతని విస్పష్ట వివరణములు అన్నియు, ఆ తత్త్వవేత్తను అధికతరముగ గౌరవింపజేయును అనియు ఎస్. భాష్యాచార్యులు వచించియున్నాడు. కాని అట్టి గౌరవప్రపత్తులు ఈ మహాత్మునకుమాత్రమే యబ్బుటకు గారణమేమి? ఇతని గొప్పదనమేమి? కేవలము పాండిత్యమా? అటులైనచో ఆతని బూర్వాపరముల నాతని మించిన విద్వత్సార్వభౌములెందరు లేరు! ధీకుశలతయా? అతనితో వాదే పోరాడి ఓడిన వ్యక్తులు తక్కువవారలా! సన్న్యాసమా? తన గురుపరంపరలో నెందరు అధికతరశ్రేష్ఠులైన సన్న్యాసులు లేరు? అయిన కారణమేదియై యుండును? ఈ సమస్యలకు సమాధానముగ, తత్తుల్యుడై, సర్వ ఆధునిక ప్రపంచమును అద్వైతభావతరంగములచే ముంచి ఊగించిన వేదాంతసింహము వివేకానందుడే ఆ రహస్యమును వెల్లడించియున్నాడు. Compare the great teachers of religion with the great philosophers. The philosophers scarcely influenced anybody's inner man, and wrote most marvelous books. The religious teachers, on

144. Pandit N Bhashyacharya : The Age of Sankara, p 48.

the other hand, moved countries in their life time [145] గొప్ప మతాచార్యులను గొప్ప తత్త్వవేత్తలతో బోల్చుము. ఎవని హృదయముల నెవ్విధముగను గదలింపజాలకపోయినను, దత్త్వవేత్తలు అద్భుత గ్రంథముల రచించియుండిరి. కాని మతాచార్యులు తమ జీవితకాలములోనే దేశముల గదలించివైచిరి. కారణమేమి? The difference was made by personality. In the philosopher, it is a faint personality that influences, in the great prophets it is tremendous. In the former we touch the intellect, in the latter we touch life [145] వ్యక్తిత్వమువలననే వ్యత్యాసమేర్పడినది. తత్త్వవేత్తలో బ్రభావమును జూపించునది దుర్బల వ్యక్తిత్వము. గొప్ప ప్రవక్తలలో నది మహాద్భుతము. ప్రథమునితో మనము ధీకుశలత గాంచెదము. ద్వితీయునిలో హృదయమునే మనము స్పృశించెదము అని పలికియున్నాడు. అందుచే నీ రెండు తత్త్వములు, మనోహృదయములు ఎవనిలో సంపూర్ణవికాసము నొందునో అట్టి వ్యక్తి సంపూర్ణ వ్యక్తమై, వ్యష్టిత్వమునుండి సమష్టిత్వము నందుకొనుచు, అఖిల వ్యష్టిలోకమునధీనము గావించి, ఆకర్షించునని వివేకానందుని తాత్పర్యము. అట్లు శ్రీ. శంకరులు కేవల తత్త్వవేత్తయై, తన మేధాశక్తిచే బ్రాచీనార్వాచీన పండితబృందమునకింకను అజ్ఞాతమై అగ్రాహ్యములని దోచు యుద్గ్రంథముల రచించుటయేగాక తన యసాధారణ, అమానుష, అద్భుత పరిశుద్ధాధ్యాత్మిక శక్తిచే సకల సాధకలోకము నాకర్షించి, హృదయముల గదలించి, సర్వాదర్శ

145. Swami Vivekananda : The Complete Works, vol. 2, p 15.

మూర్తియై వెల్వొందుట గమనార్హము. అట్టి అద్వయాధ్యాత్మిక శక్తి లోకమున సహస్రాధిక వత్సరముల బిమ్మట జగత్తున దల లెత్తుచున్న నాస్తిక దుర్మతాది సంఘవినాశక శక్తుల నరికట్టి, సద్ధర్మ పరిపాలనమునకై అవతరించుచుండుట భారతీయ సంస్కృతీ జ్ఞానులకు విదితమే.

అందుచే నా అనిదంపూర్వ స్వరూపుడు, తా నిర్వచించి వివరించిన సిద్ధాంతము నవీనముగాక, గురుపరంపరాగతమై పేతెంచుచున్నను నవీన భాషా సౌష్టవమున, వినూత్న వివరణా కౌశల్యమున, అజేయ తర్క ప్రాభవమున, అత్యద్భుత భావ విజృంభణమున, మృదుమధురశైలితో, ఆకర్షణీయ విధానమున, వచన రచనములద్వారా ప్రచారము జేసియుండుటచే, అద్వైతా చార్య, అద్వైతమతస్థాపక, మొదలగు బిరుదులతోగూడిన గౌర వము ఆ యాచార్యవర్యునికి లభించెను. పూర్వము ప్రసంగవశ మున నీగ్రంథమున వివరింపబడినరీతి ఉపనిషత్తులు మాయావాద మును అనేక వివరణములతో వచించియున్నను, Maya Vada, theory of Maya, his (Sankara's) especial contribution to the world of philosophy 146 మాయా వాదమనబడు మాయాసిద్ధాంతము, తత్త్వశాస్త్రలోకమున శంకరుని ముఖ్యమగు కానుక అను భావములును దొర్లినవి. తత్త్వమస్యాది మహావాక్యములు ఉపనిషత్తులనుండియే శంకరునిచే స్వీకరింప బడియున్నను, మున్నే యనేక యద్వైతాచార్యులచే నవి బహుళ ముగ వివరింపబడియున్నను, Sankara stood forth as

146. Editor: Prabuddha Bharata, 1955, p 278.

the most uncompromising Monistic Teacher of India expounding in inimitable language the great truth of the familiar formula 'Tatvamasi' 147 తత్త్వమసి అను పరిచిత సత్యమును అనుపమ భాషలో వివరించుటయందు శంకరులు సమాధానపడని ప్రముఖ భారతీయాద్వైతవాదిగ నిలిచెననియు, వచింపబడెను.

కాని Fountain head of Religion 'ఆధ్యాత్మిక స్రవంతి' అను గ్రంథమునకు ప్రఖ్యాత రచయిత అయిన గంగా ప్రసాద్ వచించినట్లు, A comparitive study of religions will show that there has never been any real invention in the realm of religion, that the main principles which constitute its essence are as old as the human race, and that these considerations warrant the conclusion that the germs of religious knowledge were vouchsafed by God to man in the beginning of this creation 148 మతముల సంబంధార్థక పఠనము, మతవిషయమున నెట్టి యథార్థ వినూత్న కల్పనము జరిగియుండలేదనియు, దాని ముఖ్యాధారక సూత్రములు మానవకోటివలె ప్రాచీనములనియు బోధించును. ఈ సృష్టి ప్రారంభమున, నీశ్వరుడే మానవునకు మత విజ్ఞాన బీజముల ప్రసాదించియుండినట్లు యీ విచారణములు నిర్ణయించును. These founders are all transmitters,

147. Sri C. N. Krishnaswami Aiyer : The Three Great Acharyas, p 21.

148. Sri Ganga Prasad Jain : The Fountainhead of Religion, p 1.

not original teachers 149 కాన నీ మతస్థాపకులు ప్రథమ గురువులుగాక, పూర్వ విషయముల నందించువారే యని హెచ్. పి. బ్లావట్స్కీగూడ వ్రాసెను. Each man, poet or philosopher, inhales much before he exhales కవిగాని తత్త్వవిదుడుగాని ఉచ్చరించుటకు పూర్వము ఎక్కువ గ్రహించును సూక్తిగ, There has been no entirely new religion since the beginning of the world 150 ప్రపంచ ప్రారంభమునుండి సంపూర్ణముగ క్రొత్త మతము లేదు అని మాక్సుముల్లరు మహాశయుడు తెలుపురీతి, The individual philosopher is but a mouth-piece of tradition and that tradition goes back farther and farther the more we try to fix it chronologicelly 151 వ్యక్తిగతముగ తత్త్వవేత్త సంప్రదాయమునకు వక్త. ఆ సంప్రదాయమును కాలక్రమమునననుసరించి నిర్ణయింప మనము యత్నింప, వెనుక వెనుకకు నది వెడలుచుండును. అనగా No philosopher owes everything to himself. He growes from a soil that already made for him, and he breathes an intellectual atmosphere which is not his own making 152 తా వచించున దంతయు నే తత్త్వజ్ఞనిదియు గాదు. అతనికొరకు పూర్వమే

---

149. Madame H. P. Blavastky : The Secret Doctrine, vol. 1, xxxvi.

150. Prof. F. Max Muller : Chips From a German Workship, vol. 1, p x.

151. Prof. F. Max Muller : The Six Systems of Indian Philosophy, p 87.

152. Prof. F. Max Muller : The Six Systems of Indian Philosophy, p 2.

సంసిద్ధమైన క్షేత్రమున నతడభివృద్ధిజెందును. తనచే నిర్మింపబడని యొక విజ్ఞాన వాతావరణమున నతడు జీవించును అనియు మానవబుద్ధిజన్య వాతావరణమున నెల్లపుడు సర్వసామాన్యమగు భాషవలె కొంత తత్త్వార్థ విషయసంపద యుండుననియు నాతని విశ్వాసము [153] అందుచే నెవరుగాని క్రొత్త భావములతో క్రొత్త మతముల నెప్పుడును స్థాపించి యుండలేదని విశదమగుచున్నది. అదియునుగాక, నా సిద్ధాంతములైనను నొక తత్త్వవేత్తయొక్క మేధాజనితములు గాక, They are not the work of one thinker or of one age but a succession of thinkers spread over a number of generations [154] ఆ సిద్ధాంతము ఒక జ్ఞానికిగాని, ఒక కాలమునకుగాని జెందక, ననేక తరములకు జెందిన అనేక వేత్తలచే నిర్మితము అని ఆచార్య రాధాకృష్ణుని అభిప్రాయము. అయినను జరుగుచున్నదేమి? ప్రథమముననే వచింపబడియున్నటుల, నొక్కొక్క మేధావి, తన వ్యక్తిత్వమును, నాటి పరిస్థితులను, బూర్వ సిద్ధాంతమున మేళవింపజేసి, దానికి గ్రొత్తందనమును గల్పించుటచే, నది వినూత్నమను భ్రాంతి యేర్పడుట సహజము. గంగాప్రసాదుడిదే భావమును వెలిబుచ్చుచు, Every new religion was in its beginning an attempt to reform the older religion as it then existed and a protest against its abuses [155] ప్రారంభదశలో బ్రతి మతము, బూర్వ మత

---

153. Prof. F. Max Muller : The Six Systems of Indian Philosophy, p 104.

154. Dr. S. Radhakrishnan : Indian Philosophy, vol. 2, p 22

155. Sri Ganga Prasad Jain : The Fountainhead of Religion, p 4.

మును నాడున్న రూపమును, దానిపైగల నిందల దొలగించి సంస్కరించుటయే యగును అని వక్కాణించియున్నాడు.

అసలు యీ సిద్ధాంతము దేశకాలబద్ధముగాక, సర్వకాల, సర్వదేశములకన్వయ సత్యముఁగ స్వీకరింపబడవలసియున్నను [156] ఎస్. ఎస్. సూర్యనారాయణశాస్త్రి వచించునట్లు the Adwaita tradition, of which Sankara was the exponent, can always claim to be much older than Sankara [157] శంకరుని తనకు వ్యాఖ్యాతగ గల అద్వైత సంప్రదాయము, శంకరునికంటె జాల ప్రాచీనమని వాదింప నవకాశమెల్లప్పుడును గలదు. అది నిర్వివాదము. Perhaps the most trustworthy exponent of the Arya Dharma or Brahmanical system was the great teacher Sankara [158] ఆర్యధర్మమునకు, బహుశః ప్రముఖాచార్యుడైన శంకరుడే విశ్వసనీయ వ్యాఖ్యాతగ మోనియర్ విలియమ్స్ గూడ తెలిపియున్నాడు. వేదాంతసూత్రకర్త వ్యాసునికంటె శంకరుడే బ్రాహ్మణ ధర్మమునకు అవతారమనియు నాతని విశ్వాసము. అద్వైతమేగాక ద్వైత విశిష్టాద్వైతములుగూడ మధ్వ రామానుజ బుద్ధిజనితము గావనియు, నవియు have been current in India almost from time immemorial [159] భారత

156. Prof. F. Max Muller : The Six Systems of Indian Philosophy, p 121.
157. Prof. S. S. Suryanarayana Sastry : Sankaracharya, p 9.
158. Dr. Monior Williams : Religious Thought and Life in India.
159. Swami Vivekananda : The Complete Works, vol. 3, p 396.

మున అనాదికాలమునుండి వ్యవహారమున నున్నట్టివే యనియు వివేకానందుని వాక్యము.

పై విషయ నిర్ధారణమునకై కొంత గ్రంథావలోడనము గావించినచో శంకరుడు అద్వైత సిద్ధాంతమునకు ప్రథమ నిర్మాత కాకుండుటయే గాక వ్యాఖ్యాతయు గాదనియు గ్రహించెదము. అతని గురుపాదులు గోవింద భగవత్పాదుల గ్రంథరచనము మనకు లభింపకపోయినను, నా భావముల శంకరునకు బోధించి రచనమునకు ప్రోత్సహించిన పూర్వాద్వైతాచార్యుడు అతడు. కొంచెము వెనుకకు నేగినచో, నాతని గురువర్యుడనబడు గౌడపాదాచార్యులు, స్పష్టముగ నద్వైతప్రబోధ గావించు మాండూక్యోపనిషత్తునకు అద్వైత వివరణమున నొక సిద్ధాంతరూపముగ అద్వైత తత్వమునకొక స్వరూపమొసంగి కారికలను వివరించి యుండుటచే, నాతడు శంకర పూర్వాద్వైతాచార్యులలో ప్రముఖ వ్యక్తియే. ఆ గౌడపాదునికిగూడ నాధారభూతమైన సూత్రకర్త బాదరాయణ వ్యాసుడును, అతఃపూర్వముండియున్న కాశకృత్స్నాదిక ఋషీశ్వరకోటియు, ఉపనిషదృషిసత్తములును, అతిప్రాచీన అద్వైతాచార్యకోటియే. అంతియగాక శంకరుడు తన రచనములందైనను దా వివరించు సిద్ధాంతము స్వకల్పితమని వాకొనకుండుటయే గాక, his constant appeal to Sruti, is really to be taken as an acknowledgement of his past, of the debt he owed to his illustrious predecessors who gave him a clue, - - to the philosophy of which he afterwards become a

champion 160 తన భూతకాల విజ్ఞానమునకు గృతజ్ఞతా సూచి కముగను, తరువాత తాను ప్రముఖ ప్రచారకుడుగ నేర్పడిన సిద్ధాంతమునకు, దనకు రహస్యము నెరింగించిన సుప్రఖ్యాత ప్రాచీనులకు, దన ఋణవిమోచనమునకై శంకరుడు తరచు శ్రుతి ప్రమాణముల స్వీకరించును అని ద్రుపద్ ఎస్. డేసన్ అభిప్రాయము. కాని యథార్థమునకు It is indeed difiicult to decide whether Sankara's philosophy is a continuation or re-interpretation of or an addition to the old teaching. We can not distinguish the old from the new, for in the living the old is new and new old 161 శంకర సిద్ధాంతము పూర్వవిషయమునకు అనుసరణమనిగాని, పునర్వ్యాఖ్యానమనిగాని, అనుసంధానమనిగాని తెలుపుట చాల కష్టము. జీవనమున పాత, క్రొత్త, క్రొత్త, పాత, మేళన మొందునుగాన, ప్రాచీనార్వాచీనముల విడదీసి గ్రహింపజాలమని, రాధాకృష్ణపండితుని నిర్ణయము. అనగ శంకరుడు తన అద్వితీయ మేధాశక్తిచే, అనుభవజనిత మహత్తరానుభవకోటిచే వేదవేదాంతప్రబోధితమై, అవిచ్ఛిన్న ఆచార్య పరంపరాగతమై జనుదెంచు అద్వైతవాద గ్రహణము నామూలాగ్రము గ్రహించి, అజేయ శేముషీదురంధరత్వమును, దాన మేళవింప జేసి వివరించియుండుటచే, దానికి ఒక వినూత్న వికాస మేర్పడి నూత్న రూపముగలదానివోలె వెల్గొందుట విస్పష్టము. అందుచే నది శంకర కల్పిత సృష్టి యను అపోహ చదువరుల కేర్పడుట సహజమగుచున్నది. కాన శంకరునితో నద్వైతము ప్రారంభింప

---

160. Druped S Deson: Prabuddha Bharata, 1935, p 479.
161. Dr. S. Radhakrishnan: Indian Philosophy, vol. 2, 467.

బడక అతఃపూర్వమే యుండి, యీతని అద్వితీయ రచన వచన తపోశక్తులచే బ్రాబల్యము పొంది. నాటినుండి యావత్ప్రపంచ మేధాసంపన్నుల కాలవాలమై, శరణ్యమై, వికాసమై విరాజిల్లి యున్నదని యీ మీమాంసవలన మనము గ్రహింపగలిగితిమి. అట్లగుచో శంకరపూర్వాద్వైత ప్రమాణములెవ్వియో తిలకించి కొన్నింటి నిక జూచెదముగాక! సారగ్రహణము గావించెదముగాక!

## అద్వైతము - వేదము

పూర్వ గ్రంథభాగమున సవివరముగ బరిశీలింపబడి నిర్ణయింపబడినటుల శ్రీశంకర భగవత్పాదులకు బూర్వము అద్వైత ప్రమాణములు పెక్కు గలవని సిద్ధము. శంకరునికి బూర్వము శాస్త్రము బహుళ విస్తరముగనేయుండి అతనికాధారమైయున్నట్లు గాంచియున్నారము. వేదకాల శంకరకాలమునకు మధ్యకాలమున శాస్త్రమనంతముగ నభివృద్ధిగాంచి అతివిశాలమై యుండియు, నతిపురాణములగుటచేతను, ముద్రణా సౌకర్యముల భావమగుటచేతను, లిఖితములైనను చిరకాలము భద్రపరుపబడుట దుర్లభమగుటచేతను శిథిలములై నశింప, గొన్నిమాత్రము గురుపరంపరా ప్రభావమున లభించినను, నవియు, నధికసంఖ్యాకములుగ జిరకాలమునుండి భారతభూమిపై దండయాత్రలు సాగించియున్న పర సంస్కృతీపరుల హస్తంగతములై దగ్ధములైనవి. కాని మేధావులైన కొందరు అధ్యయనపరుల మహాత్మ్యమున వారి ముఖతః అవచ్ఛిన్నముగ వచ్చినవి కొలదిగనే మిగిలియుండుట విదితమే. అయినను శంకరు కాలమున, మనకు లభించియున్న

గ్రంథములకంటె నధికతరముగ వేదాంత సాహిత్యము గ్రంథ రూపముననను, వాగ్రూపముననను నాడు నున్నటుల దెలియుచున్నది అందుచే వీని ప్రభావము శంకరునిపై దప్పక బ్రసరించి, అతని అద్భుత గ్రంథరచనమునకు దోడ్పడియుండె ననుట నిర్వివాదము.

అందు ముఖ్యమైనవానిని విచారించిచూచినను, అట ప్రధానముగ వేద, ఉపనిషత్, సూత్ర, పురాణ, ఇతిహాస, తంత్ర, స్మృతి, జైన బౌద్ధాదులు కానుపించును. వాని నన్నింటిని సంపూర్ణముగ బరిశీలించి, విచారించి రచింప నుద్యమించిన, నొక్కొక్కటి యొక్క బృహద్ గ్రంథముగ రూపొందుట సహజమే. కాన అతి క్లుప్తముగ వానిలో గొన్నింటినిమాత్రము అవలోడన మొనరింప యత్నించెదముగాక!

కాలక్రమము ననుసరించి ప్రథమమున వేదములనే స్వీక రించి చూచెదముగాక! ఉపనిషత్తులు వేదభాగములై యున్నను, వాని ప్రాధాన్యమును అనుసరించి ప్రత్యేకముగ విచారించుట సమంజసమని తలంపు.

'వేదోఽఖిలో ధర్మమూలం' (మనుస్మృతి. 2. 6) వేదమే అఖిల ధర్మమునకు మూలమగుటచే 'వేదమేవ సదాభ్యస్యేత్' (మను. 2. 166) వేదమునే ఎల్లప్పుడభ్యసింపవలెను. అది పితృ దేవమనుష్యాణాం వేదశ్చక్షుస్సనాతనం। అశక్యం చాప్రమేయం చ వేదశాస్త్రమితి స్థితిః॥' (మనుస్మృతి. 12. 94) పితృ దేవ మనుష్యులకగోచర విషయములందు వేదమే నేత్రమువలె బ్రమా ణము. అది సనాతనము, అప్రమేయము అనియు, 'విభర్తి సర్వ

భూతాని వేదశాస్త్రం సనాతనం' (మను. 12. 99) నిత్యమైన వేదశాస్త్రము సర్వదా సర్వభూతముల భరించుచున్నది అని పలు విధముల మనువుచే నుతింపబడిన వేదము, The Vedas are the oldest of the books of the library of mankind [162] మానవజాతియొక్క గ్రంథాలయమున నతిప్రాచీన గ్రంథములు అని మాన్యులేయన్ డెల్బాస్ మొదలగు ననేక ప్రాక్ప్రతీచీ పండితవర్గముచే నిశ్చయింపబడి నుతింపబడిన వేదములు, పరమ సనాతనములై, పరమ ప్రమాణములై, సర్వవిధముల మానవసంస్కృతీ విజృంభణమునకును, మానవాభ్యుదయమునకు, ఋర్వోక్తమురీతి లౌకికాధ్యాత్మికవిధానముగ దోడ్పడుచునుండుట సువిదితము. అందు బేర్కొనబడిన ఋషీశ్వరులు బోధింపలేదు, సిద్ధాంతపరుపలేదు, రచింపనుగూడ లేదు. కాని వివేకానందుని వచనములలో Music came out of their hearts [163] వేదగానము వారి హృదయములనుండియే వెలువడెను.

అవి అంతటి అమూల్యములై ధర్మమూలములై యొప్పారుటచే, సకల సిద్ధాంతముల the germs are to be found in the Vedas [164] బీజములు వేదములందు గోచరించును. పూర్వమీమాంసా శాస్త్రము వేదమునగల కర్మకాండ సంబంధముగల బ్రాహ్మణములతో నన్వయించియుండ, while the other, alone among the philosophical systems

162. Manulayan Delbas : Vedas International Literary Association, Paris 4-7-54
163. Swami Vivekananda : The Complete Works, vol. 2, p 140.
164. Sri Ganga Prasad Jain : The Fountainhead of Religion, p 1.

represents a methodical development of the fundamental non-dualistic speculations of the Upanishads 165 రెండవది యగు వేదాంతము యితర తత్త్వార్థ సిద్ధాంతములకంటె నుపనిషత్తులగల ప్రధాన అద్వైత విషయముల సక్రమవిధానమున రూపించుచున్నదని ఏ. ఏ. మాక్డోనెల్ వచించు రీతి వేదమున నారణ్యకభాగమును వేదాంతము గ్రహించి, అందున్న అద్వైతభావముల స్వీకరించి, క్రమబద్ధ మొనరించి దానికి సిద్ధాంతరూపమొసంగెను. అందుచేతనే వివేకానందుడును, Work hundreds of lives out, search every corner of your mind for ages - and still you will not find one noble religious idea that is not already imbedned in that infinite nude of spirituality (Veda) 166 శతాధికజన్మల గృషి సల్పుడు, కొన్ని యుగములు మీ చిత్తమున మూరుమూలలగూడ బరిశోధింపుడు. అయినను, అనంతాధ్యాత్మిక ఘనస్వరూపమైన వేదమున బూర్వమే యుండని దివ్య తాత్త్వికభావము నొక్క దానినైనను గాంచజాలవు అని ఘంటాపథముగ వక్కాణించియున్నాడు.

ఈ విషయమున నెక్కువగ గృషి చేసియున్న కలకత్తా విశ్వవిద్యాలయాచార్యుడగు కోకిలేశ్వరశాస్త్రి, ఋగ్వేద అద్వైత సంబంధమునుగూర్చి వ్రిస్తావించుచు, The importance of the Rig Veda lies in the fact that it is the original store-house of the Indian Idealism which

165. Dr. A. A. Mac donell : A History of Sanskrit Literature, p 385.

166. Swami Vivekananda : The Complite Works, vol. 4, p 289.

supplied the materials of Adwaita Veda which subsequently gave rise to the admirable system of Vedanta 167 కాలాంతరమున వేదాంత సిద్ధాంతముగ రూపొందిన అద్వైత వాదమునకు విషయముల నందించిన భారతీయ అద్వైత వాదమునకు ఋగ్వేదమే ఆదిమాగారము, మరియు We have found ample material in the Rig-Vega which unmistakably proves that the theory of Non-dualism as interpreted by Sankara in his Vedanta System or philosophy runs throughout this stupendous work from the beginning to the end 167 ఈ బృహద్గ్రంథమున నాద్యంతములవరకు దన వేదాంత సిద్ధాంతములో శంకర ప్రతిపాదిత అద్వైతవాదము ప్రవహించుచునే యున్నదని, నిర్దుష్టముగ నిరూపించు వస్తువు ఋగ్వేదములో బహుళముగ గలదని మేము గ్రహించగలితిమి అనియు వ్రాసియున్నాడు.

ఋగ్వేదమున నింద్ర, వరుణ, మిత్ర, సూర్య, ఉషస్, అగ్న్యాదిక దేవతలగూర్చి యనేక రీతుల ప్రార్థనలు గోచరించుచున్నను, Polytheism perfects itself into monotheism by a process of growth 168 బహుదేశవాదము క్రమాభివృద్ధినొంది, స్వయముగా ఏకేశ్వరవాదమై సంపూర్ణమగును అని ఏ. సి. బోస్ నుడివినట్లు, వేదమున గోచరించిన

---

167. Pandit Kokileswar Sastry : A Realistic Interpretation of Sankara Vedanta, p 200.

168. A. C. Bose : The Call of the Vedas, p 17.

యొక దేవుడు సృష్టి స్థితి లయ కర్త అను విధానము బహుళ సందేహములకవకాశమొసంగి, దేశ కాల వస్తు బద్ధత్వము అతనికి నసంర్భమనియు దోచి, క్రమముగ సర్వవ్యాప్త, నిరవయవ నిర్వ్యాపార, నిరవధిక, నిరంతర, నిరతిశయ, తత్వమే ఆ భగవత్తత్వముగ గ్రహించి, అనుభవమున జూచి, దానికి బ్రహ్మమని, సత్, తత్ మొదలగు అలింగ ప్రస్తావనతోగూడిన అద్వైతభావమున మునిగి అది పరిపూర్ణమగుచున్నది. కాని పైనుచ్చరింపబడినచందము వేదములతో నీ క్రమాభివృద్ధి వ్యక్తముకాక, యీ విభిన్న దృక్పథములన్నియు దాన దోచుచు నుండుటచేత, వేదమునకు గాలనిర్ణయము చేయబడినచో, నా కాలమున నీ సిద్ధాంతములన్నియు నా నాటి వాతావరణమున నెగురుచున్నవని స్పష్టము. కాక సర్వసాధకులకుపయుక్తముగ వివిధ సిద్ధాంతముల వివరించి, పాత్రోచిత మతముల సాధకులు స్వీకరించు నవకాశమొసంగ నిట్లు వాని బ్రస్తావించి యుండుననియు గ్రాహ్యము. ఎటులైనను వేదమాత ప్రేమైకజనని కావుటచేత వివిధ స్థాయిలలోనున్న స్వీయ శిశువుల శ్రేయస్కామియై, విభిన్న ఆహారపదార్థముల వారికై సంసిద్ధపరచియుండునని విస్పష్టము.

'య ఆత్మదా బలదా యస్య విశ్వ ఉపాసతే ప్రశిషం యస్య దేవాః। యస్యచ్ఛాయామృతం యస్య మృత్యుః కస్మై దేవాయ హవిషా విధేమ॥' (ఋ. 10. 121. 2) ఆత్మజ్ఞానము నెవడు ప్రసాదించునో, బలము నెవడొసంగునో, ప్ర[illegible]మెవని నర్చించునో, ఎవని యాజ్ఞను బుధులు పాలించెదరో. ఎవని నివాసమమృతత్వమో, ఎవని ఛాయ మత్యువో, అ[illegible]రకె మనము మన ప్రార్థనముల నర్పించుచున్నాము. ఈ [illegible]కన

ఏకేశ్వరోపాసనమేగాక, వేదాంతమునకు ముఖ్యమైన ఆత్మజ్ఞాన స్మరణముగూడ గావింపబడియున్నది. మరియొక ఋక్కు 'సహస్ర శీర్షా పురుషః సహస్రాక్షః సహస్రపాత్ స భూమిం విశ్వతో వృత్వాఽ త్యతిష్ఠద్ దశాంగుళం॥' (ఋ. 11. 90. 1) అనంత శిరములు, అసంఖ్యాక నేత్రములు, అగణిత పాదములు గల పురుషుడు, సర్వదిక్కుల భూమి నావరించి, సకలదిక్కుల నతిక్రమించెను అని ఋగ్వేదమేగాక యజుస్సామములుగూడ వచించి యున్నవి. పూర్వము ఏకుడై యుపాసనాసాధ్యమైన ఈశ్వరుడు, ఈ మంత్రమున సర్వవ్యాపకుడై నిర్దిష్టేంద్రియములులేక నిరవయవుడై వెలుగొందుచున్నాడు. 'ఏతావాన్ అస్య మహిమాఽతో జ్యాయాంశ్చ పురుషః। పాదోఽస్య విశ్వాభూతాని త్రిపాదాస్యామృతం దివి॥' (ఋ. 11. 90. 3) అతని మహిమ దేశకాలముల వ్యాప్తము; కాని ఆ పురుషుడు సర్వాతీతము; విశ్వభూతములెల్ల అతని కొక పాదము, మూడు పాదములు పరమపదముగల అమృతత్వము అని యీ మంత్రము అతని నిరవధికస్థితిని యింకను వివరించి యున్నది. 'పురుష ఏవేదం సర్వం యద్ భూతం యచ్చ భవ్యం। ఉతామృతత్వస్యేశానో యద్ అన్నే నాతిరోహతి॥' (ఋ. 10. 10. 2) పురుషుడే భూతభవ్యములు. సర్వప్రకృతి నతిక్రమించు అమృతత్వముగూడ నాతడే యగుచున్నాడు. అట్లగుచో నతడు పుట్టుట పెరుగుట, మరణించుట, మొదలగు వికారములకాలవాలమా యను సందేహనివారణార్థము అతడమృతుడే యని గట్టిగ జెప్పబడినది. అటులే 'అకామో ధీరో అమృతః స్వయంభూ రసేన తృప్తో న కుతశ్చనోనః। తమేవ విద్వాన్ న బిభాయ మృత్యోర్ ఆత్మానం ధీరం అజరం యువానం॥' (అ. 10. 8. 44) అకామి, స్థిరుడు, అమృ

తుడు, స్వయంవ్యక్తుడు, రసతృప్తుడు, నిర్లోపుడు అతడు, ఆ యాత్మ నెరింగిన జ్ఞాని మృత్యుభయము నొందడు, ఆత్మ స్థిరమై అజరమై యౌవనమై యుండును అని, యీ వాక్యమునగల సర్వవ్యాపక తత్త్వమే ఆత్మ యనియు వాకొనబడినది.

వేద వివిధ భాగముల ప్రస్తావింపబడిన దేవతలు ప్రత్యేక వ్యక్తిత్వము గలవారు గారనియు వేదమే వివరించుచు, ననేకులుగ జెప్పబడినవారు ఒక్కరే యనియు దెలియజేసెను. 'సువర్ణం విప్రాః కవయో వచోభిరేకం సంతం బహుధా కల్పయంతి॥' (ఋ. 10. 444. 5) ఆ సుందర వర్ణములుగల ఆత్మ ఏకమైయుండ బుధులు వారి రచనములచేత బహుధా కల్పించుకొని యున్నారు. 'ఏకం సత్ విప్రా బహుధా వదంతి' (ఋ. 1. 164. 46) ఆ సత్పదార్థమొకటి. జ్ఞానులు వివిధముగ వచించెదరు. అందుచే 'యో దేవానాం నామధా ఏక ఏవ' (ఋ. 10. 82. 3) వివిధ దేవతల నామముల ధరించినవాడొక్కడే అని విదితము. ఎట్లనగా 'ఏక ఏవాగ్నిర్ బహుధా సమిద్ధ ఏకః సూర్యో విశ్వం అనుభూతః। ఏకైవోషాః సర్వం ఇదం విభాత్యేకం వా ఇదం విబభూవ సర్వం॥' (ఋ. 8. 58. 2) ఒకే అగ్ని వివిధ స్థలముల బ్రజ్వలింపబడుచున్నది. ఒకే సూర్యుడు ఎల్లరమీద బ్రకాశించుచున్నాడు. ఏకముగనే యున్న యుషస్సు అంతటను వికాసము గలుగజేయు చున్నది. అట్లే ఒకటే యీ సర్వముగ నైనది. మరియు, 'ఇంద్రం మిత్రం వరుణమగ్నిమాహురథో దివ్యః స సుపర్ణో గరుత్మాన్। ఏకం సత్ విప్రా బహుధా వదంత్యగ్నిం యమం మాతరిశ్వానమాహుః॥' (ఋ. 1. 164. 46) ఇంద్ర మిత్ర వరుణ

అగ్నులగూర్చి వచింపబడును. సువర్ణుడైన గరుత్మంతుడును గలడు. అగ్ని యమ మాతరిశ్వులుగ, ఏకమై యున్న దానిని, జ్ఞానులు వివిధముగా వచించుచుందురు. అందుచే 'తద్ ఏవాగ్నిస్ తద్ ఆదిత్యస్, తద్ వాయుస్, తద్ ఉ చంద్రమాః। తద్ ఏవ శుక్రం తద్ బ్రహ్మ తా ఆపః సః ప్రజాపతిః॥' (య. వ. 32. 1) అదియే అగ్ని, అదియే ఆదిత్యుడు, అదియే వాయువు, అదియే చంద్రుడు, అదియే కాంతి, అదియే బ్రహ్మము, జలములదే ప్రజాపతియు నతడే. ఈ మంత్రమున బూర్వ పురుష శబ్దము అంతరించి, అలింగమైన 'తద్' వాచక ప్రయోగము జరిగి యున్నది. 'త్వం స్త్రీ త్వం పుమాత్ అసి, త్వం కుమార ఉత వా కుమారీ త్వం జీర్ణో దండేన వంచసి, త్వం జాతో భవసి, విశ్వతో ముఖః (అ. 20. 8. 27) నీవు స్త్రీవి, నీవు పురుషుడవు, నీవు కుమారుడవు, కుమారివి, దండమున వడంకు వృద్ధుడవు నీవే, నీవు సర్వస్వరూపివి, ఈ మొదలగు మంత్రముల సులభగ్రాహ్యముగ ఆ బ్రహ్మ పదార్థమే సర్వదేవతలు, సర్వవిశ్వము, సర్వ జీవులు సర్వము అతడే యని నిరూపింపబడియున్నది.

అంతియగాక పి. యస్. శాస్త్రి అభిప్రాయము ప్రకారము The nature of Jiva in and out of bondage is stated in the 30 th Rk 169 ఋ. 1. 164. 30 ఋక్కు, జీవుని బంధమోక్షముల స్థితి ద్వయమును వివరించుచు, నదే సూక్తమున 18 వ ఋక్కున జీవబ్రహ్మైకత్వము తెలుపబడినట్లు అతని ఉద్దేశ్యము. మరియు 'ద్వా సువర్ణా సయుజా సఖాయా

169. Prof. P. S. Sastry : Adwaitism of Dirghatamas in Rig Veda.

సమానం వృక్షం పరిషస్వజాతే। తయోరన్యః పిప్పలం స్వాద్వ త్త్యనశ్నన్నన్యోఽభిచాకసీతి॥' (ఋ. 1. 164. 20) మిత్రులైన సుందర పక్షిద్వయము ఒకే వృక్షముపై వసించుచున్నవి. అందొకటి పిప్పల ఫలముల భుజించుచుండ, రెండవది సాక్షివలె జూచుచున్నదను ఋక్కులో దేహమను వృక్షమున జీవేశ్వరరూప పక్షిద్వయము వసించుచున్నట్లును, అందు జీవుడు కర్మఫలముల ననుభవించుచుండ, ఈశ్వరుడుదాశీనవృత్తి నున్నటుల వివరింపబడి యున్నది. ఇచట బింబ ప్రతిబింబన్యాయమున, నీశ్వర ప్రతిబింబమైన జీవుడు మాయాప్రతిబింబమగుటచే నా మాయాధీన వృత్తి జరించు, తద్గత సుఖ దుఃఖాదిక కర్మఫలముల ననుభవించుచునుండ, బింబరూపుడైన ఈశ్వరుడుదాశీనుడై, సాక్షియై మాయాతీతుడై తిలకించుచున్నట్లు వ్యక్తము. ఇదే శ్లోకమును ముండక (3. 1. 1) శ్వేతాశ్వతర (4. 6) ఉపనిషత్తులు యథాతథముగా స్వీకరింప, 'ద్వా సువర్ణా శరీరేస్మిన్ జీవేశాఖ్యౌ సహ స్థితౌ। తయో ర్జీవః ఫలం భుంక్తే కర్మణో న మహేశ్వరః॥ కేవలం సాక్షిరూపేణ వినా భోగో మహేశ్వరః। ప్రకాశతే స్వయం భేదః కల్పితో మాయయా తయోః॥' (అన్నపూర్ణ. 4. 33) భావము నట్లే యుంచి భాషకు నిసుమంత రూపాంతర మొసంగి, వారిరువురి తత్త్వముల సిద్ధాంతరీతిగ అన్నపూర్ణ వివరించెను. అటులే రుద్రహృదయముగూడ పై శ్లోకముల నట్లే స్వీకరించి యున్నది. ఈ మంత్రముల వేదార్థమును ఉపనిషత్తులు వివరించియున్నటుల ఈశ్వరుని ద్రష్టత్వ ఉదాశీనత్వములును, జీవుని కల్పితత్వమును వ్యక్తము. ఇదే భావమును (ఋ. 1. 164. 4) వ ఋక్కుగూడ స్పష్టపరుచుటయేగాక వివర్తవాదమును సమర్థించుచు,

ముక్తదశలో నానాత్వాభావమును విస్పష్టలీల దెలుపుచున్న దని పి. యస్. శాస్త్రి అభిప్రాయము. అందుచేతనే యజుర్వేద వాక్యముచందము, 'అంతాయ బహువాదినం అనంతాయ మూకం' (30. 19) అంతవంతమైనదాని వర్ణింప వాచాలుండ, అనంతమును వర్ణింప మూగవారు గలరనునట్లు ఋగ్వేదమున నొక జ్ఞాని, అద్వైతానుభూతియైన జీవబ్రహ్మైకత్వజ్ఞానము గడించి ఆశ్చర్య విభ్రమచకితుడై 'వి మే కర్ణా పతయతో వి చక్షుర్। వీ ఉ దం జ్యోతిర్ హృదయ అహితం యత్। వి మే మనశ్చరతి దూర ఆధీః కిం స్విద్ వక్ష్యామి కిము నూ మనిష్యే' (ఋ. 6.9.6) సుదూర ప్రకాశము నొసంగు నా యంతర తత్త్వమునుగూర్చి కర్ణములాలింప, నేత్రములు తిలకింప నున్ముఖమై గలవు. తన భావములతో నా చిత్తము దూరమున దిరుగుచున్నది. నే దేనిని వచించెదను ? మరియు దేనిగూర్చి యోచింతును? అని గానము జేసినాడు. Thus almost all the fundamental tenets of Adwaita are latent in this Sukta (Dirghatamas Sukta). Hence it is but sheer magness and impartinence still to call Adwaita crypto-Buddhism, or an innovation of Sankara 169 అట్లు దీర్ఘ తమః సూక్తమున (1. 164) అద్వైతవాదమునగల ప్రధాన సూత్రములన్నియు గర్భితము. అట్లగుట నింకను అద్వైతము ప్రచ్ఛన్న బౌద్ధమనియు, శంకర కల్పనమనియు వచించుట ఉన్మత్తప్రలాపము, అధికప్రసంగమని పి. యస్. శాస్త్రి వాదించుచున్నాడు, అటులే We find Vedantic tho-

169. Prof. P. S. Sastry : Adwaitism of Dirghatamas in Rig Veda.

ught even in some of the earliest hymns of the Rig Veda, eg., the Nasadya Sukta which forms as it were the basis of later Upanishads 170 తర్వాత ఉపనిషత్తుల కాధారమైన నాసదీయాది ఋగ్వేదీయ ప్రాచీన సూక్తములలో వేదాంత భావముల, మనము గాంచగల మనియు వీరేశ్వరానందుడు తన బ్రహ్మసూత్రముల నుడివి యున్నాడు.

మరియు, వేదము సృష్ట్యాది ప్రస్తావనము గావించి, 'నైవేహ కించనాగ్ర ఆసీత్। మృత్యునైవేదమావృతమాసీత్। అశనాయయాశనాయా హి మృత్యుః॥' (బృ. 1. 2. 1) ప్రథమమున శూన్యముండెను. సర్వము క్షుత్తనెడు మృత్యువుచే నావరింపబడియుండెను, మహత్ క్షుత్తు అనగా శూన్యము మృత్యువు అని ప్రథమమున బ్రిస్తుత విశ్వమున గోచరించు సర్వము వ్యక్తముగ లేదనియు, నట 'నాశః కారణలయః అను సూక్తి ననుసరించి, సకలమునకు బరమకారణమైన నొక అవ్యక్త అగోచర అవిజ్ఞేయపదార్థముండెననియు జెప్పంబడియున్నది. ఆ విషయముననే యింకను వివరించుచు, 'నాసద్ ఆసీనో సద్ ఆసీత్ తదానీం। నాసీద్ రజో నో వ్యోమాపరో యత్। కిం అవరీవః కుహ కస్య శర్మన్నంభః కిం ఆసీద్ గహనం గభీరం ॥౧॥ న మృత్యుర్ ఆసీద్ అమృతం న తర్హి నం రాత్ర్యా అహన ఆసీత్ ప్రకేతః। ఆసీద్ అవాతం స్వధయా తద్ ఏకం తస్మాద్ధాన్యాన్ నవరః కిం చనాస ॥౨॥' (ఋ. 10. 129. 1-2) అచ్చట సదసత్తులు

170. Swami Veereswarananda : Brahma Sutras, p 1.

రెండును అభావము. అచట వాయువుగాని దాని నతీతించు ఆకసముగాని లేదు. ఎచట దేనిని ఆవరించినది? అచట ఎవరి ఆశ్రయముగలదు? అగాధమును నిగూఢమునునైన జలము గలదా? అపుడు మృత్యువు లేదు, అమృతత్వముగూడ మృష. దివారాత్రముల యునికి జాడలు కనుపింపవు. ఏకతత్త్వము నివాతము గలదు. అది వినా నెద్దియును లేదని పూర్వ మంత్రార్థ మును యింకను బహుళముగ వివరించి యున్నది. అనగా అచ్చట సూర్య చంద్రాది గ్రహస్థితులుగాని, ఆకాశాది పంచ మహాభూతములుగాని, మృత్యు అమృతత్వమున యునికిగాని లేక ఏకమై, సర్వ విభేదశూన్యమై, యొక యింద్రియాతీత తత్త్వ ముండినట్లు వేదార్థము.

కాని పిమ్మట, ప్రస్తుత యింద్రియగోచర సృష్టి ఎట్లే ర్పడినది? అని సృష్టిలో భాగవిభాగములుగనున్న జీవులలో బ్రహ్మజ్ఞాశీలురు సృష్టినుండి సృష్ట్యాదినిగూర్చి ప్రశ్నించి విచారించి, నిశ్చయింప నుద్యుక్తులైరి. ఏ యరణ్యమున నే వృక్షము గ్రహింపబడి యీ స్వర్గ విశ్వములు మలచబడెను? ధీమంతు లారా! ఈ విశ్వమునకాధారనుగ నతడే యాధారమును గైకొని నిలుపబడియున్నాడను విషయముల మీ చిత్తముల విచారింపుడు అని మానవుడనతికాలముననే నీ విచారమును ప్రారంభించి యుండెను. అందుచే 'ద్వివిధం హి బ్రహ్మ గమ్య తే నామ రూపవికారో భేదోపాధివిశిష్టం తద్విపరీతం చ సర్వోపాధివర్జితం' బ్రహ్మము ద్వివిధముగ గ్రహింపబడెను. [నామ రూప వికార భేదములనెడి ఉపాధి గలిగినది యొకటి, అవి లేనిది రెండవది

అనురీతి,సృష్టికాధారమైన మరియొకబ్రహ్మతత్త్వమునకు సృష్ట్యాది కార్యనిర్వహణము నూహింపక దప్పినదికాదు. దీనివలన సర్వాధిష్ఠాన సగుణనిర్గుణాతీత బ్రహ్మము నిర్లిప్తస్థితి సర్వాతీతమై యుండ, దాని నాధారముగ గొని సగుణబ్రహ్మమేర్పడినట్లు విదితము. 'హిరణ్యగర్భః సమవర్తతాగ్రే భూతస్య జాతః పతిరేక ఆసీత్' (ఋ. 10. 121. 1) ప్రథమమున హిరణ్యగర్భుడుండెను. అతడే సర్వభూతజాతమునకు గారణము. అతడే ఏకైకప్రభువు అను మంత్రములు సగుణమును వివరించియున్నవి. ఈ విషయ నిర్ణయమునకు నాటి మేధావంతులెక్కువ తపస్సు చేసి సత్యమారసినట్లు గోచరము. The beginnings of Indian philosophy, which are to be found in the latest hymns of the Rig Veda and in the Atharvana Veda are concerned with speculations on the origin of the world and on the eternal principle by which it is created in and maintained 171 ఋగ్వేదాథర్వణ వేదములలో దర్శాతి ఋక్కులు భారతీయ తత్త్వశాస్త్రమునకు ప్రారంభకములై యున్నవి. అవి ప్రపంచ సృష్టి, సృష్టిపాలనమునకు గారణమైన నిత్యతత్త్వమునుగూర్చి యూహలతో నిండియున్నవని ఏ. ఏ. మాక్డొనెల్‌కూడ వచించి యున్నాడు. 'తస్మిన్నిదం సం చ విచైతి సర్వం' (య, వా. 32. 8) ఈ సర్వము ఎచట లయించును? ఎటనుండి ఆవిర్భవించును ? అని ప్రశ్నించుకొని, 'యః సమాన్యో ఉ వరుణో యో వ్యాయెన్యా ఉ' (అ. 4. 16. 8) సకలము ఈశ్వరునిలో

---

171. Dr. A. A. Mac donell : A History of Sanskrit Literature, p 385.

నేకమగును. అతనినుండియే వెలువడును అని గ్రహించిరి. ఇట్లు ద్వివిధ బ్రహ్మమును సిద్ధాంతమున స్వీకరించుట అద్వైత సిద్ధాంత విధానమునగూడ గాననగును. పారమార్థికముగ సర్వాతీత బ్రహ్మ ప్రతిపాదనము గావించి, వ్యావహారిక సత్యమునుగూడ సమ్మతించి, తదాధారముగ సగుణ బ్రహ్మమును స్వీకరించుట వేదమునుండియే పరమాద్వైతాచార్యుడైన శంకరుడు స్వీకరించుట స్పష్టము.

మరియు నుపనిషత్తులలోను, తర్వాత వెలువడిన అద్వైత సిద్ధాంతముననను విరివిగా నుపయోగింపబడియున్న బ్రహ్మతత్త్వ సూచిక లింగాతీత పదజాలము వేదమునందుగూడ సువ్యక్తము. 'తస్మాత్ వై విద్వాన్ పురుషం ఇదం బ్రహ్మేతి మన్యతే' (అ. 11. 8. 32) అందుచే విద్వాంసుడు ఆ పురుషుని బ్రహ్మముగ గ్రహించును. 'పూర్వో జాతో బ్రహ్మణో బ్రహ్మచారీ ధర్మ వసానం తపసోదతిష్టత్ । తస్మాత్ జాతం బ్రాహ్మణం బ్రహ్మ జ్యేష్ఠం దేవాశ్చ సర్వే అమృతేన సాకం' (అ. 11. 5. 5) బ్రహ్మచారి బ్రహ్మజ్ఞానమునకు ముందు జనించి, ధర్మధారణము గావించి తపస్సుచే నిలిచెను. అతనినుండి పరబ్రహ్మజ్ఞానము, నిత్యమైన సర్వదేవతా జ్ఞానములు నుదయించెను. 'తత్ కేవలం కృణుతే బ్రహ్మ విద్వాన్' (అ. 11. 5. 10) బ్రహ్మమును గ్రహించి బ్రహ్మచారి యీ సర్వమును సొంతముగ జేసికొనును. 'జ్యేష్ఠ రాజం బ్రహ్మణాం బ్రహ్మణస్పత' (ఋ. 2. 23. 1) బ్రహ్మజ్ఞానమునకు సార్వభౌమా యను మొదలగు ననేక మంత్రములందు బ్రహ్మశబ్దము గోచరము. 'బృంహతీతి బ్రహ్మ' (అమర. 1. 14) వృద్ధి పొందువాడు బ్రహ్మము; 'బృహత్వాత్ బృంహణత్వాత్ బ్రహ్మ

పెద్దదగుటవలన, పెద్దదానిగ జేయుటవలన బ్రహ్మ అను అర్థము ల ప్రకారము 'బ్రహ్మ కృణోతి వరుణః' (ఋ. 1. 204. 15) వరుణుడు ప్రార్థన గీతముల నిర్మించెను అను స్థానమున బ్రహ్మ శబ్దమునకు ప్రార్థన గీతమని అన్వయింపబడినచందము Haug holds that the Brahman means prayer, being derived from the root 'Brh' to swell or to grow Sacred prayers cause the growth and then it came to mean the force of nature, and later the supreme reality [172] 'బృహ్' అను ధాతు జనితముగ పెరుగుట అను యర్థమున బ్రహ్మ శబ్దము ప్రార్థన యను యర్థమున నుపయోగింపబడినదనియు, ప్రార్థనములు పరిణమింప జేయుననియు, పిమ్మట నది ప్రకృతిశక్తిగ నన్వయింపబడి, తర్వాత పరమార్థముగ నర్థమును గ్రహించినదని హాగ్ తెలిపియున్నాడు. దేవతలకు కేంద్రీకరింపబడిన శక్తిగ దానికి ప్రథమమున నర్థముండి, తర్వాత మంత్రార్థమును గ్రహించి, చివరకు బ్రహ్మము పరమ సత్యమైనదని Roth రాత్ అభిప్రాయపడెను. [172] ప్రథమమున నది వ్యాధినిర్మూలక మంత్రముగ నన్వయమనియు, బ్రాహ్మణముల కాలమునకు ప్రార్థనముల అర్థము గ్రహించెననియు, Olden-burg ఓల్డెన్‌బర్గ్ ఉద్దేశించెను. [172] బ్రహ్మమనగా ప్రార్థనమే. అది ఆత్మ నుద్ధరించును. సత్పదార్థమును గ్రహింప నాత్మోద్ధరణము జరుగును. కాన బ్రహ్మపదము, తర్వాత బ్రహ్మపరమైనదని దేవసేన్ వాకొనెను. బృహస్పతి వాచస్పతి శబ్దములవలె బ్రహ్మ పదముఉచ్చారణమునకర్థమని మాక్సుముల్లరు తలంచెను. [172]

172. Dr. S. Radhakrishnan : Indian Philosophy, vol. 1, 463.

కాని పైన వాకొనబడిన మంత్రముల బ్రహ్మశబ్దమునకు పైయర్థము లెవ్వియు నన్వయింపక, కేవలము అద్వైత సిద్ధాంతమందు ప్రతిపాదింపబడిన బ్రహ్మపదార్థమే ప్రస్తావింపఁబడినట్లు విజ్ఞులు గ్రహించెదరు. అందుచే బ్రహ్మశబ్దమునకు అద్వైత వాదానుగుణమైన అన్వయము వేదముననే గలదని విదితము.

లింగాతీతమైన వాచకముగ నపుంసక వాచక లింగమున నున్న మరి యితర శబ్దములుగూడ వేదమున గానగును. అవియు బ్రహ్మమునకన్వయములే యని ప్రకరణమును జూచిన వారికి దెలియును. 'న తస్య ప్రతిమా అస్థి' (య. వా. 32. 3) 'మహత్ తత్' (ఋ. 3. 54. 17) 'తద్ ఏవాగ్నిస్ తద్ ఆదిత్యస్ - - -' (య. వా. 32. 1) 'యస్తన్న వేద కిం ఋచా కరిష్యతి య ఇత్ తద్ విదుస్ త ఇమే సమాసతే' (ఋ. 1. 164. 39) దానిని గ్రహింపనివాడు వేద ఋక్కులతో నేమి జేయగలడు? కాని ఎవరు దాని గ్రహించెదరో వారు పూర్ణులు అని అనేక స్థానముల 'తత్' శబ్దము బ్రహ్మపరముగ వినియోగింపబడియున్నది. అటులే 'వేనస్ తత్ పస్యన్ నిహితం గుహా సద్' (య. వా. 32. 8) అద్భుతమైన దానిని జ్ఞాని గాంచును, 'ఏకం సత్ విప్రా బహుధా వదంతి' (ఋ. 1. 164. 46) అని అనేక ప్రదేశముల 'సత్' పదము బ్రహ్మమునకే అన్వయింపబడి యున్నది. 'శ్రద్ధయా సత్యం ఆప్యతే' (య. వా. 19. 30) అనుచోట్ల సత్యం శబ్దము, 'ఏజద్ ధృవం పత్యతే విశ్వం ఏకం' (ఋ. 3. 54. 8) అను అసంఖ్యాక ఋక్కులలో ఏక శబ్దము విరివిగా వేదానంతర అద్వైతశాస్త్రమున నుపయోగింపబడినచందముగనే

వేదమున గూడ నుపయోగింపబడి యుండుట గమనార్హము. అనగా నా పదములకు అద్వైతపరమైన అర్థములు అన్వయములు, శంకర నిర్మితములుగాని పూర్వాచార్యుల కల్పితములుగాని కాక వేదార్థములే యని గ్రాహ్యము. అందుచే ముఖ్యముగ ఋగ్వేద సూక్తములలో ప్రథమ మండల 164 వ సూక్తము, దశమ మండల 12 వ సూక్తములు ప్రధానములై, భావి సంపూర్ణ అద్వైతవాదమునగల శబ్దములనేగాక, తద్గత భావజాలముల గూడ జాలవరకు నుపయోగించి యున్నదని ఆచార్య డి. పి. జోషి వీరేశ్వరానంద, పి. యస్. శాస్త్రి, దేవసేన్ మొదలగు అసంఖ్యాక పండితవరేణ్యుల తాత్పర్యము.

అటులే వేదములలో శంకరకల్పితముగా భావింపబడుచున్న మాయావాదముగూడ గోచరించును. కాని, దానియర్థమున జాల వ్యత్యాసములున్నటుల పండితులు భావించిరి. In the Rig Veda the word Maya occurs frequently, and is used to indicate the supernatural power attributed to the gods, especially to Varuna, Mitra, Indra [173] ఋగ్వేదములో మాయా పదము తరచుగ వాడబడి యున్నది. ముఖ్యముగ వరుణ మిత్ర ఇంద్ర దేవతలయొక్క అసాధారణశక్తి నన్వయించుచు నది యుపయుక్తము. అంతియు గాక, In many ancient hymns, maya is praised as the world-sustainning power. (ఋ. 3. 38, 7., 10. 83. .., 1. 159. 4., 5. 85. 5) Maya in the sense of deception and cunning is the special proro-

173. Dr. S. Radhakrishnan : Indian Philosophy, vol. 2, p 565

gative of the Asuras, against whom the devas wage continual warfare 173 అనేక ప్రాచీన ఋక్కులలో 'మాయ' విశ్వ ధారణ శక్తిగ నుతింపబడియున్నది. వంచన, జాణత్వమను యర్థమున, దేవతలు నిర్విరామ యుద్ధము సాగించిన అసురుల కన్వయించుచు మాయ శబ్దముపయోగింపబడియున్నది అనిఆచార్య రాధాకృష్ణ పండితుని వివరణము. 'రూపం రూపం ప్రతిరూపో బభూవ । తద్ అస్య రూపం ప్రతిచక్షణాయ । ఇంద్రో మాయాభిః పురురూప ఈయతే యుక్తా హ్యస్య హరయః శతా దశ॥' (ఋ. 6. 47. 18) అఖిల రూపములలో నతడూహింపబడి యున్నాడు. సర్వము అతని రూపములుగనే గ్రాహ్యము. తన మాయాశక్తిచే నింద్రుడు అనేక రూపముల బర్యటించును. సహస్రాధిక హయములు కట్టబడినవి అను అర్థమును బై మంత్రమునకు గ్రహించి, Maya here means the power to transform oneself or assume stange forms 173 రూపాంతరముల నొందుట, లేక అన్యరూపముల నొందుట, యను శక్తి యని యిచ్చట మాయా శబ్దార్థముగ ఆచార్య రాధాకృష్ణుడు స్వీకరించి, ఆయర్థమునకు సమర్థనముగ 'ఓ ఇంద్రా ! దేహరూపములతో సంపూర్ణత్వము నొందినపుడు నీవు నీ సామర్థ్యమును ప్రకటించుచు మానవలోకమునజరించెదవు. అపుడు మానవులు చెప్పుకొనుచుండు నీ యుద్ధములు మాయాసృష్టిచే ఫలప్రదము అగును అను ఋ. 10. 54. 2 మంత్రము నతడు గైకొనెను. కాని యదే ఋక్కునకు For every form He has been the model, that form of His is the one to look on

---

173. Dr. S. Radhakrishnan : Indian Philosophy, vol. 2, p 565

everything; Indra by His maya (
ssion) moves in many forms, v
steeds are yoked a thousand tim
ములకు నతడే ప్రమాణము. అతని రూపమే
చును. ఇంద్రుడు తన సృష్టికారక మాయాశ
ముల జరించును. అతని సకిలించు హయ
పర్యాయములు సంధింపబడినవి అని ఎ. సి.
గ్రహించుటతో దాత్పర్యభేదము ఏర్పడుచున్న
మును బృహదారణ్యకోపనిషత్తు స్వీకరించి,
'పురశ్చక్రే ద్విపదః, పురశ్చక్రే చతుష్పదః
భూత్వా పురః పురుష ఆవిశత్' అతడు ద్విపాద
సృజించెను. ఆ శరీరములలో నా పురుషోత్త
మున ప్రథమమున ప్రవేశించెను అని వివర
అయం పురుషః సర్వాసు పూర్షు పురిశయః, నై
వృతం, నైనేన కించనా సంవృతం॥' (బృ.2.5.1
ముల నతడు వసించుచుండుటచే నతడు పురుష
నిచే నావృతము గానిదేదియును లేదు. అతనిచే
దెద్దియును లేదు అని సృష్టికర్తను, సృష్టివిధా
వించి, తర్వాత 'రూపం రూపం....' అను మంత్ర
యున్నది. ఆ మంత్రమునకు He transfor
in accordance with each form of H
the sake of making Him known. The
account of Maya (notions of superi

---

171. A. C. Bose : The Call of the Vedas, p 172.

ignorance) is perceived as manifold, for to Him are yoked ten organs, nay hundreds of them ప్రతిరూపమునకనుగుణముగ నతడు రూపాంతరము నొందెను. అతని ప్రదర్శించుటకొరకే అతని రూపము. మాయచే (అజ్ఞానావరణముచే గలిగిన భావములచే) నీశ్వరుడు నానాత్వముగ జూడబడుచున్నాడు. అతనికి దశేంద్రియములు శతాధికేంద్రియములు అనుసంధింపబడినవి అని మాధవానందుల అర్థము. ఈ యర్థమునకు, బూర్వార్థములకును ఎక్కువ వ్యత్యాసము గలదు. ఈ మంత్రమునే ఆ యుపనిగత్తు వివరించుచు, అతడు దశేంద్రియములు, సహస్రములు, అసంఖ్యాకములు, అనంతములు, అని వివరించి, 'తదేతద్బ్రహ్మ పూర్వమనపరమనంతరమబాహ్యం, అయమాత్మా బ్రహ్మ సర్వానుభూః' (బృ.2.5.19) ఆ బ్రహ్మము పూర్వాపరములు లేనిది, బాహ్యాభ్యంతరములు లేనిది, సర్వద్రష్ట అగు ఆత్మ బ్రహ్మమే అని వివరించినది. అనగా నీ యుపనిషత్తు వేదమంత్రమును సక్రమలీల వివరించియున్నది. ఇచట ఇంద్రశబ్దము కేవలము దేవతగగాక, సాక్షాత్తు బ్రహ్మముగనే స్వీకరింపబడియున్నది కావున ఆధునిక పండితాభిప్రాయములు ప్రమాణముగాక, ఉపనిషద్భావమే పరమ ప్రమాణమై యొప్పారుటచే, వేదము మాయాశబ్దమును పూర్వమంత్రమున వంచకత్వమనిగాని, శక్తి యనిగానిగాక, భ్రాంతియను తాత్పర్యముననే యుపయోగించి యున్నట్లు పరిగ్రాహ్యము. అదేవిధముగ, Doctrine of Adhyasa is traceable in the 13th and 14th Rks [175] ఋ. 1. 164. 13-14 ఋక్కులలో అధ్యాస సిద్ధాంతము గలదని పి. యస్. శాస్త్రి వ్రాసియున్నాడు.

---

175. Prof. P. S. Sastry : Adwaitism of Dirghatamas in Rig Veda.

everything; Indra by His maya (creative illu-ssion) moves in many forms, verily his bay steeds are yoked a thousand times [174] సర్వరూపములకు నతడే ప్రమాణము. అతని రూపమే అఖిలమును దర్శించును. ఇంద్రుడు తన సృష్టికారక మాయాశక్తిచే ననేక రూపముల జరించును. అతని సకిలించు హయములు సహస్రాధిక పర్యాయములు సంధింపబడినవి అని ఎ. సి. బోసు అర్థమును గ్రహించుటతో దాత్పర్యభేదము ఏర్పడుచున్నది. ఇదే మంత్రమును బృహదారణ్యకోపనిషత్తు స్వీకరించి, దీనికి ముందు 'పురశ్చక్రే ద్విపదః, పురశ్చక్రే చతుష్పదః। పురః స పక్షీ భూత్వా పురః పురుష ఆవిశత్' అతడు ద్విపాద చతుష్పాదముల సృజించెను. ఆ శరీరములలో నా పురుషోత్తముడు పక్షిరూపమున ప్రథమమున ప్రవేశించెను అని వివరించుచు, 'స వా అయం పురుషః సర్వాసు పూర్షు పురిశయః, నైనేన కించన నానావృతం, నైనేన కించనా సంవృతం॥' (బృ.2.5.18) సకల శరీరముల నతడు వసించుచుండుటచే నతడు పురుషుడనబడెను. అతనిచే నావృతము గానిదేదియును లేదు. అతనిచే వ్యాప్తము కానిదెద్దియును లేదు అని సృష్టికర్తను, సృష్టివిధానమును ప్రస్తావించి, తర్వాత 'రూపం రూపం....' అను మంత్రమును వివరించియున్నది. ఆ మంత్రమునకు He transformed Himself in accordance with each form of His was for the sake of making Him known. The Lord on account of Maya (notions of superimposed by

---

174. A. C. Bose: The Call of the Vedas, p 172.

ఆతని ఉద్దేశ్యమున ఆ సూక్తమునసే 38వ మంత్రము అధ్యాస వాదమును వృద్ధి చేయుచు, అవిద్యా నిరాసము, ఆత్మజ్ఞానా వశ్యకతను దెలుపుచున్నది. 39వ ఋక్కు బ్రహ్మ వేదముల సం బంధమును దెలిపి, మోక్షమునకు ఆనందము లక్షణముగ దెలియ జేసియున్నది. 37వ ఋక్కు భ్రాంతికార్యముల బ్రస్తావించి, అవిద్యానివృత్తికి జ్ఞానమే మార్గమనియు, జ్ఞానమన 36వ ఋక్కు బ్రహ్మమున కన్వయించెననియు పి. యస్. శాస్త్రి విశదీకరించి యున్నాడు. కావున నిస్సందేహముగ నజ్ఞాన, మాయా, జ్ఞాన, బ్రహ్మ పదములు వేదమున నద్వైతావాదానుకూలముగనే ప్రయో గింపబడియున్నటుల విస్పష్టము.

బ్రహ్మవిదుని బ్రహ్మజ్ఞానమును బ్రస్తావించుచు, 'యోన్యాం దేవతాముపాసతే న స వేద యథా పశురేవ దేవానాం' (14.4) అనురీతి ఋగ్వేదీయ శతపథబ్రాహ్మణము వచించియున్నది. ఆ మంత్రమునే బృహదారణ్యకము స్వీకరించి వివరించుచు, ఆ మంత్రమునకు బూర్వము 'బ్రహ్మ వా ఇద మగ్ర ఆసీత్ తదా త్మానమేవావేత్ అహం బ్రహ్మాస్మీతి తస్మాత్తత్సర్వమభవత్' (బృ. 1.4.10) ప్రథమమున అంతయు బ్రహ్మముగనే యుండెను. 'నేను బ్రహ్మమును' అని అది గ్రహించియుండెను. కాన అది సర్వముగ నయ్యెను అని వాకొని, అంత 'యోన్యాం దేవతా - - - ' అను మంత్రమును గొనెను. ఇతర దేవతను గైకొని 'అతడు వేరు, నేను వేరు, అని ఉపాసించువాడు అజ్ఞాని. అతడు దేవత లకు పశు సమానము అని మంత్రార్థము. కాన నీ ఋక్కుగూడ స్పష్టముగ నద్వైతార్థప్రతిపాదనమునే గావించియుండుట విది

తము. అదే బృహదారణ్యక మంత్రము. 'అహం బ్రహ్మాస్మి' అను మహావాక్యోపాసకులు బ్రహ్మమే యగుదురు. సర్వము నగుదురు అను తాత్పర్యమును వివరించుచు, 'తద్ధైతత్పశ్యన్నృషిర్వామదేవః ప్రతిపేదే, అహం మనురభవం సూర్యః' (బృ.1.4.10) ఋషి వామదేవుడు ఆత్మను బ్రహ్మముగ గ్రహించి, 'నేను మనువును, సూర్యుడను' అనియు గ్రహించెను అని తెలిపియున్నది. అటులే అద్వైతానుభూతి నెరింగించుచు 'అహం మనురభవం సూర్యశ్చాహం కక్షీవాం ఋషిరస్మి విప్రః। అహం కుత్సం ఆర్జునేయం న్యృంజేఽహం కవిర్ ఉశనా పశ్యతా మా॥' (ఋ 4.26.1) మంత్రము 'నేను మనువును, సూర్యుడను, నేను దివ్యగాయకుడైన కక్షీవంతుడను, అర్జునుని సుతుడైన కుత్సుడను, నేను ప్రభువును, ఉశనా కవిని నేనే, నన్నుగాంచుడు' అని ఇంద్రుడు పలికినట్లు దెలుపుచున్నది.

బ్రహ్మవిత్ బ్రహ్మైవ భవతి' అను ఉపనిషదర్థము వోలె, 'సపర్యగాచ్ఛుక్రమకాయమవ్రణమస్నావిరం శుద్ధ మపాపవిద్ధం' (య. వా. 40.8) బ్రహ్మవిదుడు తేజోవంతమును, అశరీరమును, నిర్మలమును, అస్నావిరమును, శుద్ధమును, పాపరహితమునైన బ్రహ్మమును బొందునని యజుర్వేదము తెలిపియున్నది. ఇదే మంత్రమును ఈశ (8) గ్రహించియున్నది.

పై విధముగ నద్వైతము శంకరునితో ప్రారంభముగాక, ఆది గ్రంథమైన వేదముతోడనే ప్రారంభింపబడియున్నటుల నిరూపింపబడియున్నది. ఇంకను సమగ్రలీల నీ విషయమును విచారించుచో, నిదియే యొక పెద్ద గ్రంథప్రమాణము నందుకొను భయమున క్లుప్తసరణి ముగించియున్నారము.

ఈ విషయము, ఈ గ్రంథమున బూర్వము విపులముగ జర్చింపబడియున్నది. మరల ప్రసంగించుట చర్వితచర్వణమే యగును. కాని వేదముల సాకల్యముగ జర్చించి, సభాస్థలి నెక్కించి, వేత్తల బురికొల్పి, పరిషత్తుల నిర్వహించి, జ్ఞానులకు సాలంకృత పారితోషిక ప్రదానమొసంగి, ఆధ్యాత్మికవిద్య నొక రూపమునకు దెచ్చి, యావన్మానవసంఘ కృతజ్ఞతలకాకరమైన యుపనిషత్సృధను ఎన్ని పర్యాయములు జవి జూచినను పంతుష్టి గలుగనేరదు. వేదములగల తాత్త్వికబీజముల స్వీకరించి, స్థాపించి మొలకరింప జేసినను, Indeed these (Upanishads) constitute the real toil and travail of the human heart in its first religious aspirations, which gave birth to the intensity of its triumphs, of its joys 176 దిగ్విజయములను సుఖముల నుద్భృతముగ మానవ హృదయమునకు గలుగజేసియున్న ప్రథమ పారపార్థిక జిజ్ఞాసతో గల యథార్థ కష్టనిష్ఠురములు గలవి యుపనిషత్తులనియు మొదలగు అసంఖ్యాక సంస్తుతులను మాక్సు ముల్లరు మొదలగు ప్రపంచ విద్వాంసులచే గౌరవింపబడియున్నను, వీరేశ్వరానందుని వచనములలో The Upanishads do not contain any ready made consistent system of thought 177 ఉపనిషత్తులు సంసిద్ధమైన ఎట్టి సహేతుక సిద్ధాంతమును గూడ గలిగియుండలేదు. అదే అభిప్రాయమును రాధాకృష్ణ పండితుడు

176. Prof. F. Max Muller : Sacred Books of the East.

177. Swami Veereswarananda : Brahma Sutras, p vi.

గూడ The Upanishads had no set of theory of philosophy or dogmatic scheme of theology to propund. They hint at the truth in life 178 ఉపనిషత్తులు నిర్ణీత తత్త్వసిద్ధాంతమునుగాని, నిర్దిష్ట అధ్యాత్మవిద్యను గాని నిర్వచింపలేవు. అవి జీవిత పరమార్థమును సూచించును అని నుడివియున్నాడు. అట్లున్నను There is no important form of Hindu thought, heterdox Buddhism included, which is not rooted in the Upanishads 179 పరపక్షమైన బౌద్ధమతముతోగూడ, నుపనిషత్తుల నాధారముగ గైకొనని హైందవ విజ్ఞానమే లేదని Bloom field బ్లూం ఫీల్డు అభిప్రాయము. వివేకానందుని దృష్టిలోగూడ All the schools of Hindu philosophy start from the Vedanta, or Upanishads, but the monists took the name of themselves as a speciality, because they wanted to base the whole of their theology and philosophy upon the Vedanta and nothing else 180 హైందవతత్త్వ సిద్ధాంతములన్నియు, వేదాంతములన్నియు, వేదాంతము నాబడు ఉపనిషత్తుల నుండియే ప్రారంభింపబడినవి. కాని ఏకేశ్వరవాదులు మాత్రము, ఉపనిషత్తులపైననే తమ తాత్త్వక, ఆధ్యాత్మిక సిద్ధాంతముల స్థాపింప సంకల్పించి యుండుటచేత ప్రత్యేకముగ వారానామమును గ్రహించిరి. అంతియుగాక An extreme monism, with

---

178. Dr. S. Radhakrishnan : Indian Philosophy, vol. 1, p 140

179. Pandit jawaharlal Nehru : Discovery of India, p 66.

180. Swami Vivekananda : The Complite Works, vol. 2, p 239.

its distinction of logic, and intuition. reality and the world of existence, we must with in some Upanishads. Nagarjuna and Sankara and the Adwaita Vedantins and the echoes of it are heard in Parmendis, and Plato, Spinoza and Plotinus, Bradly and Bergson, not to speak of the mystics in the West 181 వేదాంతము తన ప్రత్యేక తర్కము అనుభవముల సత్యరూపమున కొన్ని యుపనిషత్తుల గానబడును. నాగార్జున, శంకరులు తమ తత్త్వాతీత స్థితులు, శ్రీహర్షాది అద్వైత వేదాంతుల భావములు, మరియు వాని ప్రతి ధ్వనులైన పర్మెండీస్, ప్లేటో, స్పినోజా, ప్లోటినస్, బ్రాడ్లీ, బెర్గ్సన్, మరి యితర పాశ్చాత్య జ్ఞానుల భావములు, ఉపని షత్తుల గానబడునని రాధాకృష్ణ పండితుని వివరణము.

కావున శంకరాద్వైతమునకు బూర్వమున నిత్యస్రవంతివోలె నుపనిషత్తులు, శంకరాద్వైతనిర్వచన వివరణములకుపయుక్తమైె నట్లు విదితముగదా!

## అద్వైతము - వేదాంతసూత్రము

పూర్వోక్తరీతి నుపనిషత్తులు బహుళముగ తత్త్వవిషయ ముల గలిగియున్నను క్రమబద్ధమైన సిద్ధాంత ప్రతిపాదనము గావింపకపోవుటయు, నందందు బరస్పర విరుద్ధ సిద్ధాంతములు

181. Dr. S. Radhakrishnan : Indian Philosophy, vol. 1, Intro-

ప్రస్తావింపబడుటయు, నందుచే బాలకులకు అసంఖ్యాకసంశయ ములుప్పతిల్లి, సాధకుల మానస నావలను ముంచివేయు వెల్లువలై పరిఢవిల్లుటయు గాంచి, క్రపామయుడై, కృష్ణద్వైపాయనం విద్ధి నారాయణం ప్రభుం' (విష్ణుపురాణ) అనురీతి 'అచతుర్వదనో బ్రహ్మ ద్విబాహురవరో హరిః। అఫాలలోచనో శంభుః భగవాన్ బాదరాయణః॥' అనియు ప్రస్తుతింపబడిన ప్రజ్ఞానిధియు మేధా శక్తిస్వరూపుడైన బాదరాయణ వ్యాసుడు మనస్సు కరిగినవాడై, 108 ఉపనిషత్తులలో ముఖ్యములైనవాని పదింటిని గ్రహించి, అందు సందేహనివృత్తి సాధింప, 555 సూత్రములుగల ఉత్తర మీమాంసాదర్శనమును వివరించెను. అదియే వేదాంతదర్శన మనియు బ్రతీతి. కేవలము బ్రహ్మవిషయకమగుటచే బ్రహ్మ సూత్రములనియు, వివిధ నామముల నది యొప్పారుట, సౌరభ గ్రంథ తృతీయ భాగమున సాకల్యముగ గాంచియున్నారము. కాని యిట్టి కృషి సల్పిన మహర్షులు వ్యాసునకు బూర్వమే కొంద రున్నటుల వ్యాససూత్రములే తెలుపుచున్నవి. ఔడులోమి, కాస కృత్స్న, బాదరి, జైమిని, కార్ష్ణాజిన, ఆశ్మరథ్య మొదలగువారును ఉపనిషత్సాగర మథనము గావించి, అమృతమును వెకలించి, పంచి ఇడ ప్రయత్నించియుండిరి. వారి కృషి ఎంతవరకు సఫ లమో గ్రహింప నా గ్రంథములు నేడు అలభ్యమగుటచే అసా ధ్యము. కాని వారి భావప్రచారము నాటినుండి నేటికిని జరుగు చునే యున్నందున, వానికి నాడు బలముండియుండునని, గ్రహింపనగును. కాని శేముషీదురంధరుడగు బాదరాయణుని రచన, వచన, తపోమహిమలచే నవి గప్పబడి మరుగుపడి, నానా టికి క్షీణించిపోవ, నీ బాదరాయణ కృత గ్రంథము అతిప్రధానమై

నాటనుండి నేటివరకు అసంఖ్యాక ప్రజ్ఞావంతుల మేధాశక్తికాహార మిడుచున్నది.

కాని సూత్రములగల సిద్ధాంతభావములైనను కేవలము బాదరాయణ జనితములు గావని స్పష్టము. they cannot possibly claim to represent the very first attempts at a systematic treatment; they are rather the last summing up of what had been growing up during many generations of isolated thinkers 182 క్రమ సిద్ధాంతరచనమున నవి ప్రథమ యత్నములని చెప్పకొనజాలవు. ప్రత్యేక ప్రత్యేకతత్త్వజ్ఞులచే దరతరములుగ బోషింపబడుచున్న భావముల క్రోడీకరణములుమాత్రము అని మాక్సుముల్లరు అభిప్రాయము. ఈ భావసంపద అంతయు నాటి భారతీయారణ్య ఆశ్రమముల నిండి నిబిడీకృతమై, శతాబ్దములుగ సామాన్యములై యొప్పారి యున్నట్లును అతని భావము. 183 ఈ సూత్రకర్తలు are not the founders or originators of the systems, but only their compilers and formulators 184 సిద్ధాంత నిర్మాతలుగాక, సంకలనకర్తలు మాత్రమే యని రాధాకృష్ణ పండితుని ఉద్దేశ్యము. ఇట్టి నిర్ణయమునకు గారణము వ్యాస జైమిన్యాది సూత్రముల, పై నుదాహరింపబడియున్న ఔడులోమ్యాది ఋషీశ్వరులను ప్రస్తావించి, వారి భావములగుడ విరమించుట ముఖ్యము. సూత్రకాలమున

182. Prof. F. Max Muller : The Six Systems of Indian Philosophy' p 75.

183. Prof. F. Max Muller : The Six Systems of Indian Philosophy, p 3.

184. Dr. S. Radhakrishnan : Indian Philosophy, vol. 2, p 23

వారి భావజాలములతి ప్రాబల్యమున నున్నందులకే యవి గ్రంథ
మున గైకొనబడి పూర్వపక్ష సిద్ధాంతముల జేర్పబడియుండును.
వారు వ్యాసుని సమకాలికులైన గావచ్చు లేక ప్రాచీనులైనను
గావచ్చును. కాసకృత్స్న, యాస్క, ఏకచూర్ణి మొదలగువారు
వేదభాష్యముల రచించియుండిరి. కాసకృత్స్నుడతి ప్రాచీన
మహర్షి యనియు బండితాభిప్రాయము. పూర్వమీమాంసాసూత్ర
ముల 'ఔత్పత్తికస్తు' (1. 1. 5) సూత్రమునకు అధ్యాసార్థమును
స్వీకరించి, శంకరు బూర్వాచార్యులైన శబరస్వామి, ప్రభాకరులు
'కోయ మధ్యాసో నామ' అని ప్రశ్నించుకొని వివరించియున్నారు
అందుచే నీ భావతరంగములు, నాటి వాతావరణమున బ్రవహించు
చునే యున్నటుల స్పష్టము. ప్రశస్తములగు షడ్దర్శనములలో
The Mimamsa and the Vedanta may be regarded as the direct continuation of the Vedic culture [185] మీమాంసా వేదాంతములు వైదిక సంస్కృతియొక్క అను
బంధములే యనియు సతీశ్ చంద్ర ఛటర్జీ వచించియున్నాడు.
అందు మీమాంసాసూత్రములు కర్మకాండ ప్రాబల్యము గలిగి,
తత్ప్రవర్తకములై యొప్పారుటచే దార్శనిక ప్రాధాన్యమును
బొందజాలక పోయెనుగాని, The Vedanta school represents a definite gathering up of the philosophical doctrines of the Upanishads in an attemt to frame a system which embraces them all [186]
ఉపనిషత్తులగల నిఖిల భావముల గౌగిలింపగల సిద్ధాంతమును

185. Prof. Satischandra Chattarjee : An Introduction to Indian Philosophy, p 7.

186. Dr. A. Keith : History ot Sanskrit Lecturer, p 474.

నిర్మించు యత్నమున నుపనిషద్వాదముల గ్రోడీకరించు విధాన మును వేదాంతము సూచించును అని ఎ. బి. కీత్ వ్రాసెను. ఉపనిషద్వాదములనేగాక, in reality represents the end of a long and extensive devolopment that has been lost 187 ప్రస్తుతము నఖిలమైన సుదీర్ఘ విస్తృత వాఙ్మయవర్ధనముయొక్క పర్యవసానమును దెలుపునని ఏ. ఏ. మాక్డోనెల్ కూడ వచించెను.

నేడు మిగుల ప్రాధాన్యమును గలిగియున్న యీ సూత్ర ములు, నాడును కేవలము సూత్రములుగనే యుండి ప్రచారము నొందక, నాడు వాని వివరించు వ్యాఖ్యాతలు వక్తలు అనేకులుండి విస్తార ప్రచారము గావించియుందురు. కాని మానవుల దుర దృష్టముచే నవి యన్నియు నేడు అలభ్యము. కాన శ్రీనివాస అయ్యంగారు అన్నటుల In the course of time the lecturers were lost, the threads alone remained with out pearls 188 కాలక్రమమున, ఆ యువన్యాసములు నష్టమై, ముత్యములులేని సూత్రములు మిగిలియున్నవని చక్కగ వచించియున్నాడు. అతని యుద్దేశ్యము లైనను కేవలము తత్త్వ శాస్త్రముగాక, యుపనిషద్వ్యాఖ్యానముమాత్రము. Intellectual power ప్రజ్ఞాశక్తినిధియైన వ్యాసుని సూత్ర గ్రంథము అతి ప్రాబల్యమును సంపాదించి, నాటనుండి నేటివరకు భారత దేశమున మతస్థాపకుల నాకర్షించి, వారెల్లరు తన నాశ్రయించి,

---

187. A. A. Macdonell : India's Past.

188. V. T. Srinivasa Iyamgar : Outlines of Hindu Philosophy. p 76,

తమ సిద్ధాంతానుసారముగ దనను వ్యాఖ్యానించుకొనినగాని అర్ష ముద్ర ఏర్పడజాలదనునట్లు మేధావంతుల ప్రజ్ఞాపూరిత వ్యాఖ్యానముల నందుకొన్నది. There have been various commentaries on the Vedanta. Its doctrines found their final expression in the philosophical Aphorisms of Vysya. This treatise, called Uttara Mimamsa, is the standard authority of Vedantism - nay is the most authoritative exposition of the Hindu scriptures 189 వేదాంతముపై వివిధ వ్యాఖ్యానములు గలవు. వ్యాససూత్రములలో దాని సిద్ధాంతములు సమగ్ర మూర్తిమత్వమును బొందియున్నవి. వేదాంతముపై ఉత్తరమీమాంసయే ప్రమాణ గ్రంథము. హైందవశాస్త్రములకు అదియే ప్రామాణిక వ్యాఖ్యానము. The most antagonistic sects have been compelled, as it were, to take up the texts of Vysya, and harmonise them with their own philosophy. Even in very ancient times, the commentators of the Vedanta philosophy formed themselves into the three celebrated Hindu sects of dualists, qualified non-dualists, and non-dualists. The ancient commentaries are perhaps lost; but they have been revived in modern times by the post-Buddhistic commentators Sankara, Ramanuja and Madwa 189 అతి విరుద్ధ భావశాఖలుగూడ వ్యాససూత్రముల గ్రహించి, తమ సిద్ధాంతముతో సమన్వయము జేసికొన

189. Swami Vivekananda : The Complite Works, vol. 1, p 358.

వలసివచ్చెను. అతి ప్రాచీన కాలములగూడ, వేదాంతశాస్త్ర వ్యాఖ్యాతలు ద్వైతాద్వైత విశిష్టాద్వైతరూపమున త్రివిధ శాఖలుగ నేర్పడియుండిరి. ఆ ప్రాచీన వ్యాఖ్యానములు బహుశః నశించి యుండును. కాని బౌద్ధానంతర వ్యాఖ్యాతలైన శంకర, రామానుజ మధ్వాచార్యులచే నాధునికకాలమున నవి పునరుద్ధరింపబడిన వని వివేకానందుడు వివరించియున్నాడు.

కాని భాస్కరాచార్యుడన్నటుల 'సూత్రాభిప్రాయ సంవృత్య స్వాభిప్రాయప్రకాశనాత్ । వ్యాఖ్యాతం యైరిదం శాస్త్రం వ్యాఖ్యేయం తన్నివర్త్తయే॥' (భాష్య. 2) సూత్రాభిప్రాయముల నణగ ద్రొక్కి, స్వాభిప్రాయముల బ్రకాశింపజేయుచు, ననేక వ్యాఖ్యలు వ్రాయబడియుండుటచే, నూతన వ్యాఖ్యానములు తప్పక రచితములు గావలెనను తాత్పర్యమున, శంకరునకు బూర్వమే ఉపవర్ష, బోధాయన, భర్తృప్రపంచ, ద్రవిడాచార్య, తంక, గుహదేవ, కపర్ది, భరుచి మొదలగు ననేకులు భాష్యముల రచించియుండిరి. శుకదేవుడుగూడ నొక భాష్యమును రచించినటుల సంప్రదాయము. ఆ యా సంప్రదాయముల భావములు ఆ యా సంస్థల నెలకొని యుండగ శంకర, రామానుజ, మధ్వ, బలదేవ, వల్లభ, నింబార్కాచార్యాదులు తర్వాత దమతమ భాష్య రచనముల లిఖించి, వేదాంత సూత్రమునకు అపూర్వ ప్రాధాన్యమును గౌరవమును అభిషేకించి, వేదాంతశాస్త్రమును అతివిశాలముగను, సర్వతోముఖముగను, సర్వవిధ సాధకోపయుక్తముగను గావించిరి.

అయినను పూర్వము వ్యాసరచిత సూత్రములవలె శంకర ప్రోక్త భాష్యము, యీ అర్వాచీనములకన్నింట ప్రథమమును,

ప్రధానమునై సమకాలిక వ్యాఖ్యానముల నప్రధానమొనరించి, భవిష్యద్భాష్యములకుగూడ తన స్థానము నాక్రమింప నెట్టి యవకాశము నొసంగక శాస్త్రీయ సయుక్తిక స్వానుభవవాద ప్రపూర్ణమై యొప్పారియున్నది. **There is every likelihood that his exposition agree in all essentials with the meaning of the Badarayana Sutras** 190 బాదరాయణ సూత్రార్థములతో అఖిల ముఖ్య విషయముల శంకర భాష్యము సరిపోవుట సంభావ్యమే యని ఏ.ఏ. మాక్డోనెల్ వచించెను. కాని మాయా వివరణము వ్యాసునిదికాక శంకరునిదే యని ఈతని అభిప్రాయము. శాండిల్య భక్తిసూత్రములలో 30 వ సూత్రమున బాదరాయణుడు అభేదవాదిగ వాకొనబడినట్లును, అందుచే నాకాలమున నా ప్రతీతి సూత్రకాలమున నున్నటుల వీరేశ్వరానందస్వామి వ్రాసియున్నాడు. 191 కొందరు మాయావాదమును వ్యాస ప్రతిపాదితముగగాక శంకరప్రోక్తమని వచించెదరుగాని, యింతవరకుగల గ్రంథమున జూచినట్లు శంకరు స్వకల్పితము లెవ్వియును లేవు. అతనికి భావములు నాటి వాతావరణమే. కాని వాని బ్రధానముగ గైకొనక అతడు అద్వైత సిద్ధాంత ప్రతిపాదనమునకు ఉపనిషత్సూత్ర గీతల నాధారముగ గొని, అవియె అద్వైత ప్రతిపాదకములుగ గ్రహించి, ప్రస్థానములని పేరిడి, దానికి భాష్య త్రయమును రచించి యుండుటయు, సూత్రగ్రంథము ఉపనిషద్భావ వివరణమునకేర్పడుటయు, నా యుపనిషత్తులు ప్రస్ఫుటముగ నద్వైత తాత్పర్యమునే గలిగి యుండుటయు, నవియు వేదహృదయములై, యందుగల

190. Dr. A. A. Macdonell : The History of Sanskit Lecturer, p 402.

తాత్త్వికవిషయముల గ్రోడీకరించి చెప్పుటయు విదితమగుచుండు టచే, వీనిలో బరస్పర వైరుధ్యమును గాంచ యత్నించుట వ్యర్థమని తోచును. అట్లాచరించుట అసముచితము అన్యాయ మనియు వ్యక్తము.

కావున శంకర పూర్వాద్వైతమున వేద ఉపనిషత్ శాస్త్ర ములు, దర్శాత సూత్రముల స్వీకరించియుండుట సమంజసము. కాని సూత్రములనుటతో, కేవలము వ్యాసప్రోక్త వేదాంతసూత్ర ములేగాక, నా కాలమున, అంతకు బూర్వము, తర్వాత ఏర్పడి యున్న అఖిల సూత్రగ్రంథముల గదలించి చూచుట భావ్యము. కాని అట్టి కార్యము అతి భారమై, ప్రస్తుత కార్యమునకాటంక హేతువగునను భయముచే అఖిల సూత్రగ్రంథముల శిరోమణియై, ఉపనిషత్తత్త్వముల వివరించుచున్న వ్యాససూత్రములనే నిచట గైకొని తృప్తి పొందయత్నించితిమి.

ఇంతవరకు జర్చింపబడిన వేద ఉపనిషత్ సూత్రములు అద్వైత సిద్ధాంతముతో సాక్షత్సంబంధము గలిగి, శుద్ధ సిద్ధాంత ప్రతిపాదకములై యొప్పారుట అతిముఖ్యములు. కాని యిక విచారింపబడబోవు స్మృతి పురాణాదికములు అతి విస్తీర్ణములు, అన్వయస్వరూపములు, కథాకథనములు; గాన నలదందుగల అద్వైత భావముల గ్రోడీకరించి వివరింప, నెక్కుడు పరియాస హేతువు కాగలదు. అయినను నిసుమంత చూచెదముగాక!

# అద్వైతము - స్మృతులు

స్మృతులని యనుట తోడనే శ్రుతమైనవాని స్మరింపగా గలుగునవి యని తాత్పర్యము. అనగా ధ్యాననిష్ఠనున్న ఋషీశ్వరులు, చతుర్ముఖుని ముఖతః వెల్వడిన చతుర్వేదముల శ్రవణము గావించుటచే నివి శ్రుతులైనవి. ఆ శ్రుతి తాత్పర్యమును వారు స్మరించుటయు, వాని వివరించుటయు జరుగుటచే స్మృతులనబడినవి ఋషిప్రోక్తములు. స్మృతులందు శ్రుతులు యథాతథముగ నుండక, భావప్రధానములై, వాని సంఘజీవితమున నన్వయించు యత్నములై యొప్పారియున్నవి. స్మృతిపదమున యథార్థముగ సాంఖ్యాది దర్శనాదులను, పురాణేతిహాసాదికములును జేరియున్నను, వ్యవహారమున సంఘాభివృద్ధియు, మానవ సుఖవర్ధమానమును గోరి, తదనుగుణ నియమనిష్ఠల నిబంధించి శాసించు ఋషిప్రోక్తనులు స్మృతులుగా గలవు. అందుచే నీ స్మృతులు ఎక్కువగా మానవ సంఘ నియమావళితో నిండియుండును. కాని అవి, శ్రుతి తాత్పర్యముల సంఘమున నన్వయింప యత్నములని మరువరాదు. అందుచేతనే 'వేదః స్మృతిః సదాచారః స్వస్య చ ప్రియమాత్మనః। ఏతచ్చతుర్విధం ప్రాహుః సాక్షాద్ధర్మస్య లక్షణం॥' (మను. 2. 12) వేదము, స్మృతి, సదాచారము, స్వాత్మప్రియత్వములు నాలుగు విధములుగ ధర్మమునకు ప్రత్యక్ష లక్షణమని పెద్దల వాక్యముగనున్నది. అట్లైనను 'ధర్మం జిజ్ఞాసమానానాం ప్రమాణం పరమం శ్రుతిః' (మను. 2. 13.) ధర్మము నెరుంగగోరువారికి శ్రుతియే పరమ ప్రమాణముగ వచింపబడియున్నది. స్మృతియు నింత ప్రాధాన్యము నార్జించి

యున్నను, శ్రుతి తాత్పర్యమును సంఘమునకన్వయించునపుడు ఏవేని శ్రుతి వైరుధ్యము దొరలినచో, 'శ్రుతి స్మృతి విరోధే తు శ్రుతిరేవ గరీయసీ' అను రీతి శ్రుత్యర్థమే ముఖ్యముగాని స్మృతి కానేరదని ఘంటాపథముగ వచింపబడియున్నది. కాన శ్రుతులైన వేదోపనిషత్తుల తాత్పర్యమునే స్మృతులు వచించుచున్నవా యని వెదకుటయే అసమంజసము. స్మృతి తప్పక శ్రుతినే అను వాదము చేయవలయునుగాని దానికి స్వాతంత్ర్యమభావము.

కావున, సర్వ స్మృతులును ఎంత సంఘముమీద దృష్టి నుంచి, మానవ సౌఖ్యమును కాంక్షించి, కట్టుబాటుల నేర్పాటు గావించినను, 'సర్వేషామతి చైతేషామాత్మజ్ఞానం వరం స్మృతం। తద్ధ్యగ్ర్యం సర్వవిద్యానాం ప్రాప్యతే హ్యమృతం తతః॥' (మను. 12. 85) వేదాధ్యాసాది,సర్వ విద్యలలో నుపనిషత్ప్రతిపాద్యమను బ్రహ్మజ్ఞానమే శ్రేష్ఠము. దానివలన అమృతత్వము సిద్ధించును గాన అదియే సంపాద్యము అని మనువు చిరకు స్మరించి బోధించి నటుల, బ్రహ్మవిద్యకే ప్రాధాన్యమొసంగి, ప్రపంచ జీవితమును సాగించుకాలమునైన దీని విస్మరింపరాదని శాసించుచున్నాడు. ఆ బ్రహ్మ విద్యా ప్రాప్యమైన బ్రహ్మమును ప్రథమమునసే ప్రస్తా వించి, 'యోఽసావతీంద్రియగ్రాహ్యః సూక్ష్మోఽవ్యక్తసనాతనః। సర్వభూతమ యోఽచింత్యః స ఏవ స్వయముద్బభౌ॥' (మను. 1. 7) ఎవడు అతీంద్రియుడై, సూక్ష్మమై అవ్యక్తుడై, సనాత నుడై, సర్వభూతమయుడై, అచింత్యుడై యుండునో వాడే స్వయముగ నుద్భవించెను అని వచించి, మరల గ్రంథాంతమున 'ఏతమేకే వదంత్యగ్నిం మనుమన్యే ప్రజాపతిం। ఇంద్రమేకేఽపరే

ప్రాణమపరే బ్రహ్మశాశ్వతం॥' (మను. 12. 123) ఈ బ్రహ్మ మును గొందరగ్నిగను, కొందరు మనువనియు, ప్రజాపతిగను, కొందరు ఇంద్రుడనియు, గొందరు ప్రాణమనియు, మఱికొందరు ప్రపంచాతీత పరస్వరూపమైన బ్రహ్మముగ నుపాసించెదరని 'ఏకం సత్ విప్రా బహుధా వదంతి' అను శ్రుతితాత్పర్యమును వ్యక్తపరచియున్నాడు.

అట్టి బ్రహ్మజ్ఞానమును బొందిన జ్ఞాని, 'సర్వభూతేషు చాత్మానం సర్వభూతాని చాత్మని। సమం పశ్యన్నాత్మయాజీ స్వారాజ్యమధిగచ్ఛతి॥' (మను. 12. 91) సర్వభూతములందు ఆత్మను, సర్వభూతముల నాత్మయందును గాంచి, సమత్వ దృష్టి గలిగి ప్రవర్తించువాడు విముక్తుడగుచున్నాడు. 'సర్వ మాత్మని సంపశ్యేత్సచ్చాసచ్చ సమాహితః। సర్వం హ్యాత్మని సంపశ్యన్నా ధర్మే కురుతే మనః॥' (మను. 12. 118) సదసత్తుల నెరింగి, సర్వము ఆత్మయే అని గ్రహించి, దాని తనయందే చూచుచు, తనను గ్రహించుకొనుచో నసత్కార్యమగ్నత గలుగదనియు, 'ఏవం యస్సర్వభూతేషు పశ్యత్యాత్మాన మాత్మానా। స సర్వ సమతామేత్య బ్రహ్మాభ్యేతి పరం పదం॥' (మను. 12. 125) ఎవడీ విధముగ సర్వభూతములగల పరమాత్మను జూచునో, వాడు బ్రహ్మ సాక్షాత్కారమువలన నుత్తమస్థానమగు బ్రహ్మమునే బొందుచున్నాడు. అనగా లీనమయి బహ్మమే యగుచున్నా డనియు మనువు ఆరంభముననేగాక గ్రంథాంతముననగూడ హెచ్చ రించియున్నాడు.

కావున స్మృతులని పేర్గాంచిన మనుస్మృతియేగాక, పరాశర, యాజ్ఞవల్క్య, గౌతమి, దక్షాది వివిధ స్మృతులును యిదే మార్గమును దొరికి, పరమ గమ్యమైన బ్రహ్మవిద్యకే స్థానమొసంగి, అఖండ అవ్యయానంద బ్రహ్మలయరూప అద్వైతముక్తినే స్మరించుచు, బ్రబోధించుచు, శాసించుచున్నవని తాత్పర్యము.

## అద్వైతము — పురాణములు

పురాణములనుటతోడనే అవి అతి పురాణములనియు, కాలనిర్ణయములకతీత విషయబోధను గావించునని యనియు దోచకమానదు. ప్రస్తుతమునగల పురాణములు యథార్థముగ బురాణములు గావనియు, ననగా బురాతనములు గావనియు, కాని యవి a combination of the very old and what is not so old అతి ప్రాచీన ప్రాచీనముల సముచ్చయమై యుండుటచే may rightly be discribed as the embodiments of the ideas and the growth traditions of the race జాతియొక్క, భావజాలములయొక్కయు, ఆచారములయొక్కయు మూర్తిమంతములని నిర్దుష్టముగ నభివర్ణింపనగుననియు సర్ సి. పి. రామస్వామి అయ్యరు 1953 ప్రబుద్ధభారత పత్రికా ముఖమున దెలిపియున్నాడు. అందుచేతనే 'స్వర్గశ్చ ప్రతిస్వర్గశ్చ వంశో మన్వంతరాణి చ। వంశాను చరితం చైతి పురాణం పంచలక్షణం॥' అని (మత్స్య. 153) సర్గము, ప్రతిసర్గము, వంశము, మన్వంతరము, వంశానుచరితము అను అయిదు లక్షణములు గలది పురాణము అని పురాణలక్షణము

వివరింపబడియున్నది. పురాణముల బుట్టుపూర్వోత్తరముల జేర్కొనుచు బృహన్నారదీయపురాణము బ్రహ్మవాక్యముగ 'శ్రుణు వత్స ప్రవక్ష్యామి పురాణానాం సముచ్చయం। పురాణమేకమేవాసీత్సర్వకల్పేషు మానద॥ చతుర్వర్గస్య బీజస్య శతకోటి ప్రవిస్తరం। కాలేనాగ్రహణం దృష్ట్వా పురాణస్య మహామతిః॥ హరిర్వ్యాసరూపేణ జాయతే చ యుగే యుగే। చతుర్లక్షప్రమాణేన ద్వాపరే ద్వాపరే సదా॥ తదష్టాదశధా కృత్వా భూలోకేస్మిన్ ప్రకాశ్యతే।' వత్సా! పురాణసముచ్చయమును దెలిపెదను వినుము. సర్వకల్పములందును శతకోటి ప్రవిస్తరమగు పురాణమొకటియై యుండెను. చతుర్వర్గ సాధనమై, శతకోటి ప్రవిస్తరమైయున్న పురాణము కాలవశముచేత నెవరు గ్రహింపజాలక పోవుటచే, శ్రీహరి వ్యాసరూపముతో ప్రతియుగమునందును అవతరించి, ప్రతి ద్వాపరమున జతుర్లక్ష ప్రమాణముచే దానిని పదునెనిమిది భాగములుగ జేసి, భూలోకమున ప్రకాశింపజేయును. అవి ఎవ్వియన 'బ్రాహ్మం పాద్మం వైష్ణవం చ వాయవీయం తథైవ చ। భాగవతం నారదీయం మార్కండేయం చ కీర్తితం॥ ఆగ్నేయం చ భవిష్యం చ బ్రహ్మవైవర్త లింగకే। వారాహం చ తథా స్కాందం వామనం కూర్మ సంజ్ఞికం॥ మాత్స్యం తత్ గారుడం తద్వద్బ్రహ్మాండాఖ్య మితి త్రిషట్' బ్రహ్మ, పద్మ, విష్ణు, వాయు, భాగవత, నారద, మార్కండేయ, అగ్ని, బ్రహ్మవైవర్త, లింగ, వరాహ, స్కాంద, వామన, కూర్మ, మత్స్య, గరుడ, బ్రహ్మాండ, భవిష్యత్తులు పదునెనిమిది. వీనియందుండెడి అద్వైత భావముల గ్రోడీకరించుట పెద్ద కార్యమగుటచే, నవియు శ్రుత్యనుసార రచనములే యగుట, వానియందు అద్వైతము ప్రస్ఫుటముగ నన్వ

యమునయి యుండునని గ్రహించెదముగాక! ఈ పురాణ గ్రంథ ములప్రధానస్థానమలంకరించియున్న భాగవతమును దిలకించుచో నెల్లచోట్ల నద్వైతప్రస్తావన గావింపబడి, నిర్వచింపబడి, వివరింపబడి, తత్సిద్ధికై భక్తిమార్గ ప్రతిపాదనము గావింపబడి యుండుట సర్వజన విదితమే. అట్లు వివిధ పురాణ గ్రంథము లును, కథారూపమున సంఘమునకు క్షేమంకరవిధానమును ధర్మశాస్త్రములవోలె బోధించుచు, పర్యవసానమున అధ్యాత్మ విద్యను వివరించి తల్లక్ష్యమైన అద్వైతమును జూపించి, తత్సాధ నమునకై భక్త్యాది మార్గముల వివరించియున్నవి. ఈ విషయ మును పురాణములగల అద్వైత విషయముల, సౌరభము స్థానాంతరమున జర్చింపగలదు గాన ప్రస్తుతము విరమించెదము గాక!

## అద్వైతము - ఇతిహాసములు

'ఇతిహాస' శబ్దమన పూర్వపు కథ యనియు, క్రమముగా నరుదెంచిన యుపదేశమనియు, సంప్రదాయసిద్ధ చారిత్ర మనియు, పూర్వవిషయము క్రొత్తగ జెప్పబడుట యనియు అను వివిధార్థములతో గూడియున్నది. అనగా ప్రాచీన చారిత్ర ములు, ఆ యా కాలముల దిరిగి వ్రాయబడి నవీనత్వము నొం దుటచే నితిహాసములనబడినట్లు స్పష్టము. 'ఇతి-హ-ఆస' అనగ అటుల వారు వచించిరి అనియు వ్యుత్పత్తి.

ఈ యితిహాస సంఖ్యలో బ్రథమ స్థానము శ్రీ వాల్మీకి రామాయణమునకొసంగబడియున్నది. అటులే వాల్మీకి మహర్షి కృత యోగవాసిష్ఠ రామాయణముగూడ బ్రసిద్ధము. శ్రీమద్రామాయణగాథనంతటిని వివరించు నీ గ్రంథము వాసిష్ఠము నాబడి, అద్వైత గ్రంథములలో నతి ప్రధానముగ స్వీకరింపబడియున్నది. అది 32 వేల శ్లోకముల బృహద్గ్రంథముగ నున్నను, వైరాగ్యముతో బ్రథమ ప్రకరణమును బ్రారంభించి, శ్రీరామచంద్రునకు వైరాగ్యమూలమున ఆధ్యాత్మిక విద్యార్థితను గలిగించి, ద్వితీయ ప్రకరణమున నతని ముముక్షువుగా నొనరించి, అంత ఉత్పత్తి, స్థితి, ఉపశమ, నిర్వాణ ప్రకరణముల సకల వేదాంతబోధను మిగుల వివరముగా బోధించియున్నది. 'మోక్షోపాయాభిధానేయం సంహితా సారసంమితా। త్రింశద్ద్వే చ సహస్రాణి జ్ఞాతా నిర్వాణగిదాయినీ॥' (యోగవాసిష్ఠ) సారవంతములగు అర్థములచే బూర్ణమై, ఉపనిషత్తుల్యమై, మోక్షోపాయంబను నామము గలిగి, 32000 శ్లోకములతోనున్న యీ గ్రంథము మోక్షమును గలుగజేయునని ప్రథమముననే వసిష్ఠమహర్షి దీనిని బ్రస్తుతించెను. 'యథా రజ్జ్వామహి భ్రాంతిర్వినశ్యత్యవలోకనాత్। తథైతత్ప్రేక్షణాచ్ఛాంతిమేతి సంసారదుఃఖితః॥' (యో. వా. 4) రజ్జువుయొక్క యథార్థ జ్ఞానముచే సర్పభ్రాంతి నశించునట్లు ఈ గ్రంథావలోకనమున సంసారదుఃఖము శమించును అనియు, గ్రంథస్థ వివరములు భ్రాంతినివారణాదులే యనునట్లు సూచించియున్నాడు. అటులనే 'యదస్మాత్ప్రాప్యతే శాస్త్రాత్తత్తద్వేదాదవాప్యతే॥' ఈ శాస్త్రముచే లభించునది వేదమువలనను లభించును. వేదాంత తర్క సిద్ధాంత స్త్వస్మిన్ జ్ఞాతే చ బుధ్యతే। ఇదముత్తమమా

వివరింపబడియున్నది. పురాణముల బుట్టుపూర్వోత్తరముల జెప్పు
చుచు బృహన్నారదీయపురాణము బ్రహ్మవాక్యముగ 'శృణు వత్స
ప్రవక్ష్యామి పురాణానాం సముచ్చయం। పురాణమేకమేవాసిత్సర్వ
కల్పేషు మావర॥ చతుర్వర్గస్య బీజస్య శతకోటి ప్రవిస్తరం।
కాలేనాగ్రహణం దృష్ట్వా పురాణస్య మహామతిః॥ హరిర్వ్యాసరూ
పేణ జాయతే చ యుగే యుగే। చతుర్లక్షప్రమాణేన ద్వాపరే
ద్వాపరే సదా॥ తదష్టాదశధా కృత్వా భూలోకేస్మిన్ ప్రకాశ్యతే।'
వత్సా! పురాణసముచ్చయమును దెలిపెదను వినుము. సర్వకల్ప
ములందును శతకోటిప్రవిస్తరమగు పురాణమొకటియై యుండెను.
చతుర్వర్గ సాధనమై, శతకోటి ప్రవిస్తరమైయున్న పురాణము
కాలవశముచేత నెవరు గ్రహింపజాలక పోవుటచే, శ్రీహరి వ్యాస
రూపముతో బ్రతియుగమునందును అవతరించి, ప్రతి ద్వాపర
మున జతుర్లక్ష ప్రమాణముచే దానిని పదునెనిమిది భాగములుగ
జేసి, భూలోకమున ప్రకాశింపజేయును. అవి ఎవ్వియన
'బ్రాహ్మం పాద్మం వైష్ణవం చ వాయవీయం తథైవ చ। భాగవ
తం నారదీయం మార్కండేయం చ కీర్తితం॥ ఆగ్నేయం చ
భవిష్యం చ బ్రహ్మవైవర్త లింగకే। వారాహం చ తథా స్కాందం
వామనం కూర్మ సంజ్ఞికం॥ మాత్స్యం తత్ గారుడం తద్వద్బ్ర
హ్మాండాఖ్య మితి త్రిషట్' బ్రహ్మ, పద్మ, విష్ణు, వాయు, భాగ
వత, నారద, మార్కండేయ, అగ్ని, బ్రహ్మవైవర్త, లింగ,
వరాహ, స్కాంద, వామన, కూర్మ, మత్స్య, గరుడ, బ్రహ్మాండ,
భవిష్యత్తులు పదునెనిమిది. వీనియందుండెడి అద్వైత భావముల
గ్రోడీకరించుట పెద్ద కార్యమగుటచే, నవియు శ్రుత్యనుసార రచ
నములే యగుట, వానియందు అద్వైతము ప్రస్ఫుటముగ నన్వ

ఖ్యానం వ్యాఖ్యాతం శాస్త్రదృష్టిషు॥' వేదాంత తర్క సిద్ధాంతము లెవ్విగలవో యవి యీ గ్రంథమునెరింగిన జోధపడగలవు. ఏల యన, వేదాంత శాస్త్రముల నిది ఉత్తమమని నిర్ణయము అనియు వసిష్ఠమహర్షి దీని ప్రాశస్త్యమును నుక్కడించియున్నాడు.

ప్రారంభముననే మంగళాచరణవాక్యముల బ్రహ్మమును బ్రస్తావించి, నమస్కరించి, 'గ్రంథమును బ్రారంభించుటచే గ్రంథవిషయము బ్రహ్మవిషయమనియే తాత్పర్యము. వివేక, వైరాగ్య, శమాదిషట్క, ముముక్షుత్వములతో బ్రథమ ద్వితీయ ముల వైరాగ్యప్రకరణముననే జేర్చి, అధ్యాత్మ విద్యాధికారి నిర్ణయము రాముని వైరాగ్యస్థితిద్వారా నిర్ణయింపబడియున్నది. ద్వితీయమగు ముముక్షు ప్రకరణమున శమాదికము ముముక్షుత్వ ములు నిర్ణయింపబడినవి. తర్వాత తృతీయమగు ఉత్పత్తి ప్రక రణముతో నసలు గ్రంథము ప్రారంభమై, సర్వవేదాంత సిద్ధాం తము అద్వైతపరముగా నిర్వచించుచు, మాయాదిక భ్రాంతి నిరూపణము గావించుచు, అవస్థాత్రయ విచారణము జేయుచు వివరించియున్నది. పూర్వ ఉపనిషదాది శాస్త్రములు సిద్ధాంత ప్రతిపాదనము సూత్రప్రాయముగ నొకచోట, బ్రశ్నోత్తరరూప మున మరియొకచో వివరింప, నీ గ్రంథము ప్రత్యేక విశిష్టతతో నా యతి కఠిన వేదాంతభావముల కథారూపములనల్లి, మిగుల సుబోధకమొనరించి యుండుటచే నిది ప్రఖ్యాతి నార్జించినది. ఈ గ్రంథమగాధము, అనల్పము. దీనగల శ్లోకములు ఉపనిషత్ప్రో క్తములు. ఈ గ్రంథభావములనేగాక, శ్లోకములగూడ యథా తథముగ ఆర్యాసంగ, నాగార్జునాది బౌద్ధ విజ్ఞాన, శూన్యవాదములు

స్వీకరించి, తమ వాదములకు బలము జేకూర్చుకొనిరని పండితాభి ప్రాయము. మాండూక్యోపనిషద్వ్యాఖ్యాత గౌడపాదుడుగూడ దన కారికలలోనికి దీని శ్లోకముల గ్రహించినట్లు కొందరి ఉద్దేశ్యము. అందుచే నీ గ్రంథము శ్రీశంకరుపై నపూర్వ ప్రభావ మును జూపియుండునని జెప్పవచ్చును. కాని స్మృతికిగాక శ్రుతికే ప్రాముఖ్యమిడు తత్త్వముగాన, శంకరుడు యీ గ్రంథ ప్రస్తావ నము నెచ్చటను గావించినట్లు గానుపింపదు. అయినను భావ ప్రాబల్యముండియుండునని నమ్మకము.

ఇంత ముఖ్యమైనదే మహాభారతము. దాని స్వరూప మంతయు గేవలను రాజకీయముగ గోచరించినను, దాని యదృష్టవశమున దానిలో బ్రధానపాత్రగ శ్రీకృష్ణభగవానుడుండు టయు, సకలార్థ సంపూర్ణయశుడగు ఆ యవతారశ్రేష్ఠుని మహిమ దానినంతటను ఆవరించి, 'మహా' శబ్దము దానికి లభింపజేసి, చతుర్వేదముల తర్వాత ధర్మశాసనముల తత్తుల్యముగ బరిగణింప బడి, పంచమవేదమను బేర్వడసి యుండుటయు దాని భాగ్యము. కాని భాగవత పురాణమునగల బాలకృష్ణుడుగాక, సర్వహృదయ సీమల నవ్యక్తముగ నాకర్షించు కొంటెకృష్ణుడుగాక, నీ మహాభార తమున నతడు మహా ప్రౌఢుడై, రాజాధినేతయై, సామ్రాజ్య నిర్మాతయై, నాటి మానవకోటికాదర్శమూర్తియై, సకల గౌరవా దరకేంద్రమై యొప్పారుటయేగాక, ఆధ్యాత్మిక విద్యాధికారిగ నర్జును రూపొందించి, తన సంకల్పములకుపకరణముగ గావించి, తన యథార్థ మూర్తిమత్త్వమును సిద్ధాంతరూపమునను, బత్యక్ష ముగను, అతనికి దెలిపి పునీతుని జేయ, యుద్ధోపక్రమణమునకు

ముందు విషాదావిష్టుడై యున్న అర్జునునకు, ఉపనిషత్తుల్య గీతోపదేశము గావించుట మహాభారతముయొక్క మహాభాగ్యము. అందుచేతనే మహాభారతము, ప్రథమమున సంస్కృతీ త్రివిధ భాగమున వివరించియున్నరీతి, సమగ్ర భారతీయ సంస్కృతీ రూపమును దాల్చిన గ్రంథరాజమన నతిశయోక్తి కానేరదు. అది ఖండ ఖండాంతరముల బ్రాకుటలో ఆశ్చర్యమేమియు లేదు.

అట్లు సర్వతోముఖమైన మహాభారతమున గపిల, ఆసురి, పంచశిఖ, సనత్కుమారాది సిద్ధాంతుల అద్వైతభావములే గాక, సాక్షాద్భగవదవతారమూర్తియై, నాడే అసంఖ్యాకులచే నర్చింపబడిన శ్రీకృష్ణపరమాత్మచే నర్జుననకు బోధింపబడియున్న భగవద్గీత ప్రఖ్యాతి నొంది, యెల్లర నాకర్షించియున్నది. ఆ మహాశాస్త్రము శంకరుదృష్టికి దోచి, ఉపనిషత్సూత్రములతో మూడవ ప్రస్థానముగ గ్రహింపజేసెను. ఉపనిషద్వేదాంతసూత్రములవలె భగవద్గీతను నద్వైత శాస్త్రముగనే అతడు విశ్వసించుటచేతనే, దానికట్టి స్థానము పూర్వమెన్నడు లభింపనిది శంకరునిచే బ్రాప్తించెను. ఈ విషయమున శంకరప్రోక్త గీతాభాష్యమే ప్రమాణము. ఎల్లరకు సామాన్య మానవునిచందము, కరచరణాద్యవయవములును తద్వ్యాపారములునుగల శ్రీకృష్ణుడు, 'నైనం ఛిందంతి శస్త్రాణి నైనం దహతి పావకః । న చైనం క్లేదయంత్యాపో న శోషయతి మారుతః॥' (గీ. 2. 23) 'అవ్యక్తోయమచింత్యోయమవికార్యోయముచ్యతే।' (గీ. 2. 25) 'నిత్యస్సర్వగతః స్థాణురచలోయం సనాతనః' (గీ. 2. 24) 'అనాదిత్వాన్నిర్గుణత్వాత్పరమాత్మాయమవ్యయః । (ది. 13. 31) మొదలగు ఆత్మ లక్షణముల బ్రహ్మజ్ఞానియై వివరించుటయేగాక, 'మన్మనా భవ

మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు' (గీ. 9. 34) 'మయా తతమిదం సర్వం జగదవ్యక్తమూర్తినా। మత్ స్థాని సర్వభూతాని న చాహం తేష్వవస్థితః॥' (గీ. 9. 4) నిర్గుణనైన నాచేత నీ జగత్తంతయు వ్యాప్తమై యున్నది. భూతములన్నియు నా యాధారమున నున్నవి. నాకు భూతములాధారములు గావు. 'సర్వభూతాని కౌంతేయ! ప్రకృతిం యాంతి మామికాం। కల్ప క్షయే పునస్తాని కల్పాదౌ విసృజామ్యహం॥' (గీ. 9. 7) అర్జునా! కల్పాంతమునందు జగత్తునందలి భూతములన్నియు నా ప్రకృతిని బొందుచున్నవి. మరల కల్పారంభమున వాని నేను సృజించుచున్నానని, అసంఖ్యాక వాక్యముల, ఉపనిషత్తుల వామదేవ మహర్షి బ్రహ్మజ్ఞాన తత్పరత 'అహం మనురభవం సూర్యః' నేనే మనువును, సూర్యుడను అని వచించియున్నట్లు, శ్రీకృష్ణభగవానుడు శుద్ధాద్వైతతత్త్వమును బ్రకటించుటయేగాక, విభూతియోగమున తన విరాట్స్వరూప వర్ణనము బూర్తిగ గావించి, 'ఏవముక్త్వా తతో రాజన్! మహా యోగేశ్వరో హరిః। దర్శయామాస పార్థాయ పరమం రూపమైశ్వరం॥' (గీ. 11. 9) ధృతరాష్ట్ర మహారాజా! పూర్ణయోగీశ్వరుడైన శ్రీ కృష్ణుడు యీ రీతి బలికి, తన పరరూపమైన విశ్వరూపమును పార్థునకు జూపించెను అను సంజయుని వాక్యము రీతి సాక్షాత్తు తన విరాడ్బ్రహ్మరూపమును అర్జునునిచే గాంచజేసెను. విరాడ్ఢిరణ్యగర్భ ఈశ్వర విభేదమున బ్రహ్మము స్థూల సూక్ష్మ కారణములుగ త్రివిధముగా నుండి, ప్రథమముమాత్రము దృశ్యమానమగుటకవకాశముండుటచే శ్రీ కృష్ణుడు ఆ స్వరూపమునే వ్యక్తము జేయగలిగెను. అంతియగాక నీ శ్లోకరాజమున గీతారహస్యమంతయు

'మహా యోగేశ్వరః' అను పదమున నిమిడియున్నది. కేవలము పరమాత్మయై యుండి శ్రీకృష్ణుడు ఈ దర్శనమిడియుండక, తన మహాయోగబలమున, అనగ ఆధ్యాత్మికానుభూతి మహిమచే, బ్రహ్మవిదునివలె బ్రహ్మమై, నిజ స్వరూపమును దర్శింపజేసినట్లు సువిదితము. మరల సామాన్య కృష్ణరూపమునే అర్జునుడు కాంక్షింప, కృష్ణపరమాత్మ ఆ రూపమును బొంది, వెంటనే 'మయా ప్రసన్నేన తవార్జునేదం రూపం పరం దర్శితమాత్మయోగాత్' (గీ.11.47) అర్జునా! నీకు ప్రసన్నుడనై అన్యులింతవరకు గాంచని రూపమును నీకు ఆత్మయోగమువలన జూపించితిని అని పలుకుటయు గమనార్హము. అందుచే గీతాశాస్త్రమున శ్రీకృష్ణుని అద్వైతానుభూతియే ముఖ్య ప్రసంగమై, అదియే మూర్తీభవించి విశ్వరూపసందర్శనయోగమై రూపొందుటచే, నది అద్వైత శాస్త్రమేగాని అన్యముగాదని తాత్పర్యము. శంకరుడు దీని ప్రస్థానత్రయమున జేర్చి గౌరవించుటయు నదే కారణమని వేరుగ వచింప నవసరములేదు. ఈ గీతాశాస్త్రము మాయా ప్రస్తావమును 4.16, 7.14, 7.25, 4.6, 18.61 మొదలగు స్థానముల ప్రత్యక్షముగను, అసంఖ్యాక స్థానముల అన్వయమునను జేసియున్నది.

మరియును, కేవలము అధ్యాత్మవిద్యా శాస్త్రముగనేగాక, **Gita is said to be the most beautiful, perhaps, the only true philosophical song existing in any known tongue** [192] తెలియబడుచున్న ఏ యితర భాషలో నైనలేని యథార్థ అతిసుందర తాత్త్వికగీతముగ విలియం వాన్

---

192. William Von Humboldf : Indian Philosophy, vol. 1 p 519, of S. Radhakrishnan.

హంబోల్డ్ స్తుతించియున్నాడు. అటులే Boston Brahmin బోస్టన్ నగర బ్రాహ్మణుడని కీర్తిగడించిన Emerson ఎమర్సన్ గూడ Gita was the first of books; it was an empire spoke to us. - - - the venerable Oracle గీత ఉత్తమ గ్రంథము. ఒక సామ్రాజ్యము మనతో బ్రసంగించు చున్నట్లుండును. గౌరవప్రదమైన ఈశ్వరవాణి అని గౌరవించి యున్నాడు. అనేక విధముల స్తుతించి, నుతించి, మిఛ్లెట్ I have found the object of my search 193 చివరకు నా అన్వేషణాగమ్యమును బొందితిని అని గీతాదర్శనమున నుచ్చరించియున్నాడు.

కావున, గీతాశాస్త్రముగూడ శంకర పూర్వాద్వైతశాస్త్రములలో నతిప్రధానమై, శంకరు భావఝరిని దీర్చి దిద్దిన దనుట నిర్వివాదము.

## అద్వైతము - శైవ, శాక్త తంత్రము

వేదములయందు ఉపనిషత్తులయందును, ఇతర దైవ మూర్తులకంటె నతిప్రధానుడై, రుద్ర, ఈశాన, ఈశ్వర, పరమేశ్వర, మహాదేవ, శివ, శంకరాది వివిధ నామధేయముల నర్చింపబడుచు, సర్వమును సృజించు మహాకారణము తానై, పోషించి లయింపజేయు శక్తియు దానై యొప్పారు పరమేశ్వరుగూర్చి నెంతయని జెప్పగలము! తానే పరమశివుడై, సదాశివుడై శక్తి నపేక్షించి, ఆమెద్వారా బ్రహ్మ, విష్ణు, ఈశ్వర మూర్తిత్రయ

193. Michelet : The Bible of Kindness.

రూపముల దానే పొంది, సృష్టి స్థితి లయాది కార్యకలాపమును నిర్వహించు అద్భుతశక్తి యగుటచే, సర్వదేవతలకాధార మూర్తియై వెలుగొందుటచే నతడు, మహా దేవుడు పరమేశ్వరుడని పేర్వడయుట సమంజసమే. అందుచేత బురాణములలోగూడ నధికసంఖ్యాకములు శైవపరముగనే యొప్పారుట గమనార్హము.

మంగళకరమైన శివుడు సదాశివుడై, శుద్ధనిర్మలుడై యుండ సృష్టి అభావము, నానాత్వము అదృశ్యము. కాని ఆతనితో త్రిగుణాత్మకమైన శక్తి యొండు అద్వైతవాదమున మాయనుబోలి అనిర్వాచ్యమై, అతనియందిమిడియుండును. కాని దాని యునికిచే బరమశివునియందు ద్వైతముగాని, భిన్నత్వముగాని, వైరుధ్యము గాని ఏమాత్రము ఏర్పడదు. అచింత్య కారణవశమున నాతనిలో నది జరించి, నతని జ్ఞానశక్తిగ బ్రథమమున రూపొందును. అంత నా జ్ఞానము సంకల్పాత్మకమై ఇచ్ఛాశక్తిగగూడ మారును. ఇచ్ఛాశక్తి సృష్టిని సంకల్పించి క్రియాశక్తిగగూడ మార్పుజెంది, యీ జ్ఞాన ఇచ్ఛాక్రియాశక్తులు సృష్టియందుండి యీ సర్వవిశ్వమును నడిపించుచున్నటుల శైవాద్వైత తాత్పర్యము. శక్తి యింతగ శ్రమించి, కార్యముల నిర్వహించినను అది శివశక్తిగనే యుండి అప్రధానమై, అభిన్నమై యుండుటచేత శివుడద్వితీయుడై యుండును. కాన శైవాద్వైత వాదముగా నీ సిద్ధాంతము పరిగణింపబడుచున్నది. ఈ సిద్ధాంతము బీజరూపముగ వేదములలో నుపనిషత్తులలో నుండ, బురాణములలో విస్తారముగ బ్రబలి, తంత్రశాస్త్రముల బూర్ణరూపమును దాల్చినది.

'తన్యతే, విస్తార్యతే అనేనేతి తంత్రం' తన్ = విస్తరింప జేయుట, త్ర = రక్షించుట యగును. అందుచే ప్రపంచ పాశముల నుండి రక్షించు జ్ఞానమును ప్రసరింపజేయునది తంత్రమని యర్థము. ఈ తంత్రశాస్త్రమును పరమశివుడు పార్వతికుపదేశించుచున్నటుల నుండుచు, వేద ఉపనిషత్తుల బీజరూపమునసున్న సాధన భాగమును బూర్తిచేయుటచే దీనికి సాధనవేదమనియు ప్రతీతి గలదు. ఇట్లుపదేశింపబడిన తంత్రములు 500 గ నుండ, శైవప్రధానములు 32, శాక్తములు 66. ఇంక బౌద్ధపరమైనవి, వైష్ణవపరములుగ నన్వయింపబడినవియు గూడ గలవు. వీనిలో ఆగమ, యామలక, దామత, సంహిత లను విభాగములును గలవు. ఈ శాస్త్రములన్నియు నేక కంఠముగ శివప్రాధాన్యమును అంగీకరించుచు, నుతించుచు, ప్రపంచమున నేదోయొకరూపమున నావరించియున్నవి.

కావున, శంకరప్రతిపాదిత **Monism** ఏకేశ్వరవాదమున కేమి, అద్వైతసిద్ధాంతమునకేమి యీ శాస్త్రములు మిగుల దోడ్పడియుండుననుటకెట్టి సందియమును లేదు. అంతియగాక శంకరుడు ఎంత అద్వైతవాదియైనను, ఎన్ని గీతముల, శ్లోకముల, నితర దైవపరములుగ లిఖించియున్నను, అతని చిత్తము శివ పరముగనే ప్రవర్తించియుండుట తెలియనిదికాదు. కావుననే అతనికి శైవునిగనే వ్యవహారమున, లోకమున వ్యాప్తిగలిగి, ఆ పరంపరకు జెందిన సన్యాసులందరును శైవులుగనే బరిగణింపబడుచున్నారు. శంకరపూర్వమెట్లున్నను, శంకరు రూపవర్ణనము, శంకరానంతర సన్యాస అచార వ్యవహారములు శుద్ధశైవముగ

జూపునకు గన్పట్టును. శైవసంబంధమైన భస్మ రుద్రాక్ష ధారణ ములు, శివపంచాక్షరీ ఉపాసనము, శివపంచాతన పూజావిధానము మొదలగు విషయములన్నియు శంకరహృదయమును వెలిబుచ్చుచు, అతని శివపరముగ రూపొందించుచున్నవి. కావున శైవాద్వైతవాదము శంకర అద్వైతసిద్ధాంత ప్రతిపాదనా కార్యమున మిగుల ఉపయుక్తమై యుండుననుట నిర్వివాదము.

అటులే, శాక్తాద్వైతము ద్వైతాద్వైతములకు మధ్య సంగమస్థానము. శుద్ధమై నిర్వికారమైన బ్రహ్మము వికారమై, ఖండమై, సృష్టిరూపమును దాల్చుట యసంభవము. అందుల కెట్టులేని అతని నిర్వికారతకు భంగము వాటిల్ల జేయక, అతనియందిమిడి అన్యత్వము గల్పింపకనుండు ఒక అనిర్వచనీయ శక్తి అద్వైతమునకవసరము. అట్టి శక్తిగ శైవాద్వైత వాదము. శివ శక్తి యని వివరించి రూపొందించియున్నది. అది సర్వవిషయముల అద్వైతవాద మాయాశక్తినిబోలి యుండునని దోచును.

కాని శాక్తాద్వైతవాదము అట్లంగీకరింపదు. శివునకు బూర్వమే శక్తి నిర్వికారముగ నుండి, 'కృష్ణవర్ణం నిరాకారం' అనునట్లువివర్ణముగనుగూడ నుండి, సర్వవ్యాప్తమై, అగోచర కారణాంతరమున సృష్టిసంకల్పమావేశింప, 'తం విలోక్య మహేశాని సృష్ట్యుత్పాదనకారణాత్। ఆదినాథం మానసికం స్వభర్తారం ప్రకల్పయేత్॥' (శక్తిసంగమ తంత్ర) సృష్టి కల్పించుకారణమున స్వభర్తను గల్పింపనని దేవి అనునట్లు తనకాధారముగ మహేశ్వరుని గల్పించినది. అందుచే నా శక్తికి ఆద్యశక్తి యనియు, అదితి యనియు, పురాణి అనియు వివిధ నామధేయములుగూడ ప్రశస్తిగ గలవు.

అనగా దన భర్త కంటె దానే ముందుండుటచే దానే ముఖ్యమై, శివుడప్రధానుడగుట శాక్తేయసిద్ధాంత తాత్పర్యము. శక్తి అద్వయము. శివుని యావిర్భావముతో ద్వయమేర్పడినట్లు శాక్తేయ భావము. అందుచే, శాక్తాద్వైతముగ బేర్కొనబడియున్నది.

అటులే సాధనలయందుగూడ అద్వైతము శాక్తేయమును ఎక్కువ స్వీకరించినట్లు విదితము. అద్వైతపరుడైన శంకరుడే తన పీఠస్థానముల నా దేవిని ప్రతిష్ఠించి, నాటినుండి నేటివరకు అవిచ్ఛిన్నలీల అర్చనాదుల సాగించునట్లు గావించియున్నాడు. మరియు నాతడు కాంచీ, కాశీ మొదలగు శక్తిక్షేత్రముల నెక్కుడు దర్శించి, వసించి, ఉపాసించినట్లు జీవితము తెలుపుచున్నది. అనేక ప్రదేశముల శంకరాచార్యులు శ్రీచక్రముల బ్రతిష్ఠించి నట్లును చరిత్ర తెలియబరచుచున్నది.

మరియు శాక్తోపాసనావిధానముగూడ, ద్వైతాద్వైతము లకు మధ్యమార్గముగ నున్నది. బాహ్య దైవమును నెలకొల్పి, పరమేశ్వరుడు బాహ్యమే యని ద్వైతము బోధింప, సర్వము తానే యని అర్చననే నిరాకరించును అద్వైతము. కాని శాక్తము ఈ రెండునుగాక, బాహ్యమున సాధనోపకరణముగ నెలకొల్పబడిన దైవముపరముగాక స్వకీయమే యని విశ్వసించి, తన హృదయ మునుండి యా మూర్తిని బాహ్యమూర్తిలో బ్రవేశింప నాహ్వా నించి, యందుపవిష్టుగావించి పూజించి, మరల హృదయమున బ్రవే శింపజేసికొనును. అందునా పూజార్హదైవము యథార్థమున నన్యముగాక తనయందిమిడియున్న ఆత్మస్వరూపమే యని తాత్పర్యము. అనగా నద్వైతార్థమున దానే యనియు దృఢ

భావము. కావుననే The Saktha Tantra is a Sadhana Shastra of Monistic Adwaita Vedanta [194] శాక్త తంత్రము అద్వైత వేదాంతముయొక్క సాధనశాస్త్రమని, తంత్ర శాస్త్రమును క్షుణ్ణముగ గవేషించి, సారమును గ్రహించి, సత్యమును వెలిబుచ్చి, విస్తారము ప్రచారము గావించిన సర్ జాన్ వుడ్రాఫ్ తీర్మానించియున్నాడు.

కావున నీ రీతిగ, సాధన సిద్ధాంతముల నద్వైతవాదమునకు బహుళోపయుక్తమైన శాక్తాద్వైతవాదమును శంకరుడు తప్పక ఉచితలీల నుపయోగించుకొనియే యుండుననుటకెట్టి సంశయమవసరము లేదు. ఈ విషయముల సౌరభ గ్రంథము శైవ, శాక్త ఖండమున విస్తారముగ దెలుపగలదు. ఈ విధముగ శైవ శాక్తములు రెండును శంకర అద్వైతవాదమును బలపరచి, దానియందేకమై అభిన్నలీల యున్నవనియు నననగును.

## అద్వైతము - బౌద్ధవాదము

'సమాధిః ఆర్యాణాం ధ్వజా, ప్రజ్ఞా ఆర్యాణాం ధ్వజా ముక్తిః ఆర్యాణాం ధ్వజా' (రత్నరాసి సూత్త) సమాధి ఆర్యుల టెక్కెము. ప్రజ్ఞ ఆర్యుల బావుటా. ముక్తి ఆర్యుల ధ్వజము అని ముఖ్విధముల ధ్వజముల నార్యసంస్కృతి వివరణముగ నావిష్కరించిన బౌద్ధవాదముకూడ శంకరుని అద్వైతవాదముపై దన ప్రాబల్యమును ఎక్కువగ జూపియున్నది. ప్రపంచమున

194. Sir John Woodrofe : Shakti and Shakta, p xi.

మూడవ భాగమునకుమించిన అసంఖ్యాక మానవకోటిచే ననుస రింపబడుచు, నిత్యము 'బుద్ధం శరణం గచ్ఛామి' అని శరణాగతి స్వీకరించుచున్న యీ అపూర్వ వ్యక్తినిగూర్చి తెలియనివారు ప్రపంచమున, ముఖ్యముగ భారతదేశమున నుండజాలరు. Buddha through the ages has been depicted seated calm and serene, gently smiling upon mankind 195 సహస్రాధిక వత్సరములుగ ప్రశాంతుడై, గంభీరుడై, మానవకోటిపై మందహాసమున జూచుచు, బుద్ధుడు ఆసీనుడై యున్నట్లు చెప్పబడుచున్నది. ఆ మూర్తి Sir Hamilton సర్ హామిల్టన్ భావించినటుల సర్వమానవకోటియొక్క కల తలదీర్చు ప్రశాంతచిత్తము గలిగియుండుట నిస్సందేహము. Buddha wrote nothing, but he imprinted himself on the plastic, retentive souls of the listeners 195 బుద్ధుడు ఏమియు రచింపలేదు, కాని శ్రోతలయొక్క ధారణశక్తిగల మృదు హృదయములపై దన స్వరూపమును ముద్రించుకొనెను అని సర్. ఫ్రాన్సిస్ యంగ్‌హస్బెండ్ వాకొను నటుల, బుద్ధునిమూర్తి అసాధారణము, అద్భుతాకర్షణీయము. We must set before us the admirable figure - that finished model of calm and sweet majasty, of infinite tenderness for all that breathes and compassion for all that suffers, of perfect moral freedom and exemption from every prejudice 196 మధుర ప్రశాంత గాంభీర్యముల సుందరముగ మలచబడిన,

195. Sir Francis Younghusband : Some Sayings of Buddha xiii. of Woodword.

196. Dr. S. Radhakrishnan : Indian Philosophy, vol. 1, p 474

సర్వప్రాణులకొరకు అనంత కారుణ్యముతో బాధనొంది, అఖిల ముపై దయతో, సంపూర్ణ నైతిక స్వాతంత్ర్యము గలిగి, సకలా సూయల విమోచనమును గలిగియున్న ఆ యద్భుతమూర్తిని మనము ముందుంచుకొనవలెను. He never spake but good wise words. He was the light of the world 196 ఉత్తమములు వివేకవంతములుగాని వాక్యముల నతడు పలుకలేదు. అతడు 'విశ్వ జ్యోతి' అని Barth బార్త్ The serenity and gentleness of his face, the beauty and dignity of his life, the earnestness and enthusisam of his love, the wisdom and the eloquence of his message won the hearts of men and women alike 197 అతని ముఖము యొక్క ప్రశాంత గాంభీర్యములు, జీవితమునగల సౌందర్య ఔన్నత్య ములు, అతని ప్రేమలోగల ఆతురత ఉత్సాహములు, సందేశ మునగల వివేకపటుత్వములు, స్త్రీపురుష విభేదములులేక ఎల్లర హృదయముల నాకర్షించినవి అని రాధాకృష్ణ పండితుడు, More that a third of mankind, owe their moral and religious ideas to this illustrious prince; whose personality though imperfectly revealed in the existing sources of information, cannot but appear the highest, gentlist, holist, and most beneficent - - - in the history of thought 198 ప్రపంచములో మూడవ భాగమైన మానవ సంఘము, తమ

196. Dr. S. Radhakrishnan : Indian Philosophy, vol. 1, p 4[?]4
197 Dr. S. Radhakrishnan : Indian Philosophy, vol. 1, p 349
198. Sir Edwin Arnold : Light of Asia, p viii.

నైతికాధ్యాత్మిక భావములకొరకు యీ ప్రసిద్ధ రాచకొమరునికి ఋణపడియున్నది. ప్రస్తుతము మనకు లభించిన విషయముల ననుసరించి, అతని వ్యక్తిత్వము అసంపూర్ణముగ వ్యక్తమై యున్నను, ఉత్కృష్టమును, సౌమ్యత్వమును, పావనత్వమును, అత్యంతోపయుక్తమును అయియున్నది. ప్రపంచ ప్రఖ్యాతమైన Light of Asia 'ఆసియాఖండ జ్యోతి' అను గ్రంథకర్త సర్. ఎడ్విన్ ఆర్నాల్డ్ మొదలగు పండితాగ్రేసరులు, బుద్ధభగవానుని మూర్తిచే వ్యామోహితులై గానము జేసియున్నారు. అట్టి అసాధారణ ప్రశాంతమూర్తి విశ్వమున జనించుట అదే ప్రారంభమేమో! అంత్యముగూడ నదియే అయి యుండవచ్చును. విశ్వమున్నంత వరకు ఆ మూర్తి చైతన్యము దాని నావరించి, సర్వోపయుక్తమై శాంతిచంద్రికల బ్రసరింపజేయుచునే ఉండగదని విజ్ఞుల గాఢ విశ్వాసము.

ఆ మూర్తి శంకరునికిబూర్వము జనించి, నాటి విజ్ఞలోకమును గదలించివైచెను. అప్పటికే India possessed a great culture of its own. Centuries before than the Upanishads and Bhagavatgita - - - had been written, there were great oral traditions going back farther still. Right in the blood of the Indian Culture of Buddha's life, there must have been strains of pre-Vedic culture 199 హిందూ దేశము గొప్ప సంస్కృతిని గలిగియున్నది. అప్పటికి గొన్ని శతాబ్దములక్రితమే ఉపనిషద్గీతాదులు లిఖితములైనవి. ఇంకను

199. Sir Francis Younghusband : Some Sayings of Buddha, p viii.

వెనుకకు వాఙ్మూలక సంప్రదాయములు వెడలును. బుద్ధుని జీవిత కాలమున భారతీయ సంస్కృతిలో వేదపూర్వ సంస్కృతీ పరంపర లుండియున్నవి అనియు సర్. ఫ్రాన్సిస్ యంగ్‌హస్బెండ్ వాకొని యున్నాడు. కావున బుద్ధుని వాగమృతమైనను స్వకీయముగాక, పూర్వమే వచింపబడినరీతి, ఖూర్వపూర్వప్రోక్తమై భారతీయ అనాది సంస్కృతీ వాతావరణ తరంగ సముద్భవమే యగుచున్నది. కాన గౌతమబుద్ధుని యుపదేశముల గ్రొత్తందనము లేదని ప్రస్ఫుటము. క్రొత్తవిషయముల దాను బోధించుచున్నటుల బుద్ధభగవానుడెచ్చటను పలికియుండలేదు. అట్టి భావము బౌద్ధమతమునకే నూతనము.

కాని కాలక్రమమున బుద్ధుని బోధలు నాస్తికములనియు, తదనుష్ఠానఫలితముగ శూన్యమై పోవుట జరుగునుగాని ముక్తి అసాధ్యమనియు నొక అపవాదము ప్రబలి, తద్విరోధ సిద్ధాంతులు బహుళ ప్రచారము గావించి, ప్రాబల్యమును గడించి, తద్బల విశేషమున భారతదేశమునగల బౌద్ధవాదుల నిరసించి, హింసించి రూపుమాపిరి. కాన పశుబలమునకు బౌద్ధము లొంగి దేశాంతర గతముకాక తప్పలేదు. ఈ విషయము యొక్క సత్యాసత్య పరిశీలనము మన సౌరభ గ్రంథము తన బౌద్ధ ఖండమున విపులము గావించునుగాన నిట క్లుప్తసరణి ముగించెదముగాక !

బుద్ధుడు, తన ప్రసంగములలో నెచ్చటను సాంప్రదాయిక రాను కృష్ణ శివాది పదములమాత్రమేగాక పరమేశ్వర బ్రహ్మ ఆత్మ మొదలగు పదములగూడ వాడలేదని అపవాదము. కాని

యీ వాదము దోషయుక్తము. వాని నసంఖ్యాక సందర్భముల నుపయోగించియు, నిర్వచింప యత్నించుట అసందర్భ హేతువగుటచే నిర్వచింప, వివరింప యత్నింపలేననుటుచితము. భగవత్తత్వము, ఉపనిషత్తుల నిర్వచింపబడినట్లు అవాఙ్మానసగోచరమనియే అతని నమ్మకము. ఈ విషయముననేక ప్రసంగములలో మనము గాంచగలము. నిర్వాణ, శూన్య పదముల సృజించి, వాని సర్వ శూన్యమను అర్ధమున నుపయోగించెననునది ద్వితీయాపవాదము. కాని ఈ రెండు పదములును ఉపనిషత్పదములే గాని బుద్ధకల్పితములు గావు. 'సంపూర్ణహృదయః శూన్యేతారంభే యోగవాన్ భవతి' (సౌభాగ్యలక్ష్మి. 6) 'మహా శూన్యం తతో యాతి సర్వసిద్ధిసమాశ్రయం' (సౌభాగ్యలక్ష్మి. 9) 'బ్రహ్మాశూన్యం మనఃశూన్యం బుద్ధిశూన్యం నిరామయం। సర్వశూన్యం నిరాభాసం సమాధింభిధీయతే॥' (ఉత్తరగీత. 17) 'అహం జగద్వా సకలం శూన్యం వ్యోమ సమం సదా' (మహా. 6. 58) 'శూన్యం తత్ప్రకృతిర్మాయా బ్రహ్మవిజ్ఞానమిత్యపి' (మహా. 6. 61) 'ప్రళయే సర్వశూన్యం భవతి' (త్రి. మహానారాయణ. 1)మొదలగు ప్రాచీనార్ష గ్రంథములు, ఉపనిషత్తులు శూన్య శబ్దమును బహుళముగా నుపయోగించియుండుటయేగాక బుద్ధుని యర్థమునే స్ఫురింపజేయుట గమనార్హము. 'శూన్యం వక్తుం న శక్యతే। సుఖం చ అస్తి' (ధర్మానంద) శూన్యమును వచింప శక్యముగాదు. అచట సుఖము గలదు. 'శూన్యం ఇతి న వక్తవ్యం అశూన్యం ఇతి వా భవేత్। ఉభయనోభయం చేతి ప్రజ్ఞప్త్యర్థం తు కథ్యతే॥' (మాధ్యమిక కారికా. 22. 2.) శూన్యమనిగాని అశూన్యమనిగా, ఉభయ మనిగాని ఉభయముకాదనిగాని వచింప

రాదు. వ్యవహారముకొరకు శూన్యము అనబడినది. 'త్ర తత్రి అస్థితా వా నాస్థితా వా నావిద్యతే ఒ నోపలభ్యతే' అచ్చట ఉండుట లేకుండుటలు లేవు. 'శూన్యతా సర్వదృష్టీనాం ప్రోక్తా నిశ్శరణం జనైః। యే శాంతు శూన్యతాదృష్టిస్తాన్ అసాధ్య తవ భాషిరైః' మా. కా. 13) దానిని శూన్యమను వారుగూడ అభి వృద్ధిచెందని చెందని శక్తులు. శూన్యమని చెప్పుటయు దోషమై రాజిల్లును అని, శూన్య పదము బౌద్ధగ్రంధములలో బుద్ధ నాగార్జు నాది శంకరపూర్వ మహావ్యక్తులచే నిర్వచింపబడియున్నది. కాన శూన్యమన సర్వశూన్యమనుట, నందుచే బౌద్ధమును ఖండించు టయు, నిరసించుటయు సముచితము గాదు. అది అసందర్భమని పరిశీలకులకు దోచకమానదు.

రెండవది 'నిర్వాణ' పదము. ఈ పదము ఉపనిషత్తుల బహుళముగ వాడబడియున్నది. ఈ పదమునకు నాశము, ముక్తి యను రెండర్థముల నిఘంటువులు తెలుపుచున్నవి. పక్షపాతమున నాశమను అర్థము బౌద్ధ నిర్వాణమునకును, ముక్తి అను భావము ఆర్షనిర్వాణమునకు అన్వయించుట పరిపాటియైనది. ప్రాపంచి కత్వము నశించుటయు, దత్ఫలముగ ముక్తి లభించుటయు అను రెండు కార్యములేకకాలమున నేర్పడుటచే నర్థద్వయము సముచిత మగుచున్నది. కావున బుద్ధుడు నిర్వాణ పదమును వివరించుచు, 'అన్వేషింపబడు నిర్వాణపదవి భవములేనిది. అద్వితీయమైనది. ఏకాగ్రముచేత అనుభవవేద్యము. జరాదుఃఖములు లేనిది. నే నెరిగితిని. అది అగాధము. అతీతము. ప్రశాంతము. ఉన్నతము. తర్కవిదూరము. సంపూర్ణజ్ఞానులకు పూర్ణప్రజ్ఞులకు అనుభవ

స్థైర్యము లేక నా హిమశిఖరములపై నిలచినట్లు, పాపములు నశింప మానవుడు నిర్వాణమును జేరుకొనును. Him the Gods envy from their lower seats; Him the Three worlds in ruin should not shake; All life is lived for him, all deaths are dead; Karma will no more make, new houses. Seeking nothing, he gains all; Foregoing self, the Universe grows 'I'; If any teach NIRVANA is to cease, Say unto such they lie 201 అతనిని గాంచి క్రింద స్థానములందున్న దేవతలు అసూయ పడుదురు. శిథిల లోకత్రయము నతని గదలింపజాలదు. సకల జీవితము అతనికొరకే మనును. సర్వమృత్యువులు నశించినవి. నూత్న గృహనిర్మాత యగు కర్మ యిక నిర్మింపదు. దేనినన్వేషింపక నతడు సకలము బొందును. స్వాత్మను త్యజించు విశ్వాత్మగ నభివృద్ధి గాంచును. నిర్వాణము అనగా నశించుట యని ఎవరేని బోధించుచో వారు అసత్యము పలుకుచున్నారని దెలుపుట. If any teach Nirvana is to live, Say unto such they err: not knowing this, not what light shines beyond their broken lamps, Not lifeless, timeless, bliss 201 ఎవరైన నిర్వాణమున జీవించుట అని దెలుపుచో వారు పొరబడుచున్నారని తెలుపుడు. దీని నెరుంగక, వారి భిన్న దీపికలకతీతముగ నెట్టి తేజము ప్రకాశించుచున్నదో ఎరుంగరు. అది అప్రాణము, నిష్కాలము, ఆనందము అని బుద్ధభగవానుడు సవివరముగ నిర్వాణ నిర్వచనములగల దోషముల వ్రేలితో జూపెట్టి విశదము జేసియుండ, నిక

201. Sir Edwin Arnold : Light of Asia, p 152.

నీ అసందర్భ సందేహములకు అవకాశ మెందున్నదో! The destruction of craving is Nibbana 202 తృష్ణా వినాశనమే నిర్వాణము. Release means Nibbana. Rooted in Nibbana the holy life is lived. Nibbana is its goal. Nibbana is its end 202 ముక్తి అన నిర్వాణము. నిర్వాణములో మునిగి జీవితము నడుపబడును. దాని గమ్యము నిర్వాణము. దాని పర్యవసానము నిర్వాణము. Possessing naught, and cleaving unto naught. That is the isle, the incomparable isle. That is the ending of dreary and death. Nibbana do I call it, that is the isle 203 తనదిగ నేదియులేక, దీనిని అంటిపెట్టుకొని యుండకుండుటయే. అది అతులమైన ద్వీపము. భయమరణముల యంతము నిర్వాణమని నేను దానినందును. అదియే ద్వీపము అనియు బుద్ధభగవానుని బోధ.

నిర్వాణ పద అర్థమునుగూర్చి సర్. ఫ్రాన్సిస్ యంగ్ హస్బెండ్ వ్రాయుచు, In a state of such tremendous activity as to appear to be as motionless as a spinning top. This is what is meant by Nirvana. And this is the goal of Buddhism. Not nothingness but superlative activity 204 నిర్వాణము అను అట్టి అద్భుత స్పందనమున, తిరుగుచు నిశ్చలముగ నున్నటు

202. Goutama Buddha : Some Sayings of Buddha, of Woodward, p 327.

203. Goutama Buddha : Some Sayings of Buddha, of Woodward, p 331.

204. Sir Francis Younghusband : Some Sayings of Buddha, of Woodward, p xix, xxxviii.

వేద్యము. (మజ్జిమనికాయము) ఆ నిర్వాణము ప్రశాంతము. సంబంధ రహితము, అనాత్మనిరోధము. (మజ్జిమ) నిర్వాణము ముక్తి స్థితి నిర్మలస్థితి. (మజ్జిమ) నిర్వాణము భావచైతన్యాతీతము. (మజ్జిమ) 'నిబ్బానం పరమం సుఖం' (ధమ్మపద. 15.10) నిర్వాణము ఉత్కృష్టానందము అని నిర్వచించియున్నాడు. Nirvana as awakening from a day dream or night mare 199 నిర్వాణము స్వప్నమునుండి దుస్స్వప్నమునుండి మేల్కాంచుటవంటిది. It is neither infinity of consciousness, nor nothingness. This is rejection of all positive determinations, does not imply nothingness 199 అది అనంతాకాశము గాదు. అనంతప్రజ్ఞానముగూడ శూన్యముగూడ కాదు. శూన్యముకాక సర్వఅనుకూల నిర్వచనముల నివాసమే అగుచున్నదని బుద్ధుని వివరణము. Unto Nirvana. He is One with Life, Yet lives not. He is blest ceasing to be. Om Mani Padme, Om! the dew drop slip into the shining sea 200 నిర్వాణము నందుకొనును. అతడు నిత్యజీవితముతో నేకమగును. కాని జీవించుటలేదు. లేకుండునట్లు ఆశీర్వదింపబడెను. 'ఓం మణి పద్మే ఓం!' మంచుబిందువు ప్రకాశవంతమగు సాగరములోనికి జారినది! As one who stands on yonder snowy horn, Having naught over him but the boundless blue, So, these sins being slain, the man is come NIRVANA'S verge unto 201 ఊర్ధ్వమున నీలాకాశముగాక

199. Sir Francis Younghusband : Some Sayings of Buddha p. viii.
200. Sir Edwin Arnold : Light of Asia, p. 145
201. " " p. 152

లుండు బొంగరమువలె నుండును. నిర్వాణము అనగా నిది. బౌద్ధమతముయొక్క గమ్యము యిదే. శూన్యముగాక అతీతమైన సంచలనమే అనియు, Nirvnna is a state of Somethingness to the nth degree 104 అనంతమువరకుగల అస్థిత్వమే అనియు వచించియున్నాడు. 'యత్థ ఆపో చ పథవీ తేజో వాయో న గాధతి న తత్థ సుక్కా జోతంతి ఆదిచ్చో న ప్పకాసతి న తత్థ చందిమా భాతి తమో తత్థ న విజ్జతి। యదా చ అత్తనా వేదీ ముని మోనేణ బ్రాహ్మణో। అథ రూపా అరూపా చ సుఖదుక్ఖా పముచ్చతిః।' (బాహియ సుత్త) అచట జల భూములు, వాయువగ్నులు లేవు. సూర్య నక్షత్రము లచట ప్రకాశింపవు. చంద్రుడచట ఉదయింపడు. విద్యుత్ ప్రవేశింప జాలదు. ధ్యాన నిష్ణాతుడైన బ్రాహ్మణుడు తన ఆత్మద్వారా మౌనమున దాని బొంది, సాకారనిరాకార సుఖదుఃఖ బంధములు నుండి విడివడును.

అత్థి భిక్షవో అజాతం, అభూతం, అకతం అసంగతం। నోచేతం. భిక్షవో అభవిస్స అజాతం, అభూతం, అకతం, అసంగతం। సయిరం జాతస్స భూతస్స కతస్స సంఖతస్స నిస్సారణం సంచామేథ యస్మా చ ఖో భిక్షవో అత్థి అజాతం - - -, తస్మా జాతస్స భూతస్స కతస్స సంఖతస్స నిస్సారణం పంచాయతి (నిబ్బాణ సుత్త).

భిక్షులారా! అజాతము, అనిర్మితము, అసమ్మిళితమైన అట్టిది గలదు. అట్టిది లేనిచో, జన్మాదులనుండి విముక్తి యుండె

204. Sir Francis Younghusband : Some Sayings of Buddha, of Woodward, p xix, xviii·

డిదికాదు. అట్టిది కలదు కావుననే జన్మాదుల నతీతించుట సాధ్య మగుచున్నది. ఈ విషయ పరిశీలనము గావించిన పండిత ప్రకాండుల అభిప్రాయములిటులే అసంఖ్యాకములుగా నున్నవి. వానిని సౌరభగ్రంథ బౌద్ధ ఖండమున గాంచెదము గాక !

పై విధముగ, శూన్య నిర్వాణ పద నిర్వచనములలోనే బౌద్ధవాదముయొక్క సారాంశము చాలవరకు వ్యక్తము. అది శుద్ధ ఉపనిషత్ప్రబోధిత అద్వైతవాదమునే బోధించియున్నదని స్పష్టము. ఉపనిషత్తుల ననుసరించియే ఆర్ష సన్న్యాసాశ్రమమును స్వీకరించి, తన్నిబంధనల ననుష్ఠించి, ప్రఖ్యాతిగాంచి, తద్ధర్మ ములనే బుద్ధదేవుడు ప్రచారము జేసినటులగూడ నిస్సందేహము.

తరువాత బౌద్ధవాదమున నతి ప్రజ్ఞానిధులై బుద్ధవచన ములగల అంతరర్థముల గ్రహించి, వెలువరింప నుద్యుక్తులై కృతకృత్యులైన నాగార్జున ఆర్యాసంగదేవ మొదలగువారి మహా యాన మాధ్యమిక విజ్ఞానవాదములు, హీనయానమునకు జెందిన సౌత్రాంతిక వైభాషిక శాఖలకంటె నద్వైతవాదమునకు సన్నిహి తములై రాజిల్లినవి. బౌద్ధ సంప్రదాయమున గౌతముని తరువాత నాగార్జునుని యంతటి మహావ్యక్తి లేడని ప్రఖ్యాతి. Nagarjuna should be placed among the great philosophers of humanity [205] గొప్ప ప్రపంచ తత్త్వవేత్తలలో నాగార్జునుడొకడు అని ఆచార్య షర్ బాస్కీ వచించినాడు. Among the galaxy of men of remarkable Intellect Nagarjuna stands out as one of the greatest

---

205. Prof. Stcherbassky : The Conception of Buddhist Nirvana.

minds that India has produced 206 అద్భుత మేధా శాలుర పరంపరలో నాగార్జునుడు భారతదేశమునగల గొప్ప ప్రజ్ఞా శాలురలో నొకడు అని నెహ్రూ పండితుడు కొనియాడియున్నాడు. అటులే ఆర్యాసంగదేవుడు.

నాగార్జునుని బోధ యంతయు గడు జటిలమై, శంకరు అద్వైతవాదమునకు దుల్యముగ నుండును. అతడు ఉపనిషత్తుల గల అవిద్యా మాయా పదజాలముల విరివిగా దన రచనములం దుపయోగించి, గీర్వాణభాషలో గొప్ప ప్రచారముజేసియున్నాడు. 'ధర్మతైష సర్వధర్మానాం మాయా ధర్మతాం ఉపాదాయ' (మాధ్యమిక కారిక) పదార్థములు స్వతంత్రములుగ గోచరించుట మాయామహిమచేతనే యగును. 'యథా మాయా యథా స్వప్నే గంధర్వనగరం యథా। తథోత్పాదస్తథా స్థానం తథా భంగ ఉదాహృతం॥' (మాధ్యమిక మాత్రి) స్వప్నమునగల మాయా కల్పిత దృశ్యము, గంధర్వనగరములవలె, యీ సృష్టియంతయు నంతియే. భంగము నొందుటయు నటులనే అని ఉదాహరింపబడి యున్నది. 'యథైవ గంధర్వపురం మరీచికా యథైవ మాయా సుపినం యథైవ। స్వభావశూన్యం తు నిమిత్తభావనా తథోవ మాన్ జానత సర్వధర్మాన్' (మాధ్యమిక వృత్తి) గంధర్వపురము మరుమరీచి, మాయాసుపినములెట్లు స్వభావతః శూన్యములై నిమిత్తదర్శనములో, అట్లు సర్వవస్తువులును అని గ్రహింపుము అని భ్రాంతివాదమును గొన్ని యుపనిషత్తులవలెనే, ఆ భాషోప మానములలోనే నాగార్జునుడు వివరించియున్నాడు. 'అనిరోధం

206. Pandit Jawaharlal Nehru : Discovery of India, p 136.

అనుత్పాదం అనుచ్ఛేదం అశాశ్వతం అనేకార్థం అనానార్థం అనాగమనం అనిర్గమం॥' (మాధ్యమిక కారిక) వస్తువులు క్షణికములు కావు. శాశ్వతములుగావు. జనింపలేదు, భేదింపబడలేదు. ఏకముగాదు, అనేకమును కాదు. వచ్చుట లేదు, పోవుటలేదు అని సృష్టియొక్క అనిర్వచనీయత్వమును, ఆత్మనిత్యత్వాది భావ వివరణమును నాగార్జునుడు గావించియున్నాడు.

పై విధముగ నద్వైతవాదమున పిమ్మట శంకరునిచే నధిక ప్రచారమునకు అరుదెంచిన అద్వైత పదజాలము అంతయు, నాగార్జుననిచే ముందే అదే అర్థాన్వయములలో నుపయోగింపబడియుండుట గాననగును. అంతియగాక నాగార్జునుని అవిద్యా మాయలు అద్వైతమున వృద్ధిచేయబడినవి. గౌడపాదునకు నాగార్జునుని మాధ్యమిక సిద్ధాంతమే తన అద్వైత వాదమునకు ప్రాతిపదిక అయినది అని పండిత రాధాకృష్ణ, సురేంద్రనాథ దాస్ గుప్త మొదలగు ఆధునిక పండితుల అభిప్రాయము. అంతియుగాక, గౌడపాదుడు బౌద్ధసన్న్యాసి యనియు, నతడు బౌద్ధమును ఆర్షముగ నొనరింప నిగూఢమైన అవస్థాత్రయ విచారణముచే నాత్మతత్త్వమును బోధించు మాండూక్యోపనిషత్తును నాధారముగ గొని, నాగార్జునుని మాధ్యమిక కారికవలె మాండూక్య కారికల రచించెననియు, నందుచే నక్కడక్కడ బౌద్ధ శబ్దములు దొరలినవనియు, గొందరు పండితుల వాదము. ఆ విషయము ముందు గాంచెదముగాక !

కావున శంకరపూర్వాద్వైతమున నీ బౌద్ధవాదము అప్రతిహతమై, ఉపనిషత్తులవలె శంకరాద్వైతమునకు ఆధారమై యుండెనని దోచెడిని, అట్లు బౌద్ధ అద్వైతములకు సన్నిహిత

సంబంధముండుటచే గాలాంతరమున ద్వైత విశిష్టాద్వైత వాదులు శంకరుని ప్రచ్ఛన్న బౌద్ధుడనియు, అద్వైతమును ప్రచ్ఛన్న బౌద్ధమనియు నిందవేయుటకు అవకాశమేర్పడి యున్నదనుట నిర్వివాదము.

ఏది ఎటులున్నను, యింతవరకు శంకరపూర్వాద్వైత ప్రక రణమున మనము సవివరముగా గాంచినరీతి అద్వైత వాదము, అనాద్యనంతములైన వేదస్రవంతితో జనించి, అందే పూర్ణత్వము నొంది, కాలక్రమమున యుగయుగముల నెల్ల ప్రదేశముల బర్యటించి, ఉపనిషత్సూత్ర పురాణేతిహాస బౌద్ధాది అసంఖ్యాక యుపనదముల గౌగిలించి, స్వీకరించి, లయింపజేసికొని,విస్తరించి శంకరుకాలమునకు గొప్పప్రవాహమై రూపొంది, ప్రజ్ఞానిధి, తార్కిక చక్రవర్తి, వేదవేదాంగ వేదాంతవిద్యా సార్వభౌముడు, ఆధ్యాత్మిక తపోనిష్ఠాస్వరూపుడు అయిన జగద్గురు శ్రీశంకర భగవత్పాదాచార్య హస్తమహిమచే మహాపెల్లువయై, మహాసాగరమై, విశ్వవ్యాప్త ఆధ్యాత్మిక మహాశక్తియై, అద్భుతాశ్చర్యానంద విధానమున నెల్లర తన్మయుల గావించుచున్నదని నిశ్చయము. ముమ్మాటికి నిశ్చయము.

అది యంతటితో మౌనము వహింపక, అతి క్లిష్టమై, దుర్గ్రాహ్యమై **The great poets of India wrote for audiences of experts** 207 భారతీయ పండితులు నిపుణ సంఘముకొరకై వ్రాసిరి అని ఏ. బి. కీత్తు పండితుడు అనునట్లు కష్టసాధ్యమై యొప్పారియున్నను, బండితులకు సులభసాధ్యమై అమృతతుల్యమై సూర్యనారాయణశాస్త్రి వచించునట్లు, **the**

186. Dr. A.B. Keith : History of Sanskrit Literature, Preface.

development of Adwaita did not stop with Sankara. Points not touched o or touched on and not elaborated were discussed in great detail by later-day Adwaitins 208 శంకరునితో అద్వైత సిద్ధాంతాభివృద్ధి నిలిచిపోలేదు. పూర్వము ప్రస్తావింపబడినటువంటి బడినను వివరింపబడినట్టి విషయముల శంకరానంతర అద్వైతులు మిగుల వివరము గావించిరి. భారతముననేగాక ఖండఖండాంతర ములగూడ దాటి, Whence came the writings of men like kant and Schopen. heaur? From no other source than the direet study of the Vedantic literature 209 కాంట్ షోపెన్హార్ మొదలగు వారి రచనలెం దుండి రాగలిగినవి? వేదాంత వాఙ్మయాధ్యయనమునుండియే నవి సాక్షాత్తుగ నుద్భవించినవి అని రామతీర్థుడనునట్లు ఆధునిక తత్త్వవేత్తల హృదయకుహరములగూడ నది ప్రవేశించి, ప్రోత్స హించి, ఆవేశపరిచి, సమూలముగ గదలించుచున్నదని ఎల్లరకు సువిదితమే.

శంకరపూర్వ అద్వైతమున మన దురదృష్ట వశమున అతని ప్రత్యక్ష గురుదేవుడైన గోవిందభగవత్పాదుని రచనలు మనకు సంప్రాప్తించినవి కావు. అతడు లిఖించియున్నటుల ప్రమాణ ములుగూడ కానరావు. కాని అతని గురువర్యుడనబడు గౌడ పాదాచార్యుని మాండూక్యోపనిషత్కారికలు ప్రధానముగ అద్వైత వాద ప్రబోధములని గ్రహించి, వానికి భాష్యరూపముగ శంక

208. Prof. S. S. Suryanarayana Sastry : Sankaracharya, p 69.
209 Swami Ram Tirtha : The Complete Works, vol. 7, p 112.

రుడు వివరించియుండుటచే నవి లభ్యము. కాన శంకరునితో సాక్షాత్తుగ సంబంధముండి, అతనికి ప్రమాణ హేతువైన ఆ గ్రంథస్త భావముల సవివరముగ మనము పరిశీలించుట ముఖ్యము కర్త వ్యముగాన, నిక ఆ గ్రంథరాజ పరిశీలనము సవిస్తరముగ, సాక ల్యముగ, అష్టోత్తరశతోపనిషత్తుల నాధారముగ గైకొని గ్రహింప యత్నించెదముగాక:

# గౌడపాదాచార్యులు

## మాండూక్యోపనిత్తు

శ్లో॥ అస్పర్శయోగో వై నామ సర్వసత్వసుఖో హితః ।
అవివాదో ఽవిరుద్ధశ్చ దేశితస్తం నమామ్యహం॥

(మాండూక్యకారిక. 4.2)

ఈ శాస్త్రముచే నుపదేశింపబడుచు, సర్వజీవులకు సుఖమును హితమును కలుగజేయుచు, అవివాదమై అవిరుద్ధమై యొప్పు ఈ అస్పర్శయోగమునకు నమస్కరించెదను అని నుతించి, సామా న్యులకలభ్యమానమగుటచే 'అస్పర్శయోగో వై నామ దుర్దర్శః సర్వయోగిభిః । యోగినో బిభ్యతి హ్యస్మాదభయే భయదర్శినః॥' (మాం.కా. 3.39) అస్పర్శమైన యీ యోగము సామాన్య యోగి జనులందరికి దుర్దర్శనము. దానిలో భయమావంతయు లేక పోయినను, యోగులు దానిలో భయమును జూచి భీతి జెందెదరు

అనియు పరిపూర్ణాద్వైత సమాధిని స్తుతించి, వివరించి, ఆ దృష్టికి నీ బాహ్య ప్రపంచము, దాన గల జీవరాసులెట్లు దోచుచుండునను జిజ్ఞాస పాఠకులకు దోచునుగాన 'కల్పయత్యాత్మనాఽత్మానమాత్మా దేవః స్వమాయయా । స ఏవ బుధ్యతే భేదానితి వేదాంత నిశ్చయః॥' (మాం.కా. 2.12) స్వయం ప్రకాశమైన ఆత్మ, స్వీయ మాయచే దనలో దానే యీ సకలము నూహించి కల్పించును. అట్లు సృజింపబడిన వస్తువుల నాతడు మాత్రమే గ్రహించు చున్నాడు. ఇదియే వేదాంత నిశ్చయము. అందుచే 'సంఘాతాః స్వప్నవత్సర్వే ఆత్మ మాయా విసర్జితాః । ఆధిక్యే సర్వసామ్యే వా నోపపత్తిర్హి విద్యతే॥' (మాం.కా. 3.10) దేహాది సర్వసంఘాత ములును ఆత్మమాయచే స్వప్నమునందువలె గల్పితములు. సమానముగాని, అధికముగాని అయిన తర్కములైనను వాని సత్యత్వమును స్థిరపరుపజాలవు. 'అనిశ్చితా యథా రజ్జురంధ కారే వికల్పితా । సర్పధారాదిభిర్భావైస్తద్వదాత్మా వికల్పితః॥' (మాం.కా. 2.17) అనిశ్చిత రజ్జువు అంధకారమున సర్పము, నీటి ధారా మొదలగు వస్తురీతి భ్రాంతిచే గాంచబడినట్లు ఆత్మగూడ నట్లే యూహించబడుచున్నది. అందుచే పారమార్థికముగ 'న నిరోధో న చోత్పత్తిర్న బద్ధో న చ సాధకః। న ముముక్షుర్న వై ముక్త ఇత్యేషా పరమార్థతా॥' (మాం.కా. 2.32) ఉత్పత్తి లేదు, లయమును లేదు. బద్ధుడు లేడు సాధకుడు లేడు. ముముక్షువు లేడు, ముక్తుడును లేడు. ఇదియే పరమార్థము అనియు అద్వైత సిద్ధాంత తాత్పర్యమును మూడు మాటలలో స్పష్టపరచి, అదియే వేదాంత నిశ్చయమనియు, నదియే పరమార్థనియు ఘంటాపథ ముగ వచించు నీ గౌడపాదాచార్యుని ప్రజ్ఞావిశేషములెంతయుని

కొనియాడుట! 'అద్వైతం నావమాశ్రిత్య జీవన్ముక్తత్వమాప్నుయాత్' (సన్న్యాసోపనిషత్తు.2.96) అద్వైతమను నావను ఆశ్రయించి, జీవన్ముక్తిని బొందవలయును అను సూక్తిని అక్షరశః సాధించి, లోకమునకు అకుంఠితలీల సాదర తర్కవిన్యాసముతోడ వేదాంత అద్వైతమును వ్యాఖ్యానించు గౌడపాద గురువరేణ్యునికి వందనసహస్రములు. ఆతని వాక్యముల తీరు, తర్కముయొక్క అకుంఠితత్వము, వాదముయొక్క సామరస్యము, సువిశాలమైన హృదయము, విద్యావైభవముయొక్క ఠీవి, అనుభవముయొక్క ఔన్నత్యములు అనిదంపూర్వములు, అసమానములు. ఆతని కాతడే సాటి యనినను అతిశయోక్తి కాజాలదు.

If you want, truth indesputable by any one and truth beneficent to all men, say to all beings, read and inwardly digest what Sankara's teacher's teacher Sri Gaudapada says in his Karikas 210 ఎవనిచేతను ఆక్షేపింపబడరాని సత్యము, సర్వ మానవులకును, సర్వప్రాణులకుగూడ హితమైన సత్యమును నీవు కోరుచో, శంకరుని పరమగురువర్యుడైన శ్రీ గౌడపాదుడు తన కారికలలో నే విషయముల దెల్పెనో పఠించి, మనసా జీర్ణించుకొనుమని, శ్రీ సచ్చిదానంద శివాభినవ నృసింహభారతీస్వామి [illegible]కొనియాడినారు… శంకరుడు కారికాభాష్యాంతమున ప్రజ్ఞా [illegible] శాఖ వేదక్షుభితజలనిధే ర్వేదనామ్నోఽంతరస్థం। భూతాన్యాలోక్య [illegible]గ్నా న్యవిరతజననగ్రాహఘోరే సముద్రే। కారుణ్యాదుద్ధధా[illegible]మృత

210. Sri Sacchidananda Sivabhinava Bharati : Mandukya Upanishad of Swami Nikhilananda. p iii.

మిదమమరైర్దుర్లభం భూతహేతో । ర్యస్తం పూజ్యాభిపూజ్యం పరమ గురుమముం పాదపాతై ర్నతోస్మి॥' పూజ్యులలో బూజ్యుడై, నిరంతర జనన మరణ రూప మకర సంకీర్ణమై సంసారసాగర మగ్నులై యున్న జీవులపై గారుణ్యముచే దేవతలకుగూడ దుర్లభమైన యీ అమృతమును వేదసాగరపాదమునందుండి, తన ప్రజ్ఞాదండమున మథించి, సర్వహితము గోరి రక్షించిన పరమగురు పాదపద్మములకు ప్రణమిల్లుచున్నానని జోహారు లర్పించి యుండుట గాంచనగును. కావున గౌడపాదుని అద్వైత శాస్త్ర నిర్వచనా విధానము శంకరుని దృష్టిలోగూడ నెంత గొప్ప స్థాయితో నున్నదియో దీన వ్యక్తము. అంతకుముందు వేదాంత సూత్రములవ్రాసి, ప్రసాదించియున్న వ్యాసభగవానుడుగూడ గౌడపాదునిముందు అనామకుడై పోయెనా అను సందియము, శంకరు వాక్యముల ననుసరించినవారికి దోచుట సహజమే. అందు చేతనే సురేంద్రనాథ దాసు గుప్త It seems particularly significant that Sankara should credit Gaudapada and not Badarayana with recovering the Upanishad cread [211] ఉపనిషత్సిద్ధాంత రక్షణా గౌరవము బాదరాయణునకుగాక గౌడపాదునకు శంకరుడన్వయించుట ప్రత్యేకము అని వచించియున్నాడు. కాని శంకరునికి గౌడపాదుడే అద్వైతసిద్ధాంతమున ప్రమాణమై యుండుచో, సూత్ర భాష్యమునగాని, గీతాభాష్యమునందుగాని, మరి యితర ప్రకరణ గ్రంథములందుగాని, ఎచ్చటను మరల గౌడపాద నామస్మరణము

---

211. Prof. Surendranath Das Gupta : A History of Indian Philosophpy, vol. 1, p 422.

గావించి యుండలేదు. శంకరుదృష్టికి గౌడపాదుడును, తనకాదర్శ ప్రాయులగు నద్వైతాచార్యులలో నొకడుగనే యుండునని దోచును. కాని తనకు సన్నిహితుడై, గురుపరంపరలో దగ్గరవాడై యొప్పారి, సూత్రముల యనంతరము ఒక ఉపనిషత్తు నాధారముగగొని, బాదరాయణువలె సూత్రములగాక, సవివర అద్వైత భావపూరిత వ్యాఖ్యానమును జక్కని కవితలో గౌడపాదుడు అద్వైతవాదమునకొక ఆభరణమును నూత్న పద్ధతిని సృజించి, యర్పించి యుండుటచే గృతజ్ఞతాసూచకముగ గౌరవించి నమస్కరించియుండుట సహజమగుచున్నది. కావున శంకరు దృష్టికి వ్యాసునికంటె గౌడపాదుడే గొప్పవాడు అని భావించుటకంటె Gaudapada seems to be the most important man after the Upanishadic sages, who revived the monistic tendencies of the Upanishads in a bold and clear from and tried to formulate them in a systematic manner 211 ఉపనిష దద్వైత భావముల ధైర్యముగ స్పష్టముగ నుద్ధరించి, వాని నొక సిద్ధాంత రూపమున నేర్పరచిన ఉపనిషదనంతర ఋషీశ్వరులలో గౌడపాదుని చాల ప్రముఖ వ్యక్తిగ గైకొనుట యుక్తము. అతడు తన కారికాసందర్భమున నొక్కచోనైనను ఏ ఋషీశ్వరునిగాని, రచయితనుగాని, సిద్ధాంతినిగాని, పేరుపెట్టి ప్రస్తావింపక, తన కాధారములైనవారినిగూడ 'వేదాంతేషు విచక్షణైః' (మాం. కా. 2. 31) 'వేదాంతనిశ్చయః' (మాం. కా. 2. 12) 'తత్త్వవిదో విదుః (మాం. కా. 2. 34) 'సంబుద్ధస్తం వందే ద్విపదాం వరం'

---

211. **Prof. Surendranath Das Gupta : A History of Indian Philosophy, vol. 1, 422,**

(మాం. కా. 4. 1) సర్వథా బుద్ధైః' (మాం. కా. 4. 19) 'మనీషణః' (మాం. కా. 4. 54) 'బుద్ధానాం' (మాం. కా. 4. 80) 'బుద్ధశ్య జ్ఞానం - - - - నైతత్' (మాం. కా. 4. 99) అను చందము వ్రథమ పురుషవాచక వదములనే ఉపయోగించి యుండుటయు గమనార్హము. కాన నతనిముందు యిట్టి గ్రంథ రచనము గావించినవారు గాన రాలేదని భావింపవచ్చును. బాద రాయణునిగూడ బేర్కొనకపోవుట వ్యాసకృతము కేవలము సూత్రగ్రంథమగుటచేతనై యుండునని దోచును. ఆ కారణమున వి. సుబ్రహ్మణ్య అయ్యరు వచించినట్లు Sri Gaudapada, the first Vedantic philosopher, known to Indian history in what is said to be in the post-Upanishadic or modern period 212 అధునికమనియు ఉపనిషదనంతరమనియు నాబడు భారతీయ చారిత్రమున, గౌడ పాదుడు ప్రథమ వేదాంతతత్త్వవేత్తయని సర్వాంగీకారమే యగుచున్నది. అటులే మాండూక్యోపనిషద్భాష్యానువాదకులై నిఖిలానందస్వామియు, Gaudapada is the solitary philosopher known to us, before Sankara, gave a rational explanation of the Adwaita which is the objective of the Upanishadic teaching 213 ఉపనిషత్తాత్పర్యమైన అద్వైతమునకు సంయుక్తిక వివరణము నొసంగిన శంకరపూర్వవేత్త, మనకు దెలిసినంతవరకు గౌడపాదుడొక్కడే యని నిర్వివాదముగ వచింప నగునని వ్రాసియున్నాడు. అంతియుగాక Gaudapada

**212.** V. Subrahmanya Iyer : Mandukya Upanishad, of Nikhilananda, p ix.

**213.** Swami Nikhilananda : Mandukya Upanishad, p xiv.

has dealt with all the problems of philosophy following the scientific method of modern times [214] గౌడపాదుడు, ఆధునిక విమర్శనవిధానము ననుసరించి తత్త్వశాస్త్రమునగల సమస్యలన్నింటిని జర్చించినాడనియు నిఖిలానందుని అభిప్రాయము. అద్వైతసిద్ధాంత చారిత్రమున, Gaudapad's name will ever remain as that of a poinier who combined in himself a deep mysticism with a penetrating philosophy, and a poitic vision with a logical mind అగాధమగు అనుభూతితో, సుసూక్ష్మమైన తత్త్వార్థ చింతనము, హేతు దృక్పథము గల కవితా దృష్టియు దనలో మేళవింపజేసికొనియుండిన గొప్ప ప్రవక్తగ గవుడపాదుని నామము శాశ్వతముగ నుండునని డాక్టర్ టి. యం. పి. మహదేవన్ తన 'గవుడపాద' అను గ్రంథమున వచించియున్నాడు. అతడద్భుత సహేతుక ప్రజ్ఞాశాలి యనియు, అతని ప్రక్రియా విచారణ విధానములు, తత్త్వశాస్త్రతాత్పర్యమునగల ననేక పొరపాటు భావముల దొలగించుననియు, పూర్వమెన్నడు ఎవరిచేతను జర్చింపబడని అపూర్వ విధానమున సత్యముయొక్క అర్థము పరిశీలింపబడినదనియు [215] నందుచే Without the slightest fear of exaggeration, it may be said, that in no other part of the 'world' has man bared to pursue truth with the degree of devotion, and particularly of determination with which he has done in India [215]

214. Swami Nikhilananda : Mandukya Upanishad, p xii.
215. V. Subrahmanya Iyer : Mandukya Upanishad, p vii, of Nikhilananda.

అత్యంత శ్రద్ధతో, ప్రత్యేక దృఢసంకల్పముతో, హిందూదేశమున గౌడపాదుడు సత్యాన్వేషణమునొనరించిన విధముగ బ్రపంచమున నెవ్వడును అంత ధైర్యముతో నవలంబింపలేదని, కొంచెమేని అతిశయోక్తిలేకయే జెప్పనొప్పునని వి. సుబ్రహ్మణ్య అయ్యరు వక్కాణించియున్నాడు. ఆ కారణమున Every verse of the Karika demands profound thinking before it can be understood and appreciate 216 కారికాగ్రంథమున ప్రతిశ్లోకముగూడ గ్రహించి ఆనందించుటకు బూర్వము, ఎక్కువ యోచనను గోరును అని నిఖిలానందుడు, కారికా ప్రాశస్త్యమును వివరించియున్నాడు.

## గౌడపాదకాలము

గౌడపాదాచార్యుని జీవితవిశేషములు కాలములో మరుగు పడిపోవుటచే, నతని కాలనిర్ణయము కష్టతరముగ నున్నది. పూర్వమే వచింపబడినట్లు అతని గ్రంథమున నెచ్చటను వ్యక్తుల నామములు రాకుండుట ఒక విశేషము. బుద్ధ శబ్దము వచ్చియున్నదని సంశయించినను బుద్ధ శబ్దము నాతడే 'బుద్ధైః' (మాం.కా. 4.19) బుద్ధానాం (మాం.కా. 4.80) మొదలగు స్థానముల జ్ఞానులు అను సామాన్యార్థమున నుపయోగించియుండుటచే 4.1., 4.99 కారికల గల బుద్ధ శబ్దములకు బ్రత్యేకత నొసంగ నవసరములేదని పండితాభిప్రాయము. మరియు నీ వాక్యముల బహు

216. Swami Nikhilananda : Mandukya Upanishad, p xii.

Gaudapada's existence has been questioned and his Karikas made out to be those of north-west Bengal, the work being placed before the Sutra, but this is clearly untenable 217 గవుడపాదుని యునికియే సందేహింపబడినది. అతని కారికలు, గవుడపదము అనబడు పశ్చిమోత్తర అనగా వాయువ్య వంగరాష్ట్ర మునకు జెందినవనియు, నీ కారికా గ్రంథము వ్యాససూత్రములకే పూర్వమనియు ననుట జెల్లనేరదని ఏ. బి. కీత్ తెలిపియున్నాడు. అనగా గవుడపదము అనునది వ్యక్తి నామముగాక ప్రదేశ నామ మనియు, నా దేశమున నొక అజ్ఞాత వ్యక్తిచే వ్రాయబడి, ఆ నామమొసంగబడినదనియు గొందరి వాదము. అటులైనచో, బరంపరాస్తోత్రముననేగాక శంకరుడుగూడ నా పదమునకు వ్యక్తి గౌరవమునొసంగి స్తుతించుట జరుగదు. అందుచే నా వాదము అసందర్భము. సాంఖ్య సిద్ధాంతమున, గాపిల వాదమున, ఈశ్వర కృష్ణునిచే వ్రాయబడిన కారికలకు గవుడపాదుడు భాష్యమును రచించినట్లు గలదు. ఆ విషయము సౌరభ ప్రథమ భాగమున గాంచియున్నారము. కాని, Gaudapada wrote a commentary on the Karika Whether this commentator is the same as the author of the Karika on the Mandukya Upanishad cannot be decided, in view of the diversity of thought between the two works 218 కారికలకు గౌడపాదుడుభాష్యము వ్రాసియున్నాడు. రెండు గ్రంథములకును భావతారతమ్యముం

217. Dr. A.B. Keith : A History of Sanskrit Literature, p 475.
218. Dr. S. Radhakrishnan : Indian Philosophy, vol. 2, p 261.

డుటచే, మాండూక్యోపనిషత్కారికల వ్రాసినవాడే వీనిని వ్రాసి యుండునని తీర్మానింపజాలమని రాధాకృష్ణ పండితుడు వ్రాసి యున్నాడు. కాని, సౌరభగ్రంథము ఆ భావముల ద్రోసిపుచ్చెను. ఆదియునుగాక ప్రఖ్యాతుడైన అద్వైతాచార్యుడు సాంఖ్యకారికల వంటి గ్రంథమునకు అతి క్లుప్తముగ వ్యాఖ్య వ్రాయుటయు, నదియు మాఠరు ననుసరించి రచించుటయు నసంబద్ధమనియు, అంతటివానికి గౌరవము కాదనియు కొందరి పండితాభిప్రాయము. మరియు, విరుద్ధ భావముల బోధించు కారికలకు, అద్వైతి వివరణము లిఖించునా అను సంశయముగూడ గలుగును. కాని అల్ప గ్రంథమును రచించుట కారణము కాజాలదు. పండితులెల్ల ప్రౌఢుడుగ్రంథములనే రచింతురనుట అనుభవదూరము. మరియు నతడద్వైతిగానుండి, వ్యత్యస్తాభిప్రాయముల బ్రతిపాదించు సాంఖ్యమునకు గవుడపాదుడు వ్యాఖ్య వ్రాయునా యను సంశయముగూడ నసమంజసము. వ్యాఖ్యాతలు, తమకు ప్రత్యేక భావమున్నను విశాలబుద్ధితో బరసిద్ధాంత గ్రహణము గావింతురనియు, రచింతురనియు, దెలియవలెను. దానికుదాహరణము వాచస్పతి మిశ్రులే. కాన నట్లే గవుడపాదుడుగూడ సాంఖ్యకారికా భాష్యమును నిర్మించియుండవచ్చును అని పూర్వము వివరించియుంటిమి. కావున సాంఖ్యకారికా భాష్యమైనను, గవుడపాద కాలనిర్ణయము గావింపలేదని విదితము.

మాండూక్యకారికా **4.1** శంకరభాష్యమునకు టీకవ్రాయుచు,

**that Gaudapada performed great austirites in the Badarikasrama, in order to propitiate Nara-**

**yana** 219 నారాయణానుగ్రహముకొరకు గవుడపాదుడు బదరికాశ్రమమున దపమాచరించెననియు, నారాయణుడాతని తపమునకు సంతోషించి, అద్వైత వేదాంత రహస్యమును బోధించెననియు జెప్పబడియున్నది. కాని యీ విషయమైనను కాలనిర్ణయమునకెట్లును అనుకూలము కాదు. **It is note-worthy that Gaudapada and his disciple's disciple, as Sankara is said to be, were both of them Saktas** 220 గవుడపాదుడును, అతని ప్రశిష్యుడైన శంకరుడును, ఉభయులు శాక్తేయులే యనుట గమనార్హము అని శ్రీనివాస అయ్యంగారు వ్రాసిరి. కాని శంకరు విషయమున నెట్లున్నను, గవుడపాదుని విషయమున నతడు శాక్తేయుడను ప్రమాణము అగోచరము. ఎట్లయినను ఈ సమాచారముగూడ గవుడపాద జీవితవిశేషమునగాని, కాలనిర్ణయమునగాని అనుపయుక్తము.

శ్రీపతంజలిమహర్షి సన్నిధానమున, శ్రీగౌడపాదాచార్యులు పూర్వాశ్రమమున, పుండరీకపురమను చిదంబర క్షేత్రమున, వ్యాకరణ భాష్యము నభ్యసించిరనియు, నతడు ద్రవిడ దేశస్థుడు గనుక ద్రావిడాచార్యుడను నామాంతరము గలదనియు గొందరు తలంచిరి. 221 ద్రావిడాచార్యులు వీరే యని వ్రాయుటకాధారములు గానరావు. శంకర పూర్వాచార్యులలో రామానుజ వచన రీతి, వ్యాససూత్రములకు భాష్యమును వ్రాసిన ద్రవిడాచార్య అనగ, ద్రావిడాచార్యులును వేరే అయియుందురా అను సందేహము కలుగకమానదు. కాని ద్రావిడాచార్య భాష్యతాత్పర్యము

---

**219.** Swami Nikhilananda · **Mandukya Upanishad,** p xiii.
**220.** P. T. Srinivasa Iyengar : Outlines of Hindu Philosophy, p 91.

విశిష్టాద్వైతపరమగుటచే రామానుజులు కొంత స్వీకరింప, శంక రులు ఆ గ్రంథమునుగాని, కర్తనుగాని ఎందును బేర్కొనకుండు టయు గమనార్హము. ద్రవిడాచార్యులు అద్వైతులే యని పోలా సం. సు. శ్రీరామశాస్త్రి 'ద్రవిడాచార్య దర్శనము' అను గ్రం థమున దీర్మానించియున్నాడు. గౌడపాద ప్రస్తావన లేనేలేదు కాన గౌడపాదులే ద్రావిడాచార్యులనుట వివాదగ్రస్తము. ఇంకను గౌడపాదులు పూర్వాశ్రమమున బతంజలిదగ్గర వ్యాకరణ భాష్య శ్రవణము గావించెననియు కృష్ణస్వామయ్య వాదము [221] అటు లైన పూర్వాశ్రమ విశేషముల, నామధేయమును, గవేషించి, యుండినచో విషయాన్వేషకుల కెక్కువ ప్రయోజనకారియై యుం డెడిది. కాని యీ విషయము నింకెవ్వరును ఎచ్చటను ప్రస్తా వింపకుండుటచే, నది అప్రధానముగనే స్వీకరింతము. ఆ విషయ మటులుండ, గౌడపాదుడు పతంజలివద్ద వ్యాకరణమును గ్రహిం చుట మరియొక విశేషము. దాని నంగీకరించినచో, బతంజలి కాలము మరల వాదపూరితమే అయివున్నది. పతంజలి, మహా భాష్య సందర్భమున మగధరాజ్యమునేలిన శృంగవంశ పుష్య మిత్రుని ప్రస్తావనము జేయుట గలదు. అతడు క్రీ. పూ. 1219-1159 వరకు రాజ్యపాలనము గావించినటుల కొందరును [221], క్రీ.పూ. 1218-1158వరకు రాజ్యపాలనమని కొందరును అభిప్రాయ పడిరి. కలి పూర్వకాలనిర్ణయమెట్లున్నను తరువాత కాలనిర్ణయవిష యమున జాలదోషములుత్పత్తిల్లి యున్నవి. కలిప్రవేశము క్రీ.పూ. 3102 ఏర్పడి, నాటనుండి కలియుగ శకము ప్రారంభముకాగా,

221. శ్రీ శేషులూరి కృష్ణస్వామయ్య : జగద్గురు శ్రీ శంకర భగవత్పాదాచార్య చరిత్రము, అనుబంధము, 3.

నాటనుండి నేటివరకు యుధిష్ఠిరశకము క్రీ.పూ. 3076, మాలవగణ శకము క్రీ.పూ. 725, సైరసు శకము క్రీ.పూ. 550, శ్రీహర్షశకము క్రీ.పూ.457, గుప్తశకము క్రీ.పూ. 327, విక్రమశకము క్రీ. పూ. 57, క్రీస్తుశకము 0, శాలివాహన శకము క్రీ.త. 78, రూపములుగా కాలమానము పరిగణింపబడుచు నుండెను. కలినుండి బార్హద్రథ వంశమునందుగల 50 చక్రవర్తులు 1006 సంవత్సరములు పాలించిరి. అనగా క్రీ. పూ. 3138 నుండి 2132 వరకు పాలించి యుండిరి. అంత బ్రిద్యోతవంశము క్రీ. పూ. 2132 నుండి 1994 వరకు, 138 సంవత్సరములవరకు పరిపాలించెను. తర్వాత శిశు నాగవంశము 1914-1634 వరకు 360 సంవత్సరములు రాజ్యము జేసెను. పిమ్మట క్రీస్తు 1634-1568 వరకు నందవంశము నూరు వత్సరములు రాజ్యమునందుండెను. వెంటనే మౌర్యవంశము క్రీ. పూ. 1534-1218 వరకు పరిపాలించెను. పిమ్మట శుంగవంశము క్రీ. పూ. 1218-918 వరకును, కాణ్వము క్రీ. పూ. 918-833 వరకు ఆంధ్ర శాతవాహనులు క్రీ. పూ. 823-327 వరకు, పిమ్మట గుప్త రాజులు 327-89 వరకును పాలించినటుల ఆర్షప్రమాణములు తెలుపు చున్నవి. తర్వాత బ్రిమరవంశము క్రీ. పూ. 82 క్రీ. త. 1193 వరకు 1275 వత్సరములు అధికాకారమునందు గలదు. కాని క్రీ. పూ. 327 గుప్తవంశములోని చంద్రగుప్తునికి, క్రీ. పూ. 1534 న మౌర్యచంద్రగుప్తుని బోల్చి, యిద్దరొకటి యని పాశ్చాత్య పండితులు తీర్మానించుటచే, 1534-327 = 1207 సంవ త్సరములు మౌర్య గుప్త వంశముల మధ్యగల భారత చరిత్ర మరుగుపడిపోయినది. ఈ మధ్యకాలమునగల వ్యక్తుల గుప్త

రాజుల దర్వాతకు అన్వయింప యత్నించుటయు పాశ్చాత్య పండితులకు బరిపాటి అయినది [222].

కాని మౌర్యవంశానంతరమేగుదెంచిన శుంగవంశమునకు జెందిన ప్రథమ రాజు పుష్యమిత్రుని, 'ఇహ పుష్పమిత్రం యాజయామః, అని పతంజలి మునీంద్రుడు ప్రస్తావించి యుండుటచే వి. స్మిత్ మొదలగువారాతనిని ఆ కాలమువాడని తీర్మానించిరి. కాని పుష్యమిత్ర, దేవదత్త, యజ్ఞదత్తాది పదములు ఏ వ్యక్తికి నన్వయింపబడక, వాని సామాన్య నామవాచకములుగనే రచయితలు పూర్వకాలమునందుపయోగించుట కలదు. అందుచేత ఆ కాలము పతంజలి కాలముగ నిర్ణయింపరాదని కొందరి పండితాభిప్రాయము. కాక అట్లే తీర్మానించినను పతంజలి, పాశ్చాత్యుల నిర్ణయముప్రకారము క్రీ. శ. 200 సంవత్సరములుగాక పూర్వ గణీతము ననుసరించి 1218-1158 క్రీ. పూర్వమువాడని ఎంచనగును. అట్లు క్రీస్తు పూర్వము సుమారు 1200 సంవత్సరములకు పూర్వుడై పతంజలి సన్నిధాన మహాభాగ్యమునొందిన గౌడపాదుడును అదే కాలమునకు జెందియుండవలయునుగదా!

ఈ విషయమున నొక గాథయు గలదు. భాష్యశ్రవణ కాలమున, ఆదిశేషుని అవతారమగు పతంజలి మునీంద్రుడు, శిష్యుల నొక అవనిక కావలనుంచి, లోన దాను తన నిజ స్వరూపమును ధరించి, భాష్యమును బోధించుచుండుట కలదట! ఒక దినము భాష్యము పూర్తియయిన దరువాత, గౌడపాద మునీంద్రుడుగాక నితర శిష్యులు పతంజలి నిజస్వరూప దర్శన

222. శ్రీ కోట వేంకటాచలము: భారతీయ శకములు, పు 76, 41

లాలసులై, తెరను దొలగించి జూడగ, ఆదిశేష సహస్రముఖ ములనుండి వెల్వడు అగ్నికీలికల వారందరు భస్మమైనారట! తరువాత వచ్చిన గౌడపాదుడు, పతంజలిఋషినిగూర్చి మరణిం చినవారి యనుగ్రహింప బ్రార్థింప, నా ఆదిశేషుడు తన ఆజ్ఞలేక భాష్యకాలమున నెటకో యరిగిన దోషమునకై గౌడపాదుని బ్రహ్మ రక్షస్సుగ గమ్మని శపించి, సత్పాత్రునకు యీ భాష్యము నుప దేశింప నా శాపవిమోచనమని అనుగ్రహించెనట! అంత గౌడ పాదుడు, గురు ఆదేశానుసారము దేశముల గ్రుమ్మరుచు, నుత్తర దేశమున, నుజ్జయినీ నగరమున జంద్రశర్మ యను నాతనికి భాష్యమును బోధించినట్లు చరిత్ర. అంత గౌడపాదునకు వేదాంత శ్రవణాసక్తి గలిగి, బదరికాశ్రమంబునకేగి, బాదరాయణవ్యాసుల పుత్రుండగు శుకయోగీంద్రుల నాశ్రయించి, సన్న్యాసము స్వీక రించి, విద్య గడించి, మాండూక్య, ఉత్తరగీతలకు కారికల వ్రాసి యుండిరని కొందరి చరితార్థకథనము. కాని మరల, నిట శుక యోగీంద్రునితో గవుడపాదుని అనుసంధింపజేయుట గాల నిర్ణయ మును సమస్యాపూరితము గావించినది. వ్యాసుని కాలము ద్వాప రాంతమగుటచే క్రీ. పూ. 5112 ప్రాంతముకాగా, గవుడపాదుని కాలము క్రీ. పూ. 200 లకు బూర్వము కాజాలదనిగదా నిర్ణయము. అయినచో 3102-1200-1902 వత్సరముల అనంతరము నెట్లు సమ న్వయించుట! శుక యోగీంద్రుడే యింతకాలము జీవించి యుం డెనా! ఈ విషయమును బూర్వము చర్చించి యుంటిమి. మరియు పతంజలి, గవుడపాదుల గురు శిష్య సంబంధముగూడ కొన్ని అసందర్భ విషయములలో గూడియున్నది. పతంజలి తన యోగశాస్త్రముల జూపిన చిత్తవృత్తినిరోధాది మనో విజ

యము, శాంతిదాంత్యాది లక్షణములు, యమనియమాది జితేం ద్రియసంపన్నతకు విరుద్ధముగా బ్రవర్తించుట సమర్థనీయము గాదు. కాన వీరిరువురి సంబంధముగూడ సముచితము కాకుం డుటచే నిది త్యాగమే యగుచున్నది. మరియు నెంత వ్యాకర ణమునుమాత్రమే బోధించియున్నను, పతంజలి గవుడపాదునకు బ్రథమ గురువును, విద్యాగురువగుటచే నాతని బ్రస్తావన నాతడు గాని, శంకరాదులుగాని, సాంప్రదాయక స్తోత్రముగాని జేయ కుండుటయు మన వాదమునకు బ్రమాణ హేతువులగుచున్నవి. ఈ విధముగా గవుడపాద గురువులనబడు వారిద్వారా గవుడ పాదుని విషయములెవ్వియు దెలియబడకున్నవి.

అట్లయినచో, నాతని శిష్యులమూలమున దీర్మానించు టుచితమని గొందరు చరిత్రకారులు యత్నించిరి. పైన గవుడ పాద శిష్యవర్యులలో జంద్రశర్మ నామము బ్రస్తావింపబడినది. అతడే గోవిందభగవత్పాదుడై, కాలాంతరమున శంకర భగవత్పా దుల గురువర్యుడైనట్లు కొందరి అభిప్రాయము. క్రీ. పూ. 6 వ శతాబ్దమున, పాన్వారు బ్రాహ్మణ వంశమున జంద్రశర్మ యను నాతడే కాలాంతరమున సన్న్యసించి గోవిందుడై రాజిల్లెను. ఈతని కుమారుడు శ్రీహర్ష విక్రముడై, క్రీ. పూ. 457 న మర ణింప, నతని ప్రఖ్యాతి స్మారకముగ శ్రీహర్షశకము క్రీ. పూ. 457 ప్రారంభింపబడి, నేపాలు రాజ్యమున వాడుకలో నున్నదని కోట వేంకటాచలం మహాశయుడు వాకొనెను.[223] ఈతనికాలము ననే కుమారిలభట్టు క్రీ. పూ. 457 న జీవించియుండిరి. అపుడే

223. శ్రీ కోట వేంకటాచలం: కలిశక విజ్ఞానము తృ. భా. పుట 5

క్రి. పూ. 509 లో శ్రీశంకరులు కాలడిలో జన్మించెననియు అతని అభిప్రాయము. చంద్రశర్మాదులు సన్న్యసించుటకు బూర్వము నాలుగు వర్ణముల స్త్రీలను వివాహమాడి, వారివలన, వరరుచి, విక్రమాదిత్య, భట్టి, భర్తృహరులను నల్వురు పుత్రుల వడసి, వారికి గవుడపాద ప్రసాదిత వ్యాకరణమును బోధింప, వారు ప్రచారము గావించినట్లు కృష్ణస్వామయ్య వ్రాసినాడు. ఈ విషయ మెంతవరకు సమర్థనీయమో విచారణీయాంశమే యగును.

గోవిందయతీంద్రుని జీవితకాల విశేషములిట్లుండ, శంకర భగవత్పాదుని విషయముగూడ బండితుల మిగుల గలవరపరచి, వివిధ కాలనిర్ణయములకాలవాలము గావించుచు, క్రీ. పూ. 541 నుండి క్రీ. త. 820 సంవత్సరములవరకు విస్తరించి యుండుట విచారకరము. ఈ విషయములన్నియు సౌరభ గ్రంథము అద్వైత ఖండ ద్వితీయ భాగమైన శంకరాద్వైతమున సవివరముగా గాంచగలముకాన, ప్రస్తుతము ముగించెదముగాక.

ప్రస్తుతము జర్చింపబడినదెరంగున **Of his own guru, Govinda Bhagavatpada there appears to be no doubt whatever. Perhaps, this is because of our almost total ignorance of his identity and achievements. The less we know, the less there is to question** 224 శంకర గురువర్యుడైన గోవింద భగవత్పాదుని విషయమున సందేహములేదు. అతని వ్యక్తిత్వము గాని, ఘనతగాని, మనకు బొత్తిగ దెలియకపోవుటయే దాని

224. Prof. S. S. Suryanarayana Sastry : Sankaracharya, p 10.

గారణము. ఎంత తక్కువగ దెలిసిన నంత తక్కువ సందేహ తులు ఏర్పడును అని సూర్యనారాయణశాస్త్రి అనునట్లు, చంద్ర శర్మ వృత్తాంతము. గోవిందుని సమాచారము అగోచరముగ నున్నవి. అందుచే ప్రస్తుతమునకు నతని శంకరు గురుపాదు నిగనే స్వీకరింపనగును. కాని శంకరుడు కారికానంతమున, దన భాష్యమున గవుడపాదుని స్తుతించుటచే గవుడపాదుని దన పరమ గురునిగ స్వీకరించినట్లు భావించుట తొందరపాటు అనిపించును. అట్లు అని తీర్మానించి, thus making it almost certain that the latter had just preceeded Govinda [225] గోవిందునికి గొంచెము పూర్వునిగ గవుడపాదుని నిర్ణయించు టయు అనుచితము. చరిత్రప్రకారము చంద్రశర్మ, గవుడపాదుని వద్ద వ్యాకరణమును గ్రహించి, కాలాంతరమున సన్న్యసించి, గోవిందభగవత్పాద పట్టమును స్వీకరించి, శంకరుని గురువగుట ఏర్పడుటచే శంకరుగూడ భగవత్పాద పట్టమునే బొందియున్నట్లు వ్యక్తము. ఈ భగవత్పాదశబ్దము గవుడపాదునకు గానుపింపదు. 'పాద' శబ్దము సామాన్యమైయున్నను 'భగవత్' శబ్దము అదృశ్యముగదా! కాన గవుడపాదునకు గోవిందునకు గల సంబంధమే యింత సమస్యాపూరితముగ నుండ, నిక గవుడపాద శంకర సంబంధము ఎట్లు నిశ్చయము కాగలదు? కావున నీ విషయముల నెల్ల సాకల్యముగ విచారించిన సూర్యనారాయణశాస్త్రి, 'పరమ గురు' శబ్దము గురువునకు గురువని అన్వయము కానవసరము లేదనియు, దూరస్థుడైన గురువునకుగూడ నది అన్వయించుట కలదనియు, ఆ విషయ క్లిష్టత్వమును సూచించి, while tradi-

---

225. C. N. Krishnaswami Aiyer : The Three Great Acharyas, p 16.

tions assert a particular relation between Sankara and Gaudapada, its accuracy is subject to serious doubt. 226 సంప్రదాయము శంకర గవుడపాదుల కొక సంబంధమును దెలుపుచుండ, దాని నిర్దోషత్వము మిగుల సంశయాస్పదముగ నున్నదనియు, there is not much certainity ఎక్కువ నిశ్చయత్వము కానరాదనియు, గట్టిగా వక్కాణించియున్నాడు. కాన గవుడపాదుడు అద్వైతాచార్యులలో ప్రథముడునుకాక, శంకరుసన్నిహితుడును గాకుండుటచే నాతని కాలనిర్ణయ వ్యవహారము అతిక్లిష్టమై, కష్టసాధ్యమై యున్నదని విదితము. అట్టి అనిశ్చితాంశములపై నాధారపడి, అతని వ్యక్తిత్వ జీవితకాలముల నిర్ణయించుట దోషభూయిష్టము. శంకరజీవితమునుగూడ, గవుడపాద బాదరాయణులు శంకరునికి దర్శనమొసంగి అదృశ్యమైరి 227 అనుటయు, గవుడపాద వ్యాసుల సాక్షాత్తు స్థూలదర్శనముకాదేమో అను సందియముఁగూడ వొడమ గలదు.

అయినను శంకరచరిత్ర ననుసరించి, but he was probably living when Sankara was a student, for Sankara says that he was directly influenced by his great wisdom 228 అతని గొప్ప ప్రజ్ఞాశక్తి ప్రాబల్యమున, దానుగూడ సాక్షాత్తుగా లొంగినట్లు శంకరుడు చెప్పుకొని

226. Prof. S. S. Suryanarayana Sastry : Sankaracharya, p 10.
227. శ్రీ క్షేమ్మలూరి కృష్ణస్వామయ్య : జగద్గురు శ్రీ శంకర భగవత్పాదాచార్య చరిత్రము, పు 13.
228. Prof. Surendranath Das Gupta : A History of Indian Philosophy, vol. 1, p 423,

యుండుటచే, గౌడపాదుని కాలమున శంకరుడు యింకను విద్యార్థియై యుండునని సురేంద్రనాథ దాస్ గుప్త వచించును. అట్లు సంబంధమేర్పరచి చూచినను, శంకరు కాలము వాదగ్రస్తమగుటచే, గౌడపాద కాలమున అనిర్ధారితముగనే యున్నది. శ్రీశంకరులు బదరికాశ్రమమున గౌడపాదుని దర్శించినపుడు శంకరులకు 14 వర్షములును, గౌడపాదులకు 120 వత్సరములని కృష్ణస్వామయ్య వ్రాసి, గౌడపాదుడు సుమారు క్రీ.పూ. 615 న జన్మించినట్లు నిర్ణయింపగా, 229 శంకరు జననము క్రీ. పూ. 509 గ నిర్ణయించి, శంకర గవుడపాదులకు 238 వత్సరములు వ్యత్యాసమని శ్రీకల్యాణానందభారతి నిర్ణయించుటచే 230 గౌడపాద జననము క్రీ. పూ. 747 గ కళ్యాణానందుల లెక్కకు దేలుచున్నది. రాధాకృష్ణుడు క్రీ. త. 550 అని నిర్ణయింప 231 క్రీ. త. 700 లుగ ఏ. బి. కీత్ తీర్మానించెను. 232 వాచస్పతికంటె ముందువాడగుటచే 8 వ శతాబ్దమనియు 233 In the 8 th century a fearless Gauda theologian composed a mertical exposition of non-dualism 234 ఎనిమిదవ శతాబ్దమున

229. శ్రీ శ్రేష్ఠలూరి కృష్ణస్వామయ్య: జగద్గురు శ్రీ శంకర భగవత్పాదాచార్య చరిత్రము, అనుబంధము-3.

230. శ్రీకల్యాణానంద భారతీ స్వాములవారు: భగవద్గీత.

231. Dr. S. Radhakrishnan : Indian Philosophy, vol. 2, p 781.

232. Dr. A.B. Keith : A History of Sanskrit Literature, p 475.

233. Dr. S. Radhakrishnan : Indian Philosophy, vol. 2, p 251

234. Prof. Earnest P. Horrwitz : Buddists in Disguise, Vedanta Kesari. 1932

నొక నిర్భయ గవుడ తత్త్వవేత్త అద్వైతమునకు శ్లోకరూప రచనము గావించెనని ఆచార్య ఎర్నెస్టు పి. హొరిట్జ్‌వాకొన, About the period of 870 A. D. Gaudapada revived the monistic teaching of the Upanishads [235] క్రీ. శ. 780 ప్రాంతములలో గవుడపాదుడు ఉపనిషత్తుల అద్వైతవాదము నుద్ధరించెను అని సురేంద్రనాధ దాసు గుప్త రచించెను. కాన పై విమర్శల ననుసరించిచూచినచో, శంకర కాలనిర్ణయము క్రీ. పూ. 541 నుండి క్రీ. శ. 788 వరకు, అనగా 1329 సంవత్సరముల తారతమ్యముతోడను, గవుడపాదాచార్యుడు, క్రీ. పూ. 747 నుండి క్రీ. శ. 780 వరకు, అనగా 1527 సంవత్సరముల తారతమ్యముతోడను తీర్మానింపబడినట్లు గాంచ, మన మహాపురుషుల జీవిత విశేషములు ఎంత అజ్ఞాతములై కాలమున అంతరించిపోయినవో, అందుచే గవేషణార్థులకెంత మనస్తాపకములో గాంచనగును. అది కడు విచారకరము, దురదృష్టకరము. అందుచే గౌడపాదుని కాలనిర్ణయవ్యవహారమింతటితో నసమాప్తిగనే వదలి, విద్వాంసుల కృషి నిర్ణయములకొరకు నిరీక్షించెదముగాక !

## గౌడపాదుడు - బౌద్ధవాదము

పైన జర్చింపబడిన కాలనిర్ణయము సిద్ధాంత రాద్ధాంతము లట్లుండ గౌడపాద కృత మాండూక్య కారికలలో గొన్ని బౌద్ధవదములబోలు బదములు, ఆ యర్థములున్నను అనుమానమున

---

235. Prof. Surendranath Das Gupta : A History of Indian Philosophy, vol. 1, p 418.

గొందరు పండితవర్యులు I believe that there is sufficient evidence in his Karikas for thinking that he was possibly himself a Buddist' and considerd that the teachings of the Upanishads tallied with those of Buddha 236 గౌడపాదుడు బౌద్ధుడై యుపనిషద్భావనులకును, బుద్ధబోధలకును సామ్యము గలదని దలంచినట్లు, కారికలలో దగినంత సాక్ష్యము గలదని నా నమ్మకము అని సురేంద్రనాథ దాసు గుప్త ఆ వాదమును బలపరచెను. గవుడపాదుడు బౌద్ధభిక్షువనుట సాహసమే అనియు, నట్టి ఆధారములెందును కారికా బాహ్యమున గానరాదనియు, నందుచే నా తీర్మానము సరిగాదని కొందరి నమ్మకము. అంతియగాక యిట్టి ప్రజ్ఞానిధి బౌద్ధుడైయుండి, యుపనిషద్భాష్యమును వ్రాసి యూరకుండెనేగాని, స్వీయ మత సిద్ధాంత ప్రతిపాదనార్థమై ఎట్టి యల్ప గ్రంథమునైన వ్రాసినట్లు గానుపింపదు. అదియు విచిత్రమే. కాన నతడు బౌద్ధుడనుట ప్రమాణరహితమై, కేవలమూహాజనితమని దోచెడిని. అందుచే అటుల వాదించుటకంటె There is no doubt that this work - - - is strongly influenced by the Nihilistic school of Buddhism 237 బౌద్ధ శూన్యవాదముచే నీ రచనము ప్రబలముగ బ్రేరేపింపబడియుండుట నిస్సందేహమని ఏ. బి. కీత్ ; That Gaudapada gives us a Vedantic interpretation of the Buddhist Sunyavada is supported by many scholars such

---

236. Prof. Surendranath Das Gupta : A History of Indian Philosophy, vol. 1, p 423.

237. Dr. A. B. Keith : A History of Sanskit Literature, p 4[illegible] .

as Iacobe, Pousin, Sukhlankar, and Vidhusekhar Bhattacharya 238 గవుడపాదుడు బౌద్ధ శూన్యవాదమునకు వేదాంతార్థమును నొసంగియుండుట జకోబి, పౌసిన్ సుఖలంకార్, విధుశేఖర భట్టాచార్య మొదలగు అనేక విద్వాంసులు బలపరచిరనియు రాధాకృష్ణ పండితుడు వాకొనుచు, కాని Unfortunately Sankara explains away all obvious referenees to Buddhism. See Sankara Bhashya 4, 1, 2. 19, 42, 90 where striking references to Buddha and his doctrine are explaind away 238 దురదృష్టవశమున, శంకరరుడు బౌద్ధాన్వయములను త్రోక్కివేసియున్నాడు. విస్పష్ట బౌద్ధ భావసూచికములుగల కారికలకు శంకర భాష్యమును జూడుడు. అనియు రాధాకృష్ణుని వాదము. మరియు, Gaudapada's work bears traces of the influence of Buddhists especially of the Vijnana Veda and Madhyamika school. Gaudapada used the same arguments as the Vijnana Vedins 238 ముఖ్యముగ, బౌద్ధ విజ్ఞాన మాధ్యమిక వాదముల ప్రాబల్య చిహ్నములు గవుడపాద రచనముపై గలవు. విజ్ఞానవాదుల వాదములనే గవుడపాదుడుపయోగించెను. కావున The Karika of Gaudapada is an attempt to combine in one whole thd negative logic of the Madhyamika with the positive idealism of the Upanishads. In Gaudapada the negative tendency is more prominent than the positive. In Sankara we have a more balanced outlook 238 మాధ్యమికుల

238. Dr. S. Radhakrishnan : Indian Philosophy, vol. 2, p 465

వ్యతిరేక తర్కమును, ఉపనిషత్తుల అనుకూలాద్వైతమును ఒక్క రూపమున మేళవింప యత్నించుటే గవుడపాదకారిక. గవుడపాదు నిలో అనుకూలతత్త్వముకంటె వ్యతిరేకభావములే ప్రధానముగ గలవు. శంకరునిలో, నధికతర సమరసత్వమును మనము గాంచ గలమనియు ఆచార్య రాధాకృష్ణ పండితుడు వివరించియున్నాడు.

'జ్ఞానేనాఽకాశకల్పేన ధర్మాన్యో గగనోపమాన్ । జ్ఞేయాభి న్నేన సంబుద్ధస్తం వందే ద్విపదాం వరం॥' (మాం.కా.4.1) ఆకాశ సదృశమై, జ్ఞేయాభిన్నమై, జ్ఞానముచే నాకాశతుల్యమగు ఆత్మ ధర్మములను జక్కగా నెవడెరింగెనో, అట్టి పురుషశ్రేష్ఠునికి నమ స్కారము అను కారికలో 'ధర్మ' శబ్దము 'సంబుద్ధః' అను పదము వివాదగ్రస్తములు. 'ధర్మ' శబ్దమునకు ఆత్మధర్మమనియు, 'సంబుద్ధః' పదమునకు సమగ్ర జ్ఞాని అనియు నన్వయించి, 'ద్వి పదాం వరం' అను పదమునకు నారాయణుని పురుషశ్రేష్ఠునిగా శంకరుడు అన్వయించెను. కాని బుద్ధునికి నమస్కరించునట్లు గోచరమని పరవాదుల భావము. గౌడపాదుడు బదరికాశ్రమ మున నారాయణుగూర్చి ఘోర తపంబొనర్ప, నారాయణుడు దర్శనంబొసంగి, బ్రహ్మవిద్య ననుగ్రహించియుండెననియు, నం దుచే గవుడపాదుడు తన కృతజ్ఞతలను యిందు తెలుపుకొనెనని అనుకూలవాదుల తలంపు. అటులే 'అశక్తిరపరిజ్ఞానం క్రమ కోపోథ వా పునః। ఏవం హి సర్వథాబుద్ధైః అజాతః పరిదీపితా॥' (మాం.కా. 4,19) సామర్థ్యము లేమిచేత, దెలియకపోవుటచేత, లేక గార్య కారణజన్య కాలక్రమముయొక్క అజ్ఞానము గలుగుచున్నది. కాన విద్వాంసులచేత నన్యవిధముల బుట్టుక లేనిది అని ప్రకాశింప

జేయుబడినది అను కారికలో, 'బుద్ధైః' అను పదము మరలమరల ప్రమాద హేతువైనది. 'ఉపలంభాత్సమాచారాత్ అస్తి వస్తుత్వ వాదినాం। జాతిస్తు దేశితాబుద్ధైః అజాతేస్త్రసతాం సదా॥' (మాం. కా. 4.42) సర్వత్ర గోచరమగుటచేత, ధర్మాచరణము జరుగు చుండుటచేత వస్తుభావము గలదని దృఢాభినివేశము గలవారి కొరకు విద్వాంసులచేత ఉత్పత్తి బోధింపబడినది. ఉత్పత్తిలేని దని వచించుటచేత, భయపడువారికి ఉత్పత్తి సదా చెప్పబడినది. ఇచటగూడ 'బుద్ధైః' శబ్దమే వాదహేతువు. 'హేయజ్ఞేయాప్య పాక్యాని విజ్ఞేయాన్యగ్రయాణతః' (మాం.కా. 4 90) హేయ జ్ఞేయ ఆప్య వాక్యములు, అగ్రయాణముచే గ్రహింబడదగినవి. ఇచట 'అగ్రయాణము' అనునది మాధ్యమిక వాదమునగల అగ్రయాన లేక మహాయాన శబ్దమును స్ఫురింపజేయుట సందేహకారణము. అటులే 'అలబ్ధావరణా స్సర్వే ధర్మాః ప్రకృతినిర్మలాః। ఆదౌ బుద్ధా స్తథా ముక్తా బుధ్యంత ఇతి నాయకాః॥' (మాం. కా. 4.98) జీవు లందరును ఆవరణశూన్యులు, స్వభావశుద్ధులు, నిత్య బుద్ధ స్వభా వులు. అదేవిధముగా నిత్యముక్తులు, ప్రభువునని యు దెలిసి కొనబడుచున్నారు. 'ఆదౌ బుద్ధా' అనునది వివాదకారణము. 'క్రమతే న హి బుద్ధస్య జ్ఞానం ధర్మేషు తాపినః। సర్వే ధర్మా స్తథా జ్ఞానం నైతద్బుద్ధేన భాషితం॥' (మాం.కా. 4.99) ఆకాశము వలె నిరంతరుడగు బ్రహ్మవేత్తయొక్క జ్ఞానము, ఆత్మేతరవిష యములందు ప్రవేశింపదుగదా! అదేవిధముగా ఆత్మభిన్నము లగు సర్వవిషయములు జ్ఞానమునుగూర్చి ప్రవేశింపనేరవు. ఇది బుద్ధునిచేత వచింపబడలేదు. ఈ కడపటి కారికలలోగూడ ధర్మ,

బుద్ధ శబ్దము బుద్ధపరముగనే నుపయోగింపబడుటయు గమనార్హము.

ఈ విషయముల బరిశీలించిన సూర్యనారాయణశాస్త్రి, The karikas contain some expressions like 'Dharma' which are most suitably understood accuring to Buddhist teaching ; but the commentator has twisted them and done little justice either to himself or to the text 239 బౌద్ధ వాదమునకనుగుణమైన ధర్మాది శబ్దములు కారికలలో గలవు కాని భాష్యకారుడు వాని నిరూపమొనర్చి తనకుగాని, గ్రంథమునకు గాని న్యాయము గలుగజేయలేదని కొందరి భావములను దెలిపి, It is unsafe to rely too much on such arguments but it is no less inadvisable to brush them aside lightly 239 కాని, అట్టి వాదనలపై నెక్కువ నాధారపడుట ప్రమాదకరము. అటులే వాని త్రోసిపుచ్చుటయు అనుచితము అని హెచ్చరించియున్నాడు. గవుడపాదుడుపయోగించియున్న ధర్మ పదము appearance మాయారూపమను అర్థమున నుపయోగింపబడలేదనియు, 'Dharma' literally means atribute' which is, according to the Vedanta philosophy, non-different from the substance - as heat and light are non-different from the sunshine 240 సూర్యరశ్మికన్యముగ ఉష్ణ ప్రకాశములు లేనట్లు, పదార్థమునకన్యము గుణముండదను వేదాంతార్థమున ధర్మము

---

239. Prof. S. S Suryanarayana Sastry : Sankaracharya, p 10.
240. Swami Nikhilananda : Mandukya Upanishad, p xix

నకు శబ్దార్థము గలదనియు, నట్లు 'Dharma' is used by Gaudapada to mean Jiva which if taken as attribute of Brahman is non-different from it 240 బ్రహ్మేతరము గాని గుణముగ జీవుని ధర్మ పదమును గవుడపాదు డన్వయించెనని నిఖిలానందుడు వివరించెను. ధర్మ పదము బహు వచనమున నుపయోగింపబడి, నానాజీవుల నన్వయించెను అనియు విశదీకరణము. కాన ధర్మ శబ్దము బౌద్ధపరమనుట యుచితము గాదు అని తాత్పర్యము.

'బుద్ధ' శబ్దమును సమర్థించుచు నిఖిలానందుడు, కారిక లలో బుద్ధ శబ్దాస్తికతను సమ్మతించుచు, బుద్ధ శబ్దము గౌతమ బుద్ధునికన్వయింపజాలదనియు, It only means the knower of truth 241 బ్రహ్మజ్ఞాని యనియే దాని అర్థము అని వాకొనెను. అటులే The word 'Agrayana' may be made to indicate 'Mahayana' only by a fanciful resemblence of words. The word, really means ప్రథమతః 241 అగ్రియాన పదము, పదసాదృశ్యమున మహాయానముగా నూహింపబడినదేకాని దానికి ప్రథమతః అని అర్థము అనియు నిఖిలానందుడు దాని గొట్టివేసెను. అలాత శాంతివిషయమునగూడ గొంత వివాదము గలదు. ఈ విషయమును బ్రస్తావించుచు The idea of అలాతశాంతి is found in the Buddhist Lankavatara and the Maitrayaniya Upanishad; but we cannot accept the theory

---

240. Swami Nikhilananda : **Mandukya Upanishad**, p xix.

241. Swami Nikhilananda : **Mandukya Upanishad**, p xxi.

that in this doctrine of illusion we have a borrowing from the Buddhists. The idea is suggested strongly in certain passages of the Upanishads; it was probably developed by an Aucanishadic school affected the growth of Buddhism and in turn was affected by the brilliant, if rather wasted dialectic of Nagarjuna-[242] అలాతశాంతి భావము బౌద్ధ లంకావతరసూత్రమున, మైత్రాయణేయ ఉపనిషత్తున గలదు. కాని, యీ మాయావాదము బౌద్ధులనుండి గైకొనబడినట్లు వచించుట సమ్మతముగాదు. కొన్ని ఉపనిషద్వాక్యముల నీ భావము సూచింపబడియే యున్నది. అది ఒక ఔపనిషదిక సిద్ధాంతముచే నభివృద్ధిచేయబడి, బౌద్ధముపై బాగ్బల్యమును జూపియుండును. మరల అద్భుతమై నిరర్థకోపయుక్తమైన నాగార్జునుని వాదముచే నింకయు నభివృద్ధి చెంది యుండునని ఏ. బి. కీత్ సమన్వయించెను.

అయినను, పూర్వమే మనము గాంచియున్నట్లు ఆధ్యాత్మిక భావజాలములు, నాటి వాతావరణమున గ్రంథరూపమునను, ముఖతః నెగురుచుండ, నెవరికనుకూలమగువాని వారు గ్రహించి, సిద్ధాంతముల బ్రతిపాదించుచు, గ్రంథముల రచించుచు నుండిరనుట సమంజసము. అటులే పారిభాషిక పదములు సామాన్యముగ నుండ, వాని నందుకొని ఎవరికుచితమైన అర్థములతో వారుపయోగించుకొనియుండుటనే నందలాల్ సింహా వచించునట్లు Similarity of words and ideas here and there,

242. Dr. A.B. Keith : A History of Sanskrit Literature, p 475.

is, therefore, not a safe guide 243 అచటచట గల పద సామ్యము భావసాదృశ్యములు, సరియైన మార్గములు గావు. అందుచే Gaudapada may have 'assimilated all the Buddhist Sunyavada and Vijnanavada teachings.; but this does not prove that he thought, that these hold good of the Ultimate Truth preached by the Upanishads 244 గౌడపాదుడు బౌద్ధ శూన్య విజ్ఞానవాదముల నన్నింటిని బఠించియుండవచ్చును. కావున నివి ఉపనిషత్ప్రబోధిత పరమార్థముతో సమములని అందరు భావించినట్లు నిరూపింపజాలవని నిఖిలానందుడు వాదించును. మఱియు దాను బౌద్ధుడనని గౌడపాదుడెచ్చటను చెప్పుకొనియుండ లేకపోవుటయేగాక, 244 'నైతత్ బుద్ధేన భాషితం' (4.99) ఇది బుద్ధునిచే బోధింపబడలేదని వ్రేలు పెట్టి చూపించుట జరిగియుండుటచే, నతనికి, బౌద్ధవాదమునకు దూరమనియు నతడు వివరించెను. ఒకవేళ బుద్ధునియందు గౌడపాదునికి గౌరవమున్నను అది దోషము కాదు. Every Hindu and every lover of truth cherishes a similar feeling of the highest regard for the Compassionate One 245 ప్రతి హిందువు, ప్రతి సత్యాభిమానియు ఆ పరమ కారుణ్య హృదయునిపై అత్యంత గౌరవములు గలిగియుండును అని నిఖిలానందుని సమన్వయము. కావున గవుడపాదుడు బౌద్ధవాదముల గ్రహించియున్నను, వానియందును గౌతమునియందును విశేషగౌరవ

243. Prof. Nandalal Sinha : The Sutras of Goutama, Foreword.
244. Swami Nikhilananda : Mandukya Upanishad, p xxvi.
245. Swami Nikhilananda : Mandukya Upanishad, p xxvii.

ప్రపత్తుల గలిగి యుండినను, దా రచించియున్న మాండూక్య కారికలకొరకై బౌద్ధ భావముల గ్రహింప నవసరము గానరాదు. ఆ భావములన్నియు నుపనిషద్గతములే యయియున్నవి. అందుచే, గవుడపాదుడు బౌద్ధుడనుట జెల్లనేరదు అని పండితాభిప్రాయము.

కారికలలో నాగార్జున ప్రోక్త మాధ్యమిక కారికా పదములును, భావములును క్రిందివిధముగ నున్నట్లు పండితులు కొన్ని సూచించిరి. అవి ఎంతవరకు సమర్థనీయములోగూడ చూచెదముగాక! 'వీతరాగభయక్రోధై ర్మునిభిర్వేదపారగైః। నిర్వికల్పో హ్యయం దృష్టః ప్రపంచోపశమోఽద్వయః॥' (మాం. కా. 2.35) రాగ భయ క్రోధములు లేని వేదార్థ పారంగతులైన మునులచే నిర్వికల్పమును, ప్రపంచ రహితమును, అద్వయమును, అయిన పరమాత్మ చూడబడుచున్నాడు అను కారికలో 'ప్రపంచోపశమః' అను పదము, మాధ్యమిక కారికలలో 'సర్వోపలంబోపశమః ప్రపంచోపశమః శివః। న కశ్చిత్ కస్యచిత్ కశ్చిత్ ధర్మో బద్ధేన దేశితః (మాధ్యమిక కా. 1.20.25) సర్వప్రపంచానుభవ విరామము, ప్రపంచోపశమము మంగళకరమైనది అని ఉపయోగింపబడియున్నది. కాని యీ పదము దూరమునుండి గ్రహింపబడనవసరములేదు. తాను వ్యాఖ్య వ్రాయ సంకల్పించిన మాండూక్యోపనిషత్తులోనే, ఏడవ మంత్రమున, తురీయమైన ఆత్మ నిర్వచనమున, 'ఏకాత్మప్రత్యయసారం ప్రపంచోపశమం శాంతం శివమద్వైతం చతుర్థం మన్యంతే స ఆత్మా స విజ్ఞేయః' అని స్పష్టముగ నా పదమేగాక, నాగార్జునుడుపయోగించిన శివపదము గూడ

నందుండుట గాంచగలము. ఈ పదమింక నితరోపనిషత్తులలో గూడ గాంచనగును. కాన నాగార్జునుడే, 'ప్రపంచోపశమః శివః' అను పదద్వయమును మాండూక్యమునుండి గ్రహించియుండ వచ్చునుగదా! అదేవిధముగ 'సత్వో నాపి పరతో న ద్వాభ్యాం నాప్య హేతుతః। ఉత్పన్నజాతు విద్యంతే భావాః క్వచన కేచనః॥' (మాధ్యమిక కారిక. 1.1) చావు పుట్టుకలు లేవు. రెండును లేవు. అకారణమును లేదు. ఉత్పన్నములును ఎప్పుడును ఎక్కడను లేవు అను కారికార్థము 'న నిరోధో న చోత్పత్తిర్న బద్ధో న చ సాధకః। న ముముక్షుర్నవై ముక్త ఇత్యేషా పరమార్థతా॥' (మాం. కా. 2.32) ఉత్పత్తి ప్రళయములు లేవు. బద్ధుడు లేడు. సాధకుడు లేడు. ముముక్షువును లేడు. ముక్తుడుగూడ లేడు. ఇదియే పరమార్థము అని మాండూక్యకారికలో నుండుటయు ప్రమాదమే అయినది. రెండు కారికలలో భావసామ్యమేగాని భాషాసామ్యము ఎందును కానరాదు. అయినను యీ సామ్యము పండితుల గలవరపెట్టి, గవుడపాదుడు నాగార్జుని నుండి యీ భావముల గ్రహించినట్లు గొందరిచే దీర్మానింపజేసినది. అట్లుగాక 'న బంధోస్తి న మోక్షోస్తి నాబంధోస్తి న బంధనం। అప్రబోధాత్ ఇదం దుఃఖం ప్రబోధాత్ ప్రవిలీయతే॥' (యో. వా. 4.38 22) బంధ మోక్షములు లేవు. అబంధ బంధనములును లేవు. జ్ఞానము లేకుండుటచేతనే యీ దుఃఖము. జ్ఞానముచే నది నశించును అను యోగవాసిష్ఠ వాక్యార్థమును జూచి, నాగార్జున గవుడ పాదులిరువురు ఆ శ్లోక తాత్పర్యముల యోగవాసిష్ఠమునుండి గ్రహించి, తమ శ్లోకముల నల్లియుందురని గొందరు భావించిరి. కాని యీ శ్లోకము యథాతథముగ అవధూత (8), త్రిపురతాపిని

(5.10) మొదలగు నుపనిషత్తుల స్పష్టముగా నేమార్పుగూడ గోచరించుచున్నది. అందుచే గౌడపాదుడా శ్లోకరాజమును మార్చ లేకయే వానినుండి స్వీకరింప, నాగార్జున వాల్మీక్యాదులు భాష మార్చి, భావమును స్వీకరించియుండినట్లు వ్యక్తము.

కావున, గౌడపాదుడు ప్రసంగవశమున అనిర్వచనీయ అవాచ్య విజ్ఞానమును ప్రస్తావించి, అది ఉపనిషత్తులగల ఆత్మ నన్వయింప యత్నించి, and thus laid the foundation of a rivival of the Upanishad studies on Buddhist lines. How far the Upanishads guaranteed in detail the truth of Gaudapada's views it was left for his disciple, the great Sankara, to examine and explain 246 బౌద్ధవిధానమున నుపనిషత్పరనము నుద్ధరింప గౌడపాదుడు బూనెననియు, గౌడపాదభావనముల నుపనిషత్తులెంతవరకు సమర్థించునో విచారించి వివరింప నతని ఉత్తమ శిష్యుడైన శంకరునకు వదలివేయుబడినదనియు సురేంద్రనాథ దాస్ గుప్త భావములు పొసగనేరవని స్పష్టము. బౌద్ధ భావములే యింత తీవ్రముగ గౌడపాదునిలో నున్నచో, బౌద్ధవాద ఖండనము సర్వదా సర్వథా గావించియున్న శంకరులు, అతనికెట్లు ఉత్తమ శిష్యుడగునో ఆశ్చర్యకరము. అట్టి గ్రంథమునకు భాష్యరచనము గూడ విచిత్రమే. అందుచే గారికలలో బౌద్ధభావములున్నవని భావించుటకంటె బౌద్ధములో గారికభావములున్నవని గ్రహించిన సముచితము. ఎందుచేనన నిరువురికి నాధారము నాటి సర్వత్ర

246. Prof. Surendranath Das Gupta : A History of Indian Philosophy, vol. 1, p 429

వ్యాప్త వేదాంత వాఙ్మయరాశియే. కాన We are of opinion that Buddhist metaphysical thought is nearest to Gaudapada's Karikas [247] గౌడపాద కారికలకు బౌద్ధవాదము చాల సన్నిహితమని తన అభిప్రాయముగ నిఖిలానందుడును స్పష్టపరచెను.

గౌడపాద కాలనిర్ణయమింకను అనిశ్చయముగనే యున్నదని పూర్వము చూచియున్నారము. అట్టి గౌడపాదునకు నాగార్జునకు సంబంధమును గలుగజేసి, నాగార్జునుని అనంతరమే గౌడపాదుడున్నటుల నూహించి, శాస్త్రజ్ఞులు పై వచింపబడిన ఊహాగానముల గావించియున్నారు. Gaudapada thus flourished after all the great Buddhist teachers Aswaghosha, Nagarjuna, Asanga and Vasubandhu [248] అటుల గవుడపాదుడు, అశ్వఘోష, నాగార్జున, అసంగ, వసుబంధు గాగల గొప్ప బెద్ద ఆచార్యుల బిమ్మట నుండెను అని సురేంద్రనాథ దాస్ గుప్త వ్రాసియున్నాడు. గవుడపాదునకును నాగార్జునకును 350 వత్సరముల అంతరముగూడ గలదనియు కొందరి వాదము. నాగార్జునుడు ఆంధ్రదేశమునగల తెలంగాణా ప్రాంతమునగల విదర్భ Berar ప్రదేశమునకు జెందినవాడు. అతని కాలనిర్ణయము కాకున్నను, క్రీ. శ. రెంతవ శతాబ్దమున నుండెనని పండితాభిప్రాయము. క్రీ. శ. 78 ప్రాంతముల పాలించినట్లు చెప్పబడుచున్న కనిష్కుని కాలమునను్న అశ్వఘోషుని

---

247. Swami Nikhilananda : Mandukya Upanishad, p xviii.

248. Prof. Surendranath Das Gupta : A History of Indian Philosophy, vol. 1, p 423

(5.10) మొదలగు నుపనిషత్తుల స్పష్టముగా నేమార్పుగూడ లేక గోచరించుచున్నది. అందుచే గౌడపాదుడా శ్లోకరాజమును మార్పు లేకయే వానినుండి స్వీకరింప, నాగార్జున వాల్మీక్యాదులు భాషను మార్చి, భావమును స్వీకరించియుండినట్లు వ్యక్తము.

కావున, గౌడపాదుడు ప్రసంగవశమున అనిర్వచనీయు అవాచ్య విజ్ఞానమును బ్రస్తావించి, అది ఉపనిషత్తులగల ఆత్మకు నన్వయింప యత్నించి, and thus laid the foundation of a rivival of the Upanishad studies on Buddhist lines. How far the Upanishads guaranteed in detail the truth of Gaudapada's views it was left for his disciple, the great Sankara, to examine and explain 246 బౌద్ధవిధానమున నుపనిషత్పరనము నుద్ధరింప గౌడపాదుడు బూనెననియు, గౌడపాదభావముల నుపనిషత్తులెంతవరకు సమర్థించునో విచారించి వివరింప నతని ఉత్తమ శిష్యుడైన శంకరునకు వదలివేయుబడినదనియు సురేంద్రనాథ దాస్ గుప్త భావములు పొసగనేరవని స్పష్టము. బౌద్ధ భావములే యింత తీవ్రముగ గౌడపాదునిలో నున్నచో, బౌద్ధవాద ఖండనము సర్వదా సర్వధా గావించియున్న శంకరులు, అతనికెట్లు ఉత్తమ శిష్యుడగునో ఆశ్చర్యకరము. అట్టి గ్రంథమునకు భాష్యరచనము గూడ విచిత్రమే. అందుచే గారికలలో బౌద్ధభావములున్నవని భావించుటకంటె బౌద్ధములో గారికభావములున్నవని గ్రహించిన సముచితము. ఎందుచేనన నిరువురికి నాధారము నాటి సర్వత్ర

246. Prof. Surendranath Das Gupta : A History of Indian Philosophy, vol. 1, p 429

తర్వాత నాగార్జునకాలమని తలంపు.[249] టిబెట్టులోనున్న అభి ప్రాయము ననుసరించి నాగార్జునుడు క్రీ. త. 137 నుండి 57 వత్సరములు జీవించినట్లుగలదని పి. ఆర్. రామచంద్రరావు తెలిపి యున్నాడు.[250] కాని అతడు శాతవాహన రాజులకాలమున నుం డుట విదితమగుటచే విజయశాతవాహనునికాలము అని కొందరను టచే క్రీ. త. గ నిర్ణయించిరి. కాని కొందరి అభిప్రాయముగ విజయశాతకర్ణి క్రీ.త. 195 వత్సరములుగాక క్రీ.పూ. 343-337 అని వ్రాసియున్నారు. హాలశాతవాహనుని కాలపువాడుగ నాగార్జునుని కొందరు దీర్మానించుటచే నతడు రెండవ లేక్కప్రకారము క్రీ. పూ. 434-489 వరకు ఉన్నట్లు కొందరి అభిప్రాయము.[251] బుద్ధుని తర్వాత 400 వత్సరములకు నాగార్జునుడుండెను అని బౌద్ధ ఉత్తర శాఖీయుల అభిప్రాయముగను, దక్షిణశాఖీయులు బుద్ధుని నిర్వా ణ్యానంతరము 500 వత్సరములవాడనియు దెలుపుచున్నారు.[252] బుద్ధుని నిర్వాణము ఉత్తరశాఖీయులు క్రీ. పూ. 477 అనియు, దక్షిణశాఖీయులు క్రీ. పూ. 543 గను తెలుపుచుండుటచే, ప్రథ ముల గణనముప్రకారము నాగార్జునుడు 477-400 = 77 సంవత్స రము ప్రాంతముననో, లేక 543-500 = 43 సంవత్సరముననో యుండినట్లుతెలియుచున్నదని ఎన్. భాష్యాచార్యుని కథనము.[252]

---

249 శ్రీ చీమకుర్తి శేషగిరిరావు : ఆంధ్రపత్రిక, 9-12-19‥5.

250. శ్రీ పి. ఆర్. రామచంద్రరావు : ఆంధ్రపత్రిక, 9-1 1955.

251. శ్రీ కోట వేంకటాచలం : కలిశకవిజ్ఞానము, ద్వి.భా. పు 108

252. Pandit N. Bhashyaracharya : The Age of Patanjali, p .

కాని గౌతమబుద్ధుని కాలనిర్ణయముగూడ నతి క్లిష్టమై యున్నది. అనేక ప్రమాణముల గవేషణము గావించి, చివరకు నిస్పృహ జెంది, Unfortunately, even after all that has baen written on the subject of early Buddhist chronology, we are still uncertain as to the exact date of the Buddha's birth The date **483 B. C.** which is adopted in the history must still be regarded as provisional [253] దురదృష్టవశమున, ప్రాచీన బౌద్ధ కాలక్రమమునుగూర్చి ఎన్నియో వ్రాయబడినను, బుద్ధుని జననకాలమునుగూర్చి మనమింకను అనిశ్చయముగనే ఉన్నాము. చరిత్రచే గైకొనబడిన క్రీ. పూ. 483 వ వత్సరము. యింకను దాత్కాలికముగనే యున్నది అని ఇ. జె. రాప్సన్ తీర్మానించెను. కోట వేంకటాచల పండితుడు యీ విషయమున మిక్కిలి కృషిచేసి, బుద్ధుడు క్రీ. పూ. 1887న జనించెనని వ్రాసియున్నాడు. బుద్ధుని గౌరవించి, శిష్యుడై యుండిన బింబిసారుడును క్రీ. పూ. 1852-1814 వరకు పాలింప, నాతని కొమారుడు అజాతశత్రువు క్రీ. పూ. 1814-1787 వరకు పాలించెననియు వివరించియున్నాడు [254] చైనా దేశీయ సంప్రదాయము ననుసరించి, బుద్ధుడు క్రీ. పూ. 949 గాని 973 గాని జనించియుండినట్లు గలదని భాష్యాచార్యుని వచనము. [255] అట్టిచో బుద్ధుని తర్వాత 400, 500 వత్సరముల న్నాగార్జునుడు గలడను గణనము, ఎంత క్లిష్టత్వమున బడినదో గాంచగలము. ఏదెట్లున్నను **It has not been settled**

253. Dr. E. J. Ropson : Ancient India, vol 1, p 171.

254. శ్రీ కోట వేంకటాచలం : భారతీయ శకములు, పు 65.

255. Pandit N. B ashyacharya : The Age of Patanjali, p 32.

that Gaudapada flourished after the Buddhist philosopher Aswaghosha, Nagarjuna, Asanga and Vasubandhu. Some recent researches reveal that he lived long before them 256 బౌద్ధతత్త్వ విదులైన అశ్వఘోష, నాగార్జున, అసంగ, వసుబంధుల దర్వాత గవుడపాదుడున్నట్లు యింకను స్థిరపడలేదు. అతడు వారికి చాల పూర్వమే యుండెనని యిటీవల గవేషణమున దెలిసినదని నిఖిలానందస్వామి వాకొనియున్నాడు.

అంతియుగాక, నాగార్జునునికి బూర్వమే శూన్యవాదము గలదు. ఆ విషయమును సురేంద్రనాథుడే Mahayana Sutras written before Nagarjuna also held the Sunya Vada 257 నాగార్జునునికి బూర్వమే యున్న మహాయాన సూత్రములు శూన్యవాదమునే గలిగియున్నవని సమ్మతించియున్నాడు. అటులే It is also assumed that Buddhism was brought into existence by Gautama Buddha 258 బౌద్ధవాదమును గౌతమ బుద్ధుడే ప్రారంభించినట్లు ఊహింపబడుచున్నది. ఆ విషయము అసంబద్ధమని, 'తాను 27 వ బుద్ధు'డను బుద్ధుని వాక్యమే పూర్వపక్షము గావించును. గౌతమునకు బూర్వము మరియొక బుద్ధుడుండి, అతని బోధలు చైనా, టిబెట్టు దేశముల బౌద్ధమును బ్రచార మొనరించి యుండి

256. Swami Nikhilananda : Mandukya Upanishad, p xvii.

257. Prof. Surendranath Das Gupta : A History of Indian Philosophy, vol. 1, p 279.

258. Pandit N. Bhashyacharya : The Age of Patanjali, p 35.

నట్లు మేజర్ జనరల్ జే. జి. ఆర్. ఫర్లాంగు తెలిపియున్నాడు.[259]

బౌద్ధవాదమైనను can be found in some place or other of the Upanishads. It only proves the fact that at that time certain philosophical terms were common property of Indian thought in general [260] ఉపనిషత్తుల నేదోయొకచో గాంచనగును. నాడు గొన్ని పారిభాషిక పదములు సామాన్యముగ సర్వ భారతీయ విజ్ఞానమునకు జెందియుండునని దీనివలన విశదము అని నిఖిలానందుని తీర్మానము.

కావున ఏవిధమున విచారించిచూచినను గౌడపాదునకు ఎట్టి విధమైన బౌద్ధసంబంధముండి, తదనుగుణముగ కారికా గ్రంథము రచించి యుండవచ్చుననుటకు ఆధారములు కానుపించుట లేదు. భావ సామ్యము, పద సాదృశములు పరమాధారములు గాజాలవు. అన్నియు ఉపనిషత్సాగర జన్యములే అని విదితము. ఈవిధముగ గౌడపాదుడు స్వకృషి సాగించి, ఉపనిషత్సుధను మరి యొక మధుర రూపమునకు దెచ్చి, మనకందించినందులకు అతనికి మనమెల్ల ఋణపడియున్నారమనుటకు సందేహము లేదు. అందులకా వేదాంతవేత్తకు సహస్రాధిక నమోవాకములు.

---

259. J. G. R. Forelong : Science of Comparitive Religion.

260. Swami Nikhilananda : Mandukya Upanishad, p xxviii.

ఇంతవరకు నింతగ జర్చింపబడిన గౌడపాదుఁడు కడు మేధావియై, Philosophy is the principle of concen-tration through which man becomes himself, by partaking of reality 261 మానవుడు, తన స్వస్వరూపమగు టకు వలసిన సత్పదార్థము నందుకొనుటకుపయుక్తమగు ఏకాగ్రతయే తత్త్వశాస్త్రమనునట్లు, కేవలాభౌతిక విషయ మీమాంసయే గాక నిత్యానుభూతి విచారణయే తత్త్వార్థ విచారణమనునట్లు అతి కుశాగ్రమైన తర్కము నుపయోగించి, We have in India one of the best logical developments of thought భారతదేశమున, మనకు ఒక అద్భుత శ్రేష్ఠ తార్కికాభివృద్ధి గలదని విక్టరు కజిన్స్ అనురీతి ఆ తర్కమును అద్భుతలీలనుపయోగించి, మానవ అవస్థాత్రయము తగల అనుభూతిని నిర్దుష్టముఁగ బరిశీలించి, అందుండి సత్పదార్థమును బహిర్గతమొనర్చియుండెను. నిఖిలానందుడు వచించుచున్నట్లు The method adopted by the Upanishad and followed by Gaudapada for arri-ving at Reality is to analse our experience262 సత్పదార్థమునందుటకు ఆ యుపనిషత్తు ఉపయోగించియున్న విధానము, గౌడపాదుడనుసరించియున్న రీతి, మన అనుభవ పరిశోధనమే యగుచున్నది. తన అగాధ తత్త్వమునకు దగినట్లుండుటచేత 108 ఉపనిషత్తులలో నతిస్వల్పమును, అతి గంభీరమును, గభీరమును అగు మాండూక్యోపనిషత్తును గవుడపాదుడ ఎన్ను

---

261. Karl Jaspers : Way to wisdom, p 14.
262. Swami Nikhilananda : Mandukya Upanishad, p xii

కొనెను. పెద్దవియైనచో తన రచనా స్వాతంత్ర్యమునకాటంకము గావున దీని నేరుకొనెను [263] అనుటకంటె నిది యితర ఉపనిషత్తులకంటె నతి క్లిష్టమైన అవస్థాత్రయానుభవమీమాంసా ముఖమున జీవుని యాథార్థ్యమును గ్రహించి, 'అయం ఆత్మా బ్రహ్మ' అని తీర్మానించియున్నది కాన గవుడపాదుని దృష్టి దానిపై బర్వెత్తినది అని అనుట సమంజసము. అందుచేతనేగదా 'మాండూక్యమేకమేవాలం ముముక్షూణాం విముక్తయే' (ముక్తిక. 1. 27) ముముక్షువులకు విముక్తినొందమాండూక్యోపనిషత్తు ఒక్కటియే చాలును అని మాండూక్య స్తుతిని ముక్తికోపనిషత్తు గావించియున్నది. కాన సుప్రసిద్ధమై అనుభవవేద్యమగు, అద్వైత మూలమగు నా చిన్న యుపనిషత్తు నాశ్రయించి, ప్రసిద్ధ, అనుభవము, అద్వైతసిద్ధిని గవుడపాదుడు గడించి, ఒక్కుమ్మడి దన అనుభవసారముతో బ్రపంచముపై దండయాత్ర చేసెననిన చాల ఉత్తమము. ఆ యుపనిషత్తు కేవలము 12 చిన్న మంత్రముల గలిగియున్నది. దానిని ఆగమముగనే ఆగమప్రకరణ నామమున బ్రత్యేకముగ నుంచి, దానిలో గొన్ని విషయములమాత్రము వివరింప 29 కారికలు నిర్మించి, పిమ్మట ద్వితీయమైన వైతథ్య ప్రకరణమున దృశ్యముల ఆభాసత్వమును నిర్ణయించి, తృతీయమైన అద్వైతప్రకరణమున జీవబ్రహ్మైక్యమును బోధించి, చతుర్థమున అలాతశాంతి ప్రకరణమున పరవాద ఖండనమును సాగించి, అద్వైత సిద్ధాంతమునకు ఒక సమగ్ర గ్రంథమును గౌడపాదాచార్యవరేణ్యుడు లోకమునకు బ్రసాదించియున్నాడు. అటుల

---

263. Prof. Surendranath Das Gupta : A History of Indian Philosophy, vol. 1, p 429

గవుడపాదునిచే రచితములైన 215 కారికలకు శంకరభగవత్పా దుడు భాష్యమును రచించి వివరింప, దానికి ఆనందగిరి టీకను వ్రాసి విపులము చేసెను. ఇందరు వ్రాసినను మాండూక్య కారిక లతో, భాష్యాదులతో గూడిన నీ గ్రంథము మిగుల జటిలమై సామాన్య ప్రజ్ఞావంతులకందనిరీతి జెలంగుచున్నది. కాని The teachings of Gaudapada can benefit only those that are equipped with the Sadhana Chatustaya 264 గవుడపాద వాక్యములు సాధన చతుష్టయముల బొం దినవానికిమాత్రమే యుపయుక్తములై యున్నవి.

His distinction lies in the emphesis he lays on the impossibility of reaching the highest truth unless the totality of human experience or knowledge be taken into consideration 264 మాన వానుభవమును అనగా జ్ఞానమును సమగ్రముగ గ్రహించినగాని యథార్థమును బొంద దుర్లభమని ఘంటాపథముగ వచించుట యందే అతని ప్రావీణ్యము గలదని వి. సుబ్రహ్మణ్య అయ్యరు అభిప్రాయము. ఎల్ల తత్త్వవేత్తలవలె గవుడపాదుడు ప్రత్యక్ష ప్రపంచమునుండియే ఉపక్రమించి, తన పరిశోధనను సాగిం చెను. సత్యత్వమును దృశ్యముల కన్వయించుచో నాతడు ప్రపంచ సత్యవాది కాజాలడు. అటులే అంతర్దృశ్యముల ప్రధాన మనుచో నతను భావ ప్రాధాన్యవాదియును గాడు. ఆ రెండును వానికతీతముగనున్న పరమార్థమును గ్రహింపనుపకరించుచు

264. V. Subrahmanya Iyer : Mandukya Upanishad, of Swami Nikhilananda, p v.

గేవలము జాగ్రదవస్థకు జెందినవిగనే యున్నవి. ఆతనికి బాహ్యా భ్యంతర ప్రపంచములు రెండును భ్రాంతులే యగును. అందుచేత The general idea pervading Gaudapada's work, that bondage and liberarion, the individual soul and the world. are all unreal, makes the caustic critic observe that the theory which has nothing better to say than that an unreal soul in trying to escape from an unreal bondage in an unreal world to accomplish an unreal supreme good, may itself be an unreality 265 బంధ మోక్షములు, జీవ ప్రపంచములు సర్వము భ్రాంతి అను గౌడపాదుని రచనములోని సామాన్యభావము, భ్రాంతికల్పిత జీవుడు అయథార్థమైన పరమార్థమును సాధించుటకై అసత్య ప్రపంచమునగల కల్పిత బంధమునుండి విడివడ యత్నించుటయును అసత్యమే యగునని సునిశిత విమర్శకునిచే వచింపజేయుచున్నదని ఆచార్య రాధాకృష్ణ పండితుని భయము. దానిని వివరించుచు, నిర్వికారమైన సత్పదార్థము వికారమైన విశ్వముగ రూపొందుటకు, దన నైజధర్మమును గోల్పోవకుండుటెట్లు అని ఒక సందియము. సర్వ విశ్వమును భ్రాంతిగ ఎండమావుగ ద్యజించుటెట్లు అనునది రెండవ సందియము. సిద్ధాంతమున నంతయు గల్పితమనుచు, ఆచరణమున సర్వవస్తు సముదాయముతో వ్యవహరించుట బరస్పరవిరుద్ధమై యుండుచు సిద్ధాంత భంగమేర్పడుచున్నది. కాని యథార్థమునకు విశ్వము అద్భుతము అనిర్వచనీయమై యుండవచ్చును.

265 Dr. S. Radhakrishnan : Indian Philosophy, vol. 2,

దానికంతరముగ నతీతముగ పరమ సత్యము వేరుగ నున్నదని తాత్పర్యము. కాని ప్రపంచము స్వప్నతుల్యముగాదు అని అతడు వచించెను.

కాని అద్వైతవాదము, విశ్వపరిణామము యథార్థమని విశ్వసింపదు కాని సర్వేతర సిద్ధాంతములు విశ్వము సత్యమని విశ్వసించును. కొందరద్వైతవాదులు వివర్తవాదమును ప్రతిపాదించి, సర్పభ్రాంతి సందర్భమున రజ్జువునకెట్టి వికారమును కల్పింపకయే సర్పాధ్యాస ఏర్పడుచందము బ్రహ్మమునందెట్టి మార్పు అవసరములేకయే విశ్వభ్రాంతి ఏర్పడును అని సమన్వయము గావించియుండిరి. అంతియగాక, నీ సర్వము భ్రాంతి మాయ అను విశ్వాసము అట్టి అనుభవవేత్తకు అనగా బరిపూర్ణాద్వైతస్థితునకు గల్గునుగాని యితరులకు గలుగనేరదు. దానిని బారమార్థిక సత్యముగా శంకరాదులు వివరించియున్నారు. అట్టి అనుభూతిలేనివారికిదియంతయు సత్యముగనే గోచరించును. కాన, వారు దీనితో సర్వవిధ సంబంధముల గల్పించుకొని వ్యవహరించుటయు సామాన్యమే. ఆ విషయమునుగూడ అద్వైతవాదము కాదనక, దానికి వ్యావహారిక సత్యముగ బేరిడియున్నది. అనగ పారమార్థికానుభవసంపత్తి ప్రాప్తించినంతవరకు జీవుడు యీ వ్యావహారిక రంగమునుండి, అది సత్యమని విశ్వసించి, చరించి, కొంతకాలమైన పిమ్మట ప్రపంచానుభవమువలనను, జరామరణ వ్యాధీత్యాది అనివార్య సంఘటనలవలనను గన్నుదెరచి, తనకంటె మించినదై, అజ్ఞాతమై యొక అదృష్టశక్తి తనను నడుపుచున్నదని గ్రహించి, ప్రపంచానుభవమున దన అసమర్థతను గుర్తెరింగి,

యిక గత్యంతరము నిత్యసుఖమే అనియు, నవి క్షణికమైన యీ ప్రపంచమున అభావమనియు, దానికై అజ్ఞాతశక్తి నాశ్రయించుట బరమార్థమనియు విశ్వసించి, ఉచిత గురువు నాశ్రయించి, సాధించి, అద్వైతసిద్ధిని బొందు పర్యంతము యిది వ్యావహారిక సత్యమనియే వ్యవహారము. ఈ సోపానముల నన్నింటి నధిగమించిన పిమ్మట మాత్రమే అతడు భ్రాంతికతీతుడగుచున్నాడు. అంతవరకు భ్రాంతుడే యని విదితము. అంత వానికి, దన పూర్వ స్థితులు, అనుభవములు భ్రాంతిగ దోచును. స్వప్నమునుండి మేల్కాంచినవానికంతయేగదా! కాన 'సర్వం భ్రాంతిమయం' అను సూక్తి విధానమున వ్యావహారిక వ్యవస్థలో గుర్తించి, కృషించి, పారమార్థికముగ దాని అనుభవమున నెరుంగుట సాధక లక్షణము. కాని యీ రెండింటికి ముడిపెట్టి యోచించుచో సర్వము సందేహాస్పదముగమాత్రమే పరిణమించి, యడుగడుగునకు సమస్యల బెంచుచుండునని ముఖ్య తాత్పర్యము.

యథార్థమునకు If we ask why had God created the world? The answers to this question are generally very unsatisfactory. For his own glorification? How may we attribute to him so much vanity! For his particular amusement? But he was an eternity without this play-toy! By love of mankind? How may he love a thing before it exists; and how may it be called love, to create millions for misery and eternal pain! 48)

The Vedanta has a better answer [266] భగవంతు డెందులకు ప్రపంచమును సృజించెను? అని మనము ప్రశ్నించిన, యీ ప్రశ్నకు సమాధానములు సామాన్యముగ నసంతృప్తికరము. అతని ఘనత కొరకా? అతనికట్టి యహంకారము నెట్లు మనమాపాదించుట! అతని ప్రత్యేక లీలకొరకా? కాని యీ ఆటవస్తువునకు బూర్వమే అతడు నిత్యుడు. మానవకోటిపై ప్రేమచేతనా? అవి పుట్టకపూర్వమే అతడెట్లు ప్రేమించును? అంతియగాక, శాశ్వత దుఃఖము కష్టముల ననుభవించుట కొరకై కోటానుకోట్లను సృజించుట ప్రేమ అని అనిపించుకొనునా? వీనికన్నింటికి వేదాంత సిద్ధాంతము మంచి సమాధానము నొసంగియున్నదని ఆచార్య పాల్ దేవసేన్ తెలిపియున్నాడు. అటులే If we ask the reason why there is avidya or Maya, bringing about fall from Vidya or from being, the question cannot be answered [267] విద్యనుండి పతనముగావించుచున్న అవిద్య యగు మాయ ఎందులకు గలదని ప్రశ్నించినచో సమాధానముగూడా అభావము. కాని యీ మాయా ప్రభావమున the timeless appears as limited in time, the perfect appears as imperfect [268] కాలాతీతము కాలబద్ధమైనట్లును, పరిశుద్ధము అపరిశుద్ధమైనట్లును గానుపించును. ఈ మాయను 'దృష్ట నష్ట స్వరూపత్వం' దృష్టస్వరూప నష్టము గలదిగ శంకరుడు నిర్వచించియున్నాడు. అందుచేత సృష్టి

---

266. Prof. Paul Duessen : The Philosophy of Vedanta, p 7.

267. Dr. S. Radhakrishnan : Indian Philosophy, vol. 1, p 36.

268. Prof. S. S. Suryanarayana Sastry : Sankaracharya, p 36.

మాయచే గల్పింపబడి, మాయారూపమున గోచరించి, సత్య స్వరూపదర్శన మొసంగక అన్యథా రూపదర్శనము నొసంగు చున్నట్లు అద్వైతవాదము. అధిష్ఠానరూపమైన రజ్జు జ్ఞానమెప్పుడు సక్రమలీల లేదో, అనగా దాని యథార్థ జ్ఞానము కారణవశమున గలుగనేరదో, దాని పేరిట అన్యథారూపము అయిన సర్పము అధ్యస్థమై, అందు భాసించి, రజ్జువు నంతర్ధానమొనర్చి, కల్పిత సర్ప జ్ఞానమును గలుగజేయుచున్నది. అటులే బ్రహ్మజ్ఞాన లోపమున, అనగ తదజ్ఞానమున సంస్కారజన్యమైన అన్యథారూపమైన జీవ జగత్తులు భాసించి, తద్భ్రాంతిని గలుగజేయుచున్నవని అద్వైత వాదము. అది ఎట్లు? అని ప్రశ్నించినచో పూర్వమే ప్రసంగ వశమున వచింపబడినట్లు, ఆ ప్రశ్న ప్రాథమిక పాఠశాలా విద్యార్థి యైనను ప్రశ్నింపవచ్చునుగాని అతి మేధాసంపన్నుడైన తత్త్వ వేత్తగూడ విచారించి, అగమ్యగోచరమగుటచే అనిర్వచనీయమని చెప్పివైచును. Psychology మానసధర్మశాస్త్రము ననుస రించి దాని వివరింప నసాధ్యమై యొప్పారును. అందుచేత 'అప్రతర్క్యం అవిజ్ఞేయం' అని మాయా నిర్వచనమును జ్ఞానులు గావించియున్నారు. అఘటనాఘటన సామర్థ్య శక్తిగల నీ మాయయే సృష్టికి బరమకారణముగాని బ్రహ్మముగాదని అద్వైత వాదము. బ్రహ్మమునకు ఆ కర్తృత్వమును గల్పించుటచే బూర్వ దోషములెల్ల ముందుకు అరుదెంచి, బ్రహ్మముయొక్క నిష్కళం కత్వ, నిర్వికారత్వ, అఖండత్వాది సర్వలక్షణములకు భంగమేర్ప డును. కాక అట్లు అతనిపై నిట్టి సృష్టి కర్తృత్వాదికముల గల్పించి భావింప నెంచినచో, ఆచార్య రాధాకృష్ణుడు వచించునట్లు So long as we are employing the methods of

logic, the highest reality is not the indeterminate Brahman, but determinate Iswara who is the source of all the manifold changes in the Universe 269 ఎంతవరకు మనము తర్కము నుపయోగించెదమో అంతవరకు మనకు దోచు పరమార్థము అనిర్వాచ్య బ్రహ్మముగాక, విశ్వమున సర్వవిధ వికారములకు గారణభూతమైన ఈశ్వరుడు యగుచున్నాడు. అట్లు మానవ దృష్టికి గోచరించువాడు భగవంతుడు భగవంతుడే కాదని పాశ్చాత్య తత్త్వవేత్త యొకడు వచించియున్నాడు. కావున బ్రహ్మము సృష్టికి గారణము గాకమాయ అనగా మాయాశక్తినిగల సగుణబ్రహ్మము అగునుఅని వ్యావహారికముగ అద్వైతవాదము సమ్మతించును. సృష్టి మీమాంస జేసియున్న ఉపనిషత్తులలో నాలుగు విధముల సృష్టివిధానము జెప్పబడియున్నదని ఆచార్య పాల్ దేవసేన్ వివరించుచు (1) ప్రకృతి బ్రహ్మేతరముగ నిత్యముగ నుండ నతడు దాని సృష్టిగా బరిణమింప జేయును. (2) ఈశ్వరుడు శూన్యమునుండి సృష్టిని గల్పింప నది తర్వాత స్వతంత్రముగ నీశ్వరాపేక్షలేకయేయున్నది. (3) పరమేశ్వరుడు తానే సృష్టిరూపముగా బరిణమించెను (4) బ్రహ్మమే సత్యము, సృష్టి అసలు లేనేలేదు. ఈ నాలగింట జివరిది ఉపనిషత్తుల బ్రధానవిధానముగ నతని భా... 270 దేశకాలముల గోచరించు యీ సృష్టి భ్రాంతిరూపము. ఒ... యు. బ్రహ్మము నెరుంగుటకు యీ భ్రాంతిప్రపంచమును ని... మొన ...ింప వలెను. ఉపనిషత్సారభూతమైన చివరి సృష్టి ...యను

269. Dr. S. Radhakrishnan : Indian Philosophy, vol. 1, ... 3
270. Prof. Paul Dusseen : Dr. S. Radhakrishnan : Indian Philosophy, vol ... 38.

స్వీకరించి Gaudapada by an irrefutable logic disproves the reality of causation in the fourth chapter of the Karika, and posits Ajativada according to which Brahman or Reality has never become the Universe 271 అజేయమైన తర్కవిధానమున గౌడపాదుడు, నాలుగవ ప్రకరణమునగల కారికలలో కార్యకారణత్వముల నిరాకరించి, సత్పదార్థమైన బ్రహ్మము విశ్వముగ పరిణమింపలేదను అజాతివాదమును ప్రతిపాదించెను అని నిఖిలానందస్వామి వాకొనెను. అందుచే గౌడపాదాచార్యుడు కారికలలో ప్రకటించిన విషయముల నాకించుక గ్రహింపయత్నింతము.

## కారికాసమీక్ష

'మాండూక్యమేకమేవాలం ముముక్షూణాం విముక్తయే' (ముక్తిక. 1.27) అని ఉపనిషత్తులచేతగూడ ప్రస్తుతింపబడిన మాండూక్యోపనిషత్తు 'ఓమిత్యేతదక్షరమిదం సర్వం తస్యోప వ్యాఖ్యానాం । భూతం భవద్భవిష్యదితి సర్వమోంకార ఏవ । యచ్చాన్యత్ త్రికాలాతీతం తదప్యోంకార ఏవ (మాం.1) ఓంకారమను అక్షరమే యీ సర్వము. దాని వ్యాఖ్యానమీ క్రింద నున్నది. భూత భవిష్యద్వర్తమాన కాలత్రయము ఆ ఓంకారమే. ఈ కాలత్రయమునకతీతముగూడ ఓంకారమే అని ప్రారంభించి, ఆ ఓంకారము అ, ఉ, మ అర్థ మాత్రలుగల పాదచతుష్టయముతో నలగారుచున్నదనియు, పటులే అక్షరబ్రహ్మస్వరూపమైన ఆత్మయు

271. Swami Nikhilananda : Mandukya Upanishad, p xxx.

విశ్వ, తైజస, ప్రాజ్ఞ, తురీయరూపమున జతుష్టయముగ బై ఓంకారగత అ, ఉ, మ, అర్ధ మాత్రలతో నభిన్నమై యుండు ననియు, మరల నది ఈశ్వరపరముగ విరాట్, హిరణ్యగర్భ, ఈశ్వర, బ్రహ్మములగుననియు అనగా గార్యబ్రహ్మ, కార్యకారణ బ్రహ్మ, కారణబ్రహ్మ, కార్యకారణాతీత బ్రహ్మములనెడు రూపచతుష్టయమై, 'అయమాత్మా బ్రహ్మ' అను ద్వితీయ మంత్రము ప్రకారము విశ్వవిరాట్టులు, తైజస హిరణ్యగర్భులు, ప్రాజ్ఞ ఈశ్వరులు, తురీయ బ్రహ్మములు అభిన్నములుగ నున్నవనియు, వాని, మూడవ మంత్రమునుండి వేరువేరుగ అవస్థాత్రయమున సమన్వయించి, ఏడవ మంత్రమున దురీయమైన ఆత్మ నిర్వచనముతో అనగ బ్రహ్మనిర్వచనముతో ముగించెను. అనగా జాగ్రదవస్థాధిష్టాన పురుషుడుగ విశ్వుడుండ, స్వప్నమున తైజసుడు విరాజిల్లగ, సుషుప్తిలో ప్రాజ్ఞుడు వెలుగొందును. తర్వాత దురీయమున ఆత్మవస్తువు శుద్ధమై ప్రకాశించుననని ఉపనిషత్తుయొక్క ఉపదేశము. అంత ఎనిమిదవ మంత్రమునుండి పండ్రెండవ మంత్రమువరకు ఆ యా యవస్థల, నా యా యధిష్టానపురుషుల ద్వారా నా యా బ్రహ్మతత్త్వములయొక్క అనుభూతి గడించు ఉపాసనా విధానముల బోధించి, చివరకు బ్రహ్మజ్ఞానమున సాధకుని నిలుప ఉపనిషత్తు యత్నించియున్నది.

గౌడపాదుడదే విధానమును తు. చ. తప్పక ననుసరింపక పోయినను, ఆ భావముల నిసుమంతయైన విస్మరింపక ననుసరించి, నాలుగు ప్రకరణముల వివరముగా వాని వ్యాఖ్యానించెను. ప్రథమమున సర్వానుభవసిద్ధమైన జాగ్రత్స్వప్న సుషుప్తి వివ

రణము, ఆరవ మంత్రముతో బూర్తి అయిన వెంటనే జాగ్రదవస్థను గురించి, వచించు మూడవ మంత్రమునుండి సుషుప్తిని వివరించు అయిదు, ఆరు మంత్రములవరకుగల మంత్రార్థముల 9 కారికలలో వ్యాఖ్యానించెను. జాగ్రదాది అవస్థలయందు విశ్వాది నామముల మూడింటి గల్పించుటచే నా ముగ్గురు ప్రత్యేకమైన వ్యక్తులు ఆ మూడవస్థల వ్యవహరించుచుందురను భ్రాంతి పొరకులకు బోగొట్టుటకై, ప్రథమ కారికలోనే 'బహిష్ప్రజ్ఞో విభుర్విశ్వో హ్యంతః ప్రజ్ఞస్తు తైజసః। ఘనప్రజ్ఞస్తథా ప్రాజ్ఞ ఏక ఏవ త్రిథా స్మృతః॥' (మాం.కా. 1.1) ప్రథముడైన విశ్వుడు వ్యాప్తుడై బాహ్యవస్తువుల ననుభవించును. తైజసు డంతర్విషయముల గ్రహించును. ప్రాజ్ఞుడు ప్రజ్ఞానఘనుడు. అయినను యీ అవస్థల జెప్పబడినవారు ముమ్వురు ఒక్కరేసుమా అని యతడు హెచ్చరించెను. తర్వాత ఆ ముగ్గురి వ్యవహార వ్యత్యాసముల విశదీకరించుచు, విశ్వుడు దక్షిణాక్షినుండి, వ్యవహరింప, తైజసుడు మనసునుండి, ప్రాజ్ఞుడు హృదయాకాశమునుండి ప్రవర్తించును. అట్లు ఒకే ఆత్మ శరీరమున త్రివిధముగ వ్యవహరించుననియు (మాం. కా. 1.2); విశ్వుడు స్థూలానుభవముల, తైజసుడు సూక్ష్మముల, ప్రాజ్ఞుడు ఆనందమును అనుభవించుననియు (మాం. కా. 1.3) మంత్రార్థమున మరల వివరించి, అవస్థాత్రయమున ప్రత్యేకముగ వచింపబడిన విశ్వాదులొక్కరే యనియు, అవస్థలలో వతనికి భోజ్యమైన స్థూలాదిక విషయములుగూడ నొక్కటియే యనియు నెవడెరుంగునో వాడు త్రివిధానుభవముల నున్నను అంటనివాడుగనే యుండును అని ప్రథమమున భోక్తృ ఏకత్వము భోజ్యైకత్వమును ప్రతిపాదించి, నానావిధములుగ గోచరించు

యీ సర్వసృష్టిని భోక్తృ భోగ్యములు నా ద్వివిధ రూపములుగ నన్వయించెను (మాం. కా. 1.5). ఈ వ్యావహారిక సృష్టిలో విశ్వ తైజస ప్రాజ్ఞాది విభేద రూపములకు మాత్రమే సృష్టి గలుగుచున్నది. ప్రాణము సకలమును సృజించుచున్నది. పురుషుడు చైతన్యులైన జీవులను వేరుగ జనింపజేయుచున్నాడను సృష్టి వాదమునుగూడ ప్రతిపాదించెను (మాం. కా. 1.6). కాని పై వివరింపబడిన సృష్టియొక్క నైజమును విశ్వసించుటలో సిద్ధాంత భేదములను వివరించుచు 'విభూతిం ప్రసవం త్వన్యే మన్యంతే సృష్టిచింతకాః। స్వప్నమాయా సరూపేతి సృష్టిరన్యైర్వికల్పితా॥' (మాం. కా. 1.7) సృష్టి సత్యత్వమును విశ్వసించు సృష్టిచింతకులు. సృష్టిని బరమేశ్వర విభూతిరూపముగా భావించెదరు కాని కొందరు దాని స్వప్నమాయారూపముగ దలంచెదరు. విశ్వాదులు కల్పితులై యథార్థమున నొక్కరే యైయున్నటుల, భోగ్యము విశ్వాదులకన్యముగగాక మాయారూపమై భ్రాంతిగ దోచుననియు, సత్యత్వమావంతయు లేదనియు, అద్వైతసిద్ధాంతమున ననగా నుపనిషత్సారమైన మాయావాదమును బాఠకులకు గౌడపాదుడు ప్రవేశపరచెను. తర్వాత రెండు కారికలలోగూడ సృష్టిచింతకులు అనగ సృష్టి యాథార్థ్యమును విశ్వసించువారి వాదవిభేదముల గొన్నింటిని వివరించెను. కాని, తన తాత్పర్యము అన గ్రంథమున వివరింపబడబోవు విషయమును బ్రథమముననే బ్రసా వెను.

అంత, మాండూక్యమున శక్తిప్రధానమును, తురీ మును పర్యవసానమును అయిన ఆత్మనిర్వచనముగల ఏడ ంత్ర మును గౌడపాదుడు స్వీకరించెను. 'నాంతఃప్రజ్ఞం ... ప్ర

జ్ఞం నోభయతః ప్రజ్ఞం న ప్రజ్ఞానఘనం న ప్రజ్ఞం నాప్రజ్ఞం అదృష్ట మవ్యవహార మగ్రాహ్య మలక్షణ మచింత్య మవ్యపదేశ్యమేకాత్మ ప్రత్యయసారం ప్రపంచోపశమం శాంతం శివమద్వైతం చతుర్థం మన్యంతే స ఆత్మా స విజ్ఞేయః' అంతఃప్రజ్ఞ బహిష్ప్రజ్ఞ ఉభయ ప్రజ్ఞ ప్రజ్ఞానఘన ప్రజ్ఞ అప్రజ్ఞలలో నేదియు నాత్మకాదు. అది అదృష్టము అవ్యవహారము, అగ్రాహ్యము, అలక్షణము, అచింత్యము, అవ్యపదేశ్యము, ఏకాత్మప్రత్యయసారము ప్రపంచోపశమము, శాంతము, శివము, అద్వైతము. అదియే తురీయము, అదియే ఆత్మ, దెలియబడదగినది అని మంత్రార్థము. ఇందు ప్రథమతః బోధింపబడిన స్థూల సూక్ష్మ కారణములనబరగు అవస్థాత్రియానుభవములు వానితోసహా విశ్వాది త్రియము నిరాసము చేయబడెను. ప్రజ్ఞాస్థితులలో నీ మూడునుగాక నితర రూపాంతరములుగూడ నిరాకరింపబడినవి తర్వాత దాని నిర్వచనము అంతయు నగ్రాహ్యముగనే సాగి, కడపట సర్వ ప్రపంచోపశమమే అది యనియు, నది కేవలము సర్వశూన్యత్వముగాక ప్రశాంతమై మంగళకరమై యుండుననియు దురీయమైన ఆత్మ వర్ణింపబడినది. ఈ మంత్రరాజము ననుసరించి గౌడపాదుడు తొమ్మిది కారికల రచించెను. అవ్యయమైన తురీయమున సర్వదుఃఖములభావము లు (మాం. కా. 1.10). విశ్వాదులలో గార్య కారణత్వములుండునుగాని తురీయమున నిది అభావము (మాం. కా. 1.11). కారణరూపుడైన ప్రాజ్ఞుడు, ఆత్మానాత్మ సత్యాసత్యముల నెరుంగని స్థితిలో నుండ, దురీయుడు నిత్యుడై సర్వదృక్కుగా నుండును. (మాం. కా. 1.12). ద్వైతమును గ్రహింపకుండుట ప్రాజ్ఞ తురీయులకు సమానమేకాని, ప్రాజ్ఞుడు కారణమై సుషుప్తితో సంబం

ధించియుండ, తురీయునకు సుషుప్త్యాదికము లేదు (మాం. కా. 1.13). విశ్వతైజసులు స్వప్నసుషుప్తులచే బద్ధులై యుండ, ప్రాజ్ఞుడు గాఢ సుషుప్తి బద్ధుడై యున్నాడు. కాని జ్ఞానులు తురీయునిలో వీనిలో వేనిని గాంచరు (మాం. కా. 1. 14). స్వప్నము అన్యథా గ్రహణరూపము. సుషుప్తి అజ్ఞానరూపము. ఈ అజ్ఞాన అన్యథాజ్ఞానములుభయములు అదృశ్యముకాగా తురీయానుభవమేర్పడును (మాం. కా. 1.15). అదెట్లు? అని ప్రశ్నించుకొని తర్వాత శ్లోకమున (1.16) సిద్ధాంతముగ బూర్వభావముల గౌడపాదుడా అన్వయించెను. 'అనాదిమాయయా సుప్తో యదా జీవః ప్రబుధ్యతే । అజమనిద్రమస్వప్నమద్వైతం బుధ్యతే తదా॥' అనాదియైన మాయచే నజ్ఞానియై పరమార్థము నెరుంగక నిద్రావస్థనున్న జీవుడు ఎపుడు మేల్కాంచునో, అజమును అజ్ఞానాన్యథాజ్ఞాన రహితమునైన అద్వైతమును గ్రహించును అని, గౌడపాదుడు మాయా అద్వైత పదములు దన సిద్ధాంతమునకు మూల పదములు గాన గలిపి ప్రస్తావించి, మాయారూపమే అజ్ఞాన అన్యథాజ్ఞానరూప సుషుప్తి స్వప్న జాగ్రత్తులనియు, ననగా ఆవరణ విక్షేప మాయాస్వరూపములనియు, వాని ద్రోసినగాని వాని కతీతముగనున్న అద్వైత పరమార్థతత్త్వము ఆత్మ అనగా బ్రహ్మముయొక్క అనుభూతి లభింపదనియు ఖండితముగ వక్కాణించెను. ఈ కారికయే గౌడపాద సిద్ధాంతమునకు శిరోభూషణము. దీని వ్యాఖ్యానమే భవిష్యద్గ్రంథమంతయు ననిన ఉత్తమము. ఈ కారికా వివరణముగ తర్వాత శ్లోకద్వయమును నిర్మించెను. ప్రపంచము దృశ్యమానమగుచుండుటచే నది నదృశ్యమగును. కాన 'మాయా మాత్రమిదం ద్వైతమద్వైతం పరమార్థతః'

(మాం. కా. 1.17) ఈ ద్వైతమంతయు మాయామాత్రమేగాని అద్వైతము పరమార్థము అని పరమ సిద్ధాంతముగ మరల ద్వైత నిరాసము, అద్వైత మండనము చేసి, అటులైన గురుశిష్యాదిక వ్యవహారములెట్లు అను సందేహ నివారణమునకై యీ వ్యవహారము కల్పితమగుటచే దీనివలన గలుగు బ్రహ్మజ్ఞానముచే నిది నివర్తించును, అనగా జ్ఞానము గలుగగా నిక గురుశిష్య శాస్త్ర రూప ద్వైతములుగూడ నిర్వృత్తములగును అని సర్వ ద్వైతభావ నివృత్తిని అతడు ఉపదేశించెను.

అంత, ఎనిమిదినుండి పదునొకండువరకుగల అకార ఉకార మకారరూప విశ్వ తైజస ప్రాజ్ఞోపాసనా మంత్రముల గొని, వాని వివరించుటకై అయిదు కారికల గౌడపాదుడు వినియోగించెను. తర్వాత పంౘ్రెండవ మంత్రమైన ధురీయోపాసనమును గూర్చిన 'అమాత్రశ్చతుర్థోఽవ్యవహార్యః ప్రపంచోపశమః శివోఽద్వైత ఏవ మోంకార ఆత్మైవ సంవిశత్యాత్మనాఽఽత్మానం య ఏవం వేద' (మాం. 12) ఏపాదములు లేనిదియు, అవ్యవహారమును, ప్రపంచరహితమును, ఆనందరూపమై, అద్వైతమైన ఓంకారము చతుర్థమైన ఆత్మ. దీని నెరింగినవాడు ఆత్మయందు లయించునను వాక్యముల గైకొని, ఆరు కారికలలో దాని వివరించెను. ఓంకారమును అకారాది అక్షర క్రమమున గ్రహింపవలెను. ఓంకారమును గ్రహించిన ఇతరమెద్దియు ననవసరము (మాం. కా. 1.24). చిత్తమును ప్రణవముతో నైక్యమొనర్పవలెను. ప్రణవమే బ్రహ్మము. అది నిర్భయము. ప్రణవైక్యము నొందిన వానికి భయములేదు. (మాం. కా. 1.25). ప్రణవమే పరాపరబ్రహ్మము. అది అపూ

త్స్వప్న దృశ్యములుభయములు నొకే స్వభావముగలిగియున్నవి. దేశపరిమితిలో మాత్రము వ్యత్యాసముగలదు అని నాలుగవ కారికలో రెండింటిని ఏకము జేసి, వాని సామ్యత్వమును గౌడపాదుడు దెలిపియున్నాడు. ఆద్యంతములులేని పదార్థములు మధ్యనెట్లుండగలవు అని ప్రశ్నించుకొని, అట్లు భ్రాంతిజన్యములై యున్నను యీ దృశ్యములు సత్యపదార్థములవలె భావింపబడుచున్నవి; ఉపయుక్తమని చెప్పబడుచున్న జాగ్రద్దృశ్యము స్వప్నమున నంతమగుచు, ఆద్యంతములు గలిగి మధ్యలో మాత్రము భాసమానమగుచు, యీ జాగ్రద్దశ్యముగూడ 'మిథ్యైవ' మిథ్యయే; జాగ్రత్తులోలేని కొన్ని దృశ్యములు స్వప్నమున గోచరించినను, అవి సుప్తుని స్థితి ననుసరించి యుండుననియు గౌడపాదుని వివరణము. జాగ్రత్స్వప్నముల రెండింట నొకే చిత్తము ఆ యా దృశ్యముల సృజించుచుండ స్వప్నగతముల నసత్యములనియు, జాగ్రత్ దృశ్యముల సత్యములనియు ననుట విచిత్రము. రెండునుగూడ భ్రాంతిసిద్ధములే యగుచున్నవి.

అటుల, బాహ్యాంతర దృశ్యములు అసత్యములేగాని, వాని ద్రష్టమాత్రము అసత్యము కాదు. 'కల్పయత్యాత్మనాఽత్మాని మాత్మాదేవః స్వమాయయా' (మాం. కా. 2.12) స్వయం ప్రకాశమైన ఆత్మ, తన మాయచే దనలో దానే సర్వబాహ్యాభ్యంతర దృశ్యముల గల్పించుకొనును. అట్లు సృష్టమైనవానికి ద్రష్ట యీతడే అని వేదాంత నిర్ణయము. తన సంస్కారముల ననుసరించి ఆత్మ, తన చిత్తమున సర్వదృశ్యముల గల్పించి అనుభవించును. బాహ్య వస్తువులు ఇంద్రియములద్వారా ననుభవింప

బడ, నంతర్దృశ్యములు మనస్సుతోడనే అనుభవవేద్యములు. కాని రెండును 'అనిశ్చితా యథా రజ్జురంధకారే వికల్పితా । సర్పధారాదిభిర్భావైః తద్వదాత్మా వికల్పితః ॥' (మాం. కా. 2. 17) మందాంధకారమున, అర్ధవిజ్ఞాతమైన రజ్జువును గాంచి, సర్పాదిక కల్పనము గావించుకొనుచందము యీ దృశ్యము సర్వము ఆత్మ చేతనే కల్పితము. అధిష్ఠానమైన రజ్జుజ్ఞానముతో సర్పాదిక భ్రాంతి నశించును. అట్లే ఆత్మజ్ఞానమువెంట నీ దృశ్యములు అదృశ్యములగును.

ఈ కల్పనమంతయు ఆత్మయొక్క మాయవలననే జరిగినదని మనము విస్మరింపరాదు. ఆత్మను గురించి వివిధ సిద్ధాంతులు అనేకవిధముల వాకొనుచుందురు. ఆ సిద్ధాంతములు 2.20 నుండి 28 వరకు గారికలలో సూచింపబడియున్నవి. కాని 'యం భావం దర్శయేద్యస్య తం భావం స తు పశ్యతి। తం చావతి స భూత్వాऽసౌ తద్గ్రహః సముపైతి తమ్॥' (మాం. కా. 2.29) గురుబోధనుమాత్రమే శిష్యుడు గాంచును. సాధకునిచే సంకల్పింపబడిన రూపమును ఆత్మ దాల్చి అతని రక్షించుచున్నది. దాని వలన నతడు దానిని బొందును అను కారికలలో, బరమ అద్వైతాచార్యుడైన గౌడపాదుని సమరసమైన హృదయము వ్యక్తమగుచున్నది. తన సిద్ధాంతమునకు విరుద్ధ భావములు గలవారికి గూడ ఆత్మదర్శన అవకాశమును గల్పించి, అతి ఉదార భావమున వారిని గౌడపాదుడు చూచియుండుట యిచట గమనార్హము. అతనిలో పాషండత్వము వెతకి చూచినను లేశమాత్రమేని గోచరింపదని యీ కారిక చాటుచున్నది.

ర్వము, అనంతరము, అబాహ్యము, అనపరము, అవ్యయము (మాం. కా. 1.26). ప్రణవమే సర్వముయొక్క ఆదిమధ్యాంతము. దానినెరింగినవాడు వెంటనే పరమార్థమును బొందును. (మాం. కా. 1.27). ప్రణవమును సర్వమనోవాసి ఈశ్వరుడుగ, వివేకముగలవాడు ప్రణవమును సర్వవ్యాప్తముగ నెరింగి శోకింపడు. (మాం.కా.1.28). 'అమాత్రోऽనంతమాత్రశ్చ ద్వైతోపశమః శివః । ఓంకారో విదితో యేన స మునిర్నేతరో జనః॥' (మాం. కా. 1 29) అమాత్రమైనదై, సర్వనాదరూపమై ద్వైతవివర్జితమగుటచే, శివస్వరూపమైన ఓంకారమును యథార్థమైన ముని గ్రహింపగలడుగాని యితరులు గ్రహింపజాలరు అని ఖండితముగ నతడు వక్కాణించియున్నాడు. అట్టి జ్ఞానయుక్తమైన అద్వైత సంస్కృతినిగూర్చి వచించుచు, 'అస్పర్శయోగో వై నామ దుర్దర్శః సర్వయోగిభిః। యోగినో బిభ్యతి హ్యస్మాదభయే భయదర్శినః॥' (మాం. కా. 3.39) సర్వ సంబంధరహితమైన యీ యోగము సామాన్య యోగులందరికి దుర్లభము. దానిలో భయము రవ్వంతగనైన లేకున్నను, అందు భయహేతువును గాంచి యోగులు భీతి జెందెదరు అని గౌడపాదుడట్టి అద్వైతసిద్ధి యొక్క అసాధ్యసాధ్యత్వమును నుక్కడించియున్నాడు.

పై విషయముల ననుసరించి చూచినచో గౌడపాదుడు, తన కారికావిభాగ చతుష్టయమున, ప్రథమమైన ఆగమప్రకరణమున, మాండూక్య మంత్రార్థ వివరణమునందే తన సిద్ధాంతమున, బ్రహ్మ జీవ ఈశ్వర సృష్టుల స్థానములను, మాయానిర్వచనమును, అద్వైతసిద్ధాంతమును, అద్వైతసిద్ధి మొదలగు సర్వ విషయముల సూత్రప్రాయముగ వివరించినట్లు విదితము.

ఆతని సిద్ధాంతము అంతటితో ముగిసియుండెనుగాని, దుర్దర్శమైన దాని నంతటితో ముగించి, సాధకులకు నన్యాయమొనర్ప నతనికి సమ్మతము కాలేదు, దుర్జ్ఞేయమైనదాని అభ్యాస రూపముగ సోదాహరణముగ మరల మరల బోధించినగాని ప్రయోజనముండ దని గ్రహించి, తర్వాత వైతథ్య, అద్వైత, అలాతశాంతిప్రకరణ ముల, బూర్వ భావముల నతివిపులముగ 186 కారికలలో వివ రించెను. ఆ కారికా తాత్పర్యమునుగూడ సింహావలోకనమొన రించి గౌడపాద హృదయము గ్రహించెదముగాక!

ద్వితీయాధ్యాయమునకు వైతథ్యప్రకరణ నామధేయము. వైతథ్యమన అసత్యత్వమని యర్థము. అందుచే నీ ప్రకరణమున, దాని లక్షణముల గొంతవరకు వివరింపబడునని భావింపసగును. ప్రథమ కారికాచతుష్టయమున స్వప్నదృశ్యముల స్వభావమును, అసత్యత్వమును నిరూపించి, నాలుగవ కారికలోనే స్వప్న జాగ్ర త్తుల సామాన్యత్వ వివరణమును గౌడపాదుడు ప్రారంభించెను. అంతరమైన సంకుచిత ప్రదేశమున దృశ్యములు గోచరించు చున్నవి గాన స్వప్న దృశ్యములు భ్రాంతిజన్యములే యగును. స్వల్పకాల విశిష్టత్వముచేత ద్రష్ట దూరదేశగమనాదుల గావించి యుండుట దుర్లభము. స్వప్నమునుండి మేల్కొంచినవాడు అన్య దేశమున నుండక, జాగ్రత్ స్థలమునమాత్రమే యుండుట చేత సంబంధి దృశ్యములు అభావరూపములు. అందుచే స్వప్న దృశ్యములు భ్రాంతిజన్యములని శ్రుతి తాత్పర్యము. స్వప్నగత దృశ్యములు భాసించు చున్నట్లుండుటచే నాభాసరూపములనబడు జాగ్రద్దృశ్యములు గూడ భ్రాంతికార్యములే యగును. జాగ్ర

మరల ఆత్మ, భ్రాంతి విషయములు చర్చింపబడినవి. ఆత్మ దృశ్యములన్నింటితో నభిన్నమై యున్నను, భిన్నమువలె గోచరించును. అట్లు గోచరించు నానాత్వము స్వప్నమాయా, గంధర్వ నగర సదృశమైనదని వేదాంతుల నిర్ణయము. అసలు యథార్థమున 'న నిరోధో న చోత్పత్తిర్న బద్ధో న చ సాధకః। న ముముక్షుర్నవై ముక్త ఇత్యేషా పరమార్థతా॥' (మాం. కా. 2.32) అని మరల వేదాంత పరమార్థమును గౌడపాదుడు చాటి యున్నాడు. ఈ పరమార్థమునే మరల అద్వైత ప్రకరణమున 'న కశ్చిజ్జాయతే జీవః సంభవోస్య న విద్యతే। ఏతదుత్తమం సత్యం యత్ర కించిన్న జాయతే॥' (మాం. కా. 3.48) జీవుడెన్నడును జనింపలేదు. జనింప జేయగల కారణమెద్దియు నభావము. ఇదియే ఉత్తమ సత్యము. అసలేదియు ఉద్భవింపలేదని గౌడపాదుడు అజాతి వాదమును దెలిపెను. కాని ఆత్మ సత్యాసత్యములుగ భావింపబడుచున్నది. అయినను ద్వైతము నశ్వరము, అద్వైతము శివశంకరమైనది. అట్టిన నానాత్వముయొక్క స్థితి ఏమి యని సంశయము వొడమ, అది బ్రహ్మభిన్నముగగాని, భిన్నముగగాని లేదు అని నిర్ణయింపబడెను, ఈ ఆత్మ సర్వవిధ కల్పనములకు అతీతముగ విద్వదనుభవము. కావున బ్రహ్మ త్రోవలైన యితరముల ద్రొక్కక 'తస్మాదేవం విదిత్వైనం అద్వైతే యోజయేత్ స్మృతం। అద్వైతం సమనుప్రాప్య జడవల్లోకమాచరేత్॥' (మాం. కా. 2. 36) ఆత్మ యిట్టిదని గ్రహించి, అద్వైతముపై దృష్టిని నిలుపుము. అద్వైతాన భూతిని బొంది, జడునివలె లోకమున జరింపుము అనియు గౌడపాదుడు సకల ముముక్షువులకు హెచ్చరిక జేసియున్నాడు. ఇప్పుడు స్తుతినిం

దాదులకతీతమైన వృత్తి గలిగి, యదృచ్ఛా లాభసంతుష్టుడై అతడుండును. అట్లు సర్వదృశ్యముల నష్టమును గ్రహించి, తత్త్వవిభూతుడై అనగా ఆత్మానుసంధానుడై, తదానందనిమగ్నుడై, అతడు చరించునని బ్రహ్మవిదుని లక్షణముల నొకించుక గౌడపాదుడు వైతథ్యప్రకరణాంతమున బ్రస్తావించెను.

భ్రాంతిగ్రస్తుడైన జీవుడు, తనను సృజించెనని యూహించి నటుల బ్రహ్మము నుపాసింప సంసిద్ధుడగును. పాపమతడు కృపణుడు అనగ సంకుచిత బుద్ధుడు. అట్టివానికొరకై గౌడపాదుడు, అద్వైతప్రకరణ ద్వితీయ కారికనుండి బ్రహ్మ వివరణము, బ్రహ్మానుభూతి విషయముల వివరించుచున్నాడు. మహాకాశ ఘటాకాశ దృష్టాంతమున, ఘటాకాశములు మహాకాశజన్యములని తలంపబడినట్లు, సంఘాతములు ఆత్మజనితములే అయియున్నవి. ఘటభంగమున తదాకాశము మహాకాశలయమును బొందినట్లు జీవులు ఆత్మలయము నొందుదురు. ఒక ఘటములోని ఆకాశము కళంకితమైనను యితర ఘటాకాశములు మలినము కానట్లు, ఒక జీవుని సుఖదుఃఖాదులు ఇతర జీవులకు సంబంధింపనేరవు. ఘటాకాశ పటాకాశ మఠాకాశములవలె నామరూపములెట్లున్నను ఆకాశ సామాన్యమువలె జీవులును నామరూప విశిష్టత్వమును బొంది యున్నను ఆత్మస్వరూపముగనే యున్నారని గ్రహింపవలెను. ఘటాకాశము మహాకాశకార్యము కానట్లు జీవులు ఆత్మకార్యములు కానేరరు. ఆకాశము యథార్థతః నిర్మలమై యున్నను బాలుర దృష్టికి మలినమైనట్లు గానుపించు విధాన, ఆత్మ సుఖదుఃఖాదుల బొందినట్లు అజ్ఞానులు భావింతురు. ఈ సంఘాతములన్నియు

స్వప్నదృశ్యములవలె ఆత్మమాయా ప్రాబల్యమున నేర్పడుచున్నవి గాని సత్యములుగావు. ఆత్మ జీవైకత్వమే యథార్థము. వాని భిన్నత్వము కేవలము అయథార్థము. సృష్టినిగూర్చి ఉపనిషద్వాక్యములు బ్రహ్మ సృష్ట్యభేదమును నిరూపించునవియేగాని సృష్టిసత్యత్వ ప్రతిపాదనములేమాత్రమునుగావు.

కావున, ఉత్తమ మధ్యమ మంద ప్రజ్ఞులలో, మందప్రజ్ఞుల కొరకై ఉపాసనము ఉపనిషత్తులచే బోధింపబడియున్నది. ఆ విషయమును గ్రహింపజాలని ద్వైతులు విభిన్న మతములు గల వారై, పరస్పర ఖండనముల జేసికొనెదరుగాని అద్వైతికి నెవరి తోడను గలహము లేదు. అతని దృష్టి ఉత్తమ స్థాయి నుండుటయే దానికి గారణము. అద్వైతమే పరమార్థమైన దనుటచే వారికితరులతో నెట్టి వివాదమును లేదని, గౌడపాదుడు మరల తన ఉన్నత రీవికి వెడలినవాడై, అల్ప విషయములకై పోరాడు వారితో దనకు కలహమేల అను అతీత బుద్ధిని బ్రదర్శించెను. ఈ దృశ్యములు మాయాసృష్టములు. గానిచో బ్రహ్మఖండత్వము నకు భంగము. అఖండము ఖండమగుట ఎట్లు? అమృతము మృతమగునా? మృతము అమృతమగునా? వస్తుస్వభావము మారుట దుర్లభము. ఖండమైన పిమ్మట దానికి అఖండత్వ మెచ్చట? ఈ విషయ వివరములకై గౌడపాదుడనేక శ్రుతి ప్రమాణముల నుదాహరించియున్నాడు. 'నేహ నానాస్తి కించన' అను వాక్యము శ్రుతి తాత్పర్యముగ నిర్ణయింపబడెను. ఈ నానాత్వమెల్ల మాయాకల్పితమగును. మాయాప్రాబల్యమున స్వప్నదృశ్యములలో ద్వైతము గోచరించినట్లు, జాగ్రత్తులో నీ

ద్వైతము గూడ నేర్పడుచున్నది. మనస్సు అభావమైనపుడు దృశ్యములు లేకుండుటచే నీ దృశ్యములు మనోగోచరములే యగు చున్నవి. ఆత్మజ్ఞానముచే మనస్సు యోచింపజాలని స్థితిలో నది మనస్సేగాక దృష్టమును గాదు. అట్టి సామర్థ్యముగల మనస్సు సాధనవలన నేర్పడును. మనస్సు సుషుప్త్యవస్థ నున్నప్పుడు జడము, ప్రజ్ఞానఘనము. కాని జ్ఞానియొక్క మనస్సు నిర్విష యము నిర్బీజము. ఆ బ్రహ్మము అవస్థాత్రయ విదూరము. ఆ బ్రహ్మము 'సర్వాభిలాపవిగతః సర్వచింతాసముత్థితః। సుప్రశాంత సకృత్ జ్యోతిః సమాధిరచలోఽభయః॥' (మాం. కా. ౩.౩౭) అని ర్వాచ్యము, అచింత్యము, సుప్రశాంతము, నిత్యజ్యోతి, అచ లము, అభయము, సమాధి అని పర్యవసానముగ ఆత్మ వివర ముల దెలిపెను. అట్టి ఆత్మకు ఆదాన త్యాగములభావములు. అట్టి ఆత్మజ్ఞానము, దాని అనుభూతి స్థితులవిని, భయభ్రాంతులగు వారి జూచి, 'అస్పర్శయోగో వై నామ దుర్దర్శః సర్వయోగిభిః। యోగినో బిభ్యతిహ్యస్మాదభయే భయదర్శినః॥' (మాం.కా.౩.౩౯) దేనితోడను సంబంధము లేని యీ యోగము సామాన్యయోగుల కలభ్యము. భయములేని దాని యందు భయమును గాంచి యోగులు భయదులగుదురు. ఈ జ్ఞానయోగాభ్యాసము లేని వారు చిత్తనిరోధాదిక సాధనల జేయుదురు. చిత్తనిరోధము దుస్సాధ్యము. కాన మనోజయమునకు ఉపాయాంతరముల నన్వేషింపవలెను. విషయముల దుఃఖహేతువులని గ్రహించి, చిత్తము నందుండి మరల్పవలెను. విక్షేపముల నిరోధింపవలెను. సమాధిస్థితిలో జిత్తము నుంపక నాత్మయందు లయింపజేయ వలెను. ఏవిధమైన విక్షేపాదులులేని చిత్తమే బ్రహ్మము. ఆత్మాను

భూతిలోమాత్రమే శాంత్యాదులుగలవు. అదియే ముక్తి. ఉత్తమ సుఖము. అదియే బ్రహ్మము. కావున 'న కశ్చిజ్జాయతే జీవః సంభవోస్య న విద్యతే । ఏతదుత్తమం సత్యం యత్ర కించిన్న జాయతే॥' (మాం.కా. 3.48) అనునదియే గౌడపాద తాత్పర్యము.

అలాతశాంతి ప్రకరణము నాలుగవది. మహాకాశ సాదృశ్య స్వరూపుడైన ఆత్మ ధర్మముల గ్రహించిన జ్ఞానులకు ప్రణమిల్లుచు, గౌడపాదుడు యీ ప్రకరణమును ప్రారంభించెను. అట్టి ఆత్మ దర్శన ఫలితముగ సంప్రాప్తించిన అస్పర్శయోగము, శాస్త్ర ప్రబోధితము సర్వమానవాభ్యుదయ కారకము, సర్వక్షేమంకరము, వాదవిదూరము. సత్పదార్థము జనించినట్లు కొందరు వాదింతురు. కాని సత్ ఎట్లు మరల జనించును? కాక అసత్ ఎట్లు సత్తగును? ఇట్లు వాదించుకొనుచు, నెల్లరు అద్వైతవాదమును స్థిరపరచి, అజాతి సిద్ధాంతమును బలపరచుచున్నారు. వారి అజాతివాదము అంగీకార్యమే. అవును, అనంతము అంతవంతమగుట దుర్లభము కాన సకల జీవులు జరామరణ రహితులు. కాని, వారు జరామరణ బద్ధులమని భావించి, తమ స్వస్వరూపము విస్మరించుచున్నారు. అకారణమునుండి కార్యము జనింపదు. కార్యమునుండి కార్యముద్భవమైనచో, కార్యకారణముల అనవస్థలోబడి, అనంత పరంపర యగును. కాన కార్యకారణములు భ్రాంతిజన్యములు. కార్యకారణములు సమకాలికము లగుట దుస్సాధ్యము. పై విధముగ 'అశక్తిరపరిజ్ఞానం క్రమకోపాఽథ వా పునః । ఏవం హి సర్వథా బుద్ధై అజాతిః పరిదీపితా॥' (మాం. కా. 4.19) సమాధానమిచ్చుటకశక్తత, ప్రక్రి

తినిగురించి అజ్ఞత, కార్యకారణ పరంపరత్వమును సమన్వయింప జాలక పోవుట మొదలగు హంశములచే, బుధజనులు అజాతివాద మునే అవలంబింపజేయుట స్పష్టము. కావున బారమార్థిక దృష్టికి 'స్వతో వా పరతో వాపి న కించిద్వస్తు జాయతే । సదసత్సదస ద్వాపి న కించిద్వస్తు జాయతే॥' (మాం. కా. 4.22) స్వతఃగాని పరతః గాని ఎద్దియు జనింపలేదు. సదసత్తులుగాని, సదసద్విశి ష్టముగాని పుట్టొందలేదు. అనాది వస్తువు పుట్టుకలేనిదిగదా! చిత్త మునకెట్టి సంబంధము దృశ్యములతో లేదు. దానికి, వానితో కార్యకారణత్వముగూడ త్రికాలములందును అభావము. భ్రాంతికి గారణము లేకుండుటచే భ్రాంతి ఎటుల గలుగును? కాన మనస్సు గాని దృశ్యములుగాని జననము కాలేదు. అంతయు స్వప్న తుల్యములై భ్రాంతియే యగుట సత్యము. స్వప్నము జాగ్ర త్తులో లేకుండుటచే నది మిథ్యగ భావింపబడి జాగ్రదధీనముగ జెప్పబడెను. కాన జాగ్రత్తును స్వప్నదృశ్యములతో బోల్చిన సత్యము అగుచున్నది. కాని జాగ్రత్తుగూడ మాయాకల్పితమే. అదియు స్వప్నకాలమున నంతర్థానముగదా! సృష్టి పరిణామ ములు సమర్థనీయములు కాకుండుటచే నజాతములై యున్నవి. అసత్యము, అసత్యమునకు కారణమగుటగాని, అసత్యమునుండి సత్యముద్భవించుటగాని దుర్లభము. అటులే సత్యము సత్యము నకు గారణము కాజాలదు. మరల సత్యము అసద్వస్తువునకు గార ణము కాజాలదు. అయిన శ్రుతులు ఎందులకు సృష్టివాదమును బోధించుచున్నవను సంశయము గలిగినచో, అజాతివాదమునకు భీతిజెంది, దృష్టమైన విషయముల సత్యత్వమును బారమార్థిక సాధనలను విశ్వసించువారికొరకై బుధజనులు సృష్టివాదమును

బోధించిరి. అట్టి భయస్థులు అజాతివాదము నంగీకరింపక, గార్య కారణముల విశ్వసించి, దాని దుష్ఫలితముల ననుభవించెదరు అని, గౌడపాదుడు ద్వైతులపై మరల గరుణాపూరిత హృదయముతో బాపము దలంచుచున్నాడు. ఇంద్రజాలకుని మాయా గజము దృశ్యమానమై, సత్యగజము భంగి ప్రవర్తించి జరించుట వాని సత్యత్వమునకు హేతువు కానేరదుగదా! పుట్టుచున్నదన బడు విజ్ఞానము శాంతమద్వయమజాతము. కాన 'ఏవం న జాయతే చిత్తమేవం ధర్మా అజాః స్మృతాః। ఏవమేవ విజానంతో న పతంతి విపర్యయే॥' (మాం. కా. 4.46) అట్లు చిత్తము జన్మాది వికారములు లేనిది. అటులే సర్వ జీవులుగూడ జనన మునకతీతుల పరమార్థము నెరింగినవాడు భ్రాంతి నొందడు.

అలాతము పరిస్పందన క్రియచే దదనుగుణ చక్రాది ఆకారరముల దాల్చు చందమున ద్రష్ట దర్శన దృశ్యాదిక త్రిపుటి భ్రాంతిచే నేర్పడుచున్నది. స్పందనము లేకున్నచో, గల్పితాకారములు లేక తన సహజరూపముననెట్లు ఆ కొరివి గోచరించునో అటులే స్పందనములేని విజ్ఞానము సర్వవికార రహితముగ, దన సహజస్థితిలో నుండును. అలాతస్పందనమున గలిగిన ఆకారములు బాహ్యగతములు గావు. అటులే స్పందనానంతరమున నవి బాహ్యలయములును గావు. అలాతమునందును లయింప నేరవు. మరియు నవి అలాతజన్యములు గూడ కావు. అటులే విజ్ఞానమునుండి ఎవ్వియు జనింపలేదు లయింపలేదు. అది స్పందమానమగుచుండ గలుగు జాగ్రత్ స్వప్నాదికములందుండి జనింపలేదు. అందు లయింపలేదు. అవి విజ్ఞాన లక్షణములు కావు. కాని అవి కార్యకారణములకతీతములుగాన నచింత్యములు. దృశ్య

ములు చిత్తజన్యములుగావు. అవి బాహ్యవిషయజనితములు గూడ గావు. అందుచేత 'ఏవం హేతుఫలాజాతిం ప్రవిశంతి మనీషిణః' (మాం. కా. 4.54) బుద్ధిశాలురు కార్యకారణ నిరాస మైన అజాతివాదమునే స్వీకరించెదరు. కారణత్వముపై దృష్టి యున్నంతవరకు గార్య కారణత్వములు గోచరము. అది అంత రించిన నవి అదృశ్యము. ఎంతకాలము కార్యకారణత్వ విశ్వా సము గలదో అంతకాలము జన్మమరణములుండును. అదిపోయిన నవియు నశించును. అవి యన్నియు అజ్ఞాన జనితములు కాన నశ్వరములు. పారమార్థికముగ జీవోత్పత్తి యసంభవము. అట్టి అనుత్పన్నములకు నిత్యత్వానిత్యత్వ వ్యవహారము అభా వము. అందుచే 'న కశ్చిజ్జాయతే జీవః సంభవోస్య న విద్యతే। ఏతదుత్తమం సత్యం యత్ర కించిన్న జాయతే॥' (మాం. కా. 4. 71) అని గౌడపాదుడు మరల హెచ్చరిక జేసెను.

ఆకారణమున ఆత్మయైనను 'అజః కల్పిత సంవృత్యా పర మార్థేన నాప్యజః (మాం.కా. 4.74) మాయాదృష్టికి, అనగా వ్యావ హారిక దృష్టికిమాత్రము అజముగాని పారమార్థికముగ నజము గూడ కానేరదు. అట్టి జ్ఞానము నార్జించినవాడు జననకారణమభా వముగాన, మరల జనింపడు. 'బుద్ధ్వాఽ నిమిత్తతాం సత్యాం హేతుం పృథగనాప్నువన్। వీతశోకం తథా కామమభయం పద మశ్నుతే॥' (మాం. కా. 4.78) కార్యకారణత్వాభావమును బరమా ర్థముగ నెరింగి, జననకారణముతేమిచే వీతశోకమును, అకామా భయమును అయిన ముక్తిని బొందుదురు. చిత్తము రాగ బద్ధమై విషయములపై బర్విడుట సహజము. కాని యీ స్థితిలో

విరాగమున వెనుదిరుగును. అట్టి చిత్తము అభయము, అద్వ యముగ నుండును. ఆత్మ అజమనిద్రమస్వప్నము అగుటచే స్వయంప్రభ యగును. అది స్వయంప్రకాశముగదా! ఇట్లు పునః పునః ఆత్మతత్త్వము బోధింపబడినను, చిత్తమునకు విషయ సంస్పర్శమువలన దుఃఖము పైకి గోచరించుచున్నది. ఆత్మ నెరుంగని అజ్ఞానులు దాని అస్తి నాస్తి మొదలగు భావముల గలిగి వాదించుకొందురు. కాని అది సర్వదృక్. అట్టి ఆత్మజ్ఞాన మును బొందిన పిమ్మట 'ప్రాప్య సర్వజ్ఞతాం కృత్స్నాం బ్రాహ్మ ణ్యం పదమద్వయం। అనాపన్నాదిమధ్యాంతం కిమతః పర మిహతే॥' (మాం.కా. 4.85) సర్వజ్ఞము అద్వయము ఆదిమధ్యాం తరహితమునైన బ్రహ్మపదము సంప్రాప్తించిన పిమ్మట ఆ జ్ఞానికి యింత నేమికావలయును? అతనికి సహజ నిరాడంబరత్వము శమాదమాదికము, కృషిఫలితమునగాక సహజసిద్ధముగ వెలు వడును. స్వాభావికముగవారు జితేంద్రియులు.

వ్యావహారికమైన అవస్థాత్రయమును, తురీయమును వేదాంతము సమ్మతించును. అది వ్యావహారికాంగీకారమే. త్యాజ్య ములు, జ్ఞేయములు, సాధ్యములు, పాక్యములన రాగద్వేష మోహాదిక దోషముల ప్రథమతః నెరుంగకవలెను. వానిలో ఆప్యమై సాధ్యముగాక నన్యత్రయమూహాజనితములుమాత్రమే. సర్వధర్మ ములు అనగా జీవులు అనాదులు. వానిలో నానాత్వమావంతయు గానుపింపదు. జీవులు ఆదిరహితులనియు అవ్యయులనియు నెరింగి, యిక జ్ఞానాన్వేషణము నరికట్టినవాడే అమృతత్వమును బొందును. ఆత్మ అజము నిర్వికారము అని నిశ్చయజ్ఞానము

గలవారే మహాజ్ఞానులు. దీని సామాన్యులు గ్రహింపజాలరు. ఇది అసంగమైన జ్ఞానము. కించిన్మాత్రమైన వైధర్మ్యము గోచరించి నచో, నీ ఆత్మజ్ఞానము దుర్లభము. 'అలబ్ధావరణాః సర్వే ధర్మాః ప్రకృతి నిర్మలాః। ఆదౌ బుద్ధాస్తథా ముక్తా బుధ్యంత ఇతి నాయకాః॥' (మాం. కా. 4.98) సర్వజీవులు సదా ముక్తులు నిర్మలులు. ఆదినుండి వారు ప్రకాశస్వరూపులు నిత్యముక్తులు. కాని జీవులు పరమార్థమునునెరుంగ గలరని జ్ఞానులు బోధించెదరు. కాన 'దుర్దర్శమతిగంభీర మజం సామ్యం విశారదం। బుద్ధ్వా పదమనానాత్వం నమస్కుర్మో యథా బలం॥' (మాం. కా. 4.100) దుర్లభమును అతిగంభీరమును, అజమును, సామ్యమును, ప్రకాశవంతమును, అద్వయమును అయిన ఆ బ్రహ్మజ్ఞానము నొంది, యథాశక్తిగ మనము దానికి నమస్కరించెదముగాక!

ఈవిధముగ గౌడపాద యోగివరేణ్యుడు, ఆత్మతత్త్వము, మాయాతత్త్వము, సృష్టిరహస్యము, బ్రహ్మజ్ఞానము, మొదలగు సకల వేదాంతవిషయ సమీక్ష గావించి, పారమార్థికముగ నంతయు నజాతమే యనియు, వ్యావహారికముగ నా బ్రహ్మానుభూతి బొందువరకు అవస్థాత్రయముగా గల సర్వమును మందాంధికారికొరకై అంగీకృతము అయి బోధింపబడుననియు, అదియే వేదాంత నిశ్చయమనియు, అదియే బుధజన అనుభవరహస్యమనియు నాదిగాగల విషయముల సాకల్యముగ సయుక్తికముగ అనుభవ పూర్వకముగ జర్చించి, వాని నైజముల నిర్ణయించి,

'అద్వైతం పరమార్థో హి' అద్వైతమే పరమార్థము అని ఘంటా పథముగ దనశక్తి నంతయు నుపయోగించి జిజ్ఞాసులకొరకు ప్రకటించెను. మన వివరణములు సమర్థనములెట్లున్నను తన వాదమునకు శ్రుతులనే ప్రమాణముగగూడ జూపించి, అనుభవముల గ్రోడీకరించి నిర్ణయించెను. అందుచే గౌడపాదీయమంతయు నౌపనిషదమేగాని, స్వకపోల కల్పితముగాదని సువిదితమగుచున్నది.

సర్వేతర సిద్ధాంతములును జీవుని అన్యముగ భావించి, తత్పరమైన మరియొకదానితో సంబంధించుటయో, దర్శించుటయో, అనుభవించుటయో మొదలగు ద్వైతపర భావములతో ముక్తస్థితినిగూర్చి వివరింప, గౌడపాదుడు తన అసాధారణ ప్రజ్ఞచే నస్పర్శయోగమును రూపొందించి, దాని వివరించుట గమనార్హము. అస్పర్శయోగమైన యోగమననేమి? పూర్వమున, కర్మ భక్తి జ్ఞానాది యోగములనే వినియున్నారముగాని, యీ అపూర్వ యోగవిషయము అసాధారణము. అది దుర్జ్ఞేయమని, దుర్దర్శమని సామాన్య యోగులకు భయదమని చెప్పియున్నారు. దానగల అంతర్ధానమేమి? అస్పర్శమనగా దేనితోడను సంబంధింపనిది అని అర్థము. అందుచేత ఆ పదమున బరస్పర వైరుధ్యము గోచరించును. యోగమనగా సంబంధముగదా! The word Apsara meaning freedom from relation-

ship refers to the non-dual Brahman alone[272]
అస్పర్శ పదము బ్రహ్మమునకన్వయము. దానిని బొందుట యోగముగా నిఖిలానందుడు అన్వయించెను. అనగా అద్వైత వాదమున, జీవుడు సాధనాదుల ద్వారా బొందునది అన్యమై యున్నచో, దానితో బొందు కలుగుట యోగమననగును గాని, అట్టిది రెండవది జీవుని కన్యముగ లేకుండుటచే నతడు దేనితో గలియును? 'యత్ర సర్వమాత్మైవాభూత్ తత్కేన కం జిఘ్రేత్' (బృ. 2.4.14) అంతయు ఆత్మయేయై యుండగ, దేనిని దేనితో ఆఘ్రాణించును, చూచును, అను మంత్రార్థము అంతియేగదా! అందుచే అస్పర్శ శబ్దము కడు జాగ్రత్తగ వినియోగింపబడి, యోగ పదమందుగల ద్వైత నిరాసము చేయుచున్నది. ముక్తి యన స్వస్వరూపస్థితి నుండుట యనియే అద్వైత తాత్పర్యము. ఆ యర్థమునకనుగుణముగ, గౌడపాదుని మేధాశక్తి ఆ యద్భుత పదమును ర్మించి, అద్వైతశాస్త్రమునకు మహోపకారము గావించియున్నదని చెప్పకతప్పదు. అట్టి గౌడపాద మహాత్ము నికి 'నమస్కుర్మో యథా బలం' (మాం. కా. 4.100) మన శక్తి కొలది నమస్కరించెదముగాక!

'ప్రజ్ఞావైశాఖవేధక్షుభితజలనిధేర్వేదనామ్నోంతరస్థం భూతా న్యాలోక్య మగ్నాన్యవిరతజననగ్రాహఘోరే సముద్రే। కారుణ్యా దుద్ధధారామృతమిదమమరైర్దుర్లభం భూతహేతో ర్యస్తం పూజ్యాభి

272. Swami Nikhilananda : Mandukya Upanishad, p xx.

పూజ్యం పరమగురుమముం గౌడపాదమాన్తోస్మి' జననమరణ రూప మకరములకాకరమైన అగాధ సంసారసాగరమున మునిగి యున్నవారిపై, నిర్వ్యాజ కారుణ్యముతో వేదకడలియొక్క అగాధమునుండి తన యుక్తి దండమున మథించి, దేవతలకైన అలభ్యమానమైన యీ యమృతమును బహిర్గతమొనర్చిన పూజ్యులలో బూజ్యుడైన పరమ గురువర్యునికి నమస్కరించుచున్నాను.

## పరిసమాప్తి

ఈ విధముగ బహుముఖదృష్టితో, నద్వైతసిద్ధాంత బీజ, అంకుర, వృక్ష, పుష్ప, ఫలాదులకై శ్రీశంకరపూర్వ గ్రంథముల అవలోడనము గావించినచో నది శ్రీశంకర కల్పితము గాకుండుట మాత్రమేగాక, అతని పరమగురువనబరగు గౌడపాదాచార్యుని కల్పితముకూడ గానేరదని, ఆ పరమ సిద్ధాంతము వేదములలోనే వ్యాప్తి జెంది వివరింపబడి యున్నదనియు విస్పష్టమగుచున్నది. అట్లు అపూర్వవిధానముగ దానికి బూర్వత్వము అనగా ప్రాచీనతయేగాక, సర్వ సిద్ధాంతముల జ్యేష్ఠత్వముతోబాటు శ్రేష్ఠత్వము గూడ లభించియున్నది. అది శాస్త్రీయముగ నట్టి స్థానము నలంకరించుటయేగాక, ఎట్టి యుక్తుల దానిపై ప్రయోగించి చూచినను అజేయమై, యుక్తియుక్తమై యలరారుట గమనార్హము. అంతియగాక నది, సర్వముముక్షువులకు, సాధనమార్గమున కొంత

దవ్వరిగిన బిమ్మట సగుణత్వభ్రాంతి సహజముగా నశింప, నాక్లిష్ట సమయముల వారికాశ్రయమై, శరణ్యమై, అనుష్ఠానయోగ్యమై, అనుభవరూపమై వెలుగొంది, సర్వ సాధకశ్రేష్ఠుల నాకర్షించి, వారికి బరమ శ్రేష్ఠత్వము బ్రసాదించి, తా శ్రేష్ఠతమ స్థానము నలంకరించియుండుటయు సర్వజన విదితము. అట్టి శ్రుతి, యుక్తి, అనుభవరూప సమర్థనముబొందిన అద్వైత సిద్ధాంతమే సర్వ ముముక్షుకోటికి శరణ్యస్థానమగుటచే, నా సాధనా రహస్యముల నెరింగి, తత్ప్రతిపాదిత బ్రహ్మైక్యానుసంధానము నొంది, సర్వ జీవ గమ్యమైన 'బ్రహ్మైవాహం' అను స్థితప్రజ్ఞలో పూర్ణత్వము నొందియుందుముగాక అని ఆశించుచున్నాను.

ఓం పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్పూర్ణముదచ్యతే ।
పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవావశిష్యతే ॥

---

స్థాపితము : 1951.

# శ్రీ అనుభవానంద గ్రంథమాల

ఉద్దేశ్యము : ఈ గ్రంథమాలలో శ్రీ అనుభవానంద స్వాములవారి, శ్రీ మాతాజీ త్యాగీశానందులవారి మరియు ఇతరులచేతను రచితములైన భక్తి జ్ఞాన వైరాగ్య ప్రబోధక గ్రంథములు ప్రకటింపబడును.

విధానము : సంవత్సరమున మొత్తమునకు రెండువందల పుటలుగల గ్రంథములు వెలువడుచుండును.

విరాళము : 1] రు. 1116/- మించు విరాళమొసంగువారు మహారాజ పోషకులు. వీరి ఫొటో ఒక ముఖ్య గ్రంథమున ప్రకటింప బడును.

2] రు. 516/- మించు విరాళమొసంగువారు రాజపోషకులు. [సంవత్సరమున 10 వాయిదాలలో పైకము చెల్లింపవచ్చును]

* గ్రంథమాల పుస్తకములను వీరు ఉచితముగా బడయుదురు.

---

గ్రంథమాల మహోద్యమమునకు ఎల్లరు ఉచితరీతి దోడ్పడుదురుగాక!

---

* వి. పి. ద్వారా పుస్తకముల కోరువారు, పుస్తకములఖరీదు పైకమును ముందుగా పంపవలెను.

** పోస్టేజ్, ప్యాకింగ్ ఛార్జీలు ప్రత్యేకము.

*** ఉత్తర ప్రత్యుత్తరములకు రిప్లైకార్డు వ్రాయవలెను.

# ప్రచురణములు

1. సాధన రహస్యము (8 వ ముద్రణ) (Revised - Edition)

ముముక్షువులు సాధన ఎలా చేయాలి? దాని ఫలితములు, ఆధ్యాత్మికాభివృద్ధికి మార్గములు, చక్కని వ్యావహారిక భాషలో తెల్పిన అశేష ప్రజాదరణ పొందిన మహోత్కృష్ట గ్రంథరాజము. 22-00

[సంస్కృతము, ఇంగ్లీషు, హిందీ, మరాఠి, తమిళ, కన్నడ, మళయాళ భాషలలో అనువదింపబడి ప్రచురింపబడనున్న గ్రంథము.]

2. సాధన మకరందము (2 వ ముద్రణ)

సాధన విషయము లేకాక, అనేక నిత్యావసర విషయముల విచారణ మిందుకలదు. శ్రీ స్వాములవారి జీవితమున జరిగిన కొన్ని సంఘటనలు యిందున్నవి. 5-00

3. సాధనసుధ (3 వ ముద్రణ) (Revised - Edition)

సాధనలో దగులు ఆటంకముల నివారింప అమూల్యమగు సలహాల నొసంగు గ్రంథము. శ్రీ స్వాములవారి జీవితమున జరిగిన కొన్ని సంఘటనలు ఇందు కూర్చబడినవి. [ఇందులోని కొన్ని తత్త్వములు "స్టీరియో కేసెట్" రూపమున వెలువడినవి.]

4. అనుభవ రహస్యము

సాధనానుభవములు పొందుటకు సాధకులకు మార్గదర్శి యగు "సాధనరహస్య" అనుబంధ గ్రంథరాజము.

5. మన రామకృష్ణుడు (4 వ ముద్రణ)

జగద్గురు శ్రీ రామకృష్ణుని అద్భుతాదర్శ, సాధన వివరముల తెలుపు మహత్తర గ్రంథము. 5-00

6. మన శారదామాయి (3 వ ముద్రణ)

జగన్మాత శ్రీ శారదామాయి జీవితోపదేశముల వివరించు ఉత్సాహ పూరిత గ్రంథము, 5-00

7. మన వివేకానందుడు (4 వ ముద్రణ)

వేదాంతకేసరి శ్రీ వివేకానందుని జీవితాదర్శముల ప్రబోధించు ఉత్కృష్ట గ్రంథము. 5-00

8. శాంతి సామ్రాజ్యము (2 వ ముద్రణ)

శాంతినిగోరు నేటి ప్రపంచమునకు శాంతిప్రబోధగావించు ఉత్తమ గ్రంథము. 2-00

9. శ్రీ రామకృష్ణాదర్శము (4 వ ముద్రణ) (Revised - Edition)

శ్రీ రామకృష్ణుని సాధన, సిద్ధుల రహస్యముల వివరించు ఉత్తేజకర గ్రంథము. 2-00

10. శ్రీ శారదాదర్శము (2 వ ముద్రణ) (Revised-Edition)

ఇందు శ్రీ శారదాదేవి గొప్పదనము మన హృదయముల గదిలించును. 2-00

11. శ్రీ వివేకానందాదర్శము (4 వ ముద్రణ) (Revised - Edition)

శ్రీ వివేకానందుని ఆదర్శము ఇందు ప్రస్ఫుటముగా విరచితము. 2-00

12. శ్రీ అనుభవానందాదర్శము

ఇందు శ్రీ అనుభవానందుల ఆదర్శానుభవములు గోచరము.

2-00

13. మాండూక్యరసాయనము (2 వ ముద్రణ)

మాండూక్య ఉపనిషత్తుకు 108 ఉపనిషత్తుల ముఖ్యమంత్రముల, గౌడపాద కారికలతో శ్రీ అనుభవానందుల అద్భుత వ్యాఖ్యానము గల గ్రంథము. 5-00

14. ప్రాచీన భగవద్గీత (2 వ ముద్రణ) (Revised - Edition)

745 శ్లోకములు గల గీత. ఇది భోజపత్ర వ్రాతప్రతినుండి గ్రహింపబడి, శ్రీ అనుభవానందులచే పీఠిక వ్రాయబడినది. తాత్పర్యము కలదు.

15. శ్రీ రామకృష్ణ పూజ (2 వ ముద్రణ)

(Revised – Edition)

శ్రీ రామకృష్ణ సహస్రనామము, శ్రీ రామకృష్ణ, శ్రీ శారదా, శ్రీ వివేకానంద, శ్రీ అనుభవానందుల అష్టోత్తర శత నామములు యిందు కలవు. శ్రీ రామకృష్ణ అష్టోత్తర శతమునకు ఉపనిషత్ మంత్రములతో శ్రీ త్యాగీశానందుల చక్కని వ్యాఖ్యానము కలదు. 6-00

16. శ్రీ రామకృష్ణ లీలాసంకీర్తనము (6 వ ముద్రణ)

(Revised – Edition)

భక్తి, జ్ఞాన, వైరాగ్య ప్రబోధక కీర్తనలు. 169.

[ఇందులోని కొన్ని పాటలు "శ్రీ రామకృష్ణ గానసుధ" రూపమున 'స్టీరియో కేసెట్' గా విడుదల అయినవి. మరి కొన్నిపాటలు 'కేసెట్' రూపమున వెలువడనున్నవి.] 6-00

17. శ్రీ రామకృష్ణ-వివేకానంద కథాగానములు

శ్రీ రామకృష్ణ, వివేకానందుల జీవితములు ప్రదర్శించుటకు అనుగుణ్యముగా శ్రీ స్వాములవారిచే విరచితము. ఆంధ్రదేశమున 100 ప్రదర్శనలకు పైగా యీయబడినవి.

18. యుగావతారము

శ్రీ రామకృష్ణ గాన కథామంజరి ["స్టీరియో కేసెట్" రూపమున వెలువడ నున్నది.]

19. పరమహంస (Pocket Size Book)

"స్టీరియో కేసెట్" రూపమున విడుదల కానున్నది.] 0-50

20. స్వామి వివేకానంద (Pocket Size Book)

["స్టీరియో కేసెట్"గా విడుదల కానున్నది.] 0-50

21. శ్రీ రామకృష్ణాంజలి (5 వ ముద్రణ)

శ్రీరామకృష్ణ తత్త్వమునుగూర్చి భక్తి, ఉత్సాహపూరిత శతకము-వివరణములతో. 1-50

22. శ్రీ దక్షిణేశ్వరీ స్తవము (4 వ ముద్రణ)

శ్రీ కాళికాదేవినిగూర్చి భక్తితో తత్త్వవిషయముల బోధించు శతకము-వివరణములతో. 1-50

23. చిత్తప్రబోధ (4 వ ముద్రణ)

సాధకులకు అనేక అమూల్య రహస్యములను, మనోతత్త్వమును గూర్చి బోధించు శతకము - వివరణములతో. 1-50

24. అనుభవానందము (4 వ ముద్రణ)

అద్వైతానంద విభూతి వ్యక్తపరచు, అద్భుతానుభవ శతకము.
(A Master-piece in the Vedanta Literature.) 0-75

25. ఉపనిషత్ వైభవము

108 ఉపనిషత్తులగూర్చి సులభశైలిలో ప్రత్యేకముగా పుస్తకములు

## సర్వసిద్ధాంతసారభవము (12 సంపుటములలో)

[మన భారతీయ సంస్కృతి, వాఙ్మయమునుగూర్చి, పరిశోధనాత్మక (Re-search) గ్రంథములు. (An Encyclopaedia of Indian Philosophy) సుమారు 4,500 పుటలలో.

26. సాంఖ్య, యోగములు (3 వ ముద్రణము)

సాంఖ్య యోగ విషయములతో శ్రీ కపిల, పతంజలి మహర్షుల జీవితకాల విశేషములు, సిద్ధాంతములు యిందు విరచితము. 20-00

27. వైశేషిక, న్యాయములు (2 వ ముద్రణ)

శ్రీ కణాద, గౌతమ మహర్షుల జీవితకాల విశేషములు వైశేషిక, న్యాయ సిద్ధాంతములు పండితాభిప్రాయములతో చర్చితము. 20-00

28. మీమాంస, వేదాంతములు (2 వ ముద్రణ)

జైమిని, వ్యాసమహర్షుల జీవితకాల సిద్ధాంతములు ఆధునిక పండితాభిప్రాయములతో రచితము. 20-00

29. శ్రీ శంకరపూర్వాద్వైతము (2 వ ముద్రణ)

వేదములనుండి శ్రీ శంకరులవరకు ప్రవహించు అద్వైత రస పరివాహమును తెలుపు విపుల గ్రంథము. అద్వైత సిద్ధాంతమునకు ఆధునిక భౌతిక విజ్ఞానమునకు సమన్వయము జూపును. 20-00

30. శ్రీ శంకరాద్వైతము (2 వ ముద్రణ)

శ్రీ శంకర జీవితకాల విశేషములు, అద్వైత సిద్ధాంతము విస్తృతముగా వివరింపబడినవి. సన్న్యాస ప్రాశస్త్య, అధికార వివరములును కలవు. 20-00

31. శ్రీ శంకరానంతరాద్వైతము (2 వ ముద్రణ)

శ్రీ సురేశ్వర, విద్యారణ్య జీవితకాల విశేషములతో అద్వైత సిద్ధాంతములిందు చర్చితము. 20_00

32. విశిష్టాద్వైతము (2 వ ముద్రణ)

వేదములనుండి వైష్ణవ సిద్ధాంత జనన చారిత్రము, శ్రీ రామానుజ జీవిత సమీక్ష, విశిష్టాద్వైత సిద్ధాంత వివరణములిందు ప్రస్ఫుటము. 20_00

33. వైష్ణవము (2 వ ముద్రణ)

శ్రీ మధ్వాచార్యునినుండి శ్రీ కృష్ణచైతన్యుని వరకుగల వైష్ణవాచార్యుల జీవిత సిద్ధాంత విషయములు సమీక్షింపబడినవి. 20_00

34. శైవాద్వైతము (2 వ ముద్రణ)

వేదముల రుద్రాధ్యాయ జనితమైన శైవసిద్ధాంతము, వీరశైవము వరకు ఎట్లు పరిణమించియున్నదియు నిట స్పష్టము. నాయనారుల జీవితములు కలవు. 20_00

35. శాక్తాద్వైతము (2 వ ముద్రణ)

వేదాంతర్గత దేవీసూక్త అదితి ప్రస్తావనతో ప్రారంభమై, దక్షిణ వామాచారరూపమున సర్వత్ర ప్రఖ్యాతి నొందిన శాక్తసిద్ధాంత సాధనములతో వివరింపబడినవి. 20_00

36. బౌద్ధము

బౌద్ధసిద్ధాంతము - ప్రాముఖ్యత, శ్రీ బుద్ధభగవానుని, జీవిత విశేషములు పరిశీలనాత్మకముగా వివరింపబడినవి.

37. సర్వ సిద్ధాంత సౌరభ సారము

సులభశైలిలో "సౌరభము"ను గూర్చి వివరణాత్మక గ్రంథము

---

38. శ్రీ రామకృష్ణ గానసుధ (స్టీరియో కేసెట్)

మధురమైన భక్తిపాటలుగల స్టీరియో కేసెట్.

వెల. రు. 40-00 లు రిజిష్టర్ పోష్టులో రు. 44-00 లు

39. భారతీయ సంస్కృతి (స్టీరియో కేసెట్)

భక్తిపాటలతో భారతీయ సంస్కృతినిగూర్చి శ్రీ మాతాజీ త్యాగీశానందుల అనర్గళ ఉపన్యాసములుగల స్టీరియో కేసెట్.

వెల రు. 30-00 లు రిజిష్టర్ పోష్టులో రు. 34-00 లు

*పై రెండు కేసెటులు తీసుకొనేవారికి పోస్టేజి ఉచితము*

40. స్టిక్కర్లు (Stickers), ఒక్కొక్కటి 4 రంగులలో, సైజు 7" × 5".

1) ఓంకారము, 2) శ్రీ రామకృష్ణ పరమహంస, 3) శ్రీ శారదామాయి, 4) శ్రీ వివేకానందస్వామి. ఒక్కొక్కటి .... 1-50

---

*అముద్రితములు*

1) శ్రీ అనుభవానందస్వామి జీవితచరిత్ర, 2) శ్రీ అనుభవానందుల లేఖావళి, 3) శ్రీ అనుభవానందుల ఉపన్యాసములు, 4) అనుభవామృతము, 5) మన భారతీయ సంస్కృతి, 6) శక్తి పూజా విశిష్టత, 7) మంత్ర శాస్త్రము, 8) తంత్రశాస్త్రము, 9) శాక్తేయము - శ్రీ రామకృష్ణుడు, 10) పరమహంస ప్రబోధము, 11) శ్రీ శారదా సందేశము, 12) శ్రీ వివేకానంద విజయభేరి, 13) శ్రీ త్యాగరాజ హృదయం మొ॥.

---

* శ్రీ అనుభవానంద స్వాములవారు చిత్రించిన 'ఓంకారము', శ్రీ రామకృష్ణ పరమహంస, శ్రీ శారదామాయి, శ్రీ వివేకానంద స్వామి ఫొటో కాపీలు కాబినెట్ మరియు ఫుల్ సైజులో మన గ్రంథమాలలో లభించును. *

## ★ భారతీయ ఆధ్యాత్మిక విజ్ఞాన సర్వస్వము ★

'వేదోఽఖిలం ధర్మమూలం' అఖిల ధర్మములకు వేదమే మూలమనుట! ధర్మఫలితము మోక్షము. ఆ ముక్తి అద్వైత జ్ఞానముచే లభ్యము. వేదము కర్మోపాసనముల బోధించుచున్నను మానవ గమ్యము మాత్రము అద్వైతమే, మానవుడు ఆ అద్వైతానుభూతిని పొందనిదే జనన మరణ ప్రవాహరూప మైన సంసార సాగరమునుండి బయల్పడుట కష్టసాధ్యము. బ్రహ్మమొక్కటియే యనియు, అదియే ఏకమనియు, 'ఏకం సత్ విప్రా బహుధా వదంతి' 'ఏకం సంతం బహుధా కల్పయంతి' అని ఆ ఏక స్వరూపమే సత్ అనియు, అదియే 'సర్వం ఖల్విదం బ్రహ్మ' 'సర్వమాత్మైవాభూత్' సర్వమాత్మయే బ్రహ్మ మనియు, అది 'అదృష్టమవ్యవహార్యమ గ్రాహ్యమలక్షణమచింత్యమవ్యపదేశ్య మేకాత్మప్రత్యయసారం' అని సర్వేంద్రియాతీతముగ వర్ణింపబడియున్నది. ఆ బ్రహ్మమును పొందినవాడు 'బ్రహ్మైవ భవతి' బ్రహ్మమే యగుననియు, అట్టి నిరాకార నిర్గుణ బ్రహ్మము 'శుద్ధం కామవివర్జితం' కామ రహితమై శుద్ధమై యుండి 'మనసైవానుద్రష్టవ్యం' మనస్సుచేతనే చూడదగినదనియు తెలుపుచు, అట్టి 'ఆత్మానం సతతం జ్ఞాత్వా కాలమునయ' ఆత్మను సదా గ్రహించి కాలమును నడుపుకొనుమని మానవునికి వేదము ప్రబోధించి, మానవుడు 'అద్వైతం నావమాశ్రిత్య జీవన్ముక్తత్వమాప్నుయాత్' 'అద్వైతమను నావనాశ్రయించి జీవన్ముక్తి పొందవలయుననియు శాసించినది.

ఈ భాగమున వేదగతాద్వైత వివరణము కలదు.

★ *An Encyclopaedia of Indian Philosophy* ★